నియు, నీతఁడు లోకారాధ్యుఁడగు భగవంతుఁడనియు, భూభారహరణార్థము తనకుఁ గుమారుఁడుగా నొక ప్రీతినిబుట్టించి తనయింటఁ బెరిఁగెననియుఁ దలంచెను. ఈసంవాదమున నిందఱు మహర్షులు బ్రహ్మయు మహేశ్వరుఁడును వినుచుండ సనత్కుమారుఁ డీ సంవాదరూపముగా నీరహస్య విషయమును దెలుపుటచే నందుని మదిఁగల సందియములు వీడెను. పరమానందభరితుఁడై తా నిదివఱ కూహించినది యజ్ఞానముచేతనే యనియు భగవంతు నింతకాలము తెలిసికొనలేక పోతిని గదా యనియు నాలోచించి తనకుఁ గర్వము వీడి లజ్జితుఁడై భగవంతునిజూచి నాయపరాధములు క్షమింపుమా యని ప్రార్థించెను. ఇంతటి యజ్ఞానుఁడనైతినిగదా యని మూర్ఛిల్లెను. భగవంతుఁ డీతనియజ్ఞానము తొలఁగెఁగదా యని భావించి మూర్ఛనుండి స్మృతిగల్గఁ జేసెను.

ఒక్క క్షణమాత్రమున నిందఱువచ్చుట యచ్చెరువు గదా. స్మరించినమాత్రమున నిందఱకిచ్చుటకి రావలయునన్న యూహ యెట్లు కలుగునన్నసందియము కొందఱకుఁ గలుగవచ్చును. సమాధానము. సామాన్యమానవుని సంకల్పము ఫలవంతము కాఁజాలదు. శ్రీకృష్ణమూర్తి పరమపురుషుఁడు. గోలోకవాసి. పరాత్పరుఁడు. కాఁబట్టి భగవత్సంకల్ప మప్రతిహతము. ఏలయన నతఁడు సర్వాంతర్యామి. మన దేహమున నేయవయవమున కేసుమంతబాధకల్గినను మనస్సునకెట్లు తెలియునో యట్లే సర్వాంతర్యామియగు భగవంతుని యూహ యేకక్షణమున సకల బ్రహ్మాండములయందును వ్యాపించును. మన మనస్సు సర్వేంద్రియములను వ్యాపించియున్న యట్లే భగవంతుఁ

పకారము సదా చేయుచుండ వారిని వధించుపొంటెఁ బరమే
శ్వరుఁడు యుద్ధముచేయఁబోఁగా నా సంగ్రామ మత్యంతభయం
కరాకృతిం దాల్చెను. ఈశ్వరుఁ డా భయానక సంగ్రామము
నందు భగవతి నారాధించి వినుతించి యశ్రమంబున వారిని
జయించెను. ఆస్తోత్రరాజమును నీ కనుగ్రహించెదను. అది
సర్వమోహపాశములఁ ద్రెంపఁగలదు. అంతియ కాక సర్వవాం
ఛాప్రదము. నందా! శ్రద్ధాయోగమూని దాని నాలకింపుము.
ఈ సభ్యులుకూడ విందురు గాక. అనవిని నందుఁ డిట్లు
ప్రశ్నించెను.

శ్రీకృష్ణా! సర్వవిఘ్నములు తొలఁగుట సర్వదుఃఖములు
నశించుట యను నీ రెండు ఫలములు కలుగుటకును సంపద్య
శస్సులు లభించుటకును, మనుజుల వాంఛితములు సిద్ధించుట
కును జగదంబయు మహాదేవియునగు విష్ణుమాయకుఁ బ్రీతిని
జనింపఁజేయుస్తోత్రరాజము నోజగత్ప్రభూ! యుపదేశింపుము.
దుర్గతినాశని యంబయని విందును. ఆయంబస్తోత్రరాజము సుదు
ర్లభము. వినీతుఁడనై భక్తుఁడనగు నాకు దానిని భక్తవత్సలుఁ
డవు గాన దెలుపుము. నీవు వేదజనకుఁడవు. నిర్గుణుండవు.
పరాత్పరుండవు. కాన నాకు దాని నుపదేశింపఁ దగుదువు. అని
ప్రశ్నించి వినఁ గుతూహలుఁడై యుండు టెఱింగి శ్రీభగవంతుఁ
డి ట్లనియెను. * వైశ్యేంద్రా! నందా! మోహపాశముల నా
మూలము త్రెంచుటకై విఘ్నములు బాధింపకుండుటకై

* శృణువక్ష్యామి వైశ్యేంద్ర స్తోత్రయత్పరమాద్భుతమ్. అని మూలము.
నందుఁడు క్షత్రియుఁడు కాన వైశ్యాదిజాతుల కధిపతియని వైశ్యేంద్రయను
పదమున కర్థమును గ్రహించుట సరసమని నాకుందోఁచెను.

బురుషాకృతిం దాల్తువు. ప్రకృతివి నీవే. వారిద్దఱికంటె నధికు రాలవు నీవే. పరమాత్మను భరించుచున్నదానవు. కావుననే సనాతనివనఁ జెల్లుదువు. వేదజననివి నీవే. సావిత్రియనియుఁ బరాత్పరయనియు. మహాలక్ష్మియనియు సర్వసంపత్స్వరూపిణి యనియు, మర్త్యలక్ష్మియనియు, క్షీరసాగరమున శేషశాయి యగు భగవంతునకుఁ గామినివనియు, స్వర్గమున స్వర్గలక్ష్మి యనియు, భూతలమున రాజలక్ష్మివనియుఁ, బాతాళమున నాగలక్ష్మియును బొగడఁబడు దానవు నీవే. గృహములయందు గృహదేవతవు. సర్వసస్యస్వరూపవు. సర్వైశ్వర్యప్రదాత్రివి. రాగాధిష్ఠాతృదేవివి. తల్లి నాయందు గరుణ నునుపుము. నాశత్రువులఁ బోకార్పుము. అని యనేకభంగుల వినుతించెను.

---

## విష్ణుప్రోక్త దుర్గాస్తుతిః.

. రక్షరక్ష మహాదేవి దుర్గే దుర్గతినాశిని, మాంభక్త మనురక్తం చ శత్రుగ్రస్తే కృపామయి. ౧. విష్ణుమాయే మహాభాగే నారాయణి సనాతని, బ్రహ్మస్వరూపే పరమే నిత్యానందస్వరూపిణి. ౨. త్వం చ బ్రహ్మాదిదేవా నా మంబికే జగదంబికే, త్వం సాకారే చ గుణతో నిరాకారే చ నిర్గుణాత్. ౩. మాయయా పురుషస్త్వం చ మాయయా ప్రకృతిస్స్వయం, తయోఃపరం బ్రహ్మపరం త్వం బిభర్షి సనాతని. ౪. వేదానాం జననీ త్వం చ సావిత్రీ చ పరాత్పరా; వైకుంతే చ మహాలక్ష్మీః సర్వసంపత్స్వరూపిణీ. ౫. మర్త్యలక్ష్మీశ్చ క్షీరోదే కామినీ శేషశాయినః, స్వర్గేషు స్వర్గలక్ష్మీ స్త్వం రాజలక్ష్మీశ్చ భూతలే. ౬. నాగాదిలక్ష్మీః పాతాళే గృహేషు గృహదేవతా, సర్వసంపత్స్వరూపాత్వం సర్వైశ్వర్య విధాయినీ. ౭. రాగాధిష్ఠాతృదేవీత్వం బ్రహ్మణశ్చ సరస్వతీ, ప్రాణానా మధిదేవీత్వం కృష్ణస్య పరమాత్మనః. ౮. గోలోకే చ స్వయం రాధా శ్రీకృష్ణస్యైవవక్షసి, గోలో

ష్టం ద్విజాతిషు। తోయేన శౌచసంకృత్వా ఆచాన్తః ప్రయతో మత ఇ
తి॥ తథా వ్యాసః॥ కాకవానర మార్జార ఖరోష్ట్రాణాం శునాంతథా।
సూకరాణామ మేధ్యం వై స్పృష్ట్వా స్నానం సచేలకమితి॥ పరాశరః॥ ఉ
చ్ఛిష్టవదనో విప్ర శ్శూద్రాదీన్నావలోకయేత్। అవలోకే ప్రమాదా
చ్చ సహాతైర్భుక్త వాన్భవేదితి॥ సఏవ ॥ వృకశ్వాన సృగాలాద్యైర్దష్ట
శ్చేత్తు ద్విజోత్తమః। స్నాత్వాజపేత్స గాయత్రీం పవిత్రాం దేవమా
తరమితి॥ అరుణోదయాత్పూర్వ భావిస్నానం నిషేధతిపరాశరః॥ భా
స్కరస్య కరైఃపూతం రాత్రౌరస్యత్ర దర్శనాత్। స్నానం దానం జ
పోహోమః కర్తవ్యో రాహుదర్శనే। అన్యదాత్వ శుచీ రాత్రి స్త
స్మాత్తాం పరివర్జ యేదితి॥ మనుః॥ నస్నానమాచరేద్భుక్త్వా నాతురో
న మహానిశి। నవాసోభి స్సహాజస్రం నావిజ్ఞాతే జలాశయే॥ పరాశరః॥
మహానిశాతు విజ్ఞేయా మధ్యస్థ ప్రహరద్వయం। ప్రదోష పశ్చిమౌ

చున్నాదః.

జలము సూర్యుని కిరణములచే పవిత్రమగును. రాత్రి కాలమున గ్రహణ సమయమున ను పవిత్రమై యుండును, గావున గ్రహణము లేనప్పుడు రాత్రి కాలమున స్నానము చేయఁ గూడదు.

రోగియును, భుజించిన వాఁడును, మహానిశా కాలమందును, పెక్కు వస్త్రములఁ జుట్టుకొనియును, ఎఱుఁగని మడుగు నందును, స్నానము చేయఁ గూడదు. రాత్రికాలమున నడిమిజాములు రెండును మహానిశయని చెప్పఁ బడును. ప్రదోషకాలమున, తుదిజామునను పవలియందువలె స్నానము చేయవగును. అని పరాశరుఁడు చెప్పెను ఇది అపద్విషయము, ఇట్టు లంగీకరింప కున్నయెడ జలము సూర్యకిరణములచే పవిత్రమగునను పూర్వవచనము విరోధించు నని కొందఱు చెప్పుచున్నారు. కాని పూర్వవచనమునకే మహానిశయందు స్నానము చేయఁ గూడదను తాత్పర్యము గలదని గ్రహించుటయేయుక్తము. ఏలనిన, బహుప్రమాణములయందు మహానిశయందగు స్నానమే నిషేధింపఁ బడియున్నది. జలము సూర్యకిరణములచే పవిత్రమగును గాన నదిలేనప్పుడు స్నానము చేయఁ గూడదని యంగీకరించు నెడ అరుణోదయ కాల స్నానంబును ముఖ్యమే కాక పోవును. కావున దాని వచనమునకు గౌణార్థ కల్పము ఎట్లును చెప్పక తప్పదు. దానిం బట్టి తుదిజామునస్నానము ఆపద్విషయంబని క్లిష్టకల్పనము చేయంబనిలేదు.

కరుణమై శంకరుఁగాంచి మాయాశక్తిచే నీయసురావళిం జంపుము. శంకరా! వరమును గోరుము. నీకుమేలగుగాక. నీవాంఛితముల దాఁపక వచింపుము. సురలలో నీవు శ్రేష్ఠుఁడవు. కావున నీకువిజయము తప్పక కల్గించెదను. అని పలుక మహాదేవుం డాజగదంబికం జూచి తల్లీ! యీదైత్యుఁడు నశించునట్లను గ్రహింపుము. ఇదియే నాకు వాంఛింపఁదగు వరము. ఓ సనాతనీ! యని ప్రార్థించెను. శ్రీదుర్గాదేవియు శంకరా! మహాభాగా! శ్రీహరిని స్మరింపుము. దైత్యుని జయింపుము. విధాతవు జ్యోతిస్స్వరూపుఁడవు నీవేకదా. ఈశ్వరుఁడన నీవే.

అని యిట్లు పలుకునంతలో భగవంతుఁడు మహావిష్ణువు కలచే వృషభరూపుఁ డయ్యెను. శూలపాణి రథమును శిరస్సున ధరించెను. మంత్రపూత మగునస్త్రమును బ్రసాదించెను. రథమును ధరించెను. అంత శంకరుఁ డాయస్త్రమునుగ్రహించి విష్ణువును ధ్యానించి దుర్గాంబను మదినిడుకొని యాయసురుని బడఁగొట్టెను. వాఁ డాయస్త్రస్పర్శమున నేలపైఁ బడియెను. రాక్షససంహార మొనరించిన శంకరుని దేవతలు పొగడిరి. వృష్టిగాఁ బూలను గురిపించిరి. దుర్గాంబ శంకరునకు శూలాయుధ మొసంగెను. విష్ణువు పినాక మనుచాపము నొసంగెను. బ్రహ్మయు శుభాశీర్వాదము లొసంగెను. మహర్షులు శంకరుని గీర్తించిరి. దేవతాంగనలు నాట్య మొనరించిరి. గంధర్వులు పాడిరి.

అని పలికి శ్రీకృష్ణమూర్తి తండ్రీ! యీస్తోత్రరాజము భక్తిమైఁ బఠింపుము. ఇది సర్వవిఘ్నములఁ దొలఁగించుచు సర్వాపదల నశింపఁజేసి శత్రుసంహార మొనరించి పరమైశ్వర్యము నొసంగి సుఖముల నిచ్చి నిర్వాణమోక్షము నీయఁజాలి హరి

సూర్యయోః। మహానదీషు చాన్యాసు స్నానం కుర్యాద్యథా విధిః॥ శంఖః॥ వాపీకూపతటాకేషు గిరిప్రస్రవణేపివా। నద్యాంనదే దేవఖాతే సరసీషూద్ధృతాంబుని। ఉష్ణోదకేఽథవాస్నాయాత్ గ్రహణే చంద్రసూర్యయోః॥ ఇతి॥ ఉష్ణోదకస్నానమాతుర విషయం॥ వ్యాసః॥ సర్వాంగంగాసమంతోయం సర్వేబ్రహ్మసమాద్విజాః॥ సర్వం భూమిసమందానం గ్రహణేచంద్ర సూర్యయోః॥ గ్రహణే స్నానాకరణే ప్రత్యవాయమాహ వసిష్ఠః॥ గ్రహణే సంక్రమేవాపి నస్నాయాద్యదిమానవః। సప్తజన్మసు కుష్ఠీస్యాద్దుఃఖభాగీచ జాయతే। ఇతి॥ శాతాతపః॥ స్నానం దానం తపః శ్రాద్ధమనంతం రాహుదర్శనే ఇతి॥ అత్ర హిరణ్యేనామేన వా శ్రాద్ధం కుర్యాత్॥ బ్రహ్మాండపురాణే॥ ఆశౌచం జాయతే నౄణాం గ్రహణేచంద్ర సూర్యయోః। రాహుస్పృష్టతయోః స్నాత్వాదానానాం కల్పతేనరః॥ సర్వేషామేవ వర్ణానాం సూతకం రాహుదర్శనే। స్నాత్వాకర్మాణి కుర్వీత పక్వమన్నం వివర్జయేత్॥ గ్రహ

---

ణముల యందుగాని, స్నానము చేయవలయును. అనియున్నది. నూతియందుగాని, చేదుడు బావి, చెరువు, సెలయేరు, నది, నదము, దేవఖాతము మొదలగు వానియందుగాని, ఉష్ణోదకముచే, గాని గ్రహణ కాలమున స్నానము చేయవలయును. అని శంఖుఁడు చెప్పెను. ఉష్ణోదక స్నానము అశక్తుల నుద్దేశించి చెప్పఁబడినది.

గ్రహణ కాలము నందు జలమంతయును గంగా తుల్యమైనది. విప్రు లందఱు బ్రహ్మతో సమానులు. సకల దానములును భూదానముతో సమానములు నగును. అని వ్యాసుఁడు చెప్పెను. గ్రహణ కాలమున స్నానము చేయకున్న యెడ వసిష్ఠుఁడు ప్రత్యవాయము కలదని చెప్పెను.

గ్రహణము నందును, సంక్రమణము నందును, స్నానము చేయకున్న యెడ ఏడుజన్మములయందు కుష్ఠురోగియు, దుఃఖవంతుఁడు నగును.

గ్రహణకాలమునఁ జేసినస్నాన దానాదుల వలన ననంతమగు ఫలముకలుగునని శాతాతపుఁడు వచించెను. గ్రహణ కాలమున హిరణ్యముచే గాని, ఆమద్రవ్యముచే గాని శ్రాద్ధము నాచరింప వలయును. అని శాతాతపుఁడు చెప్పెను.

పాపాత్మునకు దీని నుపదేశింపఁ జనదు. విష్ణుభక్తునకు, శాంతునకుఁ, బండితునకు, సర్వజ్ఞునకుఁ దప్పక యుపదేశింపవలయు. వృషభము నెక్కువాఁడును, వృషలీపతి యగువాఁడు విప్రుఁడైనను జెప్పరాదు. శూద్రులకు వంటచేయువానికి, శూద్రశ్రాద్ధాన్నభోక్తకును, కన్యకను విక్రయించువానికిని దీనిం జెప్పరాదు. దీని ప్రభావ మనిర్వచనీయము. సర్వసిద్ధుల నొసంగును. సర్వతీర్థస్నానఫలము సర్వయజ్ఞఫలము దీనం గల్గును. ఈస్తోత్రము నా ప్రాణతుల్యము. ఇపుడే సభయం దిందుఁ బఠింపుము.

అనిపలుకు శ్రీకృష్ణునివచనమును విని నందుఁడు భక్తిభరితుఁడై పార్వతిని వినుతించెను. దుర్గాంబ నందునకు వర మొసంగెను. గోలోకప్రాప్తియే దానిఫలమని యెఱుంగవలయును. వేదములయందును గుప్తమగుజ్ఞానము నందునకుం గల్గెను. నందరాజా! గోలోకశాశ్వతనివాసము శ్రీకృష్ణదాస్యము నీకుం గలుగుఁగాతమని దుర్గపలికి యంతర్హిత యయ్యెను. మును లెల్ల నా నందనందనుని వినుతించి తమతమ నివాసముల కరిగిరి. కృష్ణుఁడంత నందునిం గాంచి వ్రజేశ్వరా! ఇఁక వ్రజమునకుం బొమ్ము. త్యక్తమోహుఁడ వగుము. అని యాజ్ఞాపించెను.

మహాభక్తులారా! ఈ యుపదేశమునం దొక్కవిశేషము కలదు. అది మన మెఱుంగఁ దగినది. నందునకు భగవంతుఁ డుపదేశించునపుడు శంకలు నందునిమదిఁ బొడమకుండుటకై దుర్గాస్తోత్రము నుపదేశించెను. ఇది తొలుదొలుత నచ్చెరువుగఁ దోఁచు. చక్కఁగా యోజించిన యుక్తమేయని తోఁచు. దుర్గయన నెవ్వరని మీ రూహింతురు. శివపత్నియనియా? కాదు.

తమితి॥ యత్తుజ్యోతి శ్శాస్త్రమాత్ర సిద్ధం గ్రహణం తత్రస్నానాది న కర్తవ్యం॥ తదుక్తం కాలనిర్ణయే॥ సూర్యగ్రహో యదా రాత్రౌ దివాచంద్రగ్రహస్తథా। తత్రస్నానం నకుర్వీత దద్యాద్దానం నచక్వచిత్॥ సంక్రాంతౌ స్నానాకరణే ప్రత్యవాయ మాహ శాతాతపః॥ సూర్యసంక్రమణే పుణ్యేనస్నాయాద్యదిమానవః। సప్తజన్మ సురోగీస్యాద్దుఃఖభాగీచ జాయతఇతి॥ మేషాదిషు ద్వాదశరాశిషు సంక్రమణేనసంచరత స్సూర్యస్య పూర్వస్మాద్రాశేరుత్తరరాశౌ ప్రవేశస్సంక్రమణం తత్రముఖ్య కాలస్యగ్రహీతుమశక్య త్వాత్తత్సం బాధినౌ పూర్వోత్తర కాలౌగ్రహీతవ్యౌ॥ తదాహ దేవలః॥ సంక్రాంతి సమయస్సూక్ష్మో దుర్జ్ఞేయః పిశితేక్షణైః। తద్యోగాద ప్యధశ్చోర్ధ్వం త్రింశన్నాడ్యః ప్రకీర్తితా ఇతి॥ సంక్రాన్తేః పూర్వోత్తర కాలయో రేకైకస్మిన్ త్రింశద్ఘటికాః పుణ్యా ఇతి సామాన్యేనోక్తం॥ తత్రవిశేష మాహవృద్ధ వసిష్ఠః॥

---

యోగమునందు కోటిగుణితమగు ఫలము కలదని వ్యాసుఁడు వచించెను.

పగలు చంద్రగ్రహణంబును - రాత్రి సూర్యగ్రహణంబును శాస్త్రగ్రహణములుగా కొన్ని సమయముల యందుఁ బట్టు చుండును. అవ్వి జ్యోతిశ్శాస్త్రముచే తెలియఁబడినవియే గాని మనకు గోచరింపవు. ఆసమయముల యందు స్నానదానాదులు చేసిన ఫలము లేదు.

సంక్రమణము నందు స్నానము చేయకున్నయెడ శాతాతపుఁడు ప్రత్యవాయము కలుగునని చెప్పెను. సూర్య సంక్రమణము నందు స్నానము చేయకుండునెడ సప్తజన్మముల యందు రోగియై దుఃఖ మొందు చుండును.

సూర్యుఁడు మేషము మొదలుకొని పండ్రెండు రాసులయందు దిరుగునప్పుడు ఒక రాశినుండి యింకొక రాశియందు ప్రవేశించుటకు సంక్రమణ మని పేరు. అందు ముఖ్య కాలము తెలిసికొన శక్యముగాదు గావున దానికి సంబంధించిన పూర్వోత్తర కాలములు గ్రహింపఁ బడుచున్నవి.

సంక్రాంతి సమయము సూక్ష్మమైనది గాన మాంస చక్షుష్కులకు గోచరింపదు. కావున దానికి ముందు గాని వెనుక గాని ముప్పది గడియలు పుణ్య కాలమని దేవలుఁడు చెప్పెను.

ప్రణిధానం భక్తివిశేషః. విశిష్టముపాసనమ్. సర్వక్రియాణాం తత్రార్పణమ్, విషయసుఖాదికం ఫలమనిచ్ఛన్ సర్వాః క్రియాస్తస్మిన్ పరమగురావర్పయతి తత్ప్రణిధానం సమాధేస్తత్ఫలలాభస్య చ ప్రకృష్ట ఉపాయః ఇతి భోజవృత్తిః.

తా. ఈశ్వరు నుపాసించువాఁడు విధ్యుక్తకర్మము లాచరించి భక్తితో సర్వమును భగవదర్పణమని చేసినచో వానికి శీఘ్రముగా యోగము సిద్ధించును భక్తి మానసిక, కాయిక, వాచికమై యుండును. ఈవిషయమే భగవద్గీతలయందుఁ దొమ్మిదవయధ్యాయమున నిరువదిరెండవశ్లోకమునఁ గనంబడియెడిని.

శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

కిం త్వనంతవిశేషః. అన్యేయే భక్తాః తే ఆత్మార్థం స్వయమపి యోగక్షేమం ఈహంతే. అనన్యదర్శినస్తు నాత్మార్థం యోగక్షేమమీహంతే. నహితే జీవితే మరణేవా ఆత్మనో వృద్ధిం కుర్వంతి. కేవలమేవ భగవచ్ఛరణాః తే, అతః భగవానేవ తేషామేవ యోగక్షేమం వహాతీతి. అని శంకరభాష్యము.

కావునఁ గోరికలు కోరక పరమేశ్వరుభజించిన నాపరమేశ్వరుఁడే యాభక్తుని రక్షించునని పైప్రమాణముల సారతరార్థము. ఇట్లు ధ్యానించిన నారూపము కల్పితమైనను ముక్తి నొసంగును. ఎప్పుడు ఏ రూపమునుధ్యానించిన నద్దానఁ గలుగు జ్ఞానము సర్వజగత్స్వరూపుఁడు భగవంతుఁడని తెలుపును. సర్వవస్తువులయందు భగవంతు నెవఁడుచూచునో వానికి ముక్తి లభించును. ఇట్లు కాఁగా సగుణబ్రహ్మోపాసనము తొలుతఁ జేయఁ

నాడ్యస్తూభయతో దశేతి॥ నాత్ర త్రింశద్ఘటికావచనేన విరోధశ్శంక్యః తాదృశసామాన్య వచనస్యాభ్యనుజ్ఞాపరత్వాత్. విశేషవచనోక్త ఘటికాసంకోచ ఏవ వరీయాన్॥ తదుక్తం దేవలేన॥ యాయాస్సన్నిహితానాడ్య స్తాస్తాః పుణ్యతమాస్స్మృతా ఇతి॥ సన్నిహితఘటికాస్వనుష్ఠానాసంభవే త్రింశద్ఘటికాః పరమావధిత్వేనాభ్యనుజ్ఞాయన్తే॥ తాశ్చ సంక్రాంతయః కదాచిదహ్ని కదాచిద్రాత్రౌ సంభవంతి. తద్విశేషేణానుష్ఠాన విశేషమాహ వృద్ధవసిష్ఠః॥ అహ్ని సంక్రమణే పుణ్యమహః కృత్స్నం ప్రకీర్తితం। రాత్రౌ సంక్రమణే భానోర్దినార్ధం స్నానదానయోః। అర్ధరాత్రాదధస్తాచ్చేన్మధ్యాహ్నస్యోపరి క్రియా। ఊర్ధ్వం సంక్రమణే చోర్ధ్వముదయాత్ప్రహరద్వయం। పూర్ణే చేదర్ధరాత్రే తు యదా సంక్రమతే రవిః। ప్రాహుర్దినద్వయం పుణ్యం ముక్త్వా మకరకర్కటావితి॥ అహ్ని యదా సంక్రాంతిర్భవతి। తదా కృత్స్నమహః పుణ్యమి

---

విరోధింపదు ఇందు తక్కువ కాలమున్ను చెప్పిన విశేషవచనములకే ప్రాధాన్యము గలదు. కావుననే సంక్రాంతికి సమీపములగు గడియలే ఎక్కువ పుణ్యకాలములని దేవలుఁడు చెప్పెను. ఈసంక్రాంతులొకప్పుడు పగలు నింకొకప్పుడు రాత్రియందు వచ్చుచుండును. సంక్రాంతి పగలు ప్రవేశించిన యెడల పగలంతయు పుణ్యకాలమగును. రాత్రి ప్రవేశించిన యెడ అర్ధదినము పుణ్యకాలమగును. సంక్రాంతి అర్ధరాత్రము లోపల ప్రవేశించు నెడ నాటిమధ్యాహ్నము నుండి పుణ్యకాలమగును. అర్ధరాత్రము పైన ప్రవేశించు నెడ మరునాఁడు సూర్యోదయము మొదలుకొని రెండుజాములవఱకు పుణ్యకాలమగును. సరిగ నడిరాత్రియందే ప్రవేశించు నెడ పూర్వోత్తర దినములు రెండును పుణ్యములే యగును. ఈవిధి మకరకర్కాట సంక్రాంతులయందు లేదు. అని వృద్ధవసిష్ఠుఁడు చెప్పెను. దీనిం బట్టి అర్ధరాత్రియందు స్నానదానాదికము నిషిద్ధమని తెలియుచున్నది. కావున సూర్యోదయము కాఁగనే దక్షిణాయనము ప్రవేశించు నెడ పూర్వభాగమునకు ప్రాశస్త్యము వదలిపెట్టి, ఉత్తర భాగముననే స్నానాద్యనుష్ఠానము చేయవలెను. అస్తమయమునకు పూర్వక్షణమున ఉత్తరాయణము ప్రవేశించు నెడ ఉత్తరభాగమునకు ప్రాశస్త్యము వదలి పూర్వభాగముననే స్నానాద్యనుష్ఠానము చేయవలెను. కర్కాట సంక్రాంతి యందు పూర్వకాలము ప్రశస్తమనియు మకర సంక్రాంతి యందు ఉత్తర భాగము

ములు చదివినను ఏమతగ్రంథములు పఠించినను జక్కఁగా నర్థమగును. కావున వెఱ్ఱిసిద్ధాంతములుమాని సర్వవేదసమ్మత మగు తత్త్వమునకు నిచ్ఛానుసారము నానారూపములను గల్పించుకొని భజింపుఁడు. పరమతముల లోపములెన్నఁ బ్రయత్నింపకుఁడు. అది మీమతము సంశయాస్పదమనుట తెలుపును. భగవంతుని సర్వవ్యాపిత్వము నశింపఁజేయును. దానికన్నఁ బాపపుఁగార్యము వేఱొక్కటి కలదా? అట్టిపనికిఁ బూని దుష్పాండిత్యము వెల్లడించుచు శ్రుతులకు లేనిపోనియర్థములు చెప్పి తెలియనివిషయములు తెలిసినట్లు నటించి ముక్తి నిర్ణయింపఁ బూనకుఁడు. భగవంతుఁ డొక్కఁడని, యతఁడు నిర్గుణుఁడని, ప్రకృతి తదధీనయని, తదాజ్ఞఁగొని క్షణమాత్రమున సకలబ్రహ్మాండముల సృజించునని సకలప్రాణులు తత్కాలావిశిష్టులని నమ్ముఁడు. భగవంతుఁడే ప్రకృతిందాల్చి శ్రీకృష్ణాది రూపముల నిలవెలసి భక్తుల నుద్ధరించుచు దుష్టుల నిర్మూలించుచు నుండునని, ఆరూపమున కర్చారూపమని పేరని భావింపుఁడు. ఈమతమును భావించినచో నేమతసిద్ధాంతము నాక్షేపింప వీలుండదు. భక్తజనులారా! ఇఁకఁ బ్రకృతవిషయ మనుసరించెదను. పరాత్పరుఁడు శ్రీకృష్ణమూర్తి నందున కీవిషయ ముపదేశించి మధురాపురమునుండి గోకులమున కరుగుమని హెచ్చరించెను. నందుఁ డీయుపదేశములఁ జక్క నాలకించి పులకాంచిత శరీరుఁ డయ్యెను. ఇఁకఁ దర్వాతికథ నాలకింపుఁడు. మనమున శ్రీహరి నొక్కమాఱు ధ్యానించి పిదపఁ దచ్చరిత్రమును బఠింపుఁడు. దాన నించుక శ్రద్ధ కుదురును. మనస్సు నిర్మల

తిని. దాన నీకు హర్షము సుఖము గలుగునని తలంచెదను. తండ్రీ! బాలభావమున నేనేమేని అపరాధ మొనరించియున్న దానిని క్షమింపుము. రాజమందిరమున నావలన మీకేమే సుఖముగల్గియున్న నది స్వర్గసుఖమును మించియుండునని యెఱుంగుము. వినయముననో నయముననో భక్తిభావముననో పరిహాసముననో నే నాడినవాక్యములను బరిగ్రహింపవలయును. యశోదను గూర్చికాని గోపికాగణమును గూర్చికాని నేనాడిన వాక్యములనన్నింటిని క్షమింపందగును. తండ్రీ! నీవు గోకులమునకుం బోయి బాలకులను బాలికలను విశేషించి రాధను యశోదాదిజననులను సకలబంధువులను నామాఱుగా నూఱడించి యిష్టసుఖముల ననుభవించి యవ్వల గోలోకమున కరుగుము. యశోదారోహిణులు గోపికాబృందములు గోపబాలకులు వృషభాను ప్రభృతులు రాధాదేవికిం దల్లియగు కలావతీదేవియు రాధయు నన్నుఁగూడి గోలోకమునకు వత్తురుగాక. మీరీలోకమునుండి నిర్గమింపఁదలంచునపుడు గోలోకమునుండి పెక్కురథములు దివ్యాలంకారభూషితములై పార్షదులంగూడి గోకులమున కరుదెంచును. వానిపై సకలబంధువులంగూడి యెక్కి సంతోషాంబుధి నోలలాడుచుఁ బోవఁగలవు. సత్యముగా నిట్లు జరగును. నమ్ముము. నీ వీపార్థివదేహమును వదలి దివ్యదేహమును దాల్చి పొమ్ము. రాధిక యయోనిసంభూత. కలావతియను రాధామాతయు నయోనిసంభూతయే యగు. వారిద్దఱు నీ దేహములంగూడియే గోలోకమున కేతెంచువారు. కలావతీదేవి పితరుల మానసీకన్య. ధన్యురాలు. మాన్యురాలు. సీతామాతయు ధన్యురాలు. దుర్గా

మనోహరరీతిం జెలంగు. విప్రులు వేదవేత్తలై వ్రతపరాయణులై తపోనిరతులై యుందురు. వారు నారాయణమూర్తిని దన్మనస్కులై ధ్యానించుచుఁ దన్మంత్రమును జపింతురు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు విష్ణుభక్తులు. అందు శూద్రులును సత్యధర్మపరాయణులయియే యుందురు. రాజులు ధార్మికులును బ్రజాపాలనతత్పరులునై యుందురు. ప్రజలనుండి పదాఱవపాలు పన్నుమాత్రము గ్రహింతురు. బ్రాహ్మణులనుండి పన్ను గ్రహింపరు. ఏలన, వారు తపోనిరతులని లోకోపకారమునకై ధర్మము నుపదేశించువారని వారు గ్రహించియే పన్ను గ్రహింపరని తలంపవలయు.

వసుంధర సదా సకల సస్యపరిపూర్ణయై రత్నాధారయగుచు నుండు. శిష్యులు గురుభక్తులు. తనయులు పితృభక్తులు. వనితలు పతిభక్తిపరాయణలు. పతివ్రతపరాయణులు నగుదురు. పతులు ఋతుకాలములయందే భార్యలం గూడుదురు. అంతియే కాని నారీవ్యామోహమును బొందరు. సదా కామాతురులును గారు. దొంగలనుండి భీతి యాకాలమున లేదు. పరదారలంగోరు నీచమతులును లేరు. వృక్షములు సదా పూర్ణఫలభరితములు. ధేనువులు క్షీరమును సమృద్ధిగాఁ బిదుకును. మనుజులు పొడవుగనుండి బలముగలిగి సౌందర్యముగలవారుగ నుందురు. అందుఁ గొందఱుమాత్రము లక్షసంవత్సరము లాయుఃపరిమాణమున నొప్పునుందురు. వారిదేహముల రోగము లుండవు. విప్రులంబోలి తక్కుంగలజాతులవారు విష్ణుభక్తి నలరుచుందురు. నదీనదములు జలపూర్ణములుగనుండును. నాల్గుజాతులవారు తీర్థస్నానమునఁ బావనాంగులుగ నుందు

అథ మాఘస్నాన విధిః

తత్ర విష్ణుః॥ బాలాశ్చ యువానో వృద్ధా నరనారీ నపుంసకాః। స్నాత్వా మాఘే శుభే తీర్థే ప్రాప్నువంతీప్సితం ఫలమితి॥ యత్తు మహాభారతే॥ మాఘేత్వర్ధోదితే సూర్యే స్నానం విధివదాచరేత్। నియమో నియతాహార స్సర్వపాపైః ప్రముచ్యతే॥ మాఘమాసే రటన్త్యాపః కించిదభ్యుదితే రవౌ। బ్రహ్మఘ్నం వా సురాపం వా కంపతంతం పునీమహ ఇతి- తత్ సంధ్యోపాసనాద్యనధికృత స్త్రీశూద్రాది విషయం। ఉషస్యుషోదయే మాఘస్నానమాహుర్ద్విజన్మనాం। స్త్రీశూద్రాణాం తథాన్యేషామర్ధోదయ ఉతోదయ ఇతి స్మరణాత్॥ బ్రాహ్మణాది విషయే సంధ్యాతిక్రమ దోషోపి దుర్వార స్స్యాత్। స్నానపూర్వకత్వాత్సంధ్యావందనాదేః॥ కేచిత్తు॥ విచేయ తారకే కాలే నిత్యస్నానం విధాయచ। పునరభ్యుదితే సూర్యే మాఘస్నానం విధీయతే॥ అత్యగ్ర ఘటికాత్పూర్వం పరం సూర్యోదయాత్తథా। సహవాభ్యుదితో నామ ధర్మ·

---

మాఘస్నాన విధి.

బాలురు- యువకులు- వృద్ధులు- పురుషులు- స్త్రీలు- నపుంసకులును మాఘమాసము నందు శుభతీర్థమునందు స్నానము చేయుచు నిష్టఫలము నొందుదురు. అని విష్ణువు చెప్పెను. మహాభారతము నందు- మాఘమాసమున సూర్యుడు సగము దయించగా యథావిధిగా స్నానము చేయుచు- నియమవంతుండును- నియతాహారుండు నగువాడు సకల పాపముల నుండి విముక్తుండగును. బ్రహ్మహత్య చేసినవానిని గాని- సురాపానము చేసిన వానిని గాని పవిత్రము చేయుదుమని మాఘమాసమున సూర్యుడు కొంచెము దయించగా జలములు ధ్వని చేయుచుండును. అను వచనము సూర్యుడు కొంచెము దయింపగా మాఘస్నానము చేయవలయునని తెలుపుచున్నది. అయినను ఆవచనము సంధ్యావందనాదుల యందధికారము లేని స్త్రీ శూద్రులను గూర్చి చెప్పబడియెను. ఏలన- మాఘస్నానము ద్విజులకు నుషః కాలంబున విహిత మనియు- స్త్రీ శూద్రాదులకు నుషః కాలంబునను- అర్ధోదయంబు నను విహితమనియు స్మృతికలదు. అట్లుగాక-యీ

యుగమున ధర్మాదులుండునట్లు సంపూర్ణవృద్ధి నొందుదురు. కొందఱు ధర్మద్వేషులు. కొంద అధర్మనిరతులు. మఱికొందఱు కపటాచారపరాయణులు. పతివ్రతలు భీతిల్లుచుందురు. కులటలు చెలరేఁగుచుందురు. పరదారనిరతు లసంఖ్యలుగ నుందురు. ఏకపత్నీవ్రతులు నామమాత్రముగ నుందురు. ధర్మిష్ఠులకు సదా భయము పొదలుచుండును. అధర్మనిరతులు విచ్చలవిడిగ నుందురు. రాజు లల్పధర్మనిరతులు. ద్విజులు స్వల్పవేదరతులు. వ్రతధర్మాసక్తులు కొలఁది సంఖ్యాకులే. స్వేచ్ఛాప్రవర్తకులు పెక్కుమంది యుందురు. తీర్థము లెంతకాలము భూమి నిలిచి యుండునో, సాధువు లెంతదనుక నుందురో గ్రామదేవత లెంత కాలము వెలసియుందురో శాస్త్రము లెన్నియేండ్లుండునో అంతదనుకఁ దపస్సు సత్యము మొదలగునవి యించుకగా నిలిచి యుండునని యెఱుంగుము.

తండ్రీ! దోషసాంద్ర మగుకలికాలమున నొక్కసుగుణ మున్నను మహత్తరమే యనఁదగు. మనస్సు దోషభూయిష్ఠ మగునుగాన సుకృతము చేయునూహ యించుకకలిగినను గొప్ప ఫలము నొసంగఁజాలును. తీర్థము లెప్పుడునశించునో ధర్మాంశ మత్తఱి నశించునని భావింపుము. ధర్మము కాలము నాశ్రయిం చియుండును. కలికాలశేషమున నాధర్మము కుహూతిథియనం బడు నమవసయందుఁ జంద్రుఁడు క్షీణించినట్లు నశించును. అని శ్రీహరిపలుక నందుఁ డామాటలకు భీతిల్లి యిట్లు ప్రశ్నిం చెను. శ్రీకృష్ణా! కలియుగమునఁ దీర్థరాజము నెంతకాల ముండును. సాధువులు గ్రామదేవతలు శాస్త్రములు నెంతకా

కులటలే ప్రతిగృహమున నుందురు. ఆకాలమునఁ బతివ్రతలన వారే యనఁబడుదురు. ఆస్త్రీలు భర్తను సేవకుని దిరస్కరించి నట్లు తిరస్కరింతురు. పతులు భయమున వడఁకుచుందురు. వని తారత్నములు జారవాంఛలు పెనుఁగొన అట్టివారికే భక్ష్య ములనొసంగి చందనచర్చల వారిని గైసేయుదురుగాని భర్తలు దుఃఖితులైనను వారి నాహారాదులచే సత్కరింపరు. కొడుకు తండ్రిని దూఱును. శిష్యుఁడు గురువును దూషించును. ప్రజలు రాజు నవమానింతురు. రాజులు ప్రజల బాధింతురు. శిష్టజనులు చోరులచేతను దుష్టులచేతను సదా బాధింపఁబడుదురు. భూమి సస్యహీనరయై యుండు. ధేనువులు పాలీయఁజాలవు. పాల యందు ఘృతముండదు. వెన్న దొరకుట యరుదగు.

జనులు నిజముపలుకుట యలవాటు లేకుందురు. మిథ్యా భాషితముల కలవాటు పడుదురు. శౌచసంధ్యాశాస్త్రహీనులై బ్రాహ్మణులు వృషవాహకులై శూద్రులయిండ్ల సూపకారకులై శూద్రశవదాహకులై శూద్రవనితారతులై యుందురు. శూ ద్రులు విప్రవధూనిరతు లగుదురు. బ్రాహ్మణునిచే వంటచే యించి భుజింతురు. తల్లికంటె భార్య నెక్కుడు మర్యాదగాఁ జూతురు. స్త్రీలంపటు లయియే వా రుందురు. భృత్యులు రాజు లంద్రోసి తమరే ప్రభువులమని ప్రకటించుకొనుదురు. కాంతలు పతినిదెగడి కామాతిరేకమున జారునివరించి యతనిచెంత కరు గుదురు. రాజపుత్రులు తండ్రిని ద్రెంచి తమరే పట్టాభిషేకము చేసికొందురు. అందఱు స్వచ్ఛందాచారనిరతులై భోగభుక్తిరతు లగుదురు. ఎల్లరు కులమర్యాదల వీటఁబుచ్చి దురాచారముల నవలంబించి కుత్సితులై కుమతులై యుందురు. మంత్రముల

స్మృత్యర్థసారే॥ నిషిద్ధదివసేవాపి। రాత్రౌ చాకాలికస్య చ। ద్రవ్యాంతరయుతం తైలం నదుష్యతి కదాచనేతి॥ స్మృత్యంతరే॥ రవౌ పుష్పం గురౌ దూర్వాం భృగౌ గోమయమేవ చ। భౌమే భూమిం వినిక్షిప్య తైలాభ్యంగం సమాచరేత్॥ ద్రవ్యాంతరయుతం తైలం నదుష్యేద్గ్రహణం వినా॥ మహాభారతే॥ పాదాభ్యంగం శిరోభ్యంగం ద్విజోచ్ఛిష్టాపమార్జనం। ఏకైకం పాండవశ్రేష్ఠ రాజసూయాద్విశిష్యతఇతి. ఇతి మలాపకర్షణం స్నానం॥

### అథ క్రియా స్నానం.

తత్రశంఖః॥ క్రియాస్నానం ప్రవక్ష్యామి యథావద్విధిపూర్వకం। సరస్సు దేవఖాతేషు తీర్థేషు చ నదీషు చ। క్రియాస్నానం సముద్దిష్టం స్నానం తత్ర క్రియా మతా॥ మృద్భిరద్భిశ్చ కర్తవ్యం శౌచమాదౌ యథావిధి॥ జలే నిమగ్న ఉన్మజ్య ఉపస్పృశ్య యథావిధి। తీర్థస్యావాహనం

---

వాత వస్త్రాభరణాదుల ధరింప వలయును. ఇట్లు చేసిన సకల సంపదలు కలుగు నని శాలా దర్శము నందు గలదు. నిషిద్ధమగు వారమునందు ఇతర ద్రవ్యములతోఁ జేర్చి తైలము నంటుకొనిన యెడ దోషము లేదని స్మృత్యర్థ సారము నందు గలదు. ఆదివారమునాడు పువ్వును- గురువారము నాడు గరికెను- శుక్రవారము నాడు గోమయమును- మంగళవారమునాడు మృత్తికను తైలమునఁ జేర్చి యభ్యంగము చేసికొన నగును. గ్రహణ కాలము నందు దప్ప ఇట్లు ద్రవ్యాంతరముతోఁ గూడిన తైలము నంటుకొనినయెడ దోషములేదని స్మృత్యంతరము నందు గలదు. ఒరునిపాద మునకు తైలము రాయుట యు- తలయంటుటయు- బ్రాహ్మణులు భుజించిన విస్తళుల దీసివైచుటయు వీనిలో నొక్కొక్కటియు రాజ సూయ యాగము కన్న నెక్కువ ఫలము నొసంగును. అని మహాభారతమునఁ గలదు. మలాప కర్షణ స్నానము ముగిసెను.

### ఇఁక క్రియా స్నానము.

ఈసందర్భమున శంఖుఁడిట్లు చెప్పెను. క్రియా స్నానమును యథా విధిగాఁజెప్పు చున్నాను. సరస్సులు- దేవఖాతములు- తీర్థములు- నదులు వీనియందు క్రియాస్నా

దురు. పాపాత్ములసంఖ్య యత్యధికమై యుండును. ఎల్లవారును స్వలాభ ప్రియులుగ నుందురు. కులటలు పరస్పరకలహములు పుట్టించి ప్రజల బాధింతురు. కామినులు రూపవతులు గాక కురూపలయ్యును గర్వించుచుందురు. పురుషులు నష్టేయుందురు. నదులు నదములు తటాకములు సరోవరములు జలశూన్యములై పద్మములు లేక యుండును. మేఘములు కనంబడునుగాని నిర్జలములై యుండును.

వనితలు సంతతివిహీనలై కామాతిశయముగలిగి శీఘ్రముగా జరాభారము తమ్ముం గ్రమ్ముకొన నుందురు. అశ్వత్థవృక్షములనుగూడ ఛేదించువా రుందురు. వృక్షములు క్రమముగ నశించును. ఎందేని వృక్షములున్న నవి ఫలహీనములై యుండును. బహుశాఖలుకూడ వృక్షములందుం జూపట్టకుండు. ఎందో ఫలములుండిన నవి స్వాదువులుగ నుండవు. అన్నము జలములు నష్టేయగు. మానవులు కపటభాషణములు గలిగి దయావిహీనులై ధర్మమున నాసక్తి లేకుందురు. ఇట్టులుండు కలియుగాంతమున ద్వాదశాదిత్యులు చెలరేంగి మానవుల హింసింతురు. మేఘము లావిర్భవించి యతివృష్టిచే మిగిలిన ప్రాణులం బోకార్చు. భూమి యాకాలమునం గథామాత్రము మిగిలియుండును.

కలియుగ మీరీతిగడువంగా వర్షాగమమున క్షేత్రము బాగుపడినట్లు సత్యయుగము రాంగా ధర్మము వృద్ధియగుట శోభిల్లు. క్రమక్రమముగా ధర్మము వృద్ధినొందుటం గాలము సుఖాకరముగాం బొడకట్టు. నందభూపాలకా! యుగధర్మములను వచించితిని. ఇంక సంశయములం బొందక ప్రజమునకరుగుము.

నైతిని? అట్టి నేను గంసభీతుఁ డగుతండ్రిచే నీయింట విడువఁ బడితిని. తండ్రికంటె నెక్కుడగుతండ్రివి నీవైతివి. తల్లికంటె నెక్కుడుతల్లి యశోద యయ్యెను. దుర్గాదేవియు నేను నొసంగిన యీ జ్ఞానముచేత మోహమును వదలి సుఖముగా గోకులమున కరుగుము. అని శ్రీహరి పలుమాఱు నొక్కి చెప్పఁగా నందుఁ డిట్లు పలికెను.

వత్సా! బృందావనమును స్మరింపుము. అందు జరగు రమ్యమహోత్సవమును స్మరింపుము. గోకులమును దలంపుము. వ్రజమును స్మరింపుము. సుందర యమునాతటమును దలంపుము. నీ కతిప్రియమగు రాసోత్సవమును రమణీగణపరివృతమును మఱువకుము. గోపబాలికలను గోపబాలకులను యశోదను రోహిణిని, ప్రాణప్రియ యగు రాధికను స్మరింపకుండఁజాలవని నమ్మెదను. ఒక్కపర్యాయము గోకులమున కరుదెంచి యందొక్కవాసరము గడపుము. అని పలికి నందుఁ డత్యంతప్రీతి నైకొన శ్రీకృష్ణుని దనతొడపై నిడుకొని యానందాశ్రువుల నాతనిం దడుపుచు దుఃఖితుఁడై కపోలద్వయము ముద్దిడుకొని కౌఁగిలించుకొని పరమానందభరితుఁడై యుండెను. శ్రీహరి యానందుని యానందపారవశ్యమును గాంచి యి ట్లనియెను.

మహాభక్తులారా! ఈకథయందును గొన్ని ముఖ్యాంశములు గలవు. వానిని దెలుపక యవ్వలి కథను వ్రాయ మనసొప్పకున్నది. నందునకు శ్రీహరి యుగధర్మములఁ దెల్పెను. ఆవిషయము సకలపురాణప్రతిపాదితము. కలియుగ శేషభాగధర్మములు నట్టివే. వానింగుఱించి యిటఁ దెంచివ్రాయుట చర్వితచర్వణమన్న న్యాయమున కుదాహరణము గాఁ గలదు. కాన

స్మృత్యర్థసారే॥ నిషిద్ధ దినసేవారే। రాత్రౌచాకాలికస్యచ। ద్రవ్యాంతర యుతం తైలం నదూష్యతి కదాచనేతి॥ స్మృత్యంతరే ॥ రవౌపుష్పం గురౌదూర్వాం భృగౌగోమ యమేవచ। భౌమేభూమిం వినిక్షిప్య తైలాభ్యంగం సమాచరేత్॥ ద్రవ్యాంతరయుతం తైలం నదుష్యేద్గ్రహణంవినా॥ మహాభారతే॥ పాదాభ్యంగం శిరోభ్యంగం ద్విజోచ్ఛిష్టాపమార్జనం। ఏకైకం పాండవశ్రేష్ఠ రాజసూయాద్వి శిష్యతఇతి. ఇతి మలాపకర్షణం స్నానం॥

అథక్రియా స్నానం.

తత్రశంఖః॥ క్రియాస్నానం ప్రవక్ష్యామి యథావద్విధి పూర్వకం। సరస్సుదేవ ఖాతేషు తీర్థేషుచనదీషుచ। క్రియాస్నానం సముద్దిష్టం స్నానంతత్ర క్రియామతా॥ మృద్భిరద్భిశ్చ కర్తవ్యం శౌచమాద్యా యథావిధి॥ జలేని మగ్నఉన్మజ్య ఉపస్పృశ్య యథావిధి। తీర్థస్యావాహనం

---

వాత వస్త్రా) భరణాదుల ధరింప వలయు. ఇట్లు చేసిన సకల సంపదలు కలుగు నని శాల్తా దర్శము నందు గలదు. నిషిద్ధమగు వారమునందు ఇతర ద్రవ్యములోఁ జేర్చి తైలము నంటుకొనిన యెడ దోషము లేదని స్మృత్యర్థ సారము నందు గలదు. ఆదివారమునాడు పువ్వును- గురువారము నాడు గరికెను- శుక్రవారము నాడు గోమయమును- మంగళవారమునాడు మృత్తికను తైలమునఁ జేర్చి యభ్యంగము చేసికొన నగును. గ్రహణ కాలము నందు దప్ప ఇట్లు ద్రవ్యాంతరముతోఁ గూడిన తైలము నంటు కొనినయెడ దోషములేదని స్మృత్యంతరము నందు గలదు. ఒరునిపాద మునకు తైలము రాయుట యు- తలయంటుటయు- బ్రాహ్మణులు భుజించిన విస్తళుల దీసివైచుటయు వీనిలో నొక్కొ టొకటియు రాజ సూయ యాగము కన్న నెక్కువ ఫలము నొసంగును. అని మహా భారతమునఁ గలదు. మలాప కర్షణ స్నానము ముగిసెను.

ఇఁక క్రియా స్నానము.

ఈసందర్భమున శంఖుఁ డిట్లు చెప్పెను. క్రియా స్నానమును యథా విధిగాఁజెప్పు చున్నాను. సరస్సులు- దేవఖాతములు- తీర్థములు- నదులు వీనియందు క్రియాస్నా

మ: యాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే. ౧౦

అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం,
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్. ౧౧

శ్రీ భగవద్గీత. ౯ అధ్యాయము.

అని యిట్లు శ్రీకృష్ణపరమాత్మ నొక్కి వక్కాణించెను. ప్రకృతియు నేనును అనాదిగా నుండువార మనియు వికారములు వివిధగుణములు ప్రకృతివలనఁ గలుగుననియు నేను నిర్వికారుఁడను నిర్గుణుఁడననియు నిట్టి విషయములఁ గనుఁగొనినవాఁడు నన్నె లుంగుననియు వీని సారము. నా యాజ్ఞఁ గొని ప్రకృతి సర్వప్రపంచమును నిర్మించును. తద్వికారములు నన్నరికట్టఁజాలవు. అనియు శ్రీహరియే వచించెను. ఇట్లులుండఁగాఁ బ్రకృతియనఁగా నులికిపడుట పూర్వ్వకర్మము మంచిది కాదేమో యనుటకన్న నింకొక్కమాట యనఁజాలము కదా. మతాభినివేశము లెంతటి యన్యాయమునకైన నొడిగట్టఁ జేయుననుట కింతకంటె కుదాహరణ మేమి కావలయును. మఱియు లోకమున సకలప్రాణులకుఁ గలుగు సుఖదుఃఖములు కర్మానుసారముగాఁ గాలమే కల్పించును. అని భగవంతుఁడు పలికెను. దీని భావమేమి? ఎవ్వరెవ్వరి సుఖదుఃఖములకు వారే కర్తలుగాని భగవంతుఁడు కాఁడు. ఇతరులను బొగడుటో నిందించుటో తగదని హెచ్చరించిన ట్లెంచఁదగును. స్వస్వకర్మాధీనముగా సంభవించు సుఖదుఃఖముల కితరులను బొగడినఁగాని నిందించినఁగాని ఫలము లేదనియే దీనిసారతాత్పర్యము. ప్రపంచ చక్రము కర్మానుసారముగా సాగుచున్నదనియు నెఱుంగు

దీ ॥ తత్ర విశేషో దర్శితో భవిష్యత్పురాణే ॥ ఆషాఢే కర్కటకే సర్వా మహానద్యో రజస్వలాః। త్రిదినంతు చతుర్థేహ్ని శుద్ధాస్స్యుర్జాహ్నవీ తథేతి॥ బ్రహ్మపురాణే॥ గోదావరీ భీమరథీ తుంగభద్రా చ వేణికా। కావేరీ చ తథా కృష్ణా వింధ్య దక్షిణతః స్మృతాః। భాగీరథీ నర్మదా చ యము నా చ సరస్వతీ । విశోకా చ వితస్తా చ వింధ్యస్యోత్తరతః స్మృతాః॥ ద్వాదశైతా మహానద్యో దేవర్షి క్షేత్ర సంభవాః ॥ ఏవం మహానదీత్వే న పరిగణితా నామేవ దినత్రయం రజోదోషః॥ అన్యాసాంతు సముద్ర గా నామపి మాసద్వయం రజోదోషః॥ కేచిత్తు ॥ యాన్సృతా నద్యః ప్రోక్తాయాశ్చ గంగేతి కీర్తితాః । ఏతాసాం కర్కటే భానౌ రజోదో న విద్యతే ॥ కావేరీ తుంగ భద్రా చ కృష్ణవేణీ చ గౌతమీ । భాగీ రథీ చ విఖ్యాతాః పంచ గంగాః ప్రకీర్తితాః ఇతి వచనము దాహరన్తః రజోదోషో నాస్తీత్యాహుః॥ కాత్యాయనోపి॥ జాహ్నవ్యాదిత్య సంభూతా ప్రతుహా చ సరస్వతీ । రజసాతాన దూష్యన్తి నద్యః కృష్ణా చ వేణికా। మధుప్రవాహం శుమతీ కౌశికీ పాపనాశినీ। దృషద్వతీ తథా పుణ్యా తథా వై తరణీనదీ। ఏతాసాముదకం పుణ్యాం వర్షాకాలే ప్రవర్థితాం।

---

ష్యత్పురాణమున గలదు. సింహాకర్కాటక సంక్రమణముల మధ్య మహానది తప్ప కడమ నదులు రజస్వల లగును- కావున వాని యందు స్నానము చేయఁ గూడదు. అని వ్యాఘ్రపాదుడు చెప్పెను. కర్కాటక సంక్రమణము ప్రవేశింపగనే గంగానదితో గూడ మహానదులన్నియు మూడుదినములు రజస్వల లగును. నాల్గవనాడు పవిత్రములగు నని భవిష్యత్పురాణము నందు గలదు.

గోదావరి- భీమరథి- తుంగభద్ర- వేణి- కావేరి- కృష్ణ అను నారును వింధ్యపర్వతమునకు దక్షిణ దిక్కున నున్నవి- భాగీరథి- నర్మద- యమున- సరస్వతి- విశోక-వి ... నారును వింధ్య పర్వతమునకు నుత్తర దిక్కునఁ గలవు. ఈ పండ్రెండును మహానదులును దేవర్షి క్షేత్రముల యందుఁ బుట్టెను. ఇట్లు మహానదులలో లెక్కింపఁ బడిన వానికే రజోదోషము మూడుదినములు - తక్కినవి సముద్రములోఁ జేరిన వైనను వానికి రజో దోషము రెండు నెల లుండును.

ము. ఉద్ధవుఁడు మిమ్ముఁ దోడ్కొనిపోయి గోకులవాసుల నూఱడించివచ్చునట్లు కట్టడిచేసెదను. త్వరగా నుద్ధవు నంపెదను. ఆతఁడు పరమకారుణికుఁడు. కావున నాయాదేశంబున గోకులమున కరిగి యశోదారోహిణులను, గోపికలను, గోపకులను, గోపబాలకులను, విశేషించి ప్రాణాధిక యనందగు రాధికను నా మాటలఁ దెల్పి యూఱడించును. అనిపలికి నందుని గోకులగమనోన్ముఖునిగా నొనరించెను.

అత్తఱి వసుదేవుఁడు దేవకిం గూడి కృష్ణునొద్దకు వచ్చెను. బలదేవుఁ డుద్ధవుఁడు, అక్రూరుఁడును వచ్చిరి. వసుదేవుఁడు నందునిగాంచి నందరాజా! నీవు బలవంతుఁడవు. జ్ఞానివి, సద్బంధువవు, సఖుఁడవు నైతివి. ఇపుడు పూనిన మోహమును వదలుము. గృహమున కరుగుము. ఈకృష్ణుఁడు నాకెట్లు కుమారుఁడో నీకు నట్లే కుమారుఁడని నిశ్చయింపుము. మాదంపతులయం దెట్టిప్రీతి యీ కుమారకునకుం గలదో మీదంపతులయం దట్టిప్రీతియే యుండును. ఇవి ధ్రువము. నందా! ఏల యశ్రుజలముల విడుచుచు నాయాస పడియెదవు? శోకింప నవసరమేమి? ఈ కుమారుఁడు పదునొకండువత్సరములు నీయింట గడపెఁగదా. ఆసుఖ మనంతమని భావింపుము. అట్టి నీ వీదినమున నేల శోకించెదవు? ఈ మధురానగరమునందే పుత్త్రుం గూడి కొలఁదిదినము లుండుము. ఈ పూర్ణచంద్రాననుఁ గుమా

డియుం, శ్రీభాగవతము దశమస్కంధము నలువదైదవ యధ్యాయమునుండియుం గ్రహింపఁబడినదని యెఱుంగఁదగు.

నకుం గర్తవ్యమును దెలిపి తల్లిదండ్రులను నందుని బలరామా క్రూరలనుగూడి యభ్యంతర మందిరమున కరిగెను. ఉద్ధవుఁడా రేయి మధురానగరమునఁ గడపి ప్రభాతమున నరదమెక్కి బృందావనమున కరిగెను.

## శ్రీకృష్ణానుమతి నుద్ధవుఁడు గోకులము చేరుట.

* ఇట్లు శ్రీకృష్ణపరమాత్మ యాజ్ఞాపింప నుద్ధవుఁడు పరమానందభరితుఁడై కృతకృత్యుఁడనైతినని తలంచుచు మధురానగరమును వెడలుతఱి గణనాథుని, శ్రీమన్నారాయణమూర్తిని, శివదుర్గలను, లక్ష్మీసరస్వతులను, గంగాయమునానదులను, మనసున ధ్యానించుచు దిగీశునకు వందనమాచరించి మహేశ్వరుని మది నిడుకొని యెడనెడ శుభశకునములఁ గాంచుచుఁ బయనము సాగించెను. దుందుభిధ్వనియు, ఘంటానాదము, శంఖనిస్వనము, హరినామనాదము వినవచ్చెను. సంగీత మతిమనోహరముగా వినవచ్చెను. మఱెన్నియో మంగళధ్వనులు చెవులఁ జొచ్చెను. పతియుఁ బుత్త్రులుగల సాధ్వీమణి దర్శనమిచ్చెను. దీపము కనఁబడియె. పుష్పహారములు దర్పణము తోఁచెను. జలపూర్ణకుంభము, దధి, లాజలు, ఫలములు, దూర్వాంకురములు, శుభధాన్యము, రజతకాంచనములు, తేనెయు, బ్రాహ్మణబృందము, కృష్ణసారము, వృషభము, ఘృతము, సద్యోమాంసము, గజేంద్రము, రాజు, శ్వేతఘోటకము, పతాకయు, నకులము, శుక్లపుష్పము, పాలపిట్టయు, శ్రీచందనము దృగ్గోచరమయ్యెను. ఇట్టి శుభశకు

---

* ఇదియుం శ్రీకృష్ణజన్మఖండము తొంబదిరెండవ యధ్యాయము నుండి గ్రహింపఁబడినది. ఈ కథయందు శ్రీభాగవతాది విషయములు కలిపి వ్రాయఁబడునని యెఱుంగునది.

జః। భస్మస్నాయీ భవేత్కశ్చిత్ క్షిప్రం పాపైః ప్రముచ్యతే ॥ ఇతి॥ వారుణస్నాన మాహవ్యాసః॥ స్నానమద్భిర్యత్ స్నానం తర్పణం చ పితౄన్ ప్రతి। గాహనైః తర్పణం పితృదేవానాం స్నానం వారుణముచ్యతే ॥ బోధాయనః॥ జలావగాహనం స్నానం వారుణం సర్వవార్ణికం। మంత్రవత్ప్రోక్షణంచాపి ద్విజాతీనాం విశిష్యతే ఇతి॥ బ్రాహ్మస్నాన ప్రకారమాహకాత్యాయనః॥ ఆపోహిష్ఠాది భిర్బ్రాహ్మం మంత్రస్నానం హితత్స్మృతం। కుశాగ్రైర్మార్జనం కుర్యాద్దేవతీర్థేన వాద్విజః। ఋగంతే మార్జనం కుర్యాత్పాదాంతేవా సమాహితః॥ ఋచశ్చాంతేఽథ వాకుర్యాచ్ఛిష్టానామ్మతమీదృశం ॥ బ్రహ్మ॥భువిమూర్ధ్ని తథాకాశే మూర్ధ్న్యాకాశే తథా భువి। ఆకాశేభువి మూర్ధ్నిస్యాన్మంత్ర స్నానం విధీయతే ॥ భువిపాదయోః। ఆకాశేహృది॥ వాయవ్యం దర్శయతి బృహస్పతిః॥ వాయవ్యం గోరజః ప్రోక్తమస్తంగచ్ఛతిగోపతౌ। విద్వత్సరస్వతీప్రాప్తం స్నానం

ము నందు గలదు. వరుణ దేవతాకములగు మంత్రములతో స్నానము చేసి పితృదేవతల కు తర్పణము చేయుట వారుణ స్నానమగును. అని వ్యాసుఁడు చెప్పెను.

నీటిలో మునుగుట యను వారుణ స్నాన మన్ని వర్ణముల వారికి సమానము. అదియు మంత్రములతో ప్రోక్షించుకొనుట యనునది బ్రహ్మక్షత్ర వైశ్యులకు విశేషముగా విధింపఁబడు చున్నది.

బ్రాహ్మ స్నానము చేయు విధమును కాత్యాయనుఁడిట్లు చెప్పెను, ఎట్లనిన, ఆపోహిష్ఠా ఈ మొదలగు మంత్రములు చదువుచు ఋక్కు యొక్క యంతమునగాని పాదాంతమునగాని దర్భలతో జలమును శిరమున జల్లుకొనుట బ్రాహ్మస్నానమనియు చెప్పెను. పాదములు, శిరము హృదయమునను వానియందు మొదటను, శిరము హృదయము పాదములు, శిరమునను వానియందు పిమ్మటను, హృదయము, పాదములు శిరమునను వానియందు తరువాతను మంత్రస్నానమునందు జలముచల్లుకొనవలయును.

సూర్యుం డస్తమించు నప్పుడు గోధూళితోఁ జేయఁబడునది వాయవ్యమగును.

పండితుల యొక్క వాక్కుతోఁ జేయఁబడునది సారస్వత స్నానమగు. అదియే

* మహాత్మా! ఉద్ధవా! మానందభూపాలుఁ డెందున్న వాఁడు? బలరాముఁడు కృష్ణుఁ డెందున్నారు? సత్యము చెప్పుమా యని ప్రశ్నించిరి. ఉద్ధవుఁ డా మానినీశిరోమణు లొనరించిన యాతిథేయమునకుఁ బ్రీతిపూర్వసంభాషణము నకుఁ బరమానందభరితుఁడై రాజకుటుంబ మింత వినీతమగునే యని యబ్బురపడుచు నిట్టి మందిరోత్తమము కనుకనే పర మాత్మ యిందు వసించెనని యచ్చెరువందుచు మధురానగర మున క్రూరసహితుఁడై బలరామునిఁగూడి శ్రీగోపాలకృష్ణ మూర్తి ప్రవేశించిన దాదిగాఁ దన్నుఁ బంపినంతదనుక జరగిన చరిత్రము నించుకే వదలకుండ విన్నవించెను. ఇప్పుడు బలరామ శ్రీకృష్ణులంగూడి నందమహీజాని సానందుఁడై యున్నవాఁ డని మరల నొక్కిచెప్పెను. శ్రీకృష్ణుని బిలుచుకొని యించుక యాలస్యముగా నందుఁడు రాఁగలఁడు. మీరు చింతింపవలద నియు నొక్కిచెప్పెను. ఇచ్చట మీ కుశలముల నరసి నేను వెళ్లెదను. అంబా! నేను మధురానగరమునకుఁ బోవవలయు. ఇది శ్రీకృష్ణాజ్ఞ. దాని మీఱరాదు. తల్లీ! ఒక్కమాట యాల కింపుము. అందఱందు సానందముగా నున్నవారు. నిర్విచారము గా మీరుండుఁడు. అని యుద్ధవుఁడు చెవులకింపుగా మనస్సు నకుఁ బరమానందజనకముగాఁ దెలిపిన యావార్త నాలించిన యశోదారోహిణులు పరిమితిలేని సంతసమున నోలలాడిరి. అట్టి శుభవార్తాశ్రవణమున వా రిరువురు బ్రాహ్మణులం బిలిచి రత్నాభరణములనొసంగి బాలకులకు స్వస్త్యయనము చేయిం చిరి. ఉద్ధవునకు మిష్టాన్నమును బెట్టి తృప్తునిం గావించిరి. ఆ

* క్వ నందః క్వ బలః కృష్ణ స్సత్యం తత్కథయోద్ధవ. అని మూలము.

తదాలిప్య స్నానం వాయవ్య ముచ్యతే। ఉత్తరాయణమధ్యేతు యద్వా వర్షతి వాసవః। ఆతపేన సహస్నానం దివ్యంస్నానం తదుచ్యతే॥ కూర్మ పురాణే॥ అప్రాయత్యే సముత్పన్నే స్నానమేవం సమాచరేత్। బ్రాహ్మాదీనన్యథా శక్తో స్నానాన్యాహుర్మనీషిణః॥ జాబాలిః। అశిరస్కం భవేత్స్నానం స్నానాశక్తౌతు కర్మణః। తస్యాప్యసామర్థ్యే విధామంత్రస్నానాదికం భవేత్। అసామర్థ్యాచ్ఛరీరస్య వైషమ్యాద్దేశకాలయోః। స్నానాన్యేతాని తుల్యాని వారుణేన భవంతిహి॥ మనుః। ప్రభుః ప్రథమకల్పేపి యోనుకల్పే ప్రవర్తతే। నసాంపరాయికం తస్యదుర్మతేర్విద్యతే ఫలమితి॥ సాంపరాయికమాముష్మికం॥

ఇతిగౌణస్నానాని.

---

ఉత్తరాయణమున, ఎండ యుండగా వానకురియు నప్పుడు [illegible] దివ్యస్నానమగును. అనియు వ్యాసుడు వచించెను.

అశక్తత సంభవించి నప్పుడు బ్రాహ్మాది గౌణస్నానముల చేయవలయును. శిరస్స్నానము చేయజాలకుండిన కంఠస్నానము చేయవలయును. దానికిని శక్తిలేకుండిన మంత్రస్నానాదులు చేయవలయును, అశక్తియందును, దేశకాలవైపరీత్యము నందును గౌణస్నానములు చేసినను అవి ముఖ్యస్నానముతో సమములే యగును. అని జాబాలి మహర్షి చెప్పెను, మొదటి పక్షమును చేయశక్తియుండియు నదివిడిచి [illegible] పక్షము నవలంబించునో వానికి నాముష్మికఫలము లేదని మనువు నిర్ణయించెను.

గౌణస్నానములు ముగిసెను.

శ్రవణాదరులై రాఁగా వారి కాభగవంతుని చిత్రచరిత్రములఁ దెల్పి సంతుష్టమతులం జేసి గోపికలు శ్రీకృష్ణకుశలాదు లడుగ వారికిఁ దనివిపుట్ట నన్నియు వచించి వారింగూడి రాసమండల మున కరిగెను. చంద్రమండలమువలె వర్తులాకారమై మనో హరమై వర్ణనాతీతమై యుండెను. కదళీ స్తంభములు ఫలభార మున వంగి చాలుగా నిలిపిన ట్లుండెను. శ్రీచందన వృక్షపల్లవ ములు చూడంజూడ వేడుక గొలుపుచుండెను. వృక్షములకుఁ బట్టములు వ్రేలాడుచుండఁగాఁ జూచువారి కవి యమూల్య వస్త్రములవలెఁ గనఁబడుచుండెను. పరిమళసమ్మిళితమాల్యము లందందు దృగ్గోచర మగుచుండెను. భగవత్పూజాద్రవ్యము లందందుండెను. చందనాగరుకస్తూరీవాసనలమించిన దివ్యా నందదాయకవాసనలు గుబులుకొనుచుండెను. ఆ రాసమండ లము నసంఖ్య లగుగోపికలు కాపాడుచుండిరి. అందందు భగ వత్సేవామందిరము లానందజనకములగున ట్లమర్పఁబడి యుం డెను. గోపకు లందందు నిలిచి కాపాడుచుండిరి. వారెల్ల శ్రీకృష్ణాగమనాదరమున నుండిరి.

అందొక్కచోట మాలతీవనము కలదు. అది యమునా నదికి నుత్తరభాగమున నున్నది. అందు వకుళవృక్షములు వంజు లభూరుహములు కన్నులపండువుగా నుండెను. అశోకతరు వులు లెక్కకుమించి యుండెను. పలాశద్రుమములు చూడం జూడ నింపుగా నుండెను. మల్లికాలతలు సుమసౌరభముల వెదఁజల్లుచుండెను. శిరీషవృక్షము లందందుఁ గనఁబడుచుఁ దనపుష్పకోమలత్వమును దెలుపుచుండెను. యూధికావృక్ష ములు చాలుగానుండెను. మొగలిపొదలు మాధవీ మండప

న్న ప్రమదితవ్య మిత్యారభ్య భూత్యై న ప్రమదితవ్యమితి॥ అత్రత్య భూతిపదస్య భస్మపరతాం సిద్ధాంతయతి భగవాన్బోధాయనః॥ యథా॥ అథాతో ద్విజాతీనామహరహ స్త్రిపుండ్రవిధిం వ్యాఖ్యాస్యామో భూత్యైన ప్రమదితవ్యమితి హ్యామ్నాయత ఇతి॥ ఉపబృంహితశ్చాయ మర్థో మానవపురాణే॥ సత్యాన్న ప్రమదితవ్యం వై ధర్మాచ్చ కుశలాచ్చన। భూత్యా అగ్నిసముత్థాయాస్తతో దేహావకుంఠనాత్। లలాటహృదిదోర్ద్వంద్వే త్రిపుండ్రస్య చ ధారణాత్॥ ఇతి. తథా సూతసంహితాయాం॥ సత్యాద్ధర్మాచ్చ కుశలాద్భస్మనోద్ధూళనాదపి। త్రిపుండ్రధారణాచ్చాపీత్యాదికం ద్రష్టవ్యం॥ ఏతేన భూత్యై మంగళయుక్తాత్కర్మణ ఇతి యత్పరేషాం వివరణం తన్నిరస్తమితి॥ కల్పసూత్రే యథా వేద ఇతి వేదకల్పకల్పసూత్రవిరుద్ధత్వాదుపబృంహణబాధితత్వాచ్చేత్యధికం రతూ రుద్రాక్షమాహా

దు. ఇదిగాక - జాబాలోపనిషత్తునందు॥ అగ్నిరితి భస్మ ఈ మొదలగు మంత్రములచే భస్మమును గ్రహించి, శరీరమున నలదుకొనవలయునని యున్నది. మఱియు - తైత్తిరీయము నందు॥ శిష్యులకు బోధించునప్పుడు॥ సత్యము నెడ ప్రమాదము నొందఁగూడదని యారంభించి, భూత్యైన ప్రమదితవ్యం, భస్మధారణము నెడను ప్రమాదము నొందఁ గూడదని చెప్పఁబడి యున్నది.

ప్ర॥ భూత్యై అనఁగానే భస్మధారణ మని యెట్లు నిశ్చయించుదగును?

ఉ. భూత్యైన ప్రమదితవ్యం, అని శ్రుతియందు గలదు గాన ద్విజులకు ననుదినము త్రిపుండ్రవిధిని వివరించుచున్నా మనుట చేయిందగు భూతిపదమునకు భస్మధారణమే అర్థమని బోధాయన మహర్షి నిర్ణయించి నందున నాయర్థము నిశ్చితము గుచున్నది.

మఱియు, సత్యము నెడను, ధర్మము నెడను, కుశలము నెడను, భస్మధారణము నెడను ప్రమాదము నొందఁ గూడదని మానవ పురాణము నందును నీయర్థము ఉపబృంహింపఁ బడియున్నది. సూత సంహిత యందును నీయర్థమె నిర్ణయింపఁ బడియును.

ప్ర. భూత్యై॥ మంగళ యుక్తమగు కర్మము నుండి అని శ్రీశంకరాచార్యులవారు చెప్పియుండఁగా నాపదము భస్మపర మనుట యెట్లు?

ఉ. భూతి పదమునకు మంగళ పరముగా శంకరాచార్యుల వారు జేసిన యర్థము వేద తుల్యమగు కల్ప సూత్రమునకు విరుద్ధమైనది గనుకను మానవ పురాణమును సూత సంహిత మొదలగు వానియందు గల యుపబృంహణములచే బాధింపఁ బడినది గాన

యవ్వలిదగు కదళీవనమును బ్రవేశించెను. అది నిర్జనమై రమ్యమైయుండెను. అందొకచో రాధికాశ్రమము కన్నుల పండువు సేయుచుండెను. దాని ప్రాకారము మణినిర్మితము. దుర్గమపరిఖావేష్టితము. శత్రువుల కేరికే నగమ్యము. సజ్జనులకు సుగమము. అతిగోప్యము. సంకేతమార్గము కలది. రక్షకు లతిజాగరూకులై కాపాడుచుండిరి. విశ్వకర్మయే దాని నిర్మించెను.

ఆ రాధామందిరమును బొగడ బృందారకులకే నశక్యము. గోపికాగోపకులు దాని చుట్టునుండిరి. వేత్రహస్తులై గోలోకమునుండి యవతరించి గోపాలకు లనంబరఁగు పార్షదులు దానిం గాపాడుచుండిరి. ఆసౌధద్వారమును ముందుగఁ దిలకించి యుద్ధవుఁడు భక్తిభరమున వినమ్రుఁడై లోపలఁ బ్రవేశించెను. ద్వితీయద్వారము ప్రథమద్వార సౌందర్యమును మించియుండెను. తృతీయ చతుర్థద్వారము లేకోత్తరవృద్ధిన్యాయమున సౌందర్యనిలయములై యుండెను. అందు నాల్గవద్వార మతివిలక్షణము. ఐదవద్వార మద్దానిని మించియుండెను. ఆఱవది చూపఱకు వేడ్క నింపుచుండెను. అందు రామరావణ యుద్ధవార్తలం దెలుపుచిత్రములు కన్నులకు విందుగొలుపుచుండెను. శ్రీమహావిష్ణు దశావతారముల ప్రతిమ లందుండెను. ఒక్కచో రాసమండల చిత్రము లిఖింపఁబడియుండెను. యమునాప్రవాహచిత్ర మందుఁ జిత్రితమైయుండెను. ఆద్వారమును గోపికలే రక్షించుచుండిరి. దానిని వర్ణింప నవకాశమే లేదు.

ఆద్వారపాలికలయం దధిష్ఠాత్రుదేవియగు మాధవి యుద్ధవుని జూచినంతనే యాదృతిఁ గుశలమడిగెను. ఉద్ధవుఁడు కుశలవార్తలనెల్ల నామె కెఱుకపఱచెను. ఆకుశలవార్తల నాత్మ

బుధైస్త్రియక్తై ర్విపుండ్రకం। ధార్యం ప్రోక్తం ద్విజశ్రేష్ఠైర్నిత్యైః స్వేద
పారగైః। మేధావీత్యాది నావాపి బ్రహ్మచారీ దినేదినే। భస్మనా సజలే
నైవ ధారయేచ్ఛ్రిపుండ్రకం। హంసకారేణ త్రియుక్తేన సహామనేన త్రిపుండ్రకం
ధారయేద్భిక్షుకో నిత్యమితి జాబాలికీ శ్రుతిః॥ లలాటే హృదైవదోర్ద్వయం ద్వేత
ధైవోరసి బుద్ధిమాన్। త్రిపుండ్రం ధారయే న్నిత్యం భుక్తిముక్తి ఫలప్ర
దం। వర్ణానామాశ్రమాణాంచ మంత్రతో, మంత్రతోపివా। త్రిపుండ్రో
ద్ధూళనం ప్రోక్తం జాబాలైరాదరేణతు॥ భారద్వాజస్మృతౌ॥ ప్ర
క్షాళ్య కరపాదాస్యం ప్రక్షాళ్యాచమ్య పూర్వవత్॥ ప్రాణానాయమ్యసం
కల్ప్య భస్మస్నానం సమాచరేత్। ఆదాయ భసితం శ్వేత మగ్నిహో
త్ర సముద్భవం। ఈశానేనతు మంత్రేణ స్వమూర్ధ్ని వినిక్షిపేత్। తత
ఆదాయ తద్భస్మముఖే తత్పురుషేణతు। అఘోరేణాంస హృదయే గు
హ్యవామదేవేనచ। సద్యోజాతాభిధానేన భస్మపాదద్వయేక్షి
పేత్। సర్వాంగం ప్రణవేనైవ మంత్రేణోద్ధూళ యేత్తతః। తత దాగ్నే

---

సూతసంహితయందు॥ జాబాలోపనిషత్తునందుఁ జెప్పఁబడిన అగ్నిరితిభస్మయిత్యాది పలుకు మంత్రములతో శరీరమునకు భస్మోద్ధూళనము చేసి కొనవలయును. త్రియాయుషం అను మంత్రములతో త్రిపుండ్రము ధరింపవలయును. బ్రహ్మచారి యగు వాడు మేధావీ అనుమంత్రము చదువుచు సజల భస్మముతో త్రిపుండ్రమును ధరింపవలయును. యతియగు వాఁడు హంస మంత్రము తోఁగూడ ముమ్మారు ప్రణవము నుచ్చరించుచు త్రిపుండ్రమును ధరింపవలయును. ననిజాబాల శ్రుతియందు గలదు. ముఖము నందును, బాహుయుగమునందును, వక్షము నందును త్రిపుండ్రమును ధరింపవలయును. అన్ని వర్ణముల వారికి- అన్ని యాశ్రమముల యందున్న వారికిని భస్మోద్ధూళనము- భస్మ త్రిపుండ్రము విధింపబడియెను. కానివారిలో వేదాధికారము గలవారికి సమంత్రకముగను; అది లేనివారికి నమంత్రకముగను ధారణము విహితము

భారద్వాజస్మృతియందు॥ కాలు సేతులుం గడిగికొని, పూర్వమువలెఁ గూర్చుండి ఆచమనము, ప్రాణాయామము, సంకల్పంబును చేసి, భస్మస్నానము సేయవలయును. ఎట్లనిన, అగ్నిహోత్రమునఁ బుట్టిన తెల్లని భస్మమును దీసి కొని, యందు జలము గలిపి ఈశానమంత్రముతో శిరమునందును, తత్పురుష మంత్రముతో ముఖమునందును, అఘోర మంత్రముతో హృదయమునం

పవిత్రములగును. గోలోకమునుండి గోకులమున నవతరించితివి.
రాధికానామము నిందును ధరించియే యున్నదానవు. శతశ్రం

---

తాయై చ నమోనమః, కృష్ణవక్షస్స్థితాయై చ తత్ప్రియాయై నమోనమః.
౫. నమో వైకుంఠవాసిన్యై మహాలక్ష్మ్యై నమోనమః, విద్యాధిష్ఠాతృదేవ్యై
చ సరస్వత్యై నమోనమః. ౬. సర్వైశ్వర్యాధిదేవ్యై చ కమలాయై నమో
నమః, పద్మనాభప్రియాయై చ పద్మాయై చ నమోనమః. ౭. మహావిష్ణో
శ్చ మాత్రే చ పరాద్యాయై నమోనమః, నమస్సింధుసుతాయై చ మర్త్య
లక్ష్మ్యై నమోనమః. ౮. నారాయణప్రియాయై చ నారాయణ్యై నమో
నమః, నమోఽస్తు విష్ణుమాయాయై వైష్ణవ్యై చ నమోనమః. ౯. మహామా
యాస్వరూపాయై సంపదాయై నమోనమః, నమః కల్యాణరూపిణ్యై శుభాయై
చ నమోనమః. ౧౦. మాత్రే చతుర్ణాం వేదానాం సావిత్ర్యై చ నమోనమః,
నమో దుర్గవినాశిన్యై దుర్గాదేవ్యై నమోనమః. ౧౧. తేజస్సు సర్వదేవా
నాం పురా కృతయుగే ముదా, అధిష్ఠాన కృతాయై చ ప్రకృత్యై చ నమో
నమః. ౧౨. నమస్త్రిపురహారిణ్యై త్రిపురాయై నమోనమః, సుందరీషు చ ర
మ్యాయై నిర్గుణాయై నమోనమః. ౧౩. నమో నిద్రాస్వరూపాయై నిర్గుణా
యై నమోనమః, నమో దక్షసుతాయై చ నమస్సత్యై నమోనమః. ౧౪.
నమశ్శైలసుతాయై చ పార్వత్యై చ నమోనమః, నమో నమస్తపస్విన్యై
హ్యుమాయై చ నమోనమః. ౧౫. నిరాహారస్వరూపాయై హ్యపర్ణాయై
నమోనమః, గౌరీ లోకవిలాసిన్యై నమో గౌర్యై నమోనమః. ౧౬. నమః
కైలాసవాసిన్యై మాహేశ్వర్యై నమోనమః, నిద్రాయై చ దయాయై చ శ్ర
ద్ధాయై చ నమోనమః. ౧౭. నమో ధృత్యై క్షమాయై చ లజ్జాయై చ నమో
నమః, తృష్ణాయై క్షుత్స్వరూపాయై స్థితికర్త్రై నమోనమః. ౧౮. నమస్సం
హారరూపిణ్యై మహామాయై నమోనమః, భయాయై చాభయాయై చ ముక్తి
దాయై నమోనమః. ౧౯. నమస్స్వధాయై స్వాహాయై శాంత్యై కాంత్యై

నాంది ప్రోజనః। తస్మాత్సర్వమిదం సర్వో యస్త్రిపుండ్రం సధారయేత్ ॥ఇతి॥ పరాశర స్మృతౌ॥ బ్రాహ్మణో విధినోత్పన్నం త్రిపుండ్రం భస్మనైవతు। లలాటే ధారయే న్నిత్యం తిర్యగ్భస్మాన కుంఠనం ॥ఇతి॥ స్మృతిసారసముచ్చయే॥ అశక్తస్సమయాచారే మనసాపాప మాచరన్। శుచిరేవ భవేన్నిత్యం త్రిపుండ్రస్య చధారణాత్ ॥ఇతి॥ మహాభారతే అనుశాసనిక పర్వణి॥ అహంపశుపతిర్నామ మద్భక్తాయే చమానవాః। సర్వేతాను పశూన్ జ్ఞేయా భస్మదిగ్ధతనూరుహాః॥ రక్షార్థం మంగళార్థం చ పవిత్రార్థం చభామిని। లాంఛనార్థంచ భక్తానాం భస్మదత్తం మయా పురా ॥ఇతి॥ తత్రైవ॥ ఆయుష్కామో, ధవారాజన్ భూతికామో, ధవానరః। నిత్యం వైధారయేద్భస్మ మోక్షకామీచ యోద్విజః। ఇతి॥ ఆదిత్య పురాణే త్రిపుండ్రధారీ సతతం బ్రాహ్మణస్సర్వ కర్మసు। భస్మనా వాగ్నిహోత్రస్య శివాగ్నిజనితేన

---

న్నగువానిని భస్మత్రిపుండ్రము ధరింపనివాఁడు చేయుకర్మ వ్యర్థమగునని శాతాతపమహర్షి పలికెను.

ఇదిగాక- కల్పాదులచే సంపాదింపఁబడినభస్మముతో నాస్తూళనము త్రిపుండ్రమును బ్రాహ్మణుఁడను దినము ధరింపవలయునని పరాశర మహర్షి వచించెను.

మఱియు- శక్తికొలఁది యాచారము నాచరింపఁజాలనివాఁడైనను- పాపము లాచరించువాఁడైనను ప్రతిదినము భస్మత్రిపుండ్రమును ధరించునెడ పవిత్రుండౌనని స్మృతిసారసముచ్చయమునందుఁగలదు.

ఇదిగాక- అనుశాసనిక పర్వమునందు॥ నేనుపశుపతిని. భస్మమును ధరించునా భక్తులందరును పశుపతులు. రక్షకొఱకును- మంగళము కొఱకును- పావిత్ర్యము లాంఛనము కొఱకును భక్తులకు భస్మము నొసగితినని పరమేశ్వరుఁడు దేవితో చెప్పినట్లుకలదు: మఱియు నాపర్వమునందే॥ ఆయువునుగాని- ఐశ్వర్యమునుగాని- మోక్షమునుగాని గోరువాఁడు ముఖ్యముగా నెప్పుడు భస్మమును ధరింపవలయునని యున్నది.

బ్రాహ్మణుఁడగువాఁడు గృహ్యాగ్ని యందుగాని- శివాగ్నియందుగాని జనించిన భస్మమును సకలకర్మములు చేయునప్పుడును ధరింపవలయునని ఆదిత్యపురాణమునఁగలదు

సత్యజ్ఞానానంద స్వరూపమై జ్ఞానముచేత నెఱిఁగఁబడదగినపరబ్రహ్మమే ముఖ్యముగ భస్మమని యెఱుంగుము. ఇంక రెండవది యగ్నిజనిత మగుభస్మము. ఇది యజ్ఞానమును దొలఁగించి జ్ఞానమును గలిగించునని ఇత్యాది కల్పాది భేదములచే పలువిధములు గనున్నది.

టి రెండు విషయములమాత్రమే యిట వ్రాసెదను. ఆలకింపుఁడు. భగవంతుఁ డుద్ధవుని గోకులమునకుఁ బంపి తనరాకంగోరి పరితపించు నందలివారి నూఱడింపుమనియె. ఉద్ధవుఁడన్ననో పరమైకాంతికభక్తుఁడు. విశేషించి శ్రీకృష్ణాజ్ఞను శిరసావహించువాఁడు. భగవంతుఁ డిట్లాజ్ఞాపింప నదియే ప్రసాదసారమని భావించి గోకులమునకుఁ జనుచు నందందు శుభశకునములు తోఁప వానిం దిలకించుచుఁ బోయి బృందావనమున గోకులమును గాంచెను. బృందావనమున నొక గోకులమున్నదియా యను సందియమందకుఁడు. గోకులమున ననేకదుర్నిమిత్తములు తోఁపఁగా నందాదులు దానిని వదలి బృందావనమున కరిగిరని ముందే మీరు చదివియున్నవారు. నందాదులా బృందావనమున నివాసములు కావించుకొన్న చోటునకే గోకులమను పేరు గల్గెను. ఆవనమునందే వేఱొకతావున రాసమండలము గలదు. శ్రీకృష్ణభక్తులకు రాసమండలార్చనము నృత్తగీతములు ప్రధానములని యింతకుముందే వ్రాసియుంటిని గదా. మఱొకతావున రాధాదేవి నివసించుమందిరము గలదు. ఆమందిరము రాసమండలమునకు సమీపమున నున్నది. రాసేశ్వరియన్నను రాధయన్న నొక్కటియే యని గ్రహింపుఁడు. ఇవ్విషయములు మదినిడుకొన్నచోఁ గథను వినునప్పుడు శంకలు పొడముకుండు.

ఉద్ధవుఁడు బృందావనము చేరంజని గోకులమునకుం బోయి నందమందిరమునకుం బోయెను. యశోదారోహిణులం దుద్ధవున కాతిథేయసత్కారము లాచరించిరి. కుశలమడిగిరి. ఈపట్టున నాకాలపుటాచారము లెట్లుండునని యించుక విచారించు టధికప్రసంగము కాదు. ఇపుడు నందమందిరమున నున్న

శ్రుత్యా విధీయతే యస్మాత్తత్త్యాగీ పతితో భవేత్ ॥ఇతి కూర్మపురాణే॥ స్రష్టా సృష్టిస్తేనా హి త్రిపుండ్రస్య ప్రశస్తతాం। ససర్జ స లలాటం హి తిర్యక్ప్రాగూర్ధ్వ్యం న వర్తులం। తిర్యగ్రేఖాః ప్రవర్తన్తే లలాటే సర్వదేహినాం। తథా పి మానవా మూఢా న కుర్వన్తి త్రిపుండ్రకం। వేదవాధ్యయనే శూద్రో నాధికారీ యథా భవేత్। త్రిపుండ్రేణ వినా విప్రో నాధికారీ స్వకర్మసు। యథా రాజా స్వచిహ్నాంకం స్వజనం మన్యతే సదా తథా శివ స్త్రిపుండ్రాంకం నరం స్వమివ మన్యతే॥ ద్విజాతిర్వాన్య జాతిర్వాపి తచ్ఛుద్ధేన భస్మనా। ధారయేద్య స్త్రిపుండ్రాంకం రుద్రస్తేన వశీకృతః॥ ఇతి లైంగే॥ త్రిపుండ్రం సురవిప్రాణాం వర్తులం నృపవైశ్యయోః। అర్ధచంద్రం తు శూద్రాణా మన్యేషా మూర్ధ్వ పుండ్రకమితి॥

బ్రహ్మక్షత్రవైశ్యానాం భస్మసదాగ్నిహోత్రజనితేనాన్యైర్వైదికం వైదికైస్త్రిర్యక్పుండ్రతయా లలాటఫలకే వక్షఃస్థలే మస్తకే। బాహ్వోర్మూర్ధ్ని త్రిపుర స్మరం క్రతుశతం తైరేవ సమ్యక్కృతం స్నానం తీర్థసహస్రకోటిషు ధరాదత్తా

---

పతితుండగునని మానవపురాణము నందుగలదు.

గృహస్థుఁడు- యతియు ప్రతిదినము భస్మత్రిపుండ్రమును ధరింపవలయునని జాబాల శ్రుతియందుఁ గలదు కావున- బ్రాహ్మణుఁ డెల్లప్పుడు త్రిపుండ్రమును ధరింపవలయు. ఇది శ్రుతిచే విధింపఁ బడినదిగాన దీనిని విడిచిపెట్టినవాఁడు పతితుండగును. అని సనత్కుమార సంహిత యందు గలదు

బ్రహ్మదేవుఁడు త్రిపుండ్రము యొక్క ప్రాశస్త్యమును సృష్టియందే కనఁబరచెను. ఎట్లనిన- అతఁడు లలాటము నడ్డముగ సృజించెను గాని నిడుపుగ గాని చంద్రముగా గాని సృజింపలేదు. మఱియు- అందఱియొక్క ముఖమునందును అడ్డరేఖలె కనఁబడుచున్నవి. దీనింబట్టి అడ్డముగ భస్మత్రిపుండ్రమును ధరింప వలయునని యె సృష్టికర్త తాత్పర్య మైనటుల తెలియుచున్నది. అయినను మూఢులగు మానవులు త్రిపుండ్రమును ధరింపనొల్లరు. శూద్రునకు వేదాధ్యయనమున నధికారము లేనటుల త్రిపుండ్రము ధరింపని ద్విజునకు వైదికకర్మానుష్ఠానము నందధికారము లేదు. రాజు తన చిహ్నము ధరించినవానినిస్వ

లమునకు నాకాలమునకుఁ దారతమ్యము పర్వత మశకముల కుండునంత యనవచ్చును గదా. హస్తిమశకన్యాయ మనరాదు. పిదప నుద్ధవుఁడు కుశలములం దెలుప నాలకించి హర్షించి యా యుత్సాహమున నీఁకముందును బతిపుత్రులకు మేలుచేకూరుట కై పరమేశ్వరుఁడగు మహాదేవుని

శంకరం పూజయామాస విప్రద్వారా పరం విభుమ్.

బ్రాహ్మణులద్వారా పూజించెను. తానేల పూజింపరా దనరాదు. స్త్రీలు శివపూజ చేయరాదు. విప్రులద్వారా చేయింపవలయు. విగ్రహములఁ బూజించుటకు స్త్రీల కధికారము గలదు. ఇది భేదబుద్ధిగాదా. మహర్షుల కిట్టినియమములు చేయుట న్యాయమా యని ప్రశ్నింపకుఁడు. స్మృతికర్తలకుఁ బక్షపాతము లేదు.

స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మాన మేవ చ,
స్వంచధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి.
అర్థస్య సంగ్రహే చైనాం వ్యయేచైవ నియోజయేత్,
శౌచే ధర్మేఽన్నపంక్త్యాం చ పారిణాహ్యస్య వేక్షణే.
అరక్షితా గృహేరుద్ధాః పురుషై రాప్తకారిభిః,
ఆత్మాన మాత్మనా యాస్తు రక్షేయుస్తా స్సురక్షితాః.

మనుస్మృతి. ౯ అధ్యాయము.

అనుపపత్తుల ననుసరించి స్త్రీలకు గృహశిశుపాలనాది మహాకార్యములు విధించి దేవపూజాదులు పురుషకర్తవ్యము లని శాసించిరి. కాని భేదబుద్ధిని గాదు. సర్వభూతసము లగు మహాత్ముల కట్టిసుబుద్ధి యెట్లుండును? కొంచమైన నాలోచింపక వారినాక్షేపించుట తెలివితక్కువ కాదా. పురుషులు పాలిచ్చి

యథా పురీషు సర్వాసు పురీ వారాణసీ శుభా। తథా శుభం త్రిపుండ్రం చ సర్వపుండ్రేషు కథ్యతే॥ యథా విశ్వాధికో రుద్ర స్సర్వ వేదేషు గీయతే। తథా సర్వ పురాణేషు త్రిపుండ్ర మపి గీయతే॥ త్రిపుండ్ర ధారిణః పాదౌ ప్రక్షాళ్య యత్తోయః పుమాన్ సర్వ పాతక యుక్తోపి సద్యః పూయతే నరః॥ త్రిపుండ్ర ధారిణో భిక్షాప్రదానేన హి కేవలం సర్వపాతక యుక్తోపి పూయతే మానవో చిరాత్॥ తేనాధీతం శ్రుతం తేన తేన సర్వ మనుష్ఠితం। యేన విప్రేణ శిరసి త్రిపుండ్రం భస్మనా ధృతం॥ కృతం స్యాదకృతం తేన శ్రుతం స్యాదశ్రుతం భవేత్। అధీత మనధీతం చ త్రిపుండ్రం యేన వా ధృతం॥ వృధా వేదా వృధా యజ్ఞా వృధా దానం వృధా తపః। వృధా వ్రతోపవాసౌ తు త్రిపుండ్రం యో న ధారయేత్। సత్యం శౌచం తథా యజ్ఞ స్తీర్థం దేవాది పూజనం। సర్వమే

---

వైదిక ధర్మనిష్ఠులకు వైదిక చిహ్నంబును, అవైదిక ధర్మనిష్ఠులకు నవైదిక చిహ్నంబును విహితములగును. ఇందు భస్మత్రిపుండ్రము, భస్మోద్ధూళనము ననునివి వైదిక చిహ్నములును, ఊర్ధ్వపుండ్రము మొదలగు నవి యవైదిక చిహ్నములగును. సర్వవేద వేద్యుండును, సంసార మోచకుండును, ఊర్ధ్వ విగ్రహుండును చంద్రశేఖరుండు నగు మహాదేవుండు లోకోపకారమునకై వైదిక చిహ్నమునే ధరించునని పరాశర పురాణంబునఁ గలదు.

సౌరసంహితయందు॥ శరీరమునం దంతటను భస్మము నలదుకొనినవాని ననుసరించి పోవువాఁడు సకల పాతక యుక్తుండైనను నప్పుడే పవిత్రుండగును॥ సకల పురములలో కాశీనగర మెట్లో అట్లే సకల పుండ్రములలో భస్మ త్రిపుండ్రము సర్వోత్తమ మైనది॥ సకల వేదముల యందును, పురాణముల యందును, పరమేశ్వరుండు ప్రశంసింపబడునట్లే సకల వేదాదులయందును భస్మ త్రిపుండ్రంబును ప్రశంసింపఁబడుచున్నది॥ ఎవ్వండు భస్మత్రిపుండ్రధారియొక్క పాదములను గడుగువాఁడో వాఁడు సర్వపాతకయుక్తుండైనను అప్పుడే పవిత్రుండగును॥ త్రిపుండ్రమును ధరించినవానికి భిక్షము నొసంగువాఁడు సకలపాపవిముక్తుఁడగును॥ ఎవ్వండు త్రిపుండ్రమును ధరించెనో వాఁడు సకల వేదముల జదివినవాఁడును సకల సుకర్మములు జేసినవాఁడునగును భస్మ త్రిపుండ్రము ధరించినవాఁడు తాను చేయని సత్కర్మముల నెల్లఁజేసినవాఁడును, వినని వేదార్థములను వినినవాఁడును నగును. త్రిపుండ్రము ధరింపని వాఁడు చదివిన వేదములును॥ అట్టివాఁడు చేసిన యజ్ఞములు, దానములు, తపము, వ్రతము, ఉపవాసములును

మని హెచ్చరింపఁగలవు. గోపికలు భగవత్పాదారవిందసేవా పరాయణలనుట తేటపఱుపఁగలవు.

ఆవల నుద్ధవుఁడు బృందావనమున రాసమండలమును గన్నులారఁ గనుఁగొనియెను. ఆరాసమందిరము నిత్యోత్సవ విరాజితము. బ్రహ్మాదులకే సేవ్యము. నిత్యాలంకార సంభృతము. దానిమహిమము భక్తులు కానివారికిఁ దేటపడునది కాదు. భగవంతుఁడు గొల్లపిల్లలతో వ్యభిచరించెనన్నవారి కింత కంటే వేఱూహలు ప్రసరించునా. పూర్వపుణ్యమునఁగాని భక్తి భావ మలవడదు. అది యలవడినఁగాని భగవచ్చరితము రుచింపదు. భక్తిహీనుల కన్నియు విపరీతములుగాఁ దోఁపకమానవు. ఏలన నాతనిమది సదా ప్రముదితమైయుండక దుఃఖముతో నిండియుండును. సుఖ మాప్రాశికున్నదన్న శూన్యము. అంధునకు వెన్నెల రుచింపనిచందమున భగవత్సేవ వ్యర్థమని భావించువారలకు నింతకంటె మఱేమి తెలియఁగలదు. కావున వారి మాటలకుఁ జెవిరంధ్రమునఁ జోటీయరాదు. వినినను విననట్లే భావింపవలయును.

ఆమీఁద నుద్ధవుఁడు రాధామందిరమున కరిగెను. కక్ష్యాంతరములు గడచెను. గోపిక లుద్ధవునకు మర్యాద చేసిరి. కపటద్వారమునఁ గావలియుండు గోపికల కధిష్ఠాత్రిదేవి యగు మాధవి యతనిరాకను దేవి కెఱుకపఱచి తదనుమతి నొంది పిలుచుకొని యాతిథేయములఁ గల్పించెను. రాధాదేవిం జూచినంతనే ఉద్ధవున కాశ్చర్యకర మగుభావ మంకురించెను. ఆదేవిని వినుతించెను. ఆస్తుతిని దిలకింపుఁడు. సకలదేవతాస్వరూపిణి యని తెల్పును. త్రిమూర్తు లీదేవియంశసంభూ

త్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। శివస్య విష్ణోర్దేవా నాం బ్రహ్మణ స్తృప్తి కారణం॥ భస్మనా వేదమంత్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। పార్వత్యాశ్చ మహా లక్ష్మ్యా భారత్యా స్తృప్తి కారణం॥ భస్మనా వేద మంత్రేణ త్రిపుండ్రస్యచ ధారణం। వినా వేదాన్త విజ్ఞానం జాయతే నైవ కస్యచిత్॥ భస్మనా వేదమంత్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। సతాం మార్గతయా ప్రాజ్ఞాః ప్రవదంతి మహర్షయః, భస్మనా వేద మంత్రేణ త్రిపుండ్రస్యతు ధారణం। రక్షార్థం మంగళార్థం చ ప్రవదంతి మహర్షయః. త్రిపుండ్ర ధారణం ముక్త్వా ముక్తి మిచ్ఛతియః పుమాన్। విషపానేన నిత్యత్వం కురుతే హ్యాత్మ నోహి సః. వేదోదితేన మార్గేణ భస్మ నోద్ధూళ నేనచ త్రిపుండ్ర ధారణా నైవ జ్ఞానం సమ్యగ్విజాయతే। బ్రాహ్మణేనాత్మ భూతేన శివేన పరమాత్మనా। ఆదరేణ ధృతం భస్మ త్రిపుండ్రోద్ధూళనాత్మనా। ఆది బ్రాహ్మణ భూతస్య ధర్మం తిర్యక్త్రి పుండ్రకం। బ్రాహ్మణో

---

లుగనేరదు॥ భస్మత్రిపుండ్ర ధారణము సత్పురుషుల మార్గమని పండితులు చెప్పుదురు॥ భస్మధారణము సంరక్షణ కొఱకును, మంగళము కొఱకును ప్రయోగించునని మహర్షులు వచింతురు॥

ఏపురుషుండు త్రిపుండ్ర ధారణమును వదలిపెట్టి ముక్తి నొంద వలయునని కోరుచుండునో అట్టివాఁడు విషముద్రావి శాశ్వతముగా నుండవలయునని కోరువాఁడే యగును॥ వేదోక్త మార్గమున భస్మోద్ధూళనము- భస్మ త్రిపుండ్రమును ధరించునెడ జ్ఞానము గలుగును॥ దేవతలలో బ్రాహ్మణుండును, పరమాత్ముండునగు పరమేశ్వరుండు భస్మోద్ధూళనమును, భస్మత్రిపుండ్రమును ధరించెను॥ ఆది బ్రాహ్మణుండగు పరమేశ్వరుని ధర్మమగునదియు, భుక్తి ముక్తి ప్రదంబును నగు త్రిపుండ్రమును బ్రాహ్మణుడు ధరింపవలయు॥ వేదమునందగు సన్మార్గములలో భస్మత్రిపుండ్రము సర్వచిహ్నముల కంటెను శ్రేష్ఠమైనది కావున శ్రేయము గోరిన వారెల్లరును భస్మోద్ధూళన భస్మత్రిపుండ్రములను తప్పక ధరింపవలయును॥ భస్మోద్ధూళన భస్మ త్రిపుండ్రముల ధరించువానిని రాజైనవాఁడు రక్షింపవలయును॥ ఎవ్వండు భస్మ ధారిని నిందించునో వానిని రాజు శిక్షింపవలయును॥ చతుర్ముఖుండు సృష్టిసెపంబున త్రిపుండ్రము యొక్క ప్రాశస్త్యమును దెలిపెను॥ ఎట్లనిన, అతఁడు ముఖము నష్టముగా సృజించెనుగాని, గుండ్రముగాని, నిడుపుగాగాని సృజించెనా

వారికిఁ దెలుపవలసిన విషయ మేమిగలదు. శాక్తుఁడుకాని వాఁడు లోకమున లేఁడు. లోకమంతయు శక్తికల్పితము. ఏపేరున నామెను గీర్తించినను ఆక్షేపము లేదు. సర్వశబ్దవాచ్యత్వమే యామెచరిత్రము. ఇందు వైష్ణవులకు శైవులకును మాటలాడ స్థలమేలేదు. భగవంతు నేనామమునఁ బిలిచినను దోషము గాదు. సర్వశబ్దవాచ్యుఁడు భగవంతుఁడు కాఁడనుచో వారితో మనము మాటలాడఁ బనియుండదు. వారి కిదియే తొలిజన్మము. చాల జన్మములకుఁగాని వారికి బుద్ధి మార్పునొందదు. అట్టి మార్పు వారిబుద్ధియందుఁ ద్వరగాఁ గావలయునని మన మా పరాత్పరుని గోరవలయును. మనము చేయఁదగు ప్రథమకృత్యమిదియే. వారితో ద్వేషింపరాదు. వా రేమిచేయుదురు. వారికిఁ దోఁచినంత తెలిపిరి. వారితప్పేమియు నిందుఁ గానరాదు. కావున మనము వారిని దూషింపరాదని విన్నవించువాఁడను. ఇఁకఁ బ్రకృతము ననుసరించెదను.

రాధాంబికను స్తుతించి యుద్ధవుఁడు ధన్యుఁడయ్యెను. కృతకృత్యుఁ డయ్యె. సఫలమనోరథుఁ డయ్యెను. ఇంతయేల? భగవత్సేవాపాత్రుఁడయ్యెను. మనఃక్లేశము లాతనిమదినుండి తొలఁగెను. ఏలనఁగా,

"తదను ప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్యమ్."

అనున్యాయము ననుసరింపవలయుఁ గదా. భగవంతుఁడే రాజనుకొందము. మంత్రి ప్రకృతియనుకొనక తప్పదుకదా. మంత్రిద్వారాకదా రాజదర్శనము చేయుట లోకాచారము. అట్లే ప్రకృతినాశ్రయించి తత్కటాక్షపాత్రులమై పిదప భగవంతుని సేవింపవలయును. ఇదియే సాధుమార్గము. అడ్డుత్రోవలం

తే॥ దానం యజ్ఞాశ్చ ధర్మాశ్చ తీర్థయాత్రాచ నారద। ధ్యానంత పు
త్రిపుండ్రస్య కలాం నార్హంతి షోడశీం। యథా రాజా స్వచిహ్నం కం స్వ
జనం మన్యతే సదా। తథా శివ త్రిపుండ్రాంకధరం స్వామివ మన్యతే
ద్విజాతిర్వాత్యజాతిర్వా సిత శుద్ధేన భస్మనా। ధారయేద్య స్త్రిపు
ండ్రాంకం రుద్రస్తేన వశీకృతః॥ త్యక్తవర్ణాశ్రమాచారో లుప్తసర్వక్రి
యోపివా। సకృత్తిర్యక్త్రిపుండ్రాంకధారయేత్సోపి పూజ్య
తే॥ నాస్మిన్ జ్ఞానం పరీక్షేత నకులం నవ్రతం తథా। త్రిపుండ్రాంకిత
ఫాలోయః పూజ్య ఏవ స నారద. శ్రీభూతి మాత్రమాహాత్మ్యం వక్తుం
బ్రహ్మాన శక్నుయాత్। కింపున స్సంస్కృతాగ్న్యుద్ధం భూతిం వక్తుంస
ముత్సహేత్॥ శివ మంత్రాత్పరో మంత్రస్తత్వం చాపిశివాత్పరం। శివా
ర్చ నాత్పరం పుణ్యం నహితీర్థంచ భస్మతః॥ రుద్రాగ్నేర్య త్పరం వీర్యం
తద్భస్మ పరికీర్తితం। ధ్వంసనం సర్వదుఃఖానాం సర్వపాప విశోధనం॥
అంత్యజో వాధమోవాపి మూర్ఖోవా పండితోపివా। యస్మిన్దేశే వసే
న్నిత్యం భూతిశాసన సంయుతః। తస్మిన్ సదాశివ స్సోమః సర్వ భూత
గణైర్వృతః। సర్వతీర్థైశ్చ సంయుక్త స్సాన్నిధ్యం కురుతే సహాయస్మిద్దే

గాని పరీక్షింపఁగూడదు. ముఖమున భస్మత్రిపుండ్రము కలవాఁడు పూజనీయుండే
యగును. సామాన్యమగు భస్మముయొక్క మహిమను వచింపబ్రహ్మకైన యలవిగాదు
ఇఁక మంత్రములచే సంస్కరింపఁబడిన యగ్నియందుఁ బుట్టిన భూతియొక్క మహిమ
ము వచింప నెవ్వని వశమగును. శివమంత్రముకంటె నెక్కువయగు మంత్రంబును శివుని
కంటె పరమగు తత్వంబును శివపూజకంటె పరమగు సుకర్మంబును భస్మముకంటె పర
మగు తీర్థంబును లేదు. రుద్రాగ్నియొక్క వీర్యము భస్మమగును. ఇయ్యది సర్వదుఃఖ
ములను ధ్వంసము చేయునదియు సర్వపాపములను హరించునదియు నగును. అంత్యజుఁడు
గాని, అధముఁడుగాని, మూర్ఖుఁడుగాని పండితుఁడుగాని భస్మమును ధరించువాఁడే దేశ
మున నుండునో, ఆదేశమున సర్వభూతగణములతోడను సర్వతీర్థములతోడను సదాశి
వుం డెల్లప్పుడు వసించుచుండును. భస్మత్రిపుండ్రధారియే దేశమున నుండునో ఆదేశ
మే పవిత్రమైయుండఁగా నట్టివాని గృహము పవిత్రమైనదని వేమి చెప్పవలయును. శివ
మంత్రముచే పవిత్రములైనవియు పరమేశ్వరుని శరీరమున నలంకారమైనవియు నగు నీభ

మును వ్రాసెదను. అనఁగా నిపు డుద్ధవుఁడు గోపికలతో సంభాషించుచున్నవాఁడని యూహింపవలయునని కోరెదను. రాధతో నుద్ధవుఁడు మాటలాడ నింకను బోలేదని భావించి యీకథను జదువుఁడు. ఇదియే యిపుడు మీకుఁ దెలుపఁదగు విషయము. ఈకథప్రకార ముద్ధవుఁడు గోకులమును బ్రవేశించుచుండఁ జూచి గోపికలు మాటలాడుచున్నవారుకదా యని మాత్రము మఱువకుఁడు.

## భ్రమరగీతలు.

* ఉద్ధవుని గోపికలు కాంచిరి. ఆజానుబాహుఁడై నూత్నకమలదళలోచనుఁడై పీతాంబరము దాల్చి కమలహారమును దాల్చి ముఖారవిందము చూచువారి కద్భుతానందమినుమడింపఁజేసి కుండలమండిత కర్ణయుగళుఁడై యుద్ధవుఁడొప్పెను. ఆతనిమోమునఁ జిఱునవ్వ కనఁబడుచుండుటయే గాక యద్భుతానందమును బ్రేక్షకులకుఁ గలిగించుచుండెను. అట్టి విచిత్రరూపుని భగవద్భక్తాగ్రేసరుని గనుంగొని గోపిక లెవ్వఁడీమహాత్ముఁడు నయనానందమును వెల్లివిరియఁ జేయుచున్నవాఁడు? ఎచ్చటినుండి వచ్చెను? శ్రీకృష్ణవేషమును ధరించినవాఁడు? శ్రీకృష్ణదర్శనజనితానందమే యీతనిం జూడఁ గల్గు

---

* ఈవిషయము శ్రీభాగవతము దశమస్కంధము నలువదియేడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినదని గ్రహింపఁదగు. మఱియు నీవిషయమున నించుక గర్గసంహిత మధురాకాండము పదునేడవయధ్యాయమునఁ గలవిషయము కలిపి వ్రాయఁబడుననియుం జెప్పంగఁదగును. బ్రహ్మ విష్ణు బ్రహ్మవైవర్తపురాణములయం దీవిషయమే లేదు. శ్రీభాగవతకథతో గర్గసంహిత కథను గలుపుచు వ్రాసెదను.

మాగ్నేయ మాచరేత్॥ సర్వయజ్ఞేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలం। తత్ఫలం లభతే సర్వం భస్మస్నానా న్న సంశయః॥ మహాపాతక యుక్తోవా యుక్తోవాచోపపాతకైః। భస్మస్నానేన తత్సర్వం దహత్యగ్ని రివేంధనం। భస్మ స్నానాత్పరం స్నానం పవిత్రం నైనవిద్యతే॥ వాసిష్ఠలైంగే॥ ఏవం భస్మధృతం యేనతస్య పుణ్యఫలం శృణు। మహాపాతక సంఘాశ్చ పాతకాన్యుపపాతకాన్యపి। నశ్యన్తి మునిశార్దూల సత్యం సత్యం వదామ్యహం ॥ ఇతి ॥ కాలోత్తరే॥ తస్మాదేతచ్చ విజ్ఞాన మాగ్నేయం యస్స మాచరేత్। భవపాశైశ్చ నిర్ముక్త శ్శివలోకే మహీయతే। జ్వరరక్షః పిశాచాశ్చ ప్యసురా యాతుధానకాః। కుమార గ్రహ భూతాశ్చ కూశ్మాండా డాకినీ గణాః। బ్రహ్మరాక్షస సంముఖ్యాశ్చ భూతసాకు ష్ఠగుల్మకాః। భగందరాణి సర్వాణి వ్యాశీతిర్వాత రోగకాః। చతుష్షష్టిః పిత్తరోగాః శ్లేష్మ సప్తతి పంచకాః॥ వ్యాఘ్రసర్ప భయం చైవాస్య

నణచుఁదియు నగును. ఎవ్వండు మూఁడు కాలములయందు భస్మముచే నాగ్నేయస్నానము సర్వాంగములయందు నొనరించునో యట్టివాఁడు ఇరువదియొక్క కులము వారితో నుత్తమ గతి నొందును॥ జలస్నానము కంటె భస్మస్నానము అధిక గుణము గలది॥ కావున జలస్నానము చేసినను, చేయకున్నను తప్పక భస్మస్నానము చేయవలయును॥ సర్వయజ్ఞములు చేయనేమి పుణ్యము లభించునో సర్వ తీర్థములు సేవింప నేమిఫలము గలుగునో ఆఫలమంతయు భస్మస్నానము వలనఁ గలుగును మఱియు మహాపాతకములతోడను ఉపపాతకములతోడను గూడినవాఁడయినను భస్మస్నానము చేయునెడ అగ్ని కట్టెల నెట్టివైనను దహించునట్టుల అయ్యది పాపములన్నిటి హరించును. భస్మస్నానముకంటె పవిత్రమైన దింకొకట్టిలేదు. అని శివధర్మమునందు గలదు.

భస్మముధరించువాని పుణ్యము చెప్పెదవినుము. మహాపాతక సంఘంబులును ఉపపాతకంబులును శీఘ్రంబ నశించునని వాసిష్ఠలైంగమునందు గలదు

మఱియు ఆగ్నేయస్నానముచేయఁగా శివజ్ఞానమును పొంది భవపాశవిముక్తుండయి శివలోకంబునవసించును. జ్వరములు, రాక్షసులు, పిశాచములు, కుమారగ్రహములు, కూశ్మాండగ్రహములు, ఢాకినీ గణములు, బ్రహ్మరాక్షసులు, కుష్ఠరోగములు, గుల్మరోగములు, భగందరములు, ఎనుబదివిధములగు వాతరోగములును, అరువదినాలుగు పిత్తరోగములును, డెబ్బదియైదు విధములగు శ్లేష్మరోగములును, వ్యాఘ్రభయము, సర్పభయము ను

వదల శక్యముగానిది. జననీజనకేతరబంధువులయందుఁ జేయుమై
త్రి కార్యార్థమై యుండును. ఆమైత్రి కార్యంబు ముగిసిన
వెనుక నది నటించుటకు మాత్రమే పనికివచ్చును. అనఁగా
స్నేహముండినట్లు ప్రవర్తించవచ్చునుగాని కార్యము ముగియక
మునుపున్నయట్టిది కాదు.

ఆర్యులారా! యిందలి రహస్యవిషయములనుగూడ
నిందే వ్రాయుచుందును. కానఁ గథవలె లేదేయని భావింపకుఁడు.
ఇపుడు గోపికలచిత్తవృత్తి భగవద్దర్శనాతురమై యున్నది. శ్రీకృ
ష్ణమూర్తి మధురానగరమునుండి రాఁడేమోయని గోపికలు
కొందలంపడుచున్నవారు. ఉద్ధవునిఁ గాంచినంతనే శ్రీకృష్ణ
మూర్తియే యీతనినంపెనని గుఱుతించిరి. భగవద్విరహము
నోర్వని భక్తిపరవశలగుగోపికలు నర్మగర్భముగాఁ దమభావ
ముల నాతనికిం జెప్పఁదలంచి యిట్లు మాటలాడుచున్నవారు.
కావున నిందుఁ బ్రాతీతికార్థమే గాక విశేషార్థము లుండక
తప్పదు. కాఁబట్టియే యాశ్లోకముల వ్రాసి విశేషార్థము నించు
కవ్రాయుచు గోపికలభక్తిని వెల్లడించెదను. ఈగొడవ యిటి
నేలయనిమాత్రము తలంపక యవకాశ మించుకవ్యయపఱిచి
పఠింపుఁడు. గోపికలభక్తి పరవశత్వము తేటపడును.

ఉద్ధవా! తుమ్మెదలు మకరందమును గ్రోలుతలంపున
సుమనస్సులజేరునట్లు పురుషులు స్త్రీరత్నములయందు మైత్రి
నునుతురు. కొంతకాలమునకు వెనుక వారిం ద్యజింతురు.
వేశ్యలు నిర్ధనుఁడగుపురుషుని వదలుదురు. ప్రజలు తమ్ము

---

దృఢముకాఁగా నది నశించును. అప్పు డతఁడు మునియనఁబడఁడు. ముక్తుఁ
డనఁబడును. అని యిందలిరహస్యము.

ద్విద్రవంతిన సంశయః॥ భార్గవాద్యసితం ప్రోక్తం భస్మకల్పమభిజ్ఞ కాత్। భూతిర్భ్యాతి కరీపుంసాంరక్షారత్నా కరంపరం॥ కిమన్యదిహా వక్త వ్యం భస్మ మాహాత్మ్య కారణం। అతీవ భస్మస్నానాత్స్వయం శివో మహేశ్వరః॥ పరమాస్త్రంచ శైవానాం భస్మతత్పారమేశ్వరం॥ మానవే॥ త్రిపుండ్ర ధారిణం దృష్ట్వా భూత ప్రేత పురస్సరాః భీతాః ప్రకంపితాశ్శీఘ్రం గచ్ఛంత్యేవ నసంశయః॥ లింగే॥ స్మరణాదేవ రుద్రస్య యథా పాపం ప్రణశ్యతి। తథాస్య ధారణాదేవ సర్వపాపం ప్రణశ్యతి॥ యద్యకార్య సహస్రాణి కృత్వా యస్స్నాతి భస్మనా। తత్సర్వం దహతే భస్మ యథాగ్నిస్తేజసా వనం। కృత్వాపిచాతులం పాపం స్నాత్వా త్రికాలేపి యో ద్విజః। భస్మస్నాయీ భవేత్కించేత్ క్షిప్రం పాపైః ప్రముచ్యతే॥ భస్మస్నాన విశుద్ధాత్మా జితక్రోధో జితేంద్రియః। మత్సమీపం సమాగమ్య న భూయోపి నివర్తతే ॥ఇతి॥ శివరహస్యే॥ సమస్తతీ

---

ఈ సర్వార్థ నామములు గలవు॥ భస్మమాహాత్మ్యమును నికను చెప్పనేల? ఎల్లపుడు భస్మ స్నానము చేయువాఁడు మహేశ్వరుండే యగును। శైవులయొక్క పరమాస్త్రము భస్మ మేయగును॥ అని వాయవీయ సంహితయందు గలదు.

భూతప్రేతాదులు భస్మధారిని జూచి భయపడి పోవునని మానవపురాణమునఁ గలదు. రుద్రుని స్మరింపఁగా పాపము నశించునట్లు భస్మము ధరింపఁగా సకల పాపంబులు నశించును॥ ఎట్టికార్యములను జేసి భస్మము ధరించినను అగ్నిహోత్రుండు వనమును దహించునట్లు భస్మము సకల పాతకములను దహించును। అధిక పాపమును జేసినవాఁడైనను త్రికాలమునందు భస్మస్నానము చేయునేని పాపముల నుండి శీఘ్రముగ విముక్తుండగును. భస్మస్నానము చేయువాఁడును, అక్రోధుండును, జితేంద్రియుండు నగువాఁడు శివసామీప్యమును బొంది పునరావృత్తి నొందనేరఁడు॥ అని లింగపురాణమున గలదు॥ కాశీనగరము సమస్త తీర్థ రూపమైనదియు, విశ్వేశ్వరుఁడు సర్వదేవతాశ్రేష్ఠుండును, విభూతి సకల తత్త్వాత్మకంబును నగునట్లే త్రిపుండ్రంబును సర్వోత్తమ మగును.

యజ్ఞములతో నేమి? తీర్థయాత్రలతో నేమి? వేదపాఠములతో నేమి? ఉగ్రములైన తపములతో నేమి? మంత్రతంత్రములతో నేమి? జపములతో నేమి? ధ్యానములతో నేమి? దానములతో నేమి? సాంఖ్యయోగధారణలతో నేమి? మాతృము కానీయు నెడ బుద్ధిని కలుగఁగవాడు శుద్ధభస్మముతో త్రిపుండ్రము ధరించిన జాలునని మత్స్యపురాణమునఁ గలదు.

మూ. స్నేహానుబంధో బంధూనాం మునేరపి సుదుస్త్యజః,
అన్యైష్వర్థకృతామైత్రి యావదర్థవిడంబనా. ౬

అనుశ్లోకార్థముగాడ నిమిడియున్న ట్లూహింపక తప్పదు. ఇన్ని శ్లోకముల కొక్కపద్యమువ్రాయ నేమిహేతువో తెలియఁజాలకున్నాఁడ. భక్తిశ్శృంగారము లిందు లేవనికాఁబోలు. "కాక విడువరే సనిమిత్తసఖ్యము" అనుచో రసము తులకింపుట లేదు. చప్పిడిగా నున్నది. వారిభావ మేదియైయుండునా యని యూహించునంతటి ప్రజ్ఞ నాకు లేదని తలంచి యీచర్చమాని నాకుం దోఁచినభావమును వ్రాయఁ బూనెదను. గోపికలభావ మిదియై యుండును. తలిదండ్రులు కాక యితరులగు బంధువులయం దొనరించు మైత్రి కార్యము తీఱినపిదప నుండదు. అనునది ప్రాతీతికార్థము. శ్రీకృష్ణుఁడు పరాత్పరుఁడు. సృష్టి చేయఁబూనునపు డొక్కకార్యముకొఱకుఁ గొందఱియందు మైత్రిగలుగునట్లు నటించును. ఆపనికాఁగానే వారిని వదలును. ఇది పక్షపాతము కాదు. ఆమహాత్మునకుఁ దలిదండ్రులయం దెక్కువప్రీతియు నితరులయందుఁ దక్కువమైత్రియు నుండదు. సర్వసముఁడు కదా పరమాత్మ. అని వా రెఱింగినవారేయని మన మూహింపఁదగు. ఈభావము క్రిందిశ్లోకములంబట్టి దృఢపఱుపవచ్చును. పురుషులు స్త్రీలయం దునుచు ప్రీతి కామ్యానంతరము నిలువదు. అట్లే తుమ్మెదలు విరులరసమును గ్రోలి వెనుక వాని వదలును. అనునది సామాన్యార్థము. విశేషార్థ మేమనఁగా, పరమపురుషుఁడగు శ్రీకృష్ణమూర్తి సృష్టికార్యమునందుఁ బ్రకృతియందు మైత్రి నునుచును. అనఁగాఁ బ్రకృతికి లోఁబడును. సృష్టి లయముకాఁగాఁ బ్రకృతిని వదు

త్రిపుండ్రకం।తత్త్రిపుండ్రం భవేచ్ఛస్తం మహాపాతక నాశనం॥ ధర్మసారసుధా సింధౌ॥ త్రిపుండ్రకంసదా కుర్యాన్మాత్రపూతేనభస్మనా। వేదోక్తేనవిధానేన శివసాయుజ్య మాప్నుయాత్ ॥స్మృతి భాస్కరే॥ వనస్పతిగతేసోమే భస్మోద్ధూళితవిగ్రహాః। అర్చితంశంకరం దృష్ట్వా సర్వపాపైః ప్రముచ్యతే ॥ఇతి॥ నారదీయస్మృతౌ॥ త్రిపుండ్రం పరమంపుణ్యం బ్రహ్మవిష్ణు శివాత్మకం। యేఘోర రాక్షసాః ప్రేతా యేచాన్యే క్షుద్ర జంతవః। త్రిపుండ్రధారిణం దృష్ట్వా పలాయన్తే నసంశయః॥ మద్యంపీత్వాగురు దారాంశ్చ గత్వాస్తేయం కృత్వా బహ్మహత్యాంచకృత్వా॥ భస్మచ్ఛన్నో భస్మశయ్యాశయానో రుద్రాధ్యాయీ ముచ్యతే సర్వపాపైః।సత్యంశౌచం జపో హోమస్తీర్థం దేవాది పూజనం। తస్య వ్యర్థ మిదం సర్వం యస్త్రిపుండ్రం నధారయేత్ ॥ఇతి॥ లోకాక్షీ స్మృతౌ॥మధ్యమానామికాంగుష్ఠైర్లలాటేభస్మ నాకృతః। సుర

రాపానము, గురుతల్పగమనము, స్వర్ణస్తేయము, బ్రహ్మహత్య, అనుమహాపాతకముల చేసినవాఁడైనను భస్మదిగ్ధాంగుఁడై భస్మశయ్యయందు శయనించుచు రుద్రాధ్యాయము పారాయణ చేయుచుండెడ సకల పాపములచే విముక్తుండగును॥ త్రిపుండ్రము ధరించనివానియొక్క సత్యము, శౌచము, జపము హోమము, తీర్థయాత్ర, దేవపూజ ఇవి యన్నియు వ్యర్థములగును అనియున్నది॥

లోకాక్షీ స్మృతియందు॥ ఎవ్వఁడు శివుని యందు లగ్నమగు చిత్తముకల వాఁడై త్రిపుండ్రమును ధరించునో వాఁడు మూఁడులోకముల ధరించిన వాఁడగును త్రిపుండ్రము ధరించినవాని మహా పాతకములు నశించును. భస్మ త్రిపుండ్రమును,రుద్రాక్షలను ధరించు పవిత్రుఁడగు బ్రాహ్మణుఁడు సర్పములను పాపములను, వ్యాధులను, దుర్భిక్షమును,దొంగలను పారద్రోలుటయు గాక పరం బ్రహ్మయొక్క సాయుజ్యమును పొంది పునరావృత్తి నొంద నేరఁడు॥ఇటుల(భస్మ త్రిపుండ్రధారి పంక్తి పావనుఁడుగాన దేవతలకును పూజ్యుఁడగును. అనిచెప్పఁబడి యున్నది.

అధిక పాపములు చేసియున్నందునను, దధీచి గౌతమాదుల యొక్క శాపముల వల్లను కొందఱను భస్మరుద్రాక్షాది వైదిక చిహ్నములు రుచింప నేరవని భవిష్యత్పురాణమున గలదు.

మహాత్ముఁడగు దుర్వాసుని శాపమువల్లను, కణ్వుని శాపమువల్లను భృగుని శాప

కావుననే మనోవాక్కాయముల నా లీలామానుషవిగ్రహుని పై నునిచిరి. అంతట శ్రీహరి బాల్యకౌమారచర్యలు స్మృతిగోచరము లయ్యెను. వానింగాంచినంతనే సిగ్గు వదలిపోయెను. అనఁగాఁ దమరు స్త్రీలని పురుషుఁ డెదుట నున్నవాఁడని తమరు శ్రీకృష్ణునింతగా నడిగిన నితఁ డేమనుకొనునో యనుభావము నశించెనని భావము. వారి కత్తరుణమున నెల్లయెడల శ్రీకృష్ణ బాల్యక్రీడలే కనఁబడియెను. అట్టి శ్రీహరినిం దలంచి విలపించిరి. అంత భక్తిభావము దుర్భరమగుట గొంతెత్తి తచ్చరిత్రగేయములఁ బాడిరి. లోకవ్యవహారముల మానిరి. అనఁగాఁ దమరిపు డొనరింపవలసిన గృహకార్యము లేమనుభావము వారియందుఁ గన్పట్టలేదని భావము. కావున నాపరమేశ్వరుం దలంచుచు స్తుతిపాఠములం జెప్పుచుండిరి.

ఆర్యులారా! ఈవాక్కుల భావమును గాంచిన మీకు గోపికలు వ్యభిచారిణులు కారనియు, శ్రీకృష్ణ పాదారవిందాశ్రితమానసలనియు, మహాభక్తిభరితలనియుఁ దోఁచును గదా. లోకమునఁ గులటల కిట్టివ్యాపారము లుండునా. విటుని చరిత్రములఁ బాడుదురా. లోకమున నిట్టియాచారములు కలవా. మీరు వింటిరా చూడఁ జాలితిరా. లేదుకదా. ఈ శ్లోకముల యర్థము తెలుఁగుభాగవతమున లేకుండుట లోపము. ప్రకృతము గోపికలు భక్తిభరితహృదయలనియు నుద్ధవుని గాంచినంతనే పట్టరాని ప్రీతిచే భగవత్కథల నడుగఁ బ్రయత్నించిరనియు వారిచర్య లమానుషములనియుఁ దలంపుఁడు. వారివలె భగవద్గుణసంకీర్తనము చేయ నభ్యసింపుఁడు. భగవద్దాస్య మలవడును. తరువాతికథ నాలకింపుఁడు.

నర్థము చెప్పుతటి నుపయోగించినట్లు నా చూచినంతదనుక లేదు. వాఁడు వేశ్యను ధ్యానించుచున్నవాఁడు. వీఁడు దొంగతనముచేయ మననము చేయుచున్నాఁడు అను వాడుక లేదు. కావున నిట గోపిక భక్తిపరవశత్వమున శ్రీకృష్ణునిదర్శనమునే కోరి యిట్లు పలుకుచున్నది కాని నికామకామభీమసాయకవిదారితచిత్తపద్మయై యిట్లు మాటలాడ లేదని గ్రహింపవలయును. "ధ్యాయంతీ కృష్ణసంగమమ్" అనువాక్యమునకు మహాకవిపోతన యెట్లు తెనిఁగించెనో పరికించి యామహాత్మునిభక్తిపారవశ్యమును గొనియాడుఁడు.

చ. అనియిటు గోపికల్ పలుక నందొకగోపిక కృష్ణపాదచిం
తనమునఁ జొక్కి చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల
త్సునిశిత సద్వివేకముఁ బ్రసూన మరందమదాతిరేకముం
ఘన మృదునాదసంచలిత కాముకలోకముఁ జంచరీకముం.

కృష్ణపాదచింతనమునఁ జొక్కి అనివ్రాసి తన యపూర్వభక్తి చమత్కృతిని దెలిపి పోతన కృతకృత్యుఁడయ్యెను. మనమిట్లు విపరీతార్థమును జెప్పి యేల జన్మము నసార్థకముగఁ జేసికొనవలయునో తెలియనేరక యున్నవాఁడ. లోకప్రియుఁడగుభగవంతుఁడు పంపినదూతయనియే భావించి యిట్లు పలికెను. భృంగమును గాంచి తాఁబలుకుభాషణముల నుద్ధవుఁడెఱింగి శ్రీకృష్ణమూర్తికిం దెల్పుననియే గోపికల భావము. ఆమాటలేవియో వినుఁడు. అందు మూలము దానిపద్యము దాని విశేషార్థమును దిలకింపుఁడు.

శ్లో. మధుప కితవబంధో మాస్పృశాంఘ్రిం సపత్న్యాః
కుచవిలులితమాలాకుంకుమశ్మశ్రుభిర్నః,

ధ్వోరపి తుల్యత్వామే వేతివాచ్యా, అనేనాపి భిన్నాధి కారికత్వ సంప్రతి పత్త్యా ఉభయ విధివిరోధస్య సిద్ధత్వాత్॥ కించ, భస్మత్రిపుండ్ర విధేస్సకల శ్రుతివిహి తత్వేన వైదికత్వ నిశ్చయేన, మృదూర్ధ్వ పుండ్ర విధేసు పాంచరాత్రాది తంత్రమాత్రమూలక తయా తాంత్రికత్వా వధారణే చ విభిన్నాధికారికత్వస్య నిశ్చయాత్॥ ఏవంచ, భస్మ త్రిపుండ్ర విధేశ్శ్రుతి మూలకతయా తత్ప్రతి పాదకానా మూర్ధ్వ పుండ్ర నిషేధ కానాంచ స్మృతి పురాణాది వచసాం వైదికజన విషయత్వం తథామృదూర్ధ్వ పుండ్రస్య పాంచరాత్రాదితంత్రమాత్రమూలకతయామృదూర్ధ్వ పుండ్రవిధాయ కానాం భస్మత్రిపుండ్ర నిషేధకానాంచ స్మృతిపురాణాది వచసాం తాంత్రికజన విషయత్వ మితిచ సిద్ధం.

యదుక్తం మత్రిపరైః॥ నను దేవతోత్కర్ష నికర్ష ప్రతిపాదకాని పుండ్రస్తుతి నిందాపరాణిచ వచనాని పరస్పరవిరుద్ధాని బహూనీతిహాసపురాణాదిషు దృశ్యన్తే। అతః పరస్పర విరుద్ధార్థాభిధాయకత్వా దితిహాస పురాణానాం ప్రమాణానీతిచేత్ భవేదయం దోషో భేదవాదినాం శైవానాం వైష్ణవానాంచ శివాదన్యో విష్ణుర్విష్ణో రన్యశ్శివ ఇత్యవగచ్ఛతాం। అభేదవాదినాంతు సిద్ధాంతినాం నాయందోషః। ఈశ్వరస్యైకత్వా భ్యుపగమాత్త్వాది తదవివేక మూలం॥

కులకే భస్మత్రిపుండ్రమునందధికారమని తెలియుచున్నది గాన రెండును సమములేకదా?

ఉ. అటుల కానేరవు. దీనింబట్టియు రెండుపుండ్రములకు నధికారులు వెవ్వేరనుటచే విరోధము స్పష్టమగుచున్నేయున్నది.

ఇందు భస్మత్రిపుండ్రోన్నతి అనేకశ్రుతులచే విధింపబడినది గాన నిది వైదిక మని నిశ్చితమగుచున్నది. ఇంక మృత్తికతో నూర్ధ్వపుండ్రము ధరింపవలయునను విధి పాంచరాత్రము మొదలగు తంత్రములయందు మాత్రమే కలదు గాన నది తాంత్రికమేయని నిర్ణయింపబడుచున్నది. ఇటుల తంత్రాను సారముగా విష్ణూపాసనఁజేయువారలకే, యూర్ధ్వపుండ్రమునం దధికారముకలదని యేర్పడుటచే రెండిటికి విరోధము కలదనుట స్పష్టము.

ఇటుల భస్మత్రిపుండ్ర విధివేదమూలక మైనది. భస్మత్రిపుండ్రమును ప్రశంసించున

మరందమును గ్రోలుదువు. నీభాగ్యమే భాగ్యము. నీజన్మము సార్థకము. మహాభక్తులకుంగూడ దొరకని భగవంతుని పాదారవిందములు నీకు సేవింప లభించినవికదా అవి ముక్తిదాయకములు. సనకసనందనాదు లాపాదారవిందభజనమునే కోరుదురు. అని సంబోధించినందున మరల మాకెన్నఁడు శ్రీకృష్ణపాదాంభోజములఁ గాంచుభాగ్యము లభించునో యని ప్రశ్నించిన ట్లూహింపనగు. మఱియు ధూర్తబంధూ! అనియు సంబోధించినది. నీవు సాహసముగలవాని చుట్టమవు కదా. అనియు నర్థమగును. ధూర్తుఁడు బంధువుగాఁ గలవాఁడవనియు నర్థమగును. సదా తన్నే నమ్మియున్న మమ్ము విడనాడిపోవుటయే ధూర్తత్వమని గోపికభావము. అట్టి శ్రీకృష్ణునిదూతవుకదా యని హెచ్చరించినది. ఇట్టినీకు మావంటి యదృష్టహీనుల మాటలు వినఁబడునా యని తనదౌర్భాగ్యమును నిందించుకొనుచున్నది. ఇందున్న బాలగోపాలుని దమపురమున నుండునట్లుచేసిన మధురానగరకామినులే మాకు సపత్నులని గోపిక తలంచెను. ఔరా! మధురానగరమున వసించుమానిను లెంత పుణ్యముచేసిరో, తమహృదయారవిందముల భగవంతు నిలుపుకొనఁజాలిరి గదా యనిభావము. శ్రీహరి మధురాపురీమానినులఁ గౌఁగిలించుకొనెనని దీనిభావము కాదు. ఒకప్పుడు పౌరకాంతల కుచసమ్మర్దమున నలఁగిన వనమాలాకుంకుమపంకముగల శ్మశ్రువులచే మాపాదముల నంటకుమని యర్థము చెప్పవచ్చునుగాని నలఁగినహారమున మరంద ముండదుగాన నట్టివనమాలపై భ్రమరము వ్రాలుట యసంగతప్రసంగమువంటిదగును. కాఁబట్టి యాయర్థము చెప్పరాదు. కుచశబ్దముచే

తారవిశేష ప్రయుక్తత్వేన నసభేద సాధకఇతి వాచ్యం హరేరవతార దశక వైశిష్ట్యస్య హరస్య లీలారూపం చవింశక సాహిత్యస్యచ పార్థక్యేన ప్రమితత్వేన తదుభయోరవతార విశేషత్వస్యాప్రమితత్వాత్ ॥ ఏవం చాభేదవాదానుశోధే నైకేశ్వరత్వాభ్యుపగమోప్యసిద్ధః ॥ అభేదాభ్యుపగమేపి జీవేశ్వరయోరప్యభేదస్య సమ్మతత్వేన ద్వయోరేకస్య జీవత్వేనాపి తత్సంగత్యా తదుభయోరేకేశ్వరతా సిద్ధేః.

కించ హరస్యారాధనే హరిః ప్రహృష్యేదితి హరేరారాధనే హరః ప్రహృష్యేదితిచ సంశయేన ద్వావపి సమమన్యేన్య సేవమానా నానామేకేశ్వరత్వాభ్యుపగమాసిద్ధేః. అభేదస్యాపి వాదమాత్రసిద్ధత్వ ప్రతీతే

---

ను వారంగీకరించిన దాన అభేదవాదిమతమునందు న్యాయాన్యాయములకును భేదములేదని యేర్పడుచున్నది.

నిజమాలోచింప హరిహరాభేదమే సిద్ధింపదు. అదియెట్లనిన,

ప్ర॥ హరి- అనియు- హరుఁడనియు నీమొదలగు నామము లొక్కనికేకదా?

ఉ॥ అట్లు కాదు విష్ణు నారాయణాది నామములు హరివనియు శివ శంభ్వాది నామములు హరునివనియు నిఘంటుకారులు నిర్ణయించియుండుటచే హరిహరులు వేర్వేరనియేర్పడుచున్నది.

ప్ర॥ పేర్లువేర్వేరైనను నిద్దఱి స్వరూపమొక్కటె గావున నిర్వురు నొక్కరేయనియేల యంగీకరింపరాదు?

ఉ॥ హరిహరులకిర్వురకు స్వరూపమొక్కటె యగునెడ పేర్లువేర్వేరుగనుండనేరవు. హరికి రెండు నేత్రములును, హరునకు మూడు నేత్రములును, హరికి నాలుగు చేతులును, హరునకు పదిచేతులును నిట్లు ఇద్దఱి స్వరూపము వేర్వేరుగనే యున్నటుల ప్రమాణములవల్ల తెలియుచున్నది. మఱియు హరియొక్క పత్ని లక్ష్మియు, హరుని పత్ని గౌరియు నిటుల వారి భార్యలును వేర్వేరుగనే యున్నటుల ప్రమాణములవల్ల తెలియుచుండఁగా నిర్వురు నొక్కరే యనుట విరుద్ధము.

ప్ర॥ రామకృష్ణాద్యవతారములయందు నొక్క హరికే స్వరూపభేదంబును పత్నిభేదంబును, గలిగియున్నటుల హరిహరులకును గలిగియున్నను హరిహరరూపములు రెండును నొక్కని యవతారములేయని యంగీకరించునెడ నభేదము సిద్ధింపదా?

ఉ॥ అటుల సిద్ధింపదు. హరికి పదియవతారములు గలవనియు హరునకు నిరువదియయిదు లీలలు గలవనియు నిటుల ఇద్దఱి యవతారములు వేర్వేరని ప్రమాణములవల్ల తె

కాఁబోలు. అని పలికెను. ఇది ప్రాతీతికార్థము. పోతనగారిశ్లో కమునకు

మ. ఒకపువ్వందలి తేనెద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెడుభంగి మన్మథరపీయూషంబునం దేల్చి
మా, యకలంకోజ్జ్వల యౌవనంబుఁగొని యన్యాసక్తుఁడ
య్యెన్ విభుం, డకటా! యాతని కెట్లుదక్కె సిరి మిథ్యా
కీర్తి నమ్మెంజుమీ.

అని వ్రాసి సర్వతోముఖపాండిత్యమును వెల్లడించెను. ఇందలి విశేషార్థమేదియనఁగా! సకృత్=అనఁగా నొకానొకప్పుడు యోగనిద్రాపరాయణుఁడై కొంతకాలముండి సృష్టిచేయు నూహ కలుగఁగా నాదిశక్తిని బయలుపడంజేసి బ్రహ్మాదులను బుట్టించి వారికి జగన్మోహనకరములగు నుపనిషదర్థములను దెలిపి యని భావము. అధరామృతము వాగమృతమని తాత్పర్యము. క్రిందిపెదవిరసమని కాదు. అమృతమువంటి వాక్కులని సారము. ఇట్లు తెలిపి కొంతకాలముకాఁగా తుమ్మెద మకరందముగ్రోలి యాపువ్వుల వదలునట్లు సుమనసుల ననఁగా దేవతలను వదలును. మరల యోగనిద్రాపరాయణుఁ డగునని భావము. అట్టి నిరంజనుఁడగు భగవంతుని పాదపద్మముల మహాలక్ష్మి యెట్లు సేవించెను? ఓహో! తెలిసికొంటిని. ఉత్తమశ్లోకజల్పైః=మిథ్యాకథలచేత. (మిథ్యాకథాభిః=అనివ్యాఖ్యా) పరిదృశ్యమానప్రపంచము స్థిరముకాదను మొదలగు తత్వవాక్కులచేత హృతచేతాః=హరింపఁబడిన హృదయముగలదై, అనఁగా నీ ప్రపంచము నాచే సృజింపఁబడినది. ఇది భగవత్కారుణచే వెలసినది. కాని యెపుడు నశించునో దీని నమ్మియుండరాదు. నిత్యుఁ

నే నోర్ధ్వపుండ్రం విరచ్య — తదుపరి భస్మనా త్రిపుండ్రం ధారణీయ మి
తి విహితత్వేన తాదృశస్య విధే రననుష్ఠాన దూషితత్వేన సద్యస్సంజా
త శిశుముండనాదివద యమప్రయోజనః॥ యదప్యత్ర కేచి ద్భ్రాంత్యా త్రి
వోర్ధ్వపుండ్రం దధతే తదపి నిషిద్ధక్రియాచారః॥ భస్మనైవోర్ధ్వపుండ్రశ్చ
తిర్యక్పుండ్రో మృదా తథా। బ్రహ్మహత్యాసమః ప్రోక్తో మునిభిర్వేదపా
రగైరితి॥

తథా॥ ఊర్ధ్వపుండ్రం ద్విజః కుర్యాద్వారి మృద్భస్మచందనైః।
జపకాలే మృదా కుర్యాత్సంధ్యాకాలే తు వారిణా। భస్మనా హోమకాలే
చ చందనం సార్వకాలిక మితి- మృత్తికా చందనం భస్మ తోయం చైవ చ

---

యె హరిహరులయిద్దఱియందును గలదు గాన నిద్దఱకు భేదములేదు దీనింబట్టి యేకేశ్వ
రత్వ మెట్లుల సిద్ధింపదు?

ఉ. ఆ సిద్ధాంతమును బట్టి శుద్ధచైతన్యము జీవునియందు నీశ్వరునందును గలదుగా
న జీవేశ్వరులకును నభేద మంగీకరింపఁబడుచున్నది. అట్లే హరిహరుల యందును. నంగీక
రించునెడ నాయిద్దఱిలో నొకఁడు జీవుఁడనియు, వేరొకఁడే ఈశ్వరుఁడనియు నేర్ప
డు గాన నిద్దరు చేరి యొకఁడే యీశ్వరుఁడని యేర్పడదు. అయినను అట్లొప్పుకొన్న
యిద్దరు చేరి యీశ్వరుఁడనుటంబట్టి యనేకేశ్వరవాదమే యేర్పడును. ఆ సిద్ధాంతమునుబ
ట్టి శుద్ధచైతన్యము పిపీలికాది సర్వజంతువులయందును గలిగియున్నది. అయినను వ్యవహార
దశయందు ఒకనినే యీశ్వరుని గాను కడమ వారిని జీవులను గాను అంగీకరింపక త
ప్పదు అట్లే శుద్ధచైతన్యమును బట్టి హరిహరులకు భేదములేదని సాధింపఁబూనునెడ న
ప్పుడు వారిర్వురిలో నొకఁడే యీశ్వరుఁడనియు వేరొకఁడు జీవుఁడనియు నేర్ప
డును. ఇందు హరినె యీశ్వరునిగా నంగీకరింతురా? అప్పుడు తాము వైష్ణవులలో నే
కీభవింతురు. హరునే ఈశ్వరునిగా నంగీకరించిరా? శైవులలోఁ జేరుదురు. రెండువిధము
లను తమకు వేరుగా మతమేర్పడ నేరదు. దానికై యిద్దఱకు నీశ్వరత్వ మంగీకరించిరా?
అప్పుడు నానేశ్వరత్వదోషము అనివార్యమగును. అభేదవాదులు వ్యవహారదశయందును
నభేదము నంగీకరించునెడ లోకవిరోధము, శాస్త్రవిరోధము సంభవించునని దానిని
పారమార్థికదశయందే యంగీకరించిరి. అయినను సర్వస్యదేవత కుదరనందున నాయభే
దమును వ్యవహారదశయందును హరిహరులయెడ నంగీకరించుచున్నారు. కాని యావి
రోధము నిప్పుడెట్టుల తప్పును? విష్ణువు గౌరీపతియన్నను శివుడు లక్ష్మీపతియన్నను

వింతలే, యంగీకారముగావు మాకుఁ బురకాంతాగ్ర ప్ర
దేశంబులన్, సంగీతంబొనరింపు వారిదుదు రోజన్నికు ని
ష్టార్థముల్.

ఏలొకో యీపద్యము చప్పిడిగా నున్నది. మూలార్థ మిందుఁ
బోషింపఁబడలేదు. మహాకవిభావమేమో తెలిసికొనఁజాల కు
న్నాఁడను. "అంగీకారము కావు మాకు" అనువాక్యము సర్వ
థా అసంగతమనక తప్పదు. విజయ సఖసఖీనామ్=అను భాగ
మునకుఁ బురకాంతాగ్ర ప్రదేశములన్, అని తెనిఁగింపఁబడు
ట విరసమని నా భావము. ఇందలి విశేషార్థ మేమనఁగా,

యదూనా మధిపతిమ్ = శాపవశమున రాజగౌరవహీను
లైయున్న దీనులకధిపతి. అనఁగా దీనజనరక్షకుఁ డనుట దీనిచే
నార్తత్రాణపరాయణత్వము భగవద్గుణ మని తేటపడియెడిని.
అట్టి దీనమానవ మందారమును విశేషించి గానముచేయుచు
న్నావే. ఏల? ఇప్పుడు మాస్థితి యెట్లున్నదనఁగా, అగృహాణాం
నః అగ్రతః=గృహములులేక. ఆశ్రయములేక యని భావము.
మా కాశ్రయభూతుఁడగు భగవంతుఁ డిటలేకపోఁగా మేము
దిక్కులేక యున్నవారము కదా. ఇట్టి దీనలగు మాముందు.
పురాణమ్ చరితమ్=బహుతరముగా వేదవేదాంగములు ఘో
షించు నితిహాసము ననిసారము. అనఁగా మే మెఱుంగుదుము.
కాని దాని నిపుడు నీవు మాయెదుటఁ బాడఁగా మాకుఁ బరి
తాప మధికమగును. అట్టి మాదైవమిప్పుడు మధురానగరమున
నున్నవాఁడు. అందుఁ గ్రొత్తచెలులు పెక్కుమంది సేవించుచుం
దురు. వారి కీమహాత్ముని చరిత్రము తెలిసియుండదేమో నీ
వక్కడికిఁబోయి పాడుము. నీ పాటనువిని భగవన్మహిమము

మృదాదిధారణస్య విహితత్వేన వేదప్రతిషేధస్య స్పష్టత్వాత్ ॥ ఏతే న హోమహారయో రనుగ్రహో యయుత్సారై రుభయం ధ్రియతేతత్ హాస్యాస్పదమితి స్ఫుటం। పుండ్రాంతరస్య వైదికానాం నిషిద్ధత్వాత్ ॥ తదుక్తం క్రియాసారే॥ సర్వశాస్త్రజ సందేహ సముద్రబడబానలే। పారాశరే సాంకవం పుండ్రాంతరంను నిరాకృతం ॥ ఊర్ధ్వపుండ్రం త్రిశూలంచ వర్తులం చతురశ్రకం। అర్ధచంద్రాకృతించైవ వేదనిష్ఠో నధారయేత్ ॥ తిర్యక్పుండ్రంచ సంత్యజ్య శ్రౌతం పుండ్రాంతరం భ్రమాత్ ॥ లలాటే ధారయేన్మర్త్యః పతత్యేవ నసంశయః ॥ ఇతి భస్మప్రకరణం.

## అథ భస్మసంపాదనం.

తదుక్తం క్రియాసారే మహోపదేశే బృహజ్జాబాలో

---

దను హోమకాలమున భస్మముతోడను తర్పణకాలములయందు చందనముతోడను ధరింపవలయుననియు స్నానముచేసిన తరువాత మృత్తికతోను, హోమము చేసిన తరువాత భస్మముతోను, దేవతలను పూజించిన వెనుక గంధముతోను నూర్ధ్వపుండ్రము ధరింపవలయునని స్మృతులయందు గలదు. ఆ వచనము లెటుల సరిపడును?

ఉ. ఈవచనములు వేదవిరుద్ధములు. ఎట్లనిన, బృహజ్జాబాలోపనిషత్తునందు భస్మముధరింపక గాయత్రిని జపింపగూడదు. హోమము చేయగూడదు. దేవర్షిపితృతర్పణములు చేయగూడదు. అని కలదు. జపాదికాలములయందు మృత్తికాదులతో నూర్ధ్వపుండ్రము ధరింపవలయునను వచనములు బృహజ్జాబాల శ్రుతికి విరుద్ధములగానున్నవి గాన నా వచనములు వైదికుల నుద్దేశించి చెప్పబడినవిగా నేరవు.

కొందరు హరిహరుల యిద్దఱ యొక్క యనుగ్రహము గోరి రెండుపుండ్రములను ధరించుచుందురు గాని అది హాస్యాస్పదమైనదే. ఏలన భస్మత్రిపుండ్రము దక్క నితర పుండ్రము వైదికులకు గూడదని నిషిద్ధమైనది. ఎట్లన,

సకలశాస్త్రములయందు గలుగు సందేహసముద్రముల నణచుటకు బడబాగ్నిం బోలిన పరాశరపురాణమునందు ఊర్ధ్వపుండ్రమును, త్రిశూలాకారపుండ్రమును మరియు వర్తులము, చతురశ్రము అర్ధచంద్రాకారమునగు పుండ్రములను వేదనిష్ఠుడు ధరింపగూడదు. మనుజుడు శ్రౌతమగు భస్మత్రిపుండ్రమును వదలిపెట్టి యితర పుండ్రమును ధరించునెడ పతితుండగునని నిర్ణయింపబడి యున్నదని క్రియాసారమునఁ గలదు.

మ. సమదాళీశ్వర! చూడు ముజ్జ్వలితహాసభ్రూవిజృంభంబు
లన్, రమణీయుండగు శౌరిచేఁ గరఁగరే రామల్ త్రిలో
కంబులం, బ్రమదారత్నము లక్ష్మి యాతనిపదాబ్జాతంబు
సేవింప నిక్కము నేమెవ్వర మాకృపాజలధికిం గారుణ్య
ముం జేయఁగన్.

అనునీపద్యమును వ్రాసిరి. కాని శ్లోకచతుర్థపాదార్థ మిందుఁ బోషింపఁబడక తికమకగా వ్రాయఁబడిన దనవలసి వచ్చినది.

ఈ శ్లోకమునఁగల విశేషమేది యనఁగా, భృంగమా! శ్రీకృష్ణుని భ్రూభంగ విలాసాదులు హాసములు కపటములు గాని వాస్తవములు కావు. కార్యార్థము చూపఁబడునవియే కాని యాతఁడు నిరంజనుఁడగుట నిట్టి వికారములు లేవు. కావున విలాసార్థము చూపఁబడు నతని తాత్కాలికచర్యలం గాంచి యవి నిక్కములనియే భావించి ముల్లోకములయందలి వనితలు లోఁబడుదురు. అనఁగాఁ బ్రకృతియొక్క యపరస్వ రూపలుగానఁ బరమపురుషునకు లోఁబడియే యుందురు. భగ వత్తత్త్వమెఱింగిన యా శ్రీదేవియే తత్పాదపరాగమును గోరి సేవించెడిని. ఆమె విషయమే యిట్లుండఁగా నీలోకమున నవత రించిన మాగతి యెట్లుండునో చెప్పవలయునా? ఉత్తమశ్లోకు లనఁగా దీనుల నుద్ధరించువారని యర్థము. ఈ మాటమాత్ర ము చెప్పాము. అనఁగా భగవత్తత్త్వము నెవ్వరే నెఱుంగఁ జాలరు. అందును బూర్వస్మృతిలేక యీలోకమునఁ గార్యార్థ మవతరించితిమి. కాన మేమెఱుంగఁజాల మనుట యతిశయో క్తికాదు. లక్ష్మీదేవియే భగవత్పాదారవింద రజమును గోరి యుపాసించుచున్నది. దీనులగు నీగోపికాజనముల విషయము

లన్, లీలంబాసి పరంబుడించి తనకున్ లీనత్వముం బొందు
మ, మ్మేలా పాసె విభుండు ధార్మికులు ము న్నీ చందముల్
మెత్తురే.

పద్య మెంత చక్కఁగానున్న దో పరికింపుఁడు. ఇందుఁగల విశే
షార్థ మేదనఁగా. ఆ కాలమున నాతుమ్మెద గోపికపాదమూల
మునఁ బ్రవేశించుచుండెను. తన్ను క్షమింపుమని యది వేఁడ
వచ్చుచున్నదని యీగోపికభావించి యిట్లు పల్కుచున్నదని
వ్యాఖ్యాతలభావము. కావుననే మూలమున "విసృజశిరసిపా
దమ్" అని చెప్పఁబడినది.

ఓ మధుకరమా! మేము పతులను సుతులను మఱియు
సర్వలోకమును నిడియడియని యననేల? సమస్తమును వదలి
తిమి. భగవంతుఁ డిట్టి మమ్మేల వదలి మధురానగరమున నున్న
వాఁడో తెలియకున్నది ఇంక నిపుడు సంధిచేయ నేమున్నది?
అనఁగా సర్వమును త్యజించి తన్నే నమ్ముకొనియున్న వారము.
మమ్మువదలి వేఱొకచోటికిం బోవుట న్యాయముకాదు. ప్రియ
వచనములతో నిపుడేమిలాభము? మమ్ముద్ధరించినఁగాని యీ
తాపము శాంతింపదు. మాకుఁ బ్రత్యక్షదర్శన మొసంగుమని
శ్రీకృష్ణునితోఁ బ్రార్థింపుము.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అను తనప్రతిజ్ఞను మఱువవలదని ప్రార్థింపుము. చంచలస్వభావ
మును వదలి అనఁగా మమ్ముఁ బరీక్షించుచపని యికమాని తనపా
దారవిందభజనాసక్త చిత్తముననున్న మమ్మెల్ల రక్షింపఁబూను
మని భగవంతునితో విన్నవింపుమనునదియే గోపికభావము.

హ్మాణమాత్రేణ తజ్జలం శిరసి క్షిపేత్ । దశవారం చ జప్తేన దిక్షు తోయం
వినిక్షిపేత్ ॥ ౧౮ ॥ శైవానాం దక్షిణాం దత్త్వా శాంత్యై పుళకమాహ
రేత్ । అహరిష్యామి శైవానాం సర్వేషాం కర్మగుప్తయే ॥ ౧౯ ॥ జాత
వేదసమేనం త్వాం పుళకైశ్ఛాదయామ్యహం । మంత్రేణానేన తం వహ్నిం
పుళకైశ్ఛాదయేత్తతః ॥ ౨౦ ॥ త్రిదినం జ్వాలనస్థిత్యై ఛాదనం పుళకం స్మృ
తం । శైవాంశ్చ భోజయేచ్ఛక్త్యా స్వయం భుంజీత వాగ్యతః ॥ ౨౧ ॥
భస్మాధిక్యమభీప్సంస్తు చాధికం గోమయం హరేత్ । దినత్రయేణ యది
వా ఏకస్మిన్దివసేఽథవా ॥ ౨౨ ॥ తృతీయే వా చతుర్థే వా ప్రాతస్స్నా
త్వా సితాంబరః । శుక్లభాస్వచ్ఛేసూత్రశ్శుక్లగంధానులేపనః ॥ ౨౩
శుక్లదంతో భస్మదిగ్ధో మంత్రేణానేన మంత్రితం । మూలమం
త్రం సముచ్చార్య పుళకం భస్మ సంత్యజేత్ ॥ ౨౪ ॥ తత్ర చానాహ్యాసము
ఖాను పచారాంస్తు షోడశ । కృత్వావ్యావృత్య తథా శైనం తతో ముప

మూడు మంత్రములచేతను, పంచబ్రహ్మమంత్రములచేతను హోమము చేయవలయు. ఇట్టి
ల సర్వాహుతులను వేల్చి భవాయ, శర్వాయ, మృడాయ, రుద్రాయ హరాయ, శంభ
వే మహేశ్వరాయ అను మంత్రములచేతను హోమము చేయవలయు, మఱియు మూల
మంత్రముతో నెనిమిది మారులును, శివాయ అను మంత్రముతో నుమ్మారును స్విష్టకృ
న్మంత్రముతోడను హోమముచేసి యిట్లు మిగిలిన కృత్యమును సంపూర్తిచేసి మూల
మంత్రము నూటయెనిమిది మార్లు జపించుచు పూర్ణపాత్రోదకముతో తర్పణముచేసి పం
చబ్రహ్మమంత్రములతో నాజలము శిరమునఁజల్లుకొనవలయు॥ మఱియు మూలమంత్రము
ను పదిమార్లు జపించుచు జలమును దిక్కులయందుఁ జల్లవలయు॥ శైవులకు దక్షిణ
నొసఁగి, ఉమకనొసఁగి, ఆహరిష్యామి అనుమంత్రముచదువుచు నగ్నిని నుమకచే, గప్ప
వలయు॥ మూఁడుదినములవఱకు నగ్నియారిపోకుండ నుండుటకై యిటులుమకచేఁగప్పుట
ని చెప్పఁబడియెను. తర్వాత శక్తికొలఁది శైవులను భుజింపఁజేసి తాను భుజింపవలయు.
ఎక్కువభస్మము గావలయునేని యెక్కువగోమయము సంపాదించుకొని హోమముచే
య వలయును. ఒకదినము గాని, మూఁడుదినములు గాని, అగ్నిని గాపాడవలయు మఱునాడు గా
ని, నాల్గవనాఁడు గాని ప్రాతఃకాలమున స్నానముచేసి యుదికిన వస్త్రయుగ్మమును ధరించి
భస్మధారణముచేసి నిత్యకృత్యముల దీర్చుకొని మూలమంత్రము నుచ్చరించుచు నగ్నిమీఁద
నుమక కాలిన భస్మము తొలగింపవలయు. అగ్నికి షోడశోపచారములుచేసి శివాగ్నిను

యుండి చంపుటయుఁ జేరొక్కనజాలునా? గోపికలు జారిణులై కృష్ణుని వలచిరనుమాట దీనివలన నేటఁగలిసెఁగదా. షట్పదమును గాంచి సంభాషించునెపమున నుద్ధవునకుఁ దెలియునట్లు శ్రీకృష్ణుఁడు భగవంతుఁడనియు, నింతకుముందెన్నియో యవతారములనెత్తి యెన్నియో మహాకార్యముల నొనరించెనని యుఁ బలికెను. మధురానగరకాంతామణు లెంతటిధన్యతమలో యని వినుతించెను. తన్మైడఁబాసిపోయెనేయని యుమ్మలించెను. భగవంతునిగా శ్రీకృష్ణునెఱింగిన గోపిక కామపరతంత్రయై మాటలాడెననుటకన్న నవివేకము వేఱేమున్నది? ఆభావమును దూరముచేసి భక్తిపరవశయగు గోపిక శ్రీకృష్ణునిజూడఁ గాంక్షించి తద్గుణగణముల నెట్లు వర్ణించెనో యాలకింపుఁడు. భక్తిభావ మెఱుంగని యలసులపలుకులకుఁ జెవియొగ్గకుఁడు. అది మనల నిరయమునకుఁ ద్రోయుపద్ధతి. కావున భగవద్దివ్యకథారత్నముల శ్రవణముల నలంకరింపుఁడు. గోపికామతల్లికభావమును జిత్తగింపుఁడు. ఇందలి విశేషార్థ మేమనఁగా, ఓ షట్పదరాజమా! శ్రీకృష్ణుఁడు వామనావతారమునందును శ్రీరామావతారమునందు నొనరించిన మహాకార్యముల నెఱుంగుదును. వారివారి కర్మానురూపఫలము లనుభవమునకు రాఁగా నన్నియుఁ జేసినట్లు నటించుచు సాక్షిమాత్రుఁడవై యుందువు. ఇట్టి నిన్నాశ్రయించితిని. నాయల్పాపరాధముల సహించి నీపాదదాస్యము నొసంగుము. దయచే నపరాధముల క్షమించువాఁడవు. కావనియుఁ గర్మస్వరూపుఁడవనియు నిరంజనుఁడవనియు సర్వసాక్షివనియు బలి శిక్షణ శూర్పణఖావమాన నకృత్యముల వలనఁ దెల్లమయ్యెను. ఐనను సదా నీదివ్యకథామృతమును

త్రైవర్ణికానాం సర్వేషామగ్నిహోత్ర సముద్భవం। విరజానల జం చైవ కార్యం భస్మ మహామునే॥ ఔపాసన సముత్పన్నం గృహస్థానాం విశేషితం। సమిదగ్ని సముత్పన్నం ధార్యాంతద్బ్రహ్మచారిణాం॥ శూద్రాణాం శ్రోత్రియాగారే పచనాగ్ని సముద్భవం అన్యేషామపి సర్వేషాం ధార్యం దావానలోద్భవం। అగ్నిరిత్యాది భిర్మంత్రైః షడ్భిరాథర్వణైస్తథా। జాబాలైస్సప్త భిర్వాపి గౌణే నైవతు భస్మనా। ఉద్ధూళయేత్స్వకం దేహం పాపపుంజ భయాపహం। త్రియాయుషేణ మంత్రేణ మేధా వీత్యాది నాథవా। గౌణేన భస్మనా ధార్యం త్రిపుండ్రం బ్రహ్మచారిణా। త్రియంబకేనమంత్రేణ సతారేణ తథైవచ। పంచాక్షరేణమంత్రేణ ప్రణవేనయుతేనచ। లలాటే హృదయేచైవదోర్ద్వంద్వేచ మహామునే। త్రిపుండ్రం ధారయేన్నిత్యం గృహస్థశ్చ వనాశ్రమీ। ఆత్మమంత్రేణ హంసేన ప్రణవేన సమాహితః। త్రిపుండ్రం ధారయేన్నిత్యం సన్యాసాశ్రమమాశ్రితః॥ నమోంతేన శివేనైవ శూద్రశ్శుశ్రూషణ ప్రియః। ఉద్ధూళనం త్రిపుండ్రంచ నిత్యం భక్త్యా సమాచరేత్॥ అన్యేషామపి సర్వేషాం వినామంత్రేణ సువ్రత। ఉద్ధూళనం త్రిపుండ్రంచ కర్తవ్యం భక్తి

సమిదగ్నిజము బ్రహ్మచారులకు యోగ్యము. శ్రోత్రియ గృహంబున పచనాగ్నియందు బుట్టిన భస్మము శూద్రులకు ధార్యమగును. దావానలంబున బుట్టిన భస్మము సంకీర్ణులకు యుక్తంబగును.

అగ్నిరితి భస్మ అని మొదలుగా నథర్వణ వేదమునఁ జెప్పిన యారు మంత్రములచే గాని జాబాలమునందుఁ జెప్పిన యేడుమంత్రములచే గాని భస్మముతో శరీరమంతయును ధూళనము చేయునెడ పాపములన్నియు తొలంగును. ఈమంత్రములతోడనె బ్రహ్మచారి భస్మత్రిపుండ్రము ధరింపవలయు. గృహస్థుండు వనస్థుండును త్రియంబక మంత్రమును ప్రణవముతోఁ గూడిన పంచాక్షరమంత్రమును పఠించుచు లలాటమునందు హృదయమునందు బాహుయుగమునందును భస్మత్రిపుండ్రమును ధరింపవలయును. యతీశ్వరుండు ఆత్మమంత్రము ప్రణవయుతమగు హంసమంత్రమును జపించుచు త్రిపుండ్రమును ధరింపవలయు. శూద్రుండు శివాయనమః యను మంత్రము జపించుచు భస్మముతో నుద్ధూళనము త్రిపుండ్రమును ధరింపవలయు. తక్కువారు మంత్రముతో పనిలేకయే భస్మధారణము చేయనగును.

మునకుఁ గాశీరామేశ్వరములకుండినంత దూరమున్నది. విహంగా ఇవ పక్షులవలె సనఃగా జనులు హంసాదిపక్షులవలెనని మూలముననుండఁగా నాకాశమునఁబోవు పక్షులైన నొకపఠ్యయము భగవన్నామమునో భగవత్కథనో విన్నంతన యని వ్రాసిరి. కారణ మెఱుఁగఁజాలకున్నాఁడను. మొత్తముమీఁద నీపద్యము మూలార్థమును బోధింపఁజాలదనుట నిక్కము. విశేషార్థ మేమనఁగా, భగవత్కథ యమృతమువంటిది. ఆ యమృత బిందువు నొక్కసారి క్రోలినంతమాత్రమున శీతోష్ణములు సుఖదుఃఖములు లోనగుద్వంద్వములు తుదముట్ట నశించును. గృహమునందును గుటుంబమునందును రోఁత పుట్టును. హంసాదిపక్షులవలె భిక్షుకు లగుదురు. అనఁగా సర్వమును సన్యసించి తిరుగుదురు. హంసల నుదాహరణముగా నేల గైకొనఁబడెననఁగా సారాసారవివేకము హంసలకుఁ గలదు. కనుక నిస్సారముగా నున్న నీభవమునువదలి సారతమమగు ముక్తిమార్గమును గనుఁగొందురు. అను నర్థమునకై హంస లుదాహరణముగాఁ గైకొనఁబడినవి. అనఁగా భగవత్కథల నాలకించువారికి సంసారబాధ లుండవనియుఁ బరమహంసవృత్తి యలవడుననియు దీనిసారము. భగవత్కథల నాలకించుట యనఁగా వానిని విని తదుక్తప్రకారంబునఁ బ్రవర్తించి. యని గ్రహింపవలయును. ఇదియే గోపికభావము. భగవత్కథాశ్రవణఫలము వైరాగ్యప్రాప్తియే యని దీనిసారము.

మహాశయులారా! కామాతురయగు గోపికపలుకు లిట్లే యుండునా? ఇందుఁ గామాతురతఁ గనఁబఱచు పదమొకఁడేని కలదా? పరమ జ్ఞానమును సూచించుభావమే యిందుఁ

స్నానం సమాచరేత్। ఆదాయ భసితం శ్వేతమగ్నిహోత్రసముద్భవం। ఈశానేనతు మంత్రేణ స్వమూర్ధ్ని వినిక్షిపేత్। తతఆదాయ తద్భస్మ ముఖేతత్పురుషేణతు। అఘోరాఖ్యేన హృదయే గుహ్యే వామాహ్వయేనచ। సద్యోజాతాభిధానేన భస్మపాదద్వయేక్షిపేత్। సర్వాంగం ప్రణవేనైవ మంత్రేణోద్ధూళయేత్తతః। ఏతదాగ్నేయకం స్నానముదితం పరమర్షిభిః। సర్వకర్మసమృద్ధ్యర్థం కుర్యాదాదౌ విదంబుధః ॥ఇతి॥

## భస్మధారణం.

అథభస్మధారణం॥ ఉద్ధూళనమవగుంఠనం త్రిపుండ్రం చేతిత్రిధా॥ తదుక్తం విభూతికల్పే॥ ఆచమ్య, ప్రాణానాయమ్య, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం భస్మధారణం కరిష్యఇతి సంకల్ప్య శుష్కం భస్మగృహీత్వాఇష్టలింగేసమర్ప్యమూలేనసర్వాంగముద్ధూళయేదిత్యుద్ధూళనంతతస్స జలంగృహీత్వాఇష్టలింగేసమర్ప్యసర్వాంగమనులేపయేదిత్యవకుంఠనం.

తతశ్శివాగ్నిజం భస్మసద్యోజాతాది పంచబ్రహ్మమంత్రైః పరిగృహ్య మానస్తోకఇతి జపేనసంసృజ్య తత్రపంచకోణం విలిఖ్య తన్మ

---

వమంత్రముచే శిరమునందుంజల్లుకొనవలయు, ఆభస్మమును తత్పురుషమంత్రముతో ముఖమునందును అఘోరమంత్రముతో హృదయమునందును వామదేవమంత్రముతో గుహ్యమునందును సద్యోజాతమంత్రముతో పాదములయందును వలదుకొని ప్రణవముతో శరీరమునందంతట నుద్ధూళనము చేయవలయు. ఇట్లుజేయుట నెడ నిదియాగ్నేయస్నానమగును. కర్మసమృద్ధికై మొదట నీభస్మస్నానము జేయవలయు నని యున్నది.

### భస్మధారణము.

ఉద్ధూళనము అవగుంఠనము త్రిపుండ్రమునని భస్మధారణము మూడువిధములుగా విభూతికల్పమునందు. ఆచమనము ప్రాణాయామము, సంకల్పముజేసి పొడిభస్మమును తీసికొని యిష్టలింగమున కర్పించి మూలమంత్రముతో శరీరమందంతటను పూసికొనుట ఉద్ధూళనమగును. తరువాత భస్మమున జలముగలిపి యిష్టలింగమున కర్పించి మూలమంత్రముతో శరీర మందంతటు పూసికొనుట అవగుంఠనమగును.

అనంతరము భస్మమును పంచబ్రహ్మమంత్రములతో గ్రహించి మానస్తోక అను మంత్రముతో నందు జలముగలిపి యందు పంచకోణ యంత్రమువ్రాసి దానిముఖమున ప్ర

మ. కమనీయంబగు వేఁటకాని పలుకాకర్ణించి నిక్కంబుగాఁ
దమచిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ తద్బాణనిర్భిన్నలై
యమితోగ్రవ్యథ నొందుభంగి హరిమాయాలాపముల్
నమ్మి దుః,ఖములం జెందితి మంగజాస్త్ర జనితోగ్రశ్రాంతి
నిందిందిరా.

అని వ్రాసి తనయవ్యాజభక్తిభరమును దెలిపి కృతార్థుఁ డయ్యెను. ఇందలి విశేషార్థమేమనఁగా, గోపిక శ్రీకృష్ణదర్శనము కలుగదాయెఁ గదా యనువిచారమునఁ జిత్తము తత్తఱపడుచుండఁగా నీవాక్యము చెప్పుచున్నది. హరిణముభార్యలు దూరమున నుండెను. భర్త వేఱొకతావున నుండెను. వేఁటకాఁడు జింకవంటి కంఠస్వరమున నఱచెను. అది విని తమభర్త తమ్ముఁ బిలుచుచున్నవాఁడని నమ్మి త్వరపడి యచ్చోటికిం బోవ నాబోయ వాడితూపుల వానింగొట్టెను. దాన వేదనలం బొందెను. అట్లే మేమును గపటచరిత్రుఁడగు శ్రీకృష్ణుని మాటలు సత్యములని నమ్మి చెంతకుం బోయి యతని నఖస్పర్శమునఁ బడరాని బాధలం బడితిమి. కావున నామాటల నిఁకఁ జాలింపుము. ఇంకేమేని వేఱువార్తలున్నం బలుకుము. అని గోపిక పలికినదని శ్లోకగతభావము. దీనినుండి గ్రహింపఁదగు సారమేమని యూహించు టుచితము. పూర్వశ్లోకమున నట్టిభక్తిని వెల్లడించి యీశ్లోకమున సంభోగమును వర్ణించెననుట యసంగత ప్రసంగముకదా. ఈశ్లోకమున గురువు శిష్యునుద్ధరించుపద్ధతి చెప్పఁబడినది. లోకమునఁ గొందఱువంచకులు గురువులవలె నటించుచు వంచకులై ధనార్జనము చేయుచుందురు. వారి పలుకులు మృదువులై మధురములై యుండును. ఇతరులఁ

ధర్శ్చ సోమశ్చ ఆపశ్చైవానలో౽నిలః। ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవో౽ష్టౌ ప్రకీర్తితాః॥ ఏతేషాం నామమన్త్రేణ త్రిపుండ్రం ధారయేద్బుధః। తత్రస్యోర్ధ్వ శస్థానే త్రిపుండ్రం చ సమాహితః। శిరసి చ లలాటే చ కర్ణయో సద్యయోరపి చ। కూర్పరే మణిబంధే చ హృదయే నాభిపార్శ్వయోః। పృష్ఠే చైవం ప్రతిష్ఠాయాం జపేత్తత్రాధిదైవతం। శివం శక్తిం చ సాదాఖ్యమీశం రుద్రాఖ్యమేవ చ। వామాదినవశక్తీశ్చ ఏతాః షోడశ దేవతాః॥ అథవా మూర్ధ్ని వక్త్రే చ కర్ణయోర్నాసికే తథా। బాహుద్వయే చ హృదయే నాభ్యామూర్వోర్యుగే తథా। జానుద్వయే చ పదయోః పృష్ఠభాగే చ షోడశ॥ శివస్స్కన్దశ్చ చంద్రార్కౌ విఘ్నేశో విష్ణురేవ చ। శ్రీశ్చైవ హృదయే తిష్ఠేత్ తథా నాభౌ ప్రజాపతిః। నాగాశ్చ నాగకన్యాశ్చ ఉభయో ఋషికన్యకాః। పాదయోశ్చ సముద్రాశ్చ తీర్థం పృష్ఠే౽పి చ స్మృతాః॥ ఏవం వా షోడశస్థానమష్టస్థానమథోచ్యతే। శిరస్థానం లలాటం చ కర్ణద్వయమనంతరం। అంసయుగ్మం చ హృదయం నాభిరిత్యష్టమం భవేత్। బ్రహ్మా చ ఋషయస్సప్త దేవతాశ్చ ప్రకీర్తితాః। అ

---

ఈస్థానముల కధి దేవతలెవ్వరనిన. అష్టమూర్తులు అష్టవిద్యేశ్వరులు, అష్టదిక్పాలకులు అష్టవసువులును నగుదురు. అందు ధరుడు, ధ్రువుడు, సోముడు, జలుడు, అగ్ని, గాలి ప్రత్యూషము ప్రభాతము ననువారు అష్టవసువులు నగుదురు. వీరి నామములను మంత్రములతో నా యా చోట్ల త్రిపుండ్రము ధరింపవలయు. ఇక పదునారుచోట్లు ఎవ్వియన శిరము, లలాటము రెండు చెవులు రెండు బుజములు, రెండు మోచేతులు, రెండు మణికట్లు హృదయము, నాభి, పార్శ్వములు, వీపు, ఆధారమునను పదునారుచోట్ల ధరింపవలయు వీనికధి దేవతలెవ్వరన, శివుడు శక్తి శివసాదుడు శక్తిసాదుడు, ఈశుడు రుద్రుడు వామాది నవశక్తులును చేరి పదునార్గురు అధి దేవతలగుదురు.

మరియు శిరము, లలాటము, కర్ణములు నాసిక రెండుచేతులు హృదయము నాభి రెండు తొడలు రెండు మోకాళ్లు, రెండు పాదములు, వీపు నానివి పదునారు స్థానములగు. శివుడు స్కందుడు, చంద్రుడు అర్కుడు, విఘ్నేశుడు విష్ణు శ్రీ ప్రజాపతి నాగులు, నాగకన్యకలు, ఋషులు ఋషికన్యలు సముద్రములు తీర్థములు నానివి పదునారుస్థానముల కధి దేవతలగుదురు.

శిరము. లలాటము, రెండు చెవులు రెండుబుజములు, హృదయము, నాభియనునివి

ఇపుడు గోపిక భగవత్సమీపాగమనమును గోరుచుఁ ద్వారపడు చున్నది. తదనుగుణముగాఁ బల్కుచున్నది. ప్రియుఁడగు శ్రీకృష్ణుని మిత్రమా ! భృంగరాజమా ! మా ప్రియతముఁడగు శ్రీకృష్ణమూర్తి పంపవచ్చినవాఁడవా? నీవు మాకు సమ్మానింప నర్హుఁడ వగుదువు. నీ కేమి కావలయునో కోరుము. మమ్మిచ్చటనుండి విడువఁబడని మిథునీభావముగల యాకృష్ణుని చెంతకుం బిలుచుకొని పోవుదువో. ఓ సాధువా ! ఆ గోపాలబాలుని వక్షస్థలమున శ్రీదేవియను కాంతామణి యెల్లతఱి నెడఁబాయకుండును. అని పలికెను. ఈశ్లోకరత్నమునకు మహాభక్తుఁడు పోతనకవిచంద్రుఁడు పద్యమును వ్రాయక భక్తిభరమున వేఱొకభంగిన బద్యములను వ్రాసెను. కారణ మిదమిత్థమని యరయ నే నెంతవాఁడను ? హృద్యమగు నాపద్యములను బఠింపుఁడు.

ఉ. బంధుల బిడ్డలన్ మగల భార్యలఁ దల్లులఁ దండ్రులన్ మనో
జాంధతఁ జేసి డించి శరణందిన మమ్ము వియోగదుర్దశా
సింధువులోనఁ ద్రోచి యిటు చేరకపోవుట పాడిగాదు పు
ష్పంధయ మీయధీశునకుఁ బాదములంబడి యొత్తి చెప్పవే.

సీ. కాంచనరత్న సంఘటితసౌధంబులే,
మాకుటీరంబులు మాధవునకు
వివిధనరేంద్ర సేవిత రాజధానియే,
మాపల్లె యదువంశ మండనునకు
సురభి పాదపలతా శోభితారామమే,
మాయరణ్యము సింహ మధ్యమునకుఁ
గమనీయలక్షణ గజతురంగంబులే,
మాధేనువులు కంస మర్దనునకు.

యః। దృష్టదోష పరిగ్రస్తా భస్మనైవాభిమంత్రితాః। సుఖం ప్రయాన్తి సులభం పశ్యతాస్మింస్తు విష్టపే। నమ్రుతాంగారసిందూరైర్మంత్రితే దృష్టిదోషతః। విముచ్యన్తే జనాలోకే పశ్యతాత్ర బుధాస్త్వయం॥ అథ శ్రౌతే ధవాస్మార్తే కౌతుకే బంధనేపిచ। అఖిలైర్గృహ్యకారైశ్చ త్ర్యంబకేనాభిమార్జనం। విహితం కర్మకుర్వన్తి భస్మనైవ సితేనహి। తథాపి భస్మనిందన్తి శాపదగ్ధాజనాభువి అతస్తద్దూషకా వేద దూషకా బుద్ధవంశజాః॥ పరిజ్ఞేయాః కర్మభిశ్చ పరిభ్రష్టా మహైనసః। గౌతమాద్యైశ్చ మునిభిశ్శప్తాశ్శంభౌచ భస్మని। రుద్రాక్షేచ పరం తేషాం బుద్ధిర్నోదేతి పాపినాం॥ అస్పృశ్యాశ్చాంభసైర్దుష్టాః పాపినస్తప్తముద్రితాః। అభాషణీయాః పాపిష్ఠా దర్శనీయా నతేజనాః॥ దేశే శైవైః పునర్యత్ర నరాదుష్టాశ్చపాపినః। తద్దోషవినివృత్త్యర్థం జపేత్పంచాక్షరం మనుం॥ సూర్యదర్శన మాత్రంతు కుర్వీత శివదీక్షితః॥ ఇత్యాదివచనైరస్యైర్నిషేధేనాపినైతథా। భస్మశ్రద్ధా పుణ్యవశాజ్జాయతే పుణ్యకర్మిణామితి ప్రతిపాదిత మిత్యలం॥ ఇతి త్రిపుండ్ర విధిః॥

---

చూచగనే భయపడి పరుగిడుచున్నవి. పిశాచములు భయంకరములగు భేతాళకూశ్మాండాదిగ్రహములన్నియు భస్మముతో మంత్రింపగనే సులభముగా దొలగుచున్నవి. ఇట్లే దృష్టిదోషంబును విభూతి చేతనే తొలగుచున్నది గాని మృత్తికాదులచే పోవుట లేదు.

మఱియు గృహ్యసూత్రకారులందరును శ్రౌతస్మార్తాది సర్వకర్మములయందును భస్మధారణమును విధించియున్నారు. అయినను శాపదగ్ధులగు జనులు భస్మధారణమును నిందింతురు. కాబట్టి భస్మనిందకులగువారు వేదనిందకులగు బుద్ధవంశజులనుగాను కర్మభ్రష్టులనుగాను దలంపవలయు. కొందరు బ్రాహ్మణులు గౌతమాదిమహర్షులచే శపింపబడినవారు గాన వారికి శివునియందును భస్మరుద్రాక్షలయందును బుద్ధికలుగనేరదు. తప్తముద్రాంకితులై భస్మనిందకులగు వ్యక్తిని సంభాషింపను చూడనుగూడదు. అట్టివారిని శివభక్తులు చూచునెడ నాదోషము తొలంగుటకై పంచాక్షరమంత్రమును జపించి సూర్యదర్శనము చేయవలయునను నీ మొదలగు పురాణవచనములనుబట్టి పుణ్యాత్ములకు పూర్వపుణ్యవశంబున భస్మధారణమునెడ శ్రద్ధకలుగుచున్నదని నిర్ణయింపబడియున్నది.

త్రిపుండ్రవిధి ముగిసెను.

నీవు మా పుణ్యవశంబున నరుదెంచితివి. మానోములు ఫలించినవి. సకల ద్వంద్వక్షయంకరుఁ డగు శ్రీకృష్ణుపార్శ్వమునకు మమ్ముం దోడ్కొనిపొమ్ము. తద్దర్శనమున శీతోష్ణాదిద్వంద్వములు పాటిపోవును. ఆమహాత్ముని వక్షస్సీమ శ్రీదేవియున్నది. అనఁగాఁ బ్రకృతింగూడిన యీ సగుణబ్రహ్మమును జూడఁగోరుదుము. ఎవ్వని హృదయపీఠమున స్త్రీదేవికలదో యాతఁడనఁగా సగుణబ్రహ్మమని తాత్పర్యము. నిర్గుణుని చెంతకుం గొనిపోవుట దుర్లభము. కావున నుపాసకుఁడు సగుణబ్రహ్మము నాశ్రయింపవలయు. నిర్గుణబ్రహ్మము చెంత కనఁగా నాతత్త్వము సర్వవ్యాపకము కాన నుపాస్యము తొలుదొలుత కానేరదు. సోఽహం భావమే యతనివిషయమున నుపాసనాఖ్యగాఁ జెప్పఁబడును. అని సారము.

ఇందు భగవంతుఁడు సకల ద్వంద్వదుఃఖవినాశకుఁ డని చెప్పిన గోపిక పూర్వశ్లోకమున శ్రీకృష్ణుని నఖక్షతములను గోరినదని చెప్పనగునా? సరసమతులు నవ్వకుందురా? కాఁబట్టి గోపిక భక్తిరసప్రపూర్ణహృదయయనియు భగవద్దర్శనాతురయనియు మనమెఱుంగుట సాధుమార్గము నాశ్రయించుట. అట్టుకాట సాధ్వర్థమును గ్రహింపుఁడు. తరువాతివార్త నాలకింపుఁడు.

మూ. అపిబతమధుపుర్యా మార్యపుత్రోఽధునాస్తే
స్మరతి స పితృగేహాన్ సౌమ్యబంధూంశ్చ గోపాన్,
క్వచిదపినకథానః కిం కరీణాం గృణీతే
భజమగరు సుగంధిం మూర్ధ్న్యధాస్యత్కదాను.

పుణ్యాత్మ గలమధుకరమా! ఆయార్యపుత్త్రుఁడు మథురా

కాః॥ స్థావర త్వమను ప్రాప్య ర్భక్తాను గ్రహ కారణాత్ ॥౩॥ భక్త్యారా
త్రౌ దివాపాపం దివారాత్రౌచ భావనాత్ । లక్షంతు దర్శనాత్పు
ణ్యాం కోటిస్తత్స్పర్శ నాద్భవేత్ ॥౪॥ తస్యకోటి శతంపుణ్యం లభతే
ధారణాన్నరః। లక్షకోటి సహస్రాణి లక్షకోటి శతానిచ ॥౫॥ తజ్జపా
ల్లభతే పుణ్యం నరో రుద్రాక్ష ధారణాత్। రుద్రాక్షాణాంతు భద్రా
క్ష ధారణే స్యాన్మహా ఫలం ॥౬॥ ధాత్రీఫల ప్రమాణంతు శ్రేష్ఠమేత
దుదాహృతం । బదరీఫల మాత్రంతు మధ్యమం ప్రోచ్యతే బుధైః ॥౭॥
అధమంచణమాత్రంస్యాత్ ప్రక్రియైషా మయోచ్యతే। బ్రాహ్మణాః క్ష
త్రియావైశ్యా శ్శూద్రాశ్చేతి శివాజ్ఞయా॥౮॥వృక్షా జాతాః పృథివ్యాం
తు తజ్జాతీయా శ్శుభాక్షకాః। శ్వేతాస్తు బ్రాహ్మణాజ్ఞేయాః క్షత్రి
యారక్తవర్ణకాః ॥౯॥ పీతావైశ్యాస్తు విజ్ఞేయాః కృష్ణాశ్శూద్రా ఉదా
హృతాః। బ్రాహ్మణో బిభృయాచ్ఛ్వేతాన్ రక్తాన్ రాజాతు ధారయే
త్ ॥౧౦॥ పీతాన్ వైశ్యస్తు బిభృయాత్ కృష్ణాన్ శూద్రస్తు ధారయే
త్। సమాస్నిగ్ధా దృఢాః స్థూలాః కంటకైస్సం యుతాశ్శుభాః॥౧౧॥
క్రిమిదష్టం ఛిన్నభిన్నం కంటకైర్హీన మేవచ। వ్రణయుక్త మవృత్తంచ
షడ్రుద్రాక్షాన్ వివర్జయేత్ ॥౧౨॥ స్వయమేవ కృతద్వారం రుద్రాక్షం

---

సిన పాపము నశించును. రుద్రాక్షమును దర్శింప లక్షగోదానఫల లభించును. రుద్రాక్షమును స్పృశింప కోటిగోదానఫలము గలుగును. రుద్రాక్షమును ధరింప శతకోటిగోదానఫలము లభించును. రుద్రాక్షములతో జపముచేయనపరిమితగోదానఫలములభించును. రుద్రాక్షమునుధరింప మహాఫలంబు గలుగును.

ఉసిరిక పండంతో తుల్యమగు ప్రమాణముగల రుద్రాక్షము శ్రేష్ఠమైనది. రేగు బండంత రుద్రాక్షము మధ్యమమైనది. శనగగింజంత రుద్రాక్షము అధమమైనది.

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రసంజ్ఞల చే రుద్రాక్ష వృక్షముల నాలుగుజాతులు గలిగియున్నవి వానిలో తెల్లనివి బ్రాహ్మణ జాతియనియు, ఎఱ్ఱనివి క్షత్రియజాతియనియు, పచ్చనివి వైశ్యజాతియనియు, నల్లనివి శూద్రజాతియనియు గ్రహింపవలయు. బ్రాహ్మణుడు తెల్లనివానిని క్షత్రియుండు ఎఱ్ఱని వానిని, వైశ్యుండు పచ్చనివానిని, శూద్రుడు నల్లని వానిని ధరింపవలయు. ఎఱ్ఱనివి,నును పైనవి,గట్టిలేనివి, లావుగలవి ముండ్లుగలవి యగు రుద్రాక్షములు శ్రేష్ఠములు. పురుగు కొరికిన పగిలి పోయినవి,పంట్లులేనిది

నిర్మోహాత్మా బలమిట్టిదే కాఁబోలు! అనునంతలో ద్వారపాలిక లరుదెంచి యిట్లు పలికిరి. చకోరములయందుఁ జంద్రుఁడు, కమలములయందు భాస్కరుఁడు, తుమ్మెదలయందుఁ గమలము, చాతకపక్షులయందు మేఘము నెట్టిప్రీతి యునుపఁజాలెనో అట్టిప్రీతిని మాయందు శ్రీహరి యునుపఁడాయెఁ గదా. అను నంతలో శృంగారప్రకారలను గోపికలు వచ్చి యాయుద్ధవుని గాంచి మహాత్మా! చంద్రచకోరములకుఁ గల్గినప్రీతి విధాతృ లిఖితము. అట్లే శ్రీకృష్ణునకు మాపైఁ బ్రీతి నునుచునట్లు లిఖిం పక పోయెను. అని యుల్లసమాడునంతలో శయ్యోపకారిక లనుగోపికలు వచ్చి యచ్చెరువందుచు నార్యా! వ్యాధుఁడు కూడ మృగములవధించి మరల స్మరించును. కటాక్షపాతముల మమ్మునలయించి శ్రీకృష్ణుఁడు మరలఁ దలంపక పరదేశమునం దున్నవాఁడు కదా! ఎంతటియన్యాయము! అనుచుండునంతఁ ద్వరపడుచుఁ బార్శ్వదాహ్వాయముల నలరుగోపికలు వచ్చి మహా నుభావా! మాకు శ్రీహరి నెడఁబాయుటవలన దుఃఖము సంభ వించినది. ఆశ్రీహరి దీని నెఱుంగఁడు కాఁబోలు. కంటకవిద్ధాం గుని గాంచి విద్వాంసుఁడు తా నవిద్ధకంటకుఁడు గాన వాని బాధ నెఱుంగఁజాలఁడు కదా. అనిరి. బృందావనపాలికలు వచ్చి ప్రేమసౌఖ్య మనిమిత్తము. అట్టిదాని నెఱుంగకుండుట స్వభావ మనవచ్చును. మాకుఁ దనయందుఁ గలప్రీతి ననిమిత్తము. దీని నెఱుంగకుండుటయే యాశ్చర్యము. రసము కర్మేంద్రియము నెఱుఁగదుకదా, యనిరి. అంత గోవర్ధనవసతు లగుగోపిక లోపి కలుమాని యిట్లనిరి. ఆర్యా! పురంధ్రులపైఁ బ్రీతినునుచు మా శ్రీకృష్ణుఁడిపుడు సైరంధ్రీనాయకుఁ డయ్యెను. శైలముల నివ

మన్త్రేణ శిరసా ధారయేత్ సుధీః ॥ ౨౨ ॥ పంచాశదక్ష సహితాం వ్యోమవ్యాపీతి నోదరే । పంచ బ్రహ్మభిరంగైశ్చ త్రిమాలా పంచ సప్త చ ॥ ౨౩ ॥ అథవా మూల మన్త్రేణ సర్వాణ్యక్షాణి ధారయేత్. అథ హైనం కాలాగ్నిరుద్రం భుశుండః పునః పప్రచ్ఛ । రుద్రాక్షాణాం ముఖభేదేన యదక్షం యత్స్వరూపం యత్ఫలమితి తత్స్వరూప ముఖయుక్త మరిష్ట నిరసన మభీష్టఫల ప్రదం బ్రూహీతి సహోవాచ కాలాగ్నిరుద్రః । యచ్ఛ్రుత్వా సద్యోముక్తిశ్శీఘ్రం శివానుగ్రహ ప్రదస్తద్వదామి సావధాన మనాశ్శృణ్వితి హోవాచ ॥ ఏక వక్త్రంతు రుద్రాక్షం పరతత్వ స్వరూపకం । తద్ధారణాత్పరే తత్వే లీయతే విజితేంద్రియః ॥ ౨౪ ॥ ద్వివక్త్రం చైవ రుద్రాక్ష మర్ధనారీశ్వరాత్మకం । ధారణాదర్ధనారీశః ప్రీయతే తస్య నిత్యశః ॥ ౨౫ ॥ త్రివక్త్ర మనల స్సాక్షాత్ స్త్రీహత్యాం దహతి క్షణాత్ త్రిముఖం చైవ రుద్రాక్ష మగ్నిత్రయముదాహృతం ॥ ౨౬ ॥ తద్ధారణేన హుతభుక్తస్య తుష్యతి కామదః । చతుర్ముఖంతు రుద్రాక్షం బ్రహ్మరూప ముదాహృతం ॥ ౨౭ ॥ పంచవక్త్రం

---

ములు ధరించుట ఉత్తమము॥ శిరమునందు ఈశాన మంత్రముచేతను కంఠమునందు తత్పురుష మంత్రముచేతను, హృదయమునందు అఘోర మంత్రముచే చేతులయందు ఈశాన మంత్రముచేతను, ఉదరమునందు వ్యోమవ్యాపి మంత్రముచేతను, పంచబ్రహ్మమంత్రములు, షడంగ మంత్రములు ననువానిచే త్రిసరాదులను ఇట్లు రుద్రాక్షమాల ధరింపవలయు॥ అట్లుగాకున్న మూలమంత్రముచేతనె రుద్రాక్షములను సర్వావయవములయందు ధరింపవలయు॥ మఱియు భుశుండుడు కాలాగ్ని రుద్రునిగాంచి ముఖభేదమునుబట్టి రుద్రాక్ష మేరూపమైనదో ఏమిఫలము నిచ్చునో దెలుపుమని యడుగగా కాలాగ్ని రుద్రుండిట్లనియె॥ ఏద్దాని గనగనె సద్యోముక్తియు॥ శివానుగ్రహంబును గలుగునో దానిం జెప్పెదవినుము॥

ఏకముఖముగల రుద్రాక్షము పరతత్వ స్వరూపమైనది అద్దానిం ధరింపంగా పరతత్వంబునలయించువాఁడగును॥ రెండు ముఖములుగల రుద్రాక్షము అర్ధనారీశ్వరరూపమైనది॥ దీని ధరింపగా నర్ధనారీశ్వరుండు సుప్రీతుండగును॥

మూఁడుముఖములుగల రుద్రాక్షము అగ్నిదేవతాకమైనది॥ దీనిం ధరింప క్షణమాత్రమున స్త్రీహత్యాది దోషముల దహింపఁజేయును॥ మఱియు నిది త్రేతాగ్ని స్వరూ

అంత రమాయూథిక యనుగోపాంగన యరుదెంచి యహా! మున్ను కుబ్జ నీచకుల జనితయని పేరుపొందెను. వక్రవిగ్రహయు నయ్యెను. ఇపు డామెయే సత్కులప్రసూతయైనది. కురూపిణియయ్యు సురూపిణి యైనది. నాల్గుదినములలో సకలలోక జేగీయమానకీర్తిగల దయ్యెను. ఎంతటిపుణ్యము! ఎంతటియదృష్టము! అనియె. అనునంత మధుమాధవ్య లనుగోపిక లేతెంచి యిట్లు భాషించిరి. ఓ యుద్ధవా! ఇది మాధవునిదోషము కాదు. మధురానగరమునఁ గాపురమున్న కుబ్జ యనునాతి మా శ్రీకృష్ణుని బ్రాణపతినిగాఁ బరిగ్రహించి సంతోషించుచు యోగివరులకే నగపడని శ్రీహరితో యోగమును బొందెను. కావున నామెవలన మాకెల్ల నీయలజడి గలిగినది. అనుచుండ లలితాయూథిక యనుగోపిక వచ్చి యయోధ్యానగరమున మున్ను శ్రీరామచంద్రుని యావరాజ్యాభిషేకమునకు విఘ్నమాచరించి కైక ప్రఖ్యాతినొందెను. ఆకైకయే మధురానగరమున నిపుడు కుబ్జగా నవతరించినది. ఇఁక నేమేమియుపకారములు లోకమునకుఁ జేయనున్నదో యెవ్వ రెఱుంగుదురు? అనుచుండ విశాఖాయూథ యనుగోపిక వనములకు గోవులను దోలుకొని గోపాలబాలకులం గూడిపోవుచు నందఱమేలు కొలుపుచు మత్తమాతంగమందగమనంబున నొప్పు నందనందను ముకుందుని మఱువక స్మరింతును అనియెను. మాయాయూథిక లనుగోపిక లచ్చటికి వచ్చి యహా! సంకోచవీథులయందుఁ జేలాంచలమును బట్టుకొని బలవంతముగా రెండుచేతులు హృదయమున నొత్తుకొనుచుఁ బరస్పరాకర్షణజనితహర్షమునఁ దేలు శ్రీహరినెపు డిచ్చటికిఁ జేర్పఁగలమో యెఱుంగఁజాలకు

తుర్దశ ముఖాం చాక్షం రుద్రనేత్ర సముద్భవం ॥౩౭॥ సర్వవ్యాధిహరం చైవ సదారోగ్య మవాప్నుయాత్ । మద్యం మాంసం చలశునం పలాండుం శిగ్రుమేవచ ॥౩౮॥ శ్లేష్మాతకం విడ్వరాహాను భక్ష్యేన్వర్జయేన్నరః। గ్రహణే విషువేచైవ గ్రహాసం క్రమణేపిచ ॥౩౯॥ దర్శేచ పూర్ణమాసేచ పుణ్యేషు దివసేషుచ। రుద్రాక్ష ధారణాత్సద్యస్సర్వైః పాపైః ప్రముచ్యతే ॥౪౦॥ తన్ముఖం రుద్రఇత్యాహుస్తద్బిందు స్సర్వదేవతాః యఇమాము పనిషదం బాలోవాయు వావాప్యద్ధో వాధీయమాన స్స శివోభవతి॥ సగురుస్సర్వే షాం మంత్రాణా ముప దేష్టాభవతి। ఏతైరేవ హోమం కుర్యాదేతైరే వార్చనం తథా॥ తద్రక్షోఘ్నం మృత్యుతారకం గురుణాలబ్ధం కంఠేబాహౌ శిఖాయాం వాబధ్నీత॥ సప్తద్వీపవతీ భూమిర్దక్షిణార్థం నకల్పయేత్॥ తస్మాచ్ఛ్రద్ధయాయాం కాంచిద్దద్యాత్సా దక్షిణాభవతి॥ యఇమాము పనిషదం బ్రాహ్మణో వాతః ప్రాతరధీయానో దివసకృతం పాపం నాశయతి ప్రాతరధీయానో మాసకృతం పాపం నాశయతి । మధ్యాహ్నే ధీయమానష్షణ్మాసకృతంపాపంనాశయతి। సాయమధీయానో వత్సరకృతం పాపం నాశ

---

ఇద్దానిం ధరింపగా సర్వవ్యాధులును నశించుటంతేకి యెల్లపుడు నారోగ్యవంతుండగును మద్యము-మాంసము లశునముపలాండువు మొదలుగా నిషిద్ధవస్తువులభుజింపఁగూడదు. గ్రహణము విషువము సంక్రమణము- అమావాస్య పూర్ణిమ మొదలగు పుణ్యదివములయందు విశేషించి రుద్రాక్షముల ధరింపగా సర్వపాపములు తొలంగును. రుద్రాక్షముయొక్క ముఖము రుద్రుండనియు బిందువు సర్వదేవతలనియు జెప్పుదురు. బాలుడుగాని, యౌవనుడుగాని వృద్ధుడుగాని యీయుపనిషత్తును పఠించువాఁడు శివుండగును. అట్టివాఁడు సకలమంత్రములకు నుపదేశకుండగును జపమునుగాని, హోమముగాని యీ రుద్రాక్షులతోడనె లెక్కించుచు చేయవలయు. రాక్షసుల హరించినదియు గురువుచే నొసగబడునదియునగు మృత్యుతారకమును కంఠమునందుకాని బాహువునందుగాని శిఖయందుగాని బంధింపవలయు. దీనికి సప్తద్వీపములతోఁగూడినభూమినిగుర్వుదక్షిణగానొసగినను చాలదు. ఇచ్చట మృత్యుతారకమనగా ప్రకరణమును బట్టి రుద్రాక్షమని స్ఫురించును. కాని ప్రమాణాంతరములను బట్టి లింగమనియె గ్రహింపవలయు. ఈ యంశము లింగ

స్వర్గాదిలోకజాలముల నిర్మించుచుండునో అట్టిపరిపూర్ణుని బరాత్పరతముని శ్రీకృష్ణపరబ్రహ్మమును నమస్కరించి ప్రార్థింతుమని మ్రొక్కిరి. యజ్ఞసీతాఖ్య గోపిక లాతరుణముననే యచ్చటికి వచ్చి యీ శ్రీకృష్ణుఁడు నికుంజలతికాకుసుమాకరుఁడు. శ్రీరాధికాహృదయ కంఠవిభూషణుఁడు. రాసమండలపతి. వ్రజమండలేశ్వరుఁడు. బ్రహ్మాండమండల పరిపాలకుఁడు. అట్టివానిం బ్రార్థింతుమని కేలుమోడ్చిరి. రమావైకుంఠవాసిను లనఁబడు గోపికలు మహానందమున నోలలాడుచునే గోపాలబాలకుఁడు గోపికాసకలయూథమును స్వగుణములచే నలంకరించెనో తన పాదపంకజరజస్సున బృందావనము నలంకరించెనో గోవర్ధనాద్రి నెవఁడు సంకటించెనో సర్వలోకముల సౌభాగ్యము కొఱకు నెవఁడు భూలోకమున నవతరించెనో శేషభుజుండగు నా లీలామానుష విగ్రహుని భజింతుమని పులకాంచితతను లతికలై పలికిరి. శ్వేతద్వీపసఖిజను లిట్లు వాక్రుచ్చిరి. గజశిశువు శిలీంధ్రము నవలీలఁ దొండమున నెత్తునట్లు తనహస్తకమలమున గోవర్ధమును ధరించెను. అట్టి వ్రజరాజనందనుఁడు కృపాకరుండయ్యును మన్ము మఱచిపోయెనా యనిరి. ఊర్ధ్వవైకుంఠవాసిను లగుగోపిక లిట్లు వక్కాణించిరి. శ్యామవర్ణమయ మగునేత్రమున జగత్తును శ్యామముగాఁ జూచుచున్న మనకు రెండవపదార్థమే కనఁబడకున్నది కదా. మన కిఁక యోగాభ్యాస మెందులకో తెలియఁ జాలకున్న వారము. అనుచుండునంత నజితపదాశ్రితలగు గోపాంగనలాదరంబున స్నేహపాశము దృఢమైనవి. ఛేదింప శక్యము కాదు. దానినిం ద్రెంప హరికి శక్యమగును. అట్టి స్నేహపాశము నవలీలం ద్రెంచి మధురానగరమున

తస్సహస్రం శరదాం ప్రపన్నః । అచింతయత్తం ప్రతిహంతు కామ శ్శ
త్రుం దురాపం సకలామరాణామ్ ॥ స్ఫురత్ స్ఫులింగం తపనప్రకాశం
సర్వాశుభఘ్నం జగదావనాయ । ఉన్మీల్య నేత్రాణి శరత్సహస్ర మ
ఘోర మస్త్రంచ నిరైక్షత స్వంతదాకులం తస్య బభూవచాక్ష్ణోంత్ర
యంత్రతో ఽశ్రూణ్యపతంశ్చ తేభ్యః । రుద్రాక్షవృక్షా విటపైర్బభూవు
శ్శివాజ్ఞయా సర్వజగద్ధితాయ ॥ రుద్రాక్షవృక్షా స్సవితాక్షిజాతా స్తే
ద్వాదశస్యుః కపిలాప్రభేదైః । చంద్రాక్షిజాష్షోడశ శుభ్రవర్ణాః కృష్ణాద
శస్యు ర్జ్వలనాక్షిజాతాః ॥ బ్రాహ్మం సితం కాపిలవర్ణయుక్తం క్షాత్రం
తు వైశ్యం హ్యుభయాత్మకంతత్ । కృష్ణంతుశూద్రం కథయన్తి బీజం
రుద్రాక్షబీజాత్ప్రభవన్తి జాత్యాః ॥ ఏకాననం శంకర ఏవసాక్షా ద్రు
ద్రాక్షబీజం వినిహన్తి హత్యాం । ద్వివక్త్రబీజం బహుగోవధఘ్నం దే
వేశదైవత్యమలభ్యముక్తం ॥ ఆగ్నేయముక్తం వదనత్రయం యద్యోషి
ద్వధఘ్నం దదతాంతుతేన । చతుర్ముఖం యచ్చతురాననీయం నరస్య
హత్యాంక్షణాద్విహన్తి ॥ కాలాగ్నిరౌద్రం సముఖంచవక్త్రమభక్ష్యదు

అంత దేవతలు వేయిదివ్యవత్సరంబులు పరమేశ్వరుని ప్రార్థించిరి. తరువాత పరమేశ్వ
రుండు దేవతలకు ప్రసన్నుండై త్రిపురాసుర వధింపనెంచి కన్నులు దెరచి దేవతల కల
క్ష్యంబగు సఘోరాస్త్రమును వేయిదివ్యవత్సరములు నిరీక్షించెను. అప్పుడా దేవు కన్నుల
నుండి నీరుకారెను. శివునాజ్ఞచే లోకహితముకొరకై యా నీటివలన రుద్రాక్ష వృక్షములు
జనించెను. అందు సూర్యుడను నేత్రమువలన కపిలవర్ణము గలవి పండ్రెండు భేదములు
గలవియు, చంద్రనేత్రమువల్లనుండి తెల్లనివి పదునారు భేదములు గలవియు, అగ్నినేత్ర
మునుండి నల్లనివి పదిభేదములు గలవియునగు రుద్రాక్షవృక్షములు జనించెను. అందు తెల్ల
నివి బ్రాహ్మణజాతియు, కపిలవర్ణమైనది. క్షత్రియజాతియు, మిశ్రవర్ణమైనది. వైశ్య
జాతియు, నల్లనిది శూద్రజాతియునగును. ఒక్కముఖముగల రుద్రాక్షము కేవలము శంక
రుడేయగు. అయ్యది బ్రహ్మహత్యాదోషము నప్పుడె తొలగించును. రెండుముఖములుగల
ది గౌరీశంకరాత్మకమైనదియు ననేక గోహత్యాదోషముల నశింపజేయునది యగును.
మూడుముఖములు గలది అగ్ని దేవతాకమైనదియు, బ్రహత్యాదోషముల వదలించునదియున
గు. నాలుగుముఖములుగల రుద్రాక్షము చతుర్ముఖ బ్రహ్మ దేవతాకమైనదియు నరహ
త్యాదోషమును క్షణమాత్రమున నశింపజేయునదియు నగును. ఐదుముఖములుగల రుద్రా

విరూపిణినిగాఁ జేయించెను. అట్టి కఠినాత్మునకు మనపైఁ గరుణ యుండునే? యనిరి. సుతలవాసిను లగుగోపిక లత్యంతవ్యథాతురలై మహాదాతయై తనకుఁగోరిన భూమినొసంగిన బలిచక్రవర్తిని గార్పణ్యమూని బంధించెను. వామనరూపధారియై యలరు నా మాయావటువునకు సేవచేయుటెట్లో కో తెలియకున్నది. జాలంధరిగోపిక లాతురలై పూర్వము హిరణ్యకశిపుఁ డెన్నియోకష్టములఁ బెట్టుచుండఁగా దాళఁజాలక ప్రహ్లాదుఁ డెన్నియోసారులు మొఱ్ఱపెట్టగా నృసింహరూపమున వానికి సాయ మొనరించెను. ఈకృష్ణునికృప యెంతనిష్ఠురమైనదో తెలియఁబడదుకదా యనిరి. భూమి గోపిక లిట్లుల్లసమాడిరి. * నిర్మోహిజనులచరిత్ర మత్యంతవిచిత్రము. దానినివర్ణించుట న్యాయమైన పనిగాదు. వారు నోట నొకవిధముగా మాటలాడుదురు. హృదయమున వేఱొకవిధముగా నాలోచింతురు. కావున వారి చరిత్రమును భగవంతుఁడే యెఱుఁగఁడన నిఁక మనుష్యు లెఱుఁగుదురా యనిరి. వారివాక్యములను వినుచు నుద్ధవుఁ డాశ్చర్యావిష్టమానసుఁడై యుండెను.

ఆర్యమహాశయులారా! గోపిక లుద్ధవుని రాకెఱింగి వచ్చి యతఁడు వినుచుండ సంభాషించుకొనిన మాటలుగల యీ కథను బఠించితిరి. ఇందేమేని విశేషము కలదాయని విమర్శింతము. విశేషార్థము లిందేమియు లేవనితోఁచును గాని యించుక యవకాశమిచ్చి మనసు నేకాగ్రముచేసి యూ

---

* అహోతినిర్మోహి జనస్యచిత్రం పరంచరిత్రం గదితుం న యోగ్యం, ముఖేన చాన్యద్ధృతిభావ్యమన్య ద్దేవో నజానాతి కుతో మనుష్యాః-అని మూలము. ఇది యుందాహరణముగాఁ జెప్పఁదగినదని వ్రాయఁబడినది.

ధరా మాలా। కంఠే ధృతా యేన ధృతాక్షమాలా। జప్త్వాప్నుయా ద్యజ్ఞ
సహస్రపుణ్యం। రుద్రాక్షాష్టశతేన యేనకలితా మాలా సదా ధార్య
తే। కంఠే తేన లభేత్ క్షణాత్ క్షణమహాపుణ్యం మహేజ్యాధికం।
వింశత్యుద్రామృతకః కరోతి యదభూ ద్రుద్రాక్ష ధారావహః కైలాసే
శతకల్పమీశ సదృశో హాహానవద్యోగణః। శ్వేతం రక్తమథాపి పీత మసి
తం విప్రాదికానాం స్మృతం రుద్రాక్షస్య లభేద్యథా తథమిదం ధార్యం శి
ఖాయాం కరే। కంఠే కర్ణయుగోపవీత హృదయే ష్వాబధ్య యాన్యాదిభిః
పంచార్ణ ప్రణవాస్త్రకాఖ్య మనుభి ర్మంత్రైరవద్యైర్వరైః। స్నానేవా
ప్యథ హోమయో ర్వ్రతవిధౌ దేవార్చనా దానయో ర్దీక్షా శ్రాద్ధకయో
ర్క్రతౌ సభసితో రుద్రాక్షమాలాధరః। కుర్యాత్కర్మచ వైదికంచ సక
లం స్యాదక్షయం తత్ఫలం నోచేద్వ్యర్థమిదం భవత్యయమహో పా
పో నవద్య ధ్రువం॥ కేచిజ్జాతక శాపరోజ్జ్వలమలోత్సర్గేచ సంగే స్త్రి
యా స్పృష్ట్వాం వతుసి మాలికాం నదధతే స్యాయుః క్షయస్స్యాదితి।
పూజ్యం రోజ్యముఖాముఖేన సదృశో ముక్తాప్రవాళాసితైః సావర్ణ

ఒక్క రుద్రాక్షమును శిఖయందును, ముప్పదియారు రుద్రాక్షములను శిరమునం
దును, ముప్పదిరెండు రుద్రాక్షములను మెడయందును ధరించునేని వేయియజ్ఞముల ఫల
ములభించును. ఎనిమిదినూర్ల రుద్రాక్షలుంగల మాలికను మెడయందు ధరించువాని పుణ్య
ము వచింపవలవిగాదు. వింశతిపర్వతంబుల రుద్రాక్షముల బరువు మోయు గాదరత్వంబు
న కైలాసంబున ప్రమథగణంబై యుండును. తెలుపు, ఎరుపు పసుపువన్నెగల రుద్రాక్ష
ములను బ్రాహ్మణులు మొదలగు నాలుగుజాతులవారును క్రమముగా ధరింపవలయును.
శిఖయందును, కరమునందును, కంఠమునందును, కర్ణయుగమునందును. ఉపవీతస్థానమునం
దును, హృదయమునందును రుద్రాక్షములను వెండి, బంగారు రత్నములు మొదలగువాని
తోంచేర్చి, పంచాక్షరి ప్రణవము మొదలగు మంత్రములతో ధరించువాడు ముక్తినొం
దును. మరియు, స్నానము, జపము, హోమము వ్రతము, దేవతార్చనము దానము, దీక్ష,
శ్రాద్ధము యజ్ఞము మొదలగు కర్మములయందు భస్మరుద్రాక్షములను ధరింపవలయును. వా
టిని ధరించువాని కక్షయఫలము చేకూరును. ధరింపకున్నయెడ వాని కర్మము వ్యర్థ
మగుటయుగాక వాడు పాపఫలంబు నొందును. కొందఱు జాతాశౌచములు మలమూ
త్రోత్సర్గములు, స్త్రీసంగమము, మొదలగు సమయములయందు .. పవిత్రము

ప్రయత్నింపనేల? అట్టిప్రయత్నమును మానుకొనుఁడని మిమ్మభ్యర్థించుచున్నాఁడను. గోపికలు భగవత్సేవార్థ మెల్లలోకములనుండి యవతరించి రనువిశ్వాసము మీకు నుండుఁగాక. భక్తులచరిత్రముల నపవిత్రముగాఁ జేయఁ బ్రయత్నింపరనియు భావించెదను. శ్రీకృష్ణభక్తి చతుర్విధపురుషార్థప్రదమైనది. దాని నేల మలినముగాఁజేయ సాహసించెదరు? కొందఱు సాహసించినను ఫలముగల్గునను దురూహ నాకు లేదు. ఎందఱో దానినివదలక తరించువా రుందురు. కావున నట్టి దుష్ప్రయత్నమును జేయక భగవత్సేవార్థము మహర్షులుగూడ గోపికారూపమున నవతరించిరని నమ్మి వారివలె శ్రీకృష్ణపరబ్రహ్మమును సేవింపుఁడు. కృతకృత్యుల రగుదురు. ఇదియ యీకథనుండి తెలిసికొనఁ దగువిషయము. ఇంక దీనినుండివిరమించి భాగవత కథా శేషభాగమును వ్రాసెదను.

* ఇట్లు గోపికలు భాషించుకొనుచుండ నుద్ధవుఁ డాలించి వారిభావముల నెఱింగి సంతోషాంబుధి నోలలాడెను. వారికి శ్రీకృష్ణసందేశమును దెల్పి యూఱడింపఁ దలంచెను తడవుసేయుట పాడిగాదని యూహించెను. అట్లూహించి ప్రియభాషణముల

---

* ఇవి శ్రీభాగవతమునుండి లోపలికథ కనుబంధముగా వ్రాయఁబడును. కాని యీ కథనుమాత్రమే యితరపురాణములనుండి విశేషించి ముందు వ్రాసెదను. భాగవతకథనుండి, యుద్ధవునిసంభాషణము ముగిసిన ట్లగపడినను ముగిసినదని భావింపక యితరపురాణస్థ కథలనుగూడఁ బఠింపవలయు నని తలంపవలయును. రాధాప్రస్తావము మరల నిందుఁగలదు. అది యత్యద్భుతమైనది. ఆమె సాక్షాత్పరదేవియని యెఱుంగవచ్చును. కావున నిచట భాగవతమునఁ గలకథనుమాత్రమే వ్రాయఁ బ్రయత్నించితిని.

పద్మాక్ష తులసీకాష్ఠ రుద్రాక్ష కృతమాలయేతిరుద్రాక్షాణాంమాలా రామమంత్ర సాధనమిత్యపి గృహీతా। యద్యప్యత్రతులసీ కాష్ఠస్య న హానివేశః కృతః తథాపి తస్యాధార్యత్వాత్ రుద్రాక్ష సాహచర్యేణ ప్రశస్త రామమంత్ర సాధనత్వమనేన బోధ్యత ఇతిధ్యేయం। రుద్రాక్ష ధారణస్యాస్యత్ర విధానా దిహన కశ్చిద్విరోధః। అతఏవ సర్వజపాస్వ త్రి గణనవినియోజ్యాక్షమాలాపరిగణనైదం పర్యప్రవృత్తాయా మ క్షమాలికాయా ముపనిషది। ప్రవాళముక్తిక స్ఫటిక రజతాష్టాపద చందన పుత్రజీవికాబ్జ రుద్రాక్షా ఇతి నతులసీ కాష్ఠస్య పరిగణనం। తథా బృహజ్జాబాలే, రుద్రాక్షానధికృత్య సపమ ధర్మజ్యోతి రుద్రాక్ష ఇతి ఏవం చతుర్భి రుపపాదితమితి శ్రౌతతా రుద్రాక్షధారణస్య సిద్ధా।

ననువిశిష్టతాం ప్రశస్తతాం చేదంనిగమేషు యదీదంస్యాన్ని త్యాంగం స్యాదనివార్య మితిచేత్తదపి శ్రుతిషు నిరూపితం యథా। బృహజ్జాబాలోపనిషది। అష్టమబ్రాహ్మణే తృతీయఖండే। అథ ఖ

---

నందును నిట్లుకలదు. ఇందు (బిభృయాత్, అను లిజంతముచే రుద్రాక్షధారణము విధింపబడినది. మరియు రామరహస్యోపనిషత్తునందు. తామరపూసలు, తులసిపూసలు, రుద్రాక్షములు వీని వానితో రచింపఁబడిన జపమాలతో రామమంత్రము జపింపవలయుననుట చే రుద్రాక్షమాలిక రామమంత్రమునకును సాధనమని తెలియుచున్నది. ఇందు తులసిపూసలుచేరియున్నను వానిని ధరింపఁగూడదు గాన రుద్రాక్షములతోఁ జేరియున్నప్పుడే యవి రామమంత్రజపమునకైనను సాధనములగునని యెఱుంగునది. రుద్రాక్షధారణమున్నచో పలుచోట్ల విధింపఁబడియున్నది గాన బాధకములేదు.

ఆకారణముననే సర్వమంత్రముల జపించుటకు నుపయోగించు నక్షమాలికలను జెప్పుటకై యేర్పడినదగు అక్షమాలికోపనిషత్తునందు, పవడములు, ముత్యములు, స్ఫటికములు, వెండి పూసలు, బంగరుపూసలు, మంచిగంధపుపూసలు, పుత్రజీవికాబీజములు, తామర పూసలు రుద్రాక్షములును జపమాలికకు నుపయోగించుట కలదుగాని యిందు తులసిపూసలు చెప్పఁబడియుండలేదు. బృహజ్జాబాలమునందు. ధర్మజ్యోతిపేర రుద్రాక్షమునకు లదు. ఇటులబృహజ్జాబాలము, రుద్రాక్షజాబాలము రామరహస్యము అక్షమాలికోపనిషత్తునను నాలుగుపనిషత్తులయందు రుద్రాక్షప్రశంస కలదు గాన రుద్రాక్ష ధారణము వై

త్మునిపై నేకాంతభక్తి నునిచితిరి. ఇంతకంటె సత్యోత్తమకార్య మీలోకమునఁ గాదే లోకముననైనఁ గలదా. సత్యముగా లేదని నేను భావించుచున్నాఁడను. అందఱు నిట్లే భావింతురని నమ్మెదను. * విరహనిమిత్తమున మీకెల్ల నా పరాత్పరునిపైఁ గల్గిన ప్రేమము నిట్టిదని తెలుపుటకు శక్తి చాలదు. మీప్రేమ మిట్టిదని తెలుపుటయన నన్ననుగ్రహించుటయే యని భావించుచున్నవాఁడను. మఱియు సంభావించుచున్నవాఁడను. నేను [1] శ్రీకృష్ణమూర్తికి రహస్యకార్యమును దీర్చు పరిచరుఁడను. ఆమహాత్ముఁడు మీకుఁ జెప్పవలయునని నాకాజ్ఞాపించినమాటలు వినుఁడు. అవి సుఖావహములయి యుండును. చెప్పుటకు నాకును మహానందము. వినుటకు మీకునుగూడ నింపుగ నుండును. ఆకారణము వినుఁడు. ఈఘట్టమున నిన్నిశ్లోకముల యర్థముంగలిపి పోతనగారొక్కపద్యమును వ్రాసిరి.

మ. జపదాన వ్రతహోమ సంయమ తపస్స్వాధ్యాయముఖ్యం
బులన్, నిపుణుల్ కోరియు నేవిధున్ మనముల న్నిల్పంగ
లేరట్టి స, ద్విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై
మీకజ, స్రపటుధ్యానము లిట్లు నిల్చునె భవచ్చారిత్ర
ముల్ చిత్రముల్.

ఇది చాల సంగ్రహముగ నున్నది. ఏలాగో తెలియఁజాలకున్నాఁడను. పైఁగథ నాలకింపుఁడు.

---

* విరహేణ మహాభాగా మహాన్మేఽనుగ్రహః కృతః=అని మూలము.

[1] యమాదా యాఁగతోభద్రా హ్యహం భర్తూరహస్కరః = అని మూలము.

సంభవం రుద్రాక్షధారణస్యైవ న్యాయ్యత్వాత్ । అతఏవ విప్రాది
నాం క్రమాచ్ఛ్వేతరక్తపీతమథాసితం । తథాలాభే యథాలాభం ధా
రణీయమదూషితమితి శివపురాణవచనమపి సంగచ్ఛతే । యత్తు
త్రోక్తం బ్రాహ్మణో బిభృయాదిత్యాదివచనవిరుద్ధస్య తథాలాభే యథా
లాభమిత్యాదివచనస్యాప్రమాణ్యమితి తదపి శ్రుత్యంతరాపరిజ్ఞా
నమూలం బృహజ్జాబాలోపనిషది । అష్టమబ్రాహ్మణే తృతీయఖండే
రుద్రాక్షాశ్శ్వేతా వా అశ్వేతా వా నైవతత్ర సమ్మర్శ ఇతి । భస్మజాబా
లేపి । రుద్రాక్షాన్ శ్వేతానేవ బిభృయాన్నతత్ర సమ్మర్శ ఇత్యనేన చ
రుద్రాక్షేషు శ్వేతాశ్వేతవిమర్శనం వినా నిత్యతయా ధార్యత్వస్య ప్రతి
పాదనాత్ । కించ తామ్రాస్స్రగ్గా దృఢాస్థూలా ఇత్యాదినా తామ్రా
దీనామపి విధానాత్ । శ్వేతాదీనాం వృక్షపర్యాయత్వాచ్చ శ్వేతరు
ద్రాక్షాణామలభ్యత్వాత్తద్ధారణమనుపపన్నమితి వాదో దుష్ట ఇతి
స్పష్టం ।

నచేదం శిష్టజనానుష్ఠితమితి వాచ్యం సర్వజనానుష్ఠితత్వాత్తథాహి

చో. నల్లనిమృత్తికతోనైన శౌచవిధి తీర్చుకొనుట న్యాయమైయున్నది గాని తెల్లనిమృ
త్తిక దొరకదన్యనని బ్రాహ్మణుడు శౌచవిధిని వదలుట యుక్తమగునా? గుణములోపిం
చినను ముఖ్యమును విడువగూడదను పూర్వమీమాంసాన్యాయమునుబట్టి తెల్లనిమృత్తిక
దొరకనిచో నల్లనిమృత్తికయు గ్రాహ్యమేయని యేర్పడును. ఈ న్యాయమునుబట్టియే
తెల్లని రుద్రాక్షములు దొరకనప్పుడు నల్లని రుద్రాక్షములను ధరించుట యుక్తమని ని
ర్ణయమగును. కావుననే బ్రాహ్మణులు మొదలగువారు క్రమముగా తెలుపునల్లని మొ
దలుగాగల రుద్రాక్షములను ధరింపవలయు. అట్టివి దొరకని యెడ యేవైనను ధరింపవల
యునని శివపురాణమునగలదు.

ప. తెల్లని రుద్రాక్షములు దొరకున్నయెడ దొరకినవానిని ధరింపవలయునని శివ
పురాణవచనము తెల్లనివానినే ధరింపవలయునను శ్రుతికి విరుద్ధము గాదా?

ఉ. ఆ వచనము శ్రుతివిరుద్ధమైనది కాదు. రుద్రాక్షలు తెల్లనివైనను కాకున్న
ను వానియెడ విమర్శింపక లభించినవానిని ధరింపవలయునని బృహజ్జాబాలమునందుకలదు
గాన రెండును సమానార్థకములే యగును. శ్రుతియందు రుద్రాక్షములెట్టివైనను వానిని
నిత్యవిధిగా ధరింపవలయునని యున్నది. ఇదిగాక తెలుపు ఎరుపు మొదలగునవి చెట్ల

చు తదర్థంబే కాని వేఱొండు లేదు. దూరతరవర్తియగు ప్రియతమునిపై నెట్టులో అట్టులు స్త్రీచిత్తము సన్నిహితునియెడఁ బ్రసరింపదు. [1] సర్వవృత్తులను వదలిపెట్టి నాయందే మానసమును నిలిపి నన్నే చింతించుచుండుటచేత మీరు వేగంబ నన్నుం బడయఁగలరు. [2] ఆనాఁటిరాత్రి నన్నుంజూడ రాఁగోరి ప్రయత్నించియుఁ బతులువారింపఁగా నేమియుఁ జేయఁజాలక యింట నిలిచినవారెల్ల సమాహితధ్యానమున నన్నే పొందిరి.

అని యిట్టు హరి మీకుం జెప్పఁ బుత్తెంచెను. అని యుద్ధవుండు పలికిన నాలకించి యా మధురాలాపముల శ్రుతులు తృప్తినొంద మనంబు లానందసాగరంబున నోలలాడఁగా నిట్టులనిరి. ఆర్యా! యాదవులకుం గీడు సదా వెదకుచుండు పాపచిత్తుఁ డగుకంసుఁడు మాయదృష్టవశమునఁ దనబంధుమిత్రులతో మృతిం గాంచెను. భాగ్యవశమున సర్వార్థసిద్ధులంబడసిన యాపులంగాచిన శ్రీకృష్ణుఁ డిప్పుడు కుశలంబున నున్నవాఁడు. లజ్జచేతను స్నేహహాసోదారేక్షణములచేతను, మేము పూజించిన యా యచ్యుతుం డిపుడు మధురానగరంబునఁ బౌరకాంతలకుఁ బ్రీతిఁ గూర్చుచున్నాఁడా? రతివిశేషముల నెఱింగిన యా ప్రియుఁడు పౌరనారీమణుల ప్రియవచనములచేతను వారి విలాసములచేతను ఎట్లు బంధింపఁబడక యుండును? ఉద్ధవా! మహాశయా! ఆపౌరకాంతామణుల గోష్ఠివిశేషములఁ దేలు

---

[1] మయ్యావేశ్య మనః కృత్స్నం విముక్తాశేషవృత్తయః, అనుస్మరంత్యో మాం నిత్యమచిరా న్మాముపైష్యథ = అని మూలము.

[2] యా మయా క్రీడతా రాత్ర్యాం వనేఽస్మిన్ వ్రజ ఆస్థితాః, అలబ్ధరాసాః కల్యాణ్యో మాపుర్మద్వీర్యచింతయా = అని మూలము.

లాభరణా జటావల్కల ధారిణ ఇతి ॥ పురాశ్వేతాది శిష్యాశ్చా తాసు నయో మునిసత్తమాః । సాఖ్యాచ శతమే తేషాం సహాష్టాదశ సంఖ్యయా । తపతేభస్మ దిగ్ధాంగా స్త్రిపుండ్రాంకిత మస్తకాః । రుద్రాక్ష మాలాభరణాః రుద్రారాధనతత్పరా । ఇత్యాదినా బహువ్యపిపురాణేషు బహవస్తద్ధారిణః ప్రశంసితా ఇతి మహతీయు మనుష్ఠాత్ప్రశంసా ॥ బృహజ్జాబాలోపనిషది ॥ సమరనిదాఘః కాత్యాయన దత్తాత్రేయభరద్వాజ కపిలవసిష్ఠ పైప్పలాదైశ్చ కాలాగ్నిరుద్రం పరిసమేత్యోవాచ ॥ అథ కాలాగ్నిరుద్రః కిమర్థం భవతా మాగతమితి సహోవాచ రుద్రాక్షధారణవిధిం సర్వే శ్రోతు మిచ్ఛామ ఇతి ॥ అథ కాలాగ్ని రుద్రః ప్రోవాచ ॥ రుద్రస్యనయనాదుత్పన్నా రుద్రాక్షా ఇతి లోకేవ్యాఖ్యాయతే ॥ అథవా సదాశివ స్సంహారకాలే సంహారంకృత్వా సంహారాక్షిం ముకుళీకరోతి । తన్నయనా జ్జాతా రుద్రాక్షఇతివ్యాఖ్యాయతే । తస్మాద్రుద్రాక్షత్వమితి ॥ అథకాలాగ్నిరుద్రః ప్రోవాచత ద్రుద్రాక్షేవాగ్విషయీకృతే దశగోప్రదానే యత్ఫల మవాప్నోతి తత్ఫల మవాప్నోతి

---

ను ద్వంద్వదోషరహితులును, రుద్రాక్షమాలాధారులును భస్మాంగ గుంఠనపరులునని చెప్పఁబడియెను.

ఇదిగాక. ఉత్తమధర్మమును దెలిసికొనదలచిన మునుల నుద్దేశించి భస్మోద్ధూళిత సర్వాంగులును, త్రిపుండ్రధారులును, రుద్రాక్షమాలాభరణులునని చెప్పఁబడియున్నది. మరియు శ్వేతుడు మొదలుకొని శిష్యవరులు నూటపందొమ్మిదుగురు ఋషులును భస్మరుద్రాక్షధారులును రుద్రారాధనతత్పరులునని యున్నది. ఇటులనేక పురాణములయందు రుద్రాక్షధారులగు మహర్షులు పెక్కురు ప్రశంసింపఁబడియున్నారు.

బృహజ్జాబాలోపనిషత్తునందు. సమరుఁడు, నిదాఘుడు, కాత్యాయనుఁడు దత్తాత్రేయుఁడు మొదలగు మహర్షులు కాలాగ్నిరుద్రునొద్దకరుదెంచి రుద్రాక్షధారణవిధిని చెప్పుమని యడుగ నాగ్నేయ్నుండిట్లనియె. రుద్రుని నేత్రముల నుండి పుట్టినవి గాన రుద్రాక్షములని చెప్పఁబడుచున్నవి. సదాశివుఁడు సంహారకాలంబున ఫాలనేత్రంబుచే జగంబుల సంహరించి యా ఫాలనేత్రంబు మూయుగా నట్టి నేత్రంబునుండియు రుద్రాక్షవృక్షంబులు ప్రభవించెను. దానను రుద్రాక్షంబులని చెప్పఁబడుచున్నవి.

రుద్రాక్షముల నుచ్చరింపగా పదిగోదానముల ఫలము కలుగును. రుద్రాక్షమును

లగు గోవులును, ఆతరుణమున శ్రుతిమనోహరముగా నొనరిం చిన వేణునాదమును, శ్రీమన్నందనందనుని సదా స్మరింపఁ జేయుచుండును. మహాలక్ష్మీకాటపట్టులగు నా శ్యామసుంద రుని పాదపద్మములచేఁ జిహ్నితములగు నా భూభాగములను గాంచి మేమెల్ల నాపరమపురుషుని విస్మరింపఁజాలుదుమా? మందమందగమనమునను, సులలితమందహాసమునను, బ్రీతికి స్థా నము లగు చూపులను, మధురసంభాషణములను మాచిత్త ములు శ్రీహరియందే తగిలియుండఁగా నితర మేమియు నెఱుం గని మేమాతని నెట్లు మఱవఁగలము?

అని పలుకుచు నంతలో నంతరంగమునుండి యంతకంత కుప్పొంగుసంతోషరసంబున దేహములు పరవశములు కాఁగా నుద్ధవుని మఱచి శ్రీకృష్ణుని హృదయములఁజూచుచు నో జగ న్నాథా! వ్యసనార్ణవమున మునిఁగియున్న గోకులము నుద్ధరిం పుమా! రమానాథా! మమ్ముఁ గరుణంజూడుము. వ్రజనాథా! యార్తిధ్వంసకా! గోవిందా! పరమపురుషా! మమ్మాద రింపుము.

అని యీరీతిం బ్రార్థించి గోపికలు శ్రీకృష్ణుఁ డుద్ధవుని వలనఁ దమకుంబంపిన కుశలవార్తాశ్రవణంబున వియోగవేదన లంబాసి మరల నుద్ధవునిం జూచి శ్రీకృష్ణునిగా నాతనిని భావించి పూజించిరి. * ఆయుద్ధవుఁడు వారిభక్తి కానందించుచు నాగోపికలకు సంతోషమును గలిగించుచుఁ గొన్ని మాసములు

---

* ఉవాస కతిచిన్మాసాన్ గోపీనాం వినుదన్ శుచః, కృష్ణలీలాకథా గాయన్ రమయామాస గోకులమ్ = అని మూలము.

హ్మత్వంగచ్ఛతి ॥ ద్విసహస్రరుద్రాక్షం ద్వేవర్షే ధారయేత్ విష్ణుత్వంగచ్ఛతి ॥ త్రిసహస్రరుద్రాక్షం త్రీణివర్షాణిధారయేత్ సదాశివత్వంగచ్ఛతి ॥ నసపునరావర్తతే । సహస్రజ్యోతి రుద్రాక్షీ తిష్ఠతోవాచ ఇతి ॥

తథా స్కాందే ॥ శంకరసంహితాయాం ॥ రుద్రాక్ష్యోర్జాతా యా విప్రాః రుద్రాక్షమితి కీర్తితః । రుద్రాక్షధారకే శంభుః పరిపూర్ణకటాక్షవాన్ । రుద్రాక్షధారకాస్సర్వే రుద్రాకారాః ప్రకీర్తితాః యస్యాస్యాజ్జన్మ చరమంతస్య రుద్రాక్షధారణే । త్రిపుండ్రధారణేచైవ పంచాక్షరజపే తథా ॥ శ్రద్ధాభవేత్పుంసామన్యేషాం దుర్లభా భవేత్ । యస్యదేహేభవేదేకో రుద్రాక్షశ్శివభావకః । శివాలయంతు తద్దేహం సాక్షాచ్ఛంభుశ్శివస్స్వయం ॥ నదేహేయస్య రుద్రాక్షాన త్రిపుండ్రస్యధారణం । శ్మశానమేవతద్దేహం తన్ముఖంగిరిగహ్వరం ॥

స్కాందమున శంకర సంహితయందు. రుద్రుని నేత్రములవలన జనించెను గాన రుద్రాక్షములని చెప్పఁబడుచున్నవి. రుద్రాక్షముల ధరించినవానియెడ పరమేశ్వరుడు పరిపూర్ణకటాక్షము కలిగియుండును. రుద్రాక్షములధరించినవారలందఱును రుద్రస్వరూపులగుదురు. ఎవ్వారల జన్మంబు చివరదైయుండునో వారలకు రుద్రాక్షధారణమునందును, భస్మత్రిపుండ్రధారణమునందును, పంచాక్షరజపమునందును నెక్కువశ్రద్ధ కలిగియుండును, కాని యది తక్కువవారలకు లభింపనేరదు.

ఎవ్వని శరీరంబున నొక్క రుద్రాక్షము కలదో వాని శరీరము శివాలయంబును వాడు కేవలము రుద్రుండునగు. ఎవ్వని దేహంబున రుద్రాక్షలు భస్మ త్రిపుండ్రంబును లేవో వానిదేహము శ్మశానముంబలె నపవిత్రమైనదియు వాని నోరు కొండగృహంబోలునదియు నగును. ఎవ్వఁడు రుద్రాక్షములను ధరించిన శైవులను శివరూపులనుజూచునో వాని కన్నులె సార్థకము లైనవి గాన వాఁడె కన్నులుగలవాఁడని యెన్నఁబడును. మఱియు నెవ్వాఁడు రుద్రాక్షధారులను మనుష్యమాత్రులనుగాఁ జూచునో ఆతఁడు చేయుపూజయు జపహోమాదులును వ్యర్థంబులగును. ఎవ్వఁడు రుద్రాక్షధారులను శివరూపులనుగా జూచునో వాఁడు సర్వవిధమగు తపంబు చేసినవాఁడును, శివార్చనంబు

యెక్కడ? అజ్ఞానుఁడైనను దన్ను సేవించినమాత్రమున నమృతమని తెలియక త్రాగినను అమృత మాతనికి జరామరణబాధలు లేకయుండఁజేయురీతిఁ బరమాత్మ వానికి మేలుచేయును.

రాసక్రీడాసమయమునఁ బరాత్పరుండగు శ్రీవాసుదేవుని కోమలబాహులతల నాశ్రయించి కంఠాలింగనసుఖమును మిగులఁగాంచిన యీగోపికలకు సంభవించిన మహాప్రసాదము నిత్యానుసంధాయిని యనపాయినియు నగు శ్రీదేవికిని గమలగంధకాంతిఁ జెలువారు నిర్జరనారీమణులకును గలుగదని నా నమ్మకము. ఇట్టులుండ నింకఁ దక్కినవారిని బరిగణింపనేల? * ఎట్టులైనను వదలఁజాలని స్వజనమును ధర్మమును బరిత్యజించి శ్రుతివితతులకుం గూడ మృగ్యంబైన ముకుందపదవిని గనుఁగొన్న యీగోపికామణుల పాదపరాగమును బడయుచున్న యీబృందావనతరు లతాగుల్మములలోఁగాని, యిందలి యోషధులలోఁగాని నొక్కటిగా నేను బుట్టుదును. ఆప్తకాములగు యోగీశ్వరులు, బ్రహ్మాదిదేవవర్యులు, శ్రీదేవియు నాత్మలో సదా పూజించుచుండ నొప్పారు శ్రీముకుందదివ్యచరణారవిందమును రాసక్రీడయందుఁ గుచములఁ గౌఁగిలించుకొని తాపమును బాసి శ్రీమద్గోవిందమనోహరకథాగానముచే మూఁడుజగములను బవిత్రములు గావించు నీగోపికల పాద

---

* ఆసా మహో చరణరేణుజుషామహం స్యాం బృందావనే కిమపి గుల్మలతౌషధీనాం, యాదుస్త్యజం స్వజన మార్యపథం చ హిత్వా భేజుర్ముకుందపదవీం శ్రుతిభిర్విమృగ్యామ్. యావై శ్రియార్చిత మజాదిభిరాప్తకామై ర్యోగీశ్వరై రపి యదాత్మని రాసగోష్ఠ్యాం కృష్ణస్య తద్భగవత శ్చరణారవిందం న్యస్తం స్తనేషు విజహుః పరిరభ్య తాపమ్=అని మూలము.

దేశ్యావాత్ గౌతమస్య చ శాపతః। విప్రాణాం దాక్షిణాత్యానాం శాపోపహ
తచేతసాం। శివే భస్మసరుద్రాక్షే కించిచ్ఛ్రద్ధా న విద్యత ఇతి॥ మానవేచ॥
బ్రాహ్మణైశ్చ పురా సర్వే గౌతమేన సురక్షితైః। విచార్య కార్యం సం
భూయ స్వదేశగమనోద్యతైః। గాం కృత్వా గౌతమే న్యస్తే నిర్గతైః పురుషా
ధమైః। కృత్వా మిథ్యాభిశాపస్తు సహసా మోహవశేన తు॥ తచ్ఛ్రుత్వా స
మునిశ్రేష్ఠః గౌతమో మునిసత్తమః॥ మహాక్రోధేన సంయుక్తశ్శ
శాప బ్రాహ్మణాధమాన్॥ యద్యత్తు రుద్ర సంబంధి తత్ర తత్రాపి గు
ణినాః। భవతానున్ముఖా యూయం సర్వథా బ్రాహ్మణాధమాః॥ స్వా
ధ్యాయే చ జపే చైవ తథా ప్రవచనేపి చ। భవతానున్ముఖా యూయం సర్వ
థా బ్రాహ్మణాధమాః॥ శ్రుతిస్మృతిపురాణోక్తేష్వర్థేషు సకలేషు చ।
భవతానున్ముఖా యూయం సర్వథా బ్రాహ్మణాధమాః॥ శంఖచక్రగ
దాపద్మ దండపాశాంకుశాదిభిః॥ అంకితా శ్రద్ధయా యూయం సర్వథా
బ్రాహ్మణాధమాః। చతుర్భాశ్వత్థపత్రాభ చంద్రశూలాదిలింగినః।
భవత శ్రద్ధయా యుక్తాస్సర్వథా బ్రాహ్మణాధమాః॥ అశ్వత్థపత్రలింగీచ

---

నొద్దంజేర్చి యమ్మహామునిచే సురక్షితులై యుండి పదంపడి కొంతకాలమునకు తమ దేశము సుభిక్షంబుగా నున్నదని విని స్వదేశ గమనోన్ముఖులై గౌతమమునిమీద నొక నెపమునిడ పోదలచి యందఱును జేరి దుర్లోచనము గావించి కృత్రిమగోవును నిర్మించి యద్దాని గౌతమునిమీది కనుప నమ్మునీంద్రుండా గోవును దర్భతోఁ గొట్టెను. అంత నాగోవు నేలపైఁ ద్రెళ్లి గౌతముఁడు గోవును జంపెను గాన నిందుండరాదని యందఱును వెలువెడలుడు నమ్మునీంద్రుఁడు నిజతపః ప్రభావంబున నిజమారసి కృతఘ్నులగు వారినుద్దేశించి బ్రాహ్మణాధములారా? మీరలు రుద్రసంబంధములగు భస్మరుద్రాక్షధారణము శివపూజ మొదలగు దానియందు నాసక్తిలేని వారలగుదు.

మఱియును, శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడు విషయములయందు శ్రద్ధారహితులై యుందురు శంఖము, చక్రముఁ గద, పద్మము, దండము, పాశము, అంకుశము మొదలగువాని ముద్రలను ధరించుడు. చతుర్భుజాకారము, అశ్వత్థపత్రాకారము, అర్ధచంద్రాకారము త్రిశూలాకారములగు పుండ్రములు ధరించుడు. ఇదిగాక, బౌద్ధధర్మము నవలంబించి పాంచరాత్రము, కాపాలము, కాలాముఖము, శాక్తమునను వానియందుఁగల దీక్షలనొందుడు. చార్వాకము, పాషండము, జైనము మొదలగు దీక్షలవహించు అవైదికములగు దుర్మ

లాచరించి భక్తిభరితస్వాంతలనుగా వారిని భావించుటయు, నందాదు లుద్ధవుని సమ్మానించుటయుఁ, దమభావముల నాతనికిం దెల్పుటయు లోనుగాఁగల విషయములను బఠించితిరి. విశేషించి శ్రీకృష్ణుఁడు గోపికలకుం దెలుపుమని యుద్ధవునితోఁ బల్కినపల్కులను జదివితిరి. దీని నించుక చర్చించి వ్రాయకతప్పదు. గోపికలవృత్తి యెట్టిది? అనువిషయమే ప్రధానము. అది యేకదా శ్రీకృష్ణచరిత్రమునకుఁ దీఱనికళంకము నాపాదించినది. నందాదులు శ్రీకృష్ణునియం దెట్టిభావము కలవారు? అనునది కూడఁ దెలిసికొనుట ముఖ్యము. ఈకథనుండి యనేకనీతులు బయలువెడలును. ఈ కథనుబట్టి నందాదులు గోకులముననే యున్నవారనియు శ్రీకృష్ణుఁడు కంసవధానంతరము నందున కుపదేశింపలేదనియు నెఱుంగుఁడు. ఇది యొక్క భాగవతము నుండియే వ్రాయఁబడిన కథయనియు మఱువకుఁడు.

గర్గసంహితనుండియుఁ గొంతభాగ మిట వ్రాయఁబడినది కదా. దానిం బట్టి యోజింప నెందఱుగోపికలు శ్రీకృష్ణసేవార్థ మవతరించిరో తేటపడును. వా రుద్ధవుని శ్రీకృష్ణకుశలమును బ్రశ్నించినవిషయ మూహించినచో వారిభావము లెట్టివియో తోఁచును. కామాతుర లగువారిపలుకు లెట్లుండునదియు నించుకయైన లోకజ్ఞానముగలవా రెఱుఁగఁజాలుదురు. ఎట్టి చమత్కారిణిగాని యెంతనర్మగర్భముగా మాటలాడినను బ్రేమాతిశయమును దెల్పువాక్కులే వినఁబడును గాని తమరు వలచినకాంతుని, పరమేశ్వరునిగను, సాక్షాద్విష్ణువుగను, అద్వితీయునిగను, సంసారార్ణవతారకునిగను, దమకారాధ్యునిగను భావించినట్లు వారిమాటలనుండి తేలుననుట కవకాశము లేదు.

జితులు కావున నట్టి శ్రీకృష్ణభక్తి మీకు లభించినది కావున మీరే లోకమునఁ బూజింపఁదగినవా రనియె.

"యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౬
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్." ౭

భగవద్గీత. భక్తియోగము.

"అవిద్యమాన మన్యదాలంబనం విశ్వరూపం దేవమాత్మానంముక్త్వా యస్య సోఽనన్యః తేన అనన్యేనైవ. కేన? యోగేన సమాధినా మాం ధ్యాయంత శ్చింతయంత ఉపాసతే." శంకరభాష్యము. "న విద్యతేఽన్యో భజనీయో యస్మింస్తేన ఏకాంత భక్తియోగేనోపాసత ఇత్యర్థః." శ్రీధరీ వ్యాఖ్య.

ఈ భగవద్గీతావాక్యమునుబట్టి యితరదేవతలను గాంచూపూర్త్యర్థము నమ్మక యొక్కభగవంతునందే యెవరు మన సుంచి యుపాసింతురో అనఁగా ధ్యానింతురో వారే పరమ భక్తులు. వారిని మృత్యుసంసారసాగరమునుండి నే నుద్ధరింతు నని శ్రీకృష్ణమూర్తి యుపదేశించెను.

ఇట్లు పలికి యుద్ధవుఁ డంతతో నూరకుండక గోపికలతో నింకను సంభాషించెనుగదా. ఆవాక్కుల నించుక విమర్శింతము. ధ్యానవ్రతతపోహోమ జపస్వాధ్యాయముల చేతను సంయమము చేతను భక్తి సాధింపఁబడుననియె. ఇందు నీగోపిక లేమియొనరించి భక్తిని సాధించిరను ప్రశ్నము రావచ్చును. పై చెప్పినవి మాత్రమే కాక 'శ్రేయోవిధిభిరన్యైశ్చ' యన్నందునఁ బూర్వోక్తపద్ధతులు గాక తమమది కనుకూలమగు మఱేపద్ధతిచేనైనను

శైవప్రచారిణీ గ్రంథమాలయందు ముగుఁ బ్రకటింపఁబడు

గ్రంథ రత్నములు

———(♦)———

1 యుద్ధకాండము పద్యకావ్యము కోడూరి వెంకటాచల కవి ప్రణీ
2 బసవ విజయము ... తుమ్మలపల్లి నాగభూషణ కవి
3 లింగధారణ దీపిక ... మ॥ పం॥ భవానీ శంకరారాధ్యు
4 శివజ్ఞాన శేఖరము ... ఘంటనామాత్యుఁడు
5 కాళహస్తీశవిలాసము... కాళహస్తీశ్వరుఁడు
6 మల్లికార్జున పండితారాధ్య చరిత్ర ...సంస్కృతము
7 నందికేశ్వర పురాణము ,,
8 శైవసిద్ధాంత దర్శని 2వ సంపుటము 3వ సంపుటము
9 బసవపురాణము సంస్కృతము వ్యాసప్రణీతము
10 శివాధిక్య శిఖామణి ... రేణుకారాధ్యులు
11 శ్వేతాశ్వతర కల్పసూత్రము... శ్వేతాశ్వతరుఁడు
12 విష్ణుకృత మహిమ్న స్తోత్రము సవ్యాఖ్యానము మల్లికార్జున ప
ండితారాధ్యుల వీరనారాధ్యు
13 శివరహస్య ఖండము సంస్కృతము అసురకాండ,వీరమహేంద్ర
డ, యుద్ధకాండ, దేవకాండ, దక్షకాండ,ఉపదేశకాండలు వ్యాసకృత
14 శైవరత్నాకరము ... జ్యోతిర్నాథుఁడు
15 శైవసంజీవినీ ... సిద్ధయోగి

శైవాభిమానులారా!

మతోత్కృష్టత దెలియఁజేయుటకు గ్రంథము లేగదా! యాధా
రములు. అట్టిగ్రంథము లచ్చుపడుటకు ధనమేగదా! మూలకారణః
ధనమో! చందా దారులపై నాధారపడి యున్నది. కావున శైవమత
దభిరుచి గలవారందఱు చందా దారులుగఁ జేరి, తమమతాభిమా
మును వెల్లడి పఱచి, మాకుఁ బ్రోత్సాహ మొసంగుదు రని నమ్ము
న్నారము.

విశేషించి వచింపవలసిన దేమున్నది ? మునులకు సామాన్యముగా నలవడనిభక్తి గోపికలకుఁ గుదిరినదని యుద్ధవుఁ డనియె. ఇది చాలదా? ఇంకను వారిని నిందింపఁ బూనఁదగునా? వారికిం గల భక్తియందు సహస్రాంశముగూడ మనకు లేదేయని దుఃఖింపవలయుననుటకంటె నెక్కువ వ్రాయనుంకింపను. మఱొక్కమాట.

"దిష్ట్యా పుత్రాన్ పతీన్ దేహాన్ స్వజనం చ గృహాం స్తథా,
హిత్వావృణీత యూయం యత్కృష్ణాఖ్యం పురుషం పరమ్."

అని యుద్ధవుఁడు పలికెను. "దీనిభావ మేమి తిరుమలేశా" అని యూహింపుఁడు. మీరు సమస్తము కృష్ణార్పణము చేసితిరని దీనిసారము. కృష్ణాఖ్యం పురుషం పరమ్=అనఁగా రూపనామక్రియాశూన్యుఁ డగుపరాత్పరుఁడు భగవదుద్ధరణార్థము శ్రీకృష్ణనామమును ధరించి రూపమును గాంచెను. ప్రకృతిని స్వీకరించెనని దీనిభావము. సగుణబ్రహ్మమని దీని సారతరార్థము. అట్టిపరబ్రహ్మమునకు నాత్మార్పణము చేసితిరి. మీయదృష్టమే యదృష్టమనియె. ఔరా! గోపిక లెంతటియదృష్టము కలవారలని యుద్ధవుఁడు వర్ణించెను.

ఆర్యమహాశయావతంసములారా! ఉద్ధవుఁడు పలికినపలుకులవలన గోపికలు శ్రీకృష్ణభక్తిభరితహృదయలనియు,మహర్షులకంటె నధికశక్తిసంపన్నలనియుఁ, గాముకురాండ్రుగారనియు స్పష్టమయ్యెను. ఇంక శ్రీహరి గోపికలకుఁ జెప్పుటకు నుద్ధవుని వలనఁ బంపినవార్త యెట్టిదని యించుక విమర్శింతము. దానియం దించుకంతయైనఁ గామవికారము కనఁబడునేమో పరికింపుఁడు. నేను సర్వాంతర్యామిని. కావున బుద్ధీంద్రియముల

శ్రీకృష్ణవార్తలఁ దెలిపి యుద్ధవుఁడు గోపికలకు నమస్కరించెను. వారియం దెట్టిసుగుణములు లేకున్న నతఁ డట్టిసత్కారమును జూపునా? మరలి మధురానగరమున కరుగునపుడు నందాదులు కృష్ణునకు నమస్కరించితిమని చెప్పుమనిరి. ఏమి యీయద్భుతము! శ్రీకృష్ణుఁడు తనకుమారుఁడని యెఱుంగక నందుఁడు నమస్కరించెఁగా! పరమపురుషుఁడని యతఁ డెఱింగిన ట్లూహింపవచ్చును గదా. ఎంతటియోగ్యత కలిగియున్నను కొడుకునకుఁ దండ్రి నమస్కరించుట గానము. పరమపురుషుఁడు తనకుఁ బుత్త్రుఁడుగా జన్మించినను లోకాచారము నాతనియెడఁ గనఁబఱచుట వివేకమని యతఁ డెఱుఁగును. లోకాచారములు భగవంతునియందుఁ గనఁబఱచుట న్యాయముకాదు కదా. ఈ వృత్తాంతమువలన శ్రీకృష్ణమూర్తి సనాతనుఁడనియు, గోపికలు తత్సేవార్థము గోలోకమునుండియు వైకుంఠాదిలోకముల నుండియు నవతరించిరనియు, వారిచరిత్రము మహర్షులకే ననుష్ఠానార్హమనియు మనమెఱుంగవలయు. గోపికలవలె శ్రీకృష్ణ భక్తి నలవఱచుకొనవలయు. దానిచేఁ గృతకృత్యులము కావలయు. ఈకలికాలమున భక్తికి మించిన మంచి సులభోపాయము వేఱొకటి కానరాదు. దానిని వీడకుండుటయే మనకు విధి. లేకున్న యవిధియే. ఇంకఁ బెంచివ్రాయక తర్వాతి వృత్తాంతమును వ్రాసెదను. భక్తులారా! ఈపవిత్రచరిత్రమును జదివితిరి. దీనికి ఫలముగా శ్రీకృష్ణునిస్తుతిని బఠింపుఁడు. నిరతిశయానందము ననుభవింపఁగలరు. పఠించునపుడు మీమనసును భగవత్పాదారవిందద్వంద్వమునఁ గొలఁదివిఘటికలు నిల్పుఁడు. అది

వినుము. ఉద్ధవుఁ డిట్లు రాధను భక్తిపూర్వకముగా వినుతించి కరయుగము జోడించి నిలుచుండఁ గాంచి రాధిక చేతనను బొంది యుద్ధవునియందు శ్రీకృష్ణునాకారచిహ్నము లుంటం దిలకించి దుఃఖాతురరాలై యిట్టు లనియె. వత్సా! నీ పేరెయ్యది? ఎవరు పంప వచ్చితివి? యెందుండి వచ్చితివి? నన్నేల నుతించితివి? విస్తరించి వచింపుము. నీసర్వావయవము లందును గృష్ణాంగచిహ్నము లగపడుచున్నవి. కావున నిన్నుఁ గృష్ణపార్షదునిగాఁ దలంచెదను. శ్రీకృష్ణకుశలమును దొలుత వచింపుము. బలదేవునికుశలమును వినిపింపుము. నందుఁ డామధురానగరముననే యున్నవాఁడే. ఏల? మనోహరమగు నీబృందావనమును జూడ శ్రీగోవిందుఁ డెప్పుడు రాగలఁడు? మరల నీబృందావనసుందరభూభాగములఁ బూర్ణశీతాంశుప్రతీకాశమగు నా పరమపురుషుని మోమును జూడఁ గోరెదను. రాసమండలమున మరల నాభగవంతుం గూడి క్రీడింతును. సఖీబృందముం గూడి నిర్మలయమునాశైవలినీజలంబుల విహరింపఁ గోరుచున్నదానను. శ్రీమన్నందనందను దివ్యాంగమున సురుచిరసురభిచందనమలంద నాకాంక్షింతును. అన విని యుద్ధవుఁ డిట్లు బదులు చెప్పెను. నాపే రుద్ధవుఁడని. శుభాంగీ! నేను క్షత్రియుఁడను, పరమాత్మయగు శ్రీకృష్ణునిచేఁ గుశలవార్త మీకుం దెల్పఁ బంపఁబడినవాఁడను. ఆ శుభవార్తంగొని మీసన్నిధి కరుదెంచితిని. హరిపార్షదుఁడనే యగుదును. శ్రీకృష్ణునకు బలదేవునకు నందునకుఁ గుశలమే యలరారెనని విశ్వసింపుము. అన విని రాధాదేవి యిట్లు పలికెను.

విషయము



సమాప్తమ్



వాఁడవు? నాయం దేమియపరాధ మున్నది? దాసికను గదా. దాసీదోషము పలుమాఱులు క్షమింపఁ దగునుగదా. అని పలుకుచు స్మృతితప్పఁగా మూర్ఛమునింగెను. ఉద్ధవుఁ డామెకు భగవంతునిపైఁ గలప్రేమాతిశయమును దెలిసికొని శిశిరోప చారములఁ దెప్పిఱిల్లఁ జేసెను. మూర్ఛనుండి తెలివినొందిన యా రాధికం జూచి యా క్షత్రియకుమారుఁడు పరమాశ్చర్య మందెను.

అత్తఱి నాదేవిని శ్వేతచామరహస్తలై నెచ్చెలు లేడు గురు సేవించుచుండిరి. గోపీసహస్రము లామెకు నుపచారము లుచేయ సిద్ధముగా నుండిరి. అసంఖ్యలగు గోపిక లాదేవిని దివానిశములు సేవింపఁ గాచియుండిరి. అందొక్కవనితామణి కజ్జలహస్తయై యుండెను. వేఱొకతుక మాలతీమాల్యము చేఁబూనియుండెను. ఇంకొక్కగోపిక సిందూరహస్తయై కాచి యుండెను. మఱొకతరుణీమణి గోరోచనము కరతలమునధ రించియుండెను. ఇంక నొక్కగోపిక చందనపాత్రమును దాల్చి నిలువఁబడి కనఁబడెను. దర్పణము చేఁబూని యొకతుకయుఁ గుంకుమపట్టుకొని మఱొక కాంతామణియుఁ గస్తూరికాపాత్ర మునుదాల్చి మఱియు నొక లలనాతిలకమును, జంపక కుసుమ పాత్రమును జేఁబూని యింకొక్కపురంధ్రియు, మధురమధురస పూర్ణకలశధారిణియై యింకొక్కరామయు, సుగంధితైలము నింపిన పాత్రమును ధరించి వేఱొక్క కోపనయుఁ, దాంబూల కరండముచేఁ గ్రాలుచుండ నొక్క భామినీమణియు, సువాస నల గుబాళించు జలముగల రత్నపాత్రము కరలతికఁ గన్పడ నింకొక సుందరీరత్నమును, విచిత్రముగఁ గన్పట్టు క్రీడాపుత్త

భవతి॥ విద్యా = సమ్యగర్థజ్ఞానం ॥ శ్రద్ధా=ఆస్తిక్యబుద్ధిః॥ వీర్యవత్తరం= సమగ్రఫలం భవతీత్యర్థః ॥ నిరుక్తే ॥ అధీత్య వేదం నవిజానాతి యోఽర్థం స్థాణురయం భారవాహః కిలాభూత్ ॥ యోఽర్థవిత్సకలం భద్రమశ్నుత ఇతి ॥ అత ఏవ తేషాం పూజాదికమపి న కార్యమిత్యాహ వ్యాసః ॥ పాఠమాత్రరతాం స్తాంస్తాన్ ద్విజాతీ నర్థవర్జితాన్ । పశూనివ నతాన్ ప్రాజ్ఞో వాఙ్మాత్రేణాపి నార్చయేదితి ॥ అతోఽర్థజ్ఞానమావశ్యకమితి సిద్ధం ॥ అతఏవ ॥ నవేదపాఠమాత్రేణ సంతుష్టో యో భవేద్ద్విజః పాఠమాత్రావసాయీతు పంకే గౌరివ సీదతీతి వేదార్థాపరిజ్ఞానే దోషస్స్మృతః ॥

తథాచ ॥ మన్త్రార్థపరిజ్ఞానపూర్వకోపదేశసిద్ధ్యర్థముపనేతుర్విద్వత్తామాహ భగవానాపస్తంబమునీంద్రస్సామయాచారికేషు ॥ తమసో వా ఏష తమః ప్రవిశతి యమవిద్వానుపనయతే ॥ యశ్చావిద్వానితి హి బ్రాహ్మణమితి ॥ తత్ర వృత్తికారః ॥ విద్వానేవోపనేతాఽభిగమ్యత ఇతి ॥ విద్యాతుమవిదుషో నిందామాహ తమసో వేతి ॥ య

---

కావుననే అర్థజ్ఞానము ఆస్తిక్యబుద్ధి కలిగి చేసిననే కర్మము సంపూర్ణఫలము నొసగునని ఛాందోగ్యమున గలదు.

ఎవ్వఁడు వేదము చదివి దానియర్థము నెఱుఁగఁడో వాఁడు బరువు మోయు మొద్దుతో సమానుండగును. అర్థము నెఱిఁగినవాఁడు సకలములగు శ్రేయములను పొందునని నిరుక్తమున గలదు. కావుననే అర్థము దెలియక వేదము చదువుచుండువారిని గౌరవింపవలదని వ్యాసమహర్షి చెప్పెను. కావున నర్థజ్ఞాన మావశ్యకమని యేర్పడినది. దాననే వేదము చదివి సంతపాఠమాత్రమున తృప్తినొందినవాఁడు బురదలోఁబడిన యెద్దువోలె దుఃఖమొందునని దోషము చెప్పబడియెను.

ఇటుల అర్థజ్ఞానముతోఁగూడిన మంత్రోపదేశము సిద్ధించుటకై ఉపనయనము చేయువాఁడు విద్వాంసుఁడుగా నుండవలయునని ఆపస్తంబుఁడు చెప్పియుండెను. అదియెట్లనిన ఎవ్వానికి నపండితుఁడు ఉపనయనము గావించునో వాఁడు చీకటినుండి చీకటియందే ప్రవేశించునని బ్రాహ్మణమున గలదు. చీకటిలోనుండి చీకటిలోనే ప్రవేశించినవాఁడు దేనిని నెఱుఁగనటుల మూర్ఖునివల్ల నుపయనము పొందినవాఁడు నేమియు నెఱుఁగ నేరఁడు గాన పండితునివల్లనే మంత్రోపదేశమును పొందవలయునని వృత్తికారుఁడు వచించెను.

సినివి. సర్వశక్తిస్వరూపిణివి. తల్లీ! శుభవార్త నాలకింపుము. వాంఛాఫలమై యది యొప్పును. హృదయస్నిగ్ధకారక మది యగును. సుస్థిరమనస్కవు కమ్ము. సఖీపరివృతవై దాని నించుక యాలకింపుము. నా చెప్పఁబోవు నా సువార్త దుఃఖదావాగ్ని దగ్ధులకు సుధావర్షమువంటిది. విరహవ్యాధియుక్తలగు వనితామణులకు రసాయనమువంటిది. శుభమును గల్గించునది. నందుఁడామధురానగరంబున సానందుఁడై యున్నవాఁడు. వసుదేవుఁడు శ్రీకృష్ణున కుపనయనము చేయుదనుక నుండవలయునని నంద భూపతిని బ్రార్థించెను. బలరాముని శ్రీకృష్ణుని గారవించుచుఁ దోడుకొని గోకులమునకు నందుఁడు రాఁగలఁడు. వ్రజమునకుఁ జనుదెంచి గోపాలబాలుఁడు తల్లికి నమస్కరించి మహానందము ననాథార్తికే పరమ పావనమగు బృందావనమునకు రాఁగలఁడు. సాధ్వీమణీ! శీఘ్రముగా శ్రీకృష్ణముఖపంకజమును జూడఁగ లవు. ఈ వియోగవ్యథ నిన్నుఁ బాసి పోవఁగలదు. తల్లీ! సుస్థిరవు కమ్ము. దారుణశోకమును వదలుము. నిర్మలయోగ్య వస్త్రమును ధరింపుము. అమూల్య రత్నాభరణములఁ బరిగ్రహింపుము. చందనపంక మంగీకరింపుము. యథాపూర్వముగ సంతోషమున నోలలాడుచుండుము. చింతాలేశమైనను మది నునుపకుము.

* తల్లీ! శ్రీకృష్ణమూర్తి పరిపూర్ణదేవుఁడు. నీవు పరిపూర్ణదేవివి. శ్రీకృష్ణచంద్రుఁడు కృతనిత్యలీలుఁడు. దేవీ! నీవు కృతనిత్యలీలలుగల లీలావతివి. భగవంతుఁడు భూభారహారణార్థ మవతరించెను. అనపాయినివి గావున నీవు నిందిరాదేవివిగా

* ఈభాగము గర్గసంహితనుండి వ్రాయఁబడినదని యెఱుంగవలయును.

తితా ప్రాహుశ్శ్రుతయో మునిసత్తమా ఇతి ॥ తత్రనిర్ణయమాహ ద
క్షః ॥ రాత్ర్యంతయామనాడీద్వే సంధ్యాదిః కాల ఉచ్యతే । దర్శనా
ద్రవిరేఖాయాస్తదంతో మునిభిస్స్మృత ఇతి ॥ వ్యాసోపి ॥ ఉత్తమాతు
సనక్షత్రా మధ్యమాలుప్తతారకా । అధమాసూర్యసహితా ప్రాతస్సం
ధ్యాత్రిధామతా ॥ ఇతి. తథా ॥ యస్సంధ్యాంకాలతః ప్రాప్తా మా
న్యాదతివర్తతే । సూర్యహత్యామవాప్నోతి ఉలూకత్వమియాత్తతః ।
యాసంధ్యాసాజగత్సూతిర్మాయాతీతాహినిష్కలా । ఐశ్వరీకేవలాశ
క్తి స్తత్త్వత్రయసముద్భవా ॥ తస్మాత్సర్వప్రయత్నేన సంధ్యోపాసన
మాచరేత్ ॥ ఉపాసితో భవేత్తేన శివో యోగతనుఃహర ఇతి ॥ గౌతమః ॥
కాలేతువందితా సంధ్యా స్వర్గమోక్షప్రదాయినీ । అకాలేవందితా సం
ధ్యాసాచవంధ్యావధూరివఇతి ॥ ఛందోగశ్రుతిరపి ॥ బ్రహ్మవాదినోవద
న్తి కస్మాద్బ్రాహ్మణస్సాయమాసీనస్సంధ్యాముపాస్తే కస్మాత్ప్రాతస్తి
ష్ఠన్ కశ్చసంధ్యాయాః కాలః ॥ కించసంధ్యాయాయత్సంధ్యాత్వం ॥ దేవా
శ్చాసురాశ్చాస్పర్ధంత । తే అసురా ఆదిత్యమభిద్రవన్ । స ఆదిత్యో

---

సంధ్యాకాలమున సంధ్యావందనము చేయనివాడు సూర్యహత్యాదోషమునుపొం
ది దానంజేసి గుడ్లగూబయై పుట్టును. సంధ్యయనగా మాయకంటె నతీతమైనదియు త్రి
మూర్తులకు కారణమైనదియు నగు నీశ్వరశక్తియే యగును. కావున సర్వప్రయత్నముల
తో సంధ్య నుపాసింపవలయు. ఇట్లు సంధ్యనుపాసించునెడ యోగతనుండగు శివుని ను
పాసించినట్లె యగుననియు వేదవ్యాసమహర్షియే చెప్పియుండెను. యుక్తకాలమున సం
ధ్యావందనము చేయునెడ భోగమోక్షంబుల నొసగును. అకాలంబునచేయునెడ వ్యర్థ
మగునని గౌతముండు వచించెను. సంధ్యను గూర్చి ఛందోగశ్రుతియందు. బ్రాహ్మణుడు
సాయంకాలమునఁ గూర్చుండి సంధ్యనుపాసింపనేల? ప్రాతఃకాలమున నిలుచుండిచే
యనేల? సంధ్యాకాలమెద్ది? దానికి సంధ్యయను పేరేలవచ్చెను? అని ప్రశ్నచేసికొని
దేవతలు రాక్షసులును పరస్పరము ద్వేషము కలిగియుండిరి. దానఁజేసి రాక్షసులు సూ
ర్యునిమీది కరుదెంచిరి అప్పుడు సూర్యుడు భయపడి బ్రహ్మదేవు నొద్దకేగెను. అంత బ్ర
హ్మదేవుడాలోచించి ఋతమును సత్యమును బ్రహ్మమును ఓంకారమును త్రిపదయగు గా
యత్రిని రాక్షసబాధను దొలగించు వజ్రమునుగా గనిపెట్టెను. కావున అహోరాత్రి
ములయొక్క సంయోగకాలమునందు సంధ్యనుపాసింపవలయు. అదియె సంధ్యాకాలము.

పేరుఁ దాల్చితివి. శ్రీకృష్ణచంద్రుఁడు మోహినీరూపమును దాల్పఁగా నీవు జగద్విమోహిని యగుమాయవై యతనికార్యమును గొనసాగించితివి. నరసింహలీలలం జూప నేకాలమున భగవంతుఁడు నృసింహాకృతిందాల్చెనో నీవాకాలమున నిజభక్తవత్సలత్వమున లీలాదేవి వైతివి. మరల నాశ్రీహరి వామనుఁడై కశ్యపునినుండి ప్రభవమయ్యెనో నీవాకాలమునఁ గీర్తివైతివి. నిన్ను సర్వలోకములు కీర్తించెను గదా. హరి భార్గవరూపము నెపుడు దాల్చెనో నీవు కుఠారధారవైతివి. ఆదినారాయణుఁడు రఘువంశమున శ్రీరామచంద్రుఁడై యవతరింప నీవు జానకి యనుపేర నవతరించితివి. శార్ఙ్గి బాదరాయణుఁడు కాఁగా నీవు దేవలక్షణములుగల వేదాంతరూపిణివై పుట్టితివి. శ్రీవిష్ణువు సంకర్షణనామమునఁ బుట్టఁగా నీవు రేవతివైతివి. జ్ఞానరూపిణివను నీవే. * కౌణపమోహకారకుఁ డగుబుద్ధుఁడై హరి యవతరింపఁగా జనమోహకారిణి వగుబుద్ధివై నీ వవతరించితివి. ధర్మదేవత యగుభగవంతుఁడు కల్కిరూపమున నవతరింపఁగా నీవు కృతియనఁ బరఁగుదువు.

చంద్రమండలమున శ్రీకృష్ణుఁ డాత్మకళ నిలుప నపుడు నీవు చంద్రిక వగుదువు. శ్రీకృష్ణుఁడు సూర్యమండలముననుండ నీవు ప్రభాదేవి వగుదువు. యాదవేంద్రుఁ డింద్రుఁడై స్వర్గముననుండ నీవు శచీదేవి వగుదువు. హరి హిరణ్యరేతోనామమున నొప్పఁగా నీవు హిరణ్మయీనామమును ధరింతువు.విష్ణువు

---

* బుద్ధో యదా కౌణపమోహకారకో బుద్ధిస్తదా త్వం జనమోహకారిణీ=అని మూలము.

ఉదకాంజలి నిక్షేపా గాయత్ర్యా చాభిమంత్రితాః । నిఘ్నంతి రాక్ష
సాన్ సర్వాన్మందేహాఖ్యాన్ ద్విజేరితాః । తతః ప్రయాతి సవితా బ్రాహ్మణై
రభిరక్షితః । మరీచ్యాద్యైర్మహాభాగైః సనకాద్యైశ్చ యోగిభిః ॥ త
స్మాన్నలంఘయేత్సంధ్యాం సాయం ప్రాతస్సమాహితః । ఉల్లంఘయతి
యో మోహాత్స యాతి నరకం ధ్రువమితి ॥ సంధ్యాత్రయమాహాత్రిః ॥
సంధ్యాత్రయంతు కర్తవ్యం ద్విజేనాత్మవిదా సదేతి ॥

సంధ్యాశబ్దార్థః.

అత్ర సంధ్యాశబ్దేన సంధ్యావుపాస్యా పరమేశ్వరరూపా దేవ
తాభిధీయతే । తాముపాసీత = ధ్యాయేతేత్యనేన సాంధ్యకాలికపార
మేశ్వరోపాసనం విధీయతే ॥ నన్విదమనుపపన్నం ॥ శ్రుతి॥ ఉద్యన్తమ
స్తంయన్తమాదిత్యమభిధ్యాయన్నిత్యాదిత్యస్యైవ తద్ధ్యేయత్వా
మ్నానాదితి చేన్న ఉద్యన్తమిత్యాది శ్రుత్యా ఆదిత్యమండలాంతర్వర్తి
నః పరమేశ్వరస్యైవ ధ్యేయత్వావగమాత్ ॥ తథాహి ॥ సంధ్యాకర్మణః
గాయత్రీజపాంగత్వేన గాయత్ర్యాశ్చ పరమేశ్వరపరతయా ఆదిత్యధ్యా

---

కావున సంధ్యాకాలమున అర్ఘ్యమియ్యనివాడు నరకములనొందునని కలదు. మూడు కా
లములయందు సంధ్యావందనము చేయవలయునని అత్రి వచించెను.

సంధ్యాశబ్దార్థము.

సంధ్యనుపాసింపవలయునన చోట సంధ్య యనఁగా సంధికాలమున నుపాసింపద
గు పరమేశ్వరరూపమగు దేవత చెప్పఁబడుచున్నది. కావున సంధ్యనుపాసింపవలయున
నఁగా సంధ్యాకాలమున పరమేశ్వరునుపాసింపవలయునని తెలియుచున్నది.

ప్ర. ఇదియెట్లు? ఉదయించునప్పుడు నస్తమించునప్పుడును సూర్యుని ధ్యానింప
వలయునని శ్రుతియందుండగా పరమేశ్వరుని ధ్యానింపవలయుననుట యుక్తము కాదా?

ఉ. సూర్యుని ధ్యానింపవలయుననఁగా సూర్యునకంతర్యామియగు పరమేశ్వరుని
ధ్యానింపవలయునని యర్థము. అదియేల? అందురేని సంధ్యాకర్మము గాయత్రీజపమున
కంగము గావునను గాయత్రీమహామంత్రము పరమేశ్వరపరమైనది గావునను ఉద్యన్తమను
శ్రుతి ఆదిత్యుని పరముగా కన్పట్టుచున్నను ఆదిత్యునకంతర్యామియగు పరమేశ్వరుని పర
మనియే గ్రహింపవలయును.

ప్ర. అట్లేల?

పుము. వ్రజసుందరీమణుల కనేకవాక్యములు చెప్పుమనియె. వారు న న్నాదరించిరి. అనేకపారితోషికముల నొసంగిరి. మధురావృత్తాంతమును విన్నవించితిని. శ్రీహరియొసంగిన పత్త్రికావితతి నర్పించితిని: ఇదియ నావిన్నవింపఁదగినవిషయముః. నందాదు లామధురానగరంబున నానందాంబుధి నోలలాడుచున్నవారు. శ్రీకృష్ణమూర్తి సదా నిన్నే స్మరించుచుండును. కార్యములు కొనసాగినవి. దుష్టనృపాలుఁ డగుకంసుఁడు మృతినొందెను. దుర్మార్గులగు తదనుచరులు మరణించిరి. దుర్వృత్తుల బాధలఁ బొరయకుండ సజ్జనుల శ్రీహరి రక్షించెను. ఇదియె కదా మీాయవతారఫల మని పలికి భక్తిభావమున నుద్ధవుఁడు తత్పాదాంబుజముల ధ్యానించుచుండెను.

* ఇట్లుద్ధవుఁడు శ్రీకృష్ణకుశలవార్తలం దెలుపఁగా నాలకించి పత్రమును బరిగ్రహించి చిఱునవ్వునవ్వి సాధ్వీమణియగు రాధిక యుద్ధవునకు బహుమానముగా నవరత్నసారాంగుళీయకమునిచ్చెను. ఆయంగుళీయకము విశ్వకర్మనిర్మించినది. దాని ప్రకాశము ప్రదీపమువలె నుండెను. ఆయంగుళీయకము శ్రీకృష్ణునికొఱకు వహ్నియొసంగెను. రాసక్రీడాసమయమున దేవాదిదేవునకు దేవతాప్రోత్సాహమున నగ్నిదేవుఁడొసంగెను. అది సర్వభూషణభూషణము. అత్యుత్తమము. అనుపమానము. మఱియు నారాధాదేవి నిర్మలమగు నంశుకద్వయము నిచ్చెను. హీరమణినిర్మాణమగు మనోహరహారము నొసంగెను. ఆహారము మున్ను వరుణదేవుఁడు శ్రీకృష్ణమూర్తికొఱ కర్పించెను. శ్రీభా

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండమునుండి లోపలికథ కనుబంధముగా వ్రాయఁబడినదని యెఱుంగునది.

త్యాబ్దవాచ్యా పరబ్రహ్మరూపా చిచ్ఛక్తిరేవ సంధ్యాదేవతేత్యన్యై రుక్తం॥ తథాపి॥ తస్యాశ్శక్తేః పరమేశ్వర నిత్యానపాయినీత్వేన తా దృశశక్త్యుపాసనేనాపి శక్త్యుపాసనస్యావిచ్ఛిన్నత్వేన పరబ్రహ్మరూపేత్యు క్త్యాతస్యాః పరమేశ్వరరూపత్వాద్యథారణేనచ సిద్ధం నస్సమీహితం॥

నను, నసంధ్యాపదం పరమేశ్వర రూపదేవతాపరం; పరంతు కర్మపరమేవ॥ సంధ్యాస్నానమిత్యాదినా పరాశరేణ తత్పరత్వేన స్మృతత్వాదితి చేన్న విధివాక్యే సంధ్యాపదస్య ముఖ్యార్థత్వాత్ పరమేశ్వరపరత్వేపి తత్రత్య సంధ్యాపదస్య లక్షణయా సంధ్యాకాలోపాస్య పరమేశ్వరోపాసనాంగ మార్జనాది క్రియాపరత్వస్య నిర్బాధాత్॥ అన్యథా సంధ్యాముపాసీతేత్యత్ర కర్మణ ఉపాస్యత్వాసంభవేనానన్వయాపత్తేః॥ యత్తు. సంధ్యాపదస్య ముఖ్యవృత్త్యా చిచ్ఛక్తిపరత్వేపి సంధౌ భవా సంధ్యేతి వ్యుత్పత్త్యా క్రియాపరత్వస్యాపి సంభవాత్ తాం క్రియామాదిత్యాఖ్యాం చిచ్ఛక్తిరూపాం దేవతాం ధ్యాయన్కుర్యాదితి తదసారం॥ ఉభయపరత్వే వాక్యభేదాపత్తేః॥ ఉపాసీతేతి

---

సావిత్రీదేవతను ధ్యానము చేయుచు జపము చేయవలయునని వసిష్ఠుడు చెప్పెను గాన అర్కబింబమున నభివ్యక్తి నొందినదియు ఆదిత్య శబ్దముచే జెప్పబడునదియు పరబ్రహ్మరూపమైనదియునగు చిచ్ఛక్తియే సంధ్యాదేవతయని కొందరు చెప్పుచున్నారు. అదియేల యుక్తము గాదు?

ఉ. ఈ యర్థమంత బాధకమైనది కానేరదు. ఏలనిన ఆచిచ్ఛక్తి ఎప్పుడును పరమేశ్వరుని వదలియుండునది కాదు. దానంజేసి యట్టిశక్తి నుపాసించినను నా శక్తితో గూడియున్న పరమేశ్వరుని యుపాసనము లోపించుటలేదు. మరియు నాశక్తి పరబ్రహ్మరూపమని చెప్పియున్నారు. దానంజేసి యాశక్తి పరమేశ్వరరూపమైనదే యని యేర్పడుచున్నది. కావున నీయర్థము సార్థకమేయగును.

ప్ర. సంధ్యాపదము పరమేశ్వరరూపమగు దేవతను చెప్పునది గాదు ఇక కర్మమును చెప్పునదియే యగును. ఏలనిన సంధ్య స్నానము మొదలుగా నారుకర్మములను ప్రతిదినము జేయవలయునని పరాశరుడు చెప్పెను గాన సంధ్యయనగా నిత్యకర్మము లారింటిలో నిదియు నొకకర్మమని తెలియుచున్నది గదా?

ఉ. సంధ్య నుపాసింపవలయునను విధివాక్యమునందు సంధ్యాపదము పరమేశ్వర

నుద్ధవుఁ డాదరమున నిట్లు పలికెను. తల్లీ! సత్యముగా శ్రీహరి యిచ్చటికి రాఁగలఁడు. సూనృతముగా నిన్నుఁ జూడఁగలఁడు. సత్యముగా నీసంతాపము తొలఁగును. శ్రీహరిదగు నాపూర్ణ చంద్రబింబాననమును దర్శించినంతనే నీవంత లంతమొందు. అవంతయు శంక లీవిషయమున లేవు. నేను మధురాపురి కరిగినవెంటనే శ్రీకృష్ణమూర్తిని బ్రయాణముచేయఁ బ్రార్థించెదను. నాప్రార్థన మంగీకరించి శ్రీహరి రాఁగలఁడు. సత్యము. నన్నిటనుండి పయనముసేయ ననుమతింపుము. తల్లీ! నన్నాశీర్వదించి పంపుము. ఇచ్చటివృత్తాంత మించుకంతయు వదలకుండ శ్రీహరిసన్నిధిని విన్నవింతును అని ప్రార్థించుటయు రాధిక యిట్లు బదులుచెప్పెను. వత్సా! మనోహరమధురాపురవగమున కరుగుదువు కాని త్వరపడకుము. ఒక్కదుఃఖకథ నాలకింపుము. స్థిరమనస్కుఁడవై యాలకింపుము. నన్ను మఱచిపోవువాఁడవు కావేని విరహజ్వరకాతరనగు నేను నా ప్రాణనాథునితో విన్నవింపఁదగు నాకథను జెప్పెదను. నారీమణుల మనోవార్త నీపండితుఁ డెఱుఁగఁగలఁడు? పాండిత్యమున నించుక యిట్లుండును గదా యని యూహింపఁగలఁడని నేఁ దలంతును. వేదములే వచింపఁజాలవన నిఁక శాస్త్రములు చెప్పఁగలవా? పుత్రకా! సంతాపకరమగు నావార్త నీకుం దెల్పెద. విని నీవట విన్నవింతువు గాక.

ఉద్ధవా! గృహమునందును వనమునందును నివాసము చేసినదో రెండింటియందును భేదము నాకుం గనఁబడలేదు. తిర్యగ్జంతువు లనఁబడు పశ్వాదులందును మనుష్యులయందును భేదము చూడఁజాలక యున్నదానను. జలమునకు స్వప్నము

ఏవంచాత్ర ఉపాసన మేవప్రధానం॥ అన్యత్సర్వం మార్జనాద్యంగం భవతి॥ పరేతు॥ అర్ఘ్యదానం, సంధ్యాధ్యానం, గాయత్రీజపః ఉపస్థానంచ ప్రధానమితి వదన్తి॥ యద్యప్యత్ర కాల దేవతా యోః నామాది భేద మాహవ్యాసః॥ గాయత్రీ నామపూర్వాహ్ణే సావిత్రీ మధ్యమేదినే। సరస్వతీ చసాయాహ్నే సైవసంధ్యాత్రిషు స్మృతా॥ ప్రతిగ్రహాదన్న దోషాత్పాతకాదుప పాతకాత్। గాయత్రీ ప్రోచ్యతే తస్మాద్గాయంతం త్రాయతే యతః। సవితృ ద్యోతనాచ్చైవసావిత్రీ పరికీర్తితా। జగతః ప్రసవిత్రీవా వాగ్రూపత్వాత్సరస్వతీ గాయత్రీచ భవేద్రక్తా సావిత్రీ శుక్లవర్ణికా। సరస్వతీ భవేత్కృష్ణా ఉపాస్యా వర్ణభేదత ఇతి॥ తథాప్యత్రైవ సైవసంధ్యా త్రిషుస్మృతేత్యుక్త్యా సంధ్యాకాలోపాస్య పరమేశ్వర రూప దేవతాయా ఏవ నామత్రయోక్త్యా కాలత్రయేపి పరమేశ్వరోపాసనమచ్ఛిన్న మేవేతి యుక్తంచ దేతత్॥

## సంధ్యాకాలాతి క్రమణ ప్రాయశ్చిత్తం.

సంధ్యాకాలేత్వతిక్రాన్తే స్నాత్వాచమ్య యథావిధి। జపేద్దశశతాం దేవీం తతస్సంధ్యాం సమాచరేత్॥ జమదగ్నిః॥ ఏకాహం స

---

అది యెట్లనిన - ప్రాతఃకాలమున గాయత్రియు - మధ్యాహ్నకాలమున సావిత్రియు - సాయంకాలమున సరస్వతియు నుపాసింప దగినవారు. ప్రతిగ్రహము - అన్నదోషము మొదలగు పాతకముల నుండి రక్షించునది గాన గాయత్రి యనియు, సూర్యునందు ప్రకాశించునది గాన సావిత్రి యనియు - వాగ్రూపమైనది గాన సరస్వతి యనియుం జెప్పబడెను. గాయత్రి యెఱ్ఱనివన్నె గలదియు - సావిత్రి తెల్లని వన్నె గలదియు, సరస్వతి నల్లనివన్నె గలదియునని యున్నది గదా!

ఉ॥ అయినను. ఆసంధ్యయే మూడు కాలములయందు నుపాసింప దగినదని యటనే కలదు గాన సంధ్యాకాలమున నుపాసింప దగిన పరమేశ్వరరూపమగు దేవతకేమూడు పేళ్లు కలవని తెలియుచున్నది గాన మూడు కాలములయందు పరమేశ్వరుడే ఉపాసింపదగినవాడనుటకు బాధకములేదు.

## కాలాతిక్రమణమునకు ప్రాయశ్చిత్తము.

సంధ్యావందనమునకు కాలము అతిక్రమించునెడ స్నానము నాచమనంబును చేసి వేయిమార్లు గాయత్రిని జపించి సంధ్యావందనము చేయవలయును. ఒక దినము స

పంకజమును మరలఁ జూడనుగదా. మాలతీకేతకీచంపకకానన
ముల కా శ్రీకృష్ణుని గలసి యిఁకఁ బోఁజాలను గదా. సుందర
రాసమండలమును జూడ నప్పటివలెఁ బో శక్తురాలను గాదు
కదా. శ్రీహరింగూడి సురుచిరచందనకాననమున కేగఁజాలను
గదా. మలయపర్వతరత్నమండిరమునకు మరలఁ బ్రయాణము
సేయఁగలనను నూహ లేదు కదా. మాధవీకాననమందును,
రహస్యమగు మధుకాననమునందును, శ్రీఖండకాననమందును,
హరిం గూడుభాగ్యము మరల నాకు దొరకదు కదా. స్వచ్ఛ
మగు చంద్రసరోవరమును దర్శింపఁజాలను గదా. విస్యందక
మును సురవనమును నందనమును బుష్పభద్రకమును భద్రక
మును శ్రీహరింగూడి మరలమరలఁ బోవుభాగ్య మింకను గలు
గునా. రమ్యమై వికసించిన మాలతీలతచెంత మాధవుఁ డెట్లుం
డెనో తలంచినఁ గన్నీరు వచ్చుచున్నది. మాధవీరాత్రి యెట్లు
పోయెను? మధుసమయ మెచ్చటి కేగెను? మాధవుఁ డేల
రాఁడాయెను? అని యిట్లు పలికి రాధాదేవి శ్రీకృష్ణపదాంబుజ
ముల ధ్యానించుచు నట్లే మూర్ఛమునింగెను. పులకాంచిత
సర్వాంగియయ్యెను. శోకించెను. గాఢమూర్ఛ మున్గెను

మహామతులారా! ఉద్ధవుఁడు రాధంగాంచుటయు నామె
యపుడున్నవిధము, మూర్ఛమునింగియున్న యారాధ యుద్ధ
వునిం గొంత తెప్పిఱిల్లి చూచి సంతోషభరమున శ్రీహరికుశల
వార్తల నడుగుటయు, నుద్ధవుఁడు మధురావార్తలం దెలుపు
టయు లోనగువిషయములు గల యీభాగమును జదివితిరి
కదా. ఉద్ధవుఁడు రాధికం బ్రశంసించినభాగ మీకథకు

వాచ్యః॥ ముహూర్త త్రయం ప్రాతరితి స్మరణాత్॥ ప్రదోష కాలోప్యే తావానేవ॥ త్రిముహూర్తం ప్రదోష స్స్యాద్భానావస్తం గతేసతీ తి స్మృతేః॥ తత్రచత స్రోఘటికా గౌణమధ్య కాల ఇత్యర్థః॥ గోబిలః॥ ముఖ్యకాలే యదావశ్యంకర్మకర్తుం నశక్యతే।గౌణకాలేపి కర్తవ్యంగౌణోప్య త్రేదృశోమతః॥ ఈదృశః ముఖ్యఏవేతి సమ్మతః॥

సంధ్యాతి క్రమణే ప్రాయశ్చిత్త ద్వైవిధ్యం

సంధ్యాయాం ద్వౌకాలౌ నిర్ణీతౌ గౌణ ముఖ్య భేదాత్। ముఖ్యకాలే తిక్రాన్తే గౌణకాలే ప్రాప్తంచే దనుష్ఠానం వక్ష్యమాణప్రా యశ్చిత్త పూర్వకం కార్యం॥ తచ్చప్రాయశ్చిత్తం ద్వివిధం॥ గాయత్ర్యా ర్ఘ్య ప్రదాన రూపమేకం। ప్రాణాయామ మాత్మక మపరం॥ తత్రప్రథ మ మాహవ్యాసః॥ ప్రణవ వ్యాహృతియుతాంగాయత్రీం శిరసాసహ। ఉచ్చార్య దత్వార్ఘ్యం మూఢా సంధ్యాకర్మ సమాచరేత్॥ ఇతి॥ ఇదం ప్రాయశ్చిత్తం సంధ్యాత్రయేపి సమానం॥ తదాసీమేకం ప్రాణా యా మం కృత్వా ముఖ్యకాలాతి క్రమణదోష పరిహారార్థ మర్ఘ్య ప్రక్షేప ణాత్మకం ప్రాయశ్చిత్తం కరిష్యఇతి సంకల్ప్య ప్రాయశ్చిత్తార్ఘ్యం దత్వా త తస్సంధ్యాము పాసీత॥ అత్రద్వయోః ప్రాయశ్చిత్తయో స్సముచ్చ యో నతువికల్పః॥ ఏకస్మి న్దోషే శ్రూయమాణాని ప్రాయశ్చిత్తాని స ముచ్చీయే రన్నితి శ్రౌతే దర్శనాత్॥

---

యం కాలమునను నాల్గు గడియలనేప్ర గౌణ కాలమగునని స్మృత్యంతరము నందు గలదు. ముఖ్యకాలమున కర్మముచేయ శక్యము కానప్పుడు గౌణకాలమునఁ జేయనగును. గౌణ కాలమునఁ జేసినను ముఖ్యకాలమున జేసిన దానితో తుల్యమగు ఫలమే కలుగును.

సంధ్యాతి క్రమణము నందు ప్రాయశ్చిత్త విశేషము.

సంధ్యా వందనమునకు ముఖ్యమని, గౌణమని రెండు కాల ములు నిర్ణయింపఁబ డియెను. ముఖ్య కాల మతిక్రమించి గౌణ కాలమునఁ జేయవలసి వచ్చినప్పుడు చెప్పబో వు ప్రాయశ్చిత్త మును ముందు గాఁజేసి చేయవలయు. ఆప్రాయశ్చిత్తంబును అర్ఘ్య ప్ర దానరూపము. ప్రాణాయామ రూపమునని రెండు విధములు. అందు— ప్రణవమును—

ఇన్ని విధముల రాధాంబికను బురాణము లభివర్ణించు టకుం గలహేతువును విమర్శింతము. శ్రీభాగవతమునందు రుక్మిణి యెందే నిట్లు వర్ణింపఁబడినదా యనియుఁ బరికింతము.

"రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని."

అనునది ప్రమాణమేయని భావింతము. ఏపురాణముఁనం దేవిష యమున్నను బ్రమాణమేయని యంగీకరింపవలయును. ఒక్కటి ప్రమాణమని యింకొక్కటి ప్రమాణముకాదని మన మన రాదు. అది మనోహైన్యముఁను వెలిఁబుచ్చును. ప్రతిపురాణము తత్త్వమునే తెలుపును. రీతిభేదమేకాని తత్త్వముఁన భేదము దానియందుఁ గానరాదు. మనస్సులలోనున్న నీచత్వమే యిన్ని బాములఁ బెట్టుచున్నది. ప్రకృతవిషయమును వినుఁడు. రాధ పరదేవియని పురాణములు ఘోషించుచున్నవి. ఎన్నియో స్తోత్రము లీవిషయమునే తెల్పుచున్నవి. కావున రాధ శ్రీహరికి మేనత్తయని భ్రమింపకుఁడు. అది యవివేకులు చెప్పుమార్గము. దానినాశ్రయించిన నది మనల సంసారసాగరమున ముంచును. రుక్మిణి లక్ష్మ్యంశసంభూతురాలుకాదని నాభావము కాదు. ఇది సత్యము. నాయభిప్రాయ మీయిర్వురు భగవతియగు శ్రీదేవీ కలాసంభూతలే యనియే. ఇం దేయేభక్తున కేదేవియందు భక్తి కుదురునో వాఁ డాదేవినే మహాలక్ష్మి యని భావించి యుపాసింపవచ్చు. తత్ఫల మొక్కటియేకాని హెచ్చుతగ్గు లందులేవు. రాధయందు లోపము నారోపింపరాదని తెల్పుటకే యీగొడవ పెక్కుసారులు వ్రాయవలసివచ్చినది. క్షమింతురు గాక.

ముచితం॥ తదనంతర మతిపన్నా నుష్ఠానః। యదా పునస్సాయం సంధ్యా కాలోప్యతి క్రాంతః స్యాత్ తదానీం యథా క్రమమను ష్ఠానం భవతి అతి క్రాంతానః శేషత్వాత్॥ కించ— మధ్యాహ్న సంధ్యారాత్రౌ చే త్ప్రమాదా త్క్రియతే యది। సౌరం స్థానే జపేత్సూక్తం సౌరం వైశ్వానరీయక మితి॥ నను రాత్రౌ ప్రథమ యామేప్యతి క్రాంతే కాగతి రితి చేత్॥ అనుష్ఠానలోప ఏవగతిః॥ ఉక్త ప్రాయశ్చిత్తమే వకుర్యాత్॥

### సంధ్యాది నిత్యకర్మణా మేకదినాతి క్రమణే ప్రాయశ్చిత్తం.

సంధ్యాది నిత్యకర్మణా మనుష్ఠానాభావేన ఏకస్మిన్న హోరాత్రే గతేపరే ద్యురుపోష్య షోడశ ప్రాణా యామాను పూర్వక మష్టో

---

సంధ్యనే అనుష్ఠించి తరువాతనే పరరికృత్యముల చేయ్యవలయునని కొందఱు చెప్పుదురు. మతికొందఱైతే:- పూర్వకర్మములు కాలాతి క్రమణము నొందినను— తరువాతకర్మములు ప్రాప్తించియున్నప్పుడు పూర్వకృత్యముల నేముందుగఁజేసి తరువాతనే తక్కినవి నాచరింపవలయునని వచనముచే బట్టి క్రమముగనే చేయవలయునని చెప్పుదురు.

ప్ర॥ ఇందేది యుక్తము?

ఉ॥ మొదట సాయంకాలమునందే సంధ్యావందనము విధింపఁబడి యున్నది. అప్పటికి సాయం సంధ్యాకాలమతి క్రమింపకున్నయెడ- స్వకాలే బలవత్త్వపి అనుష్ఠాయమునుబట్టి ముందుగ సాయం సంధ్యావందనమునే చేసి తరువాతనే పరటి కృత్యములఁ దీర్చుకొనవలయు. అట్లు గాక నప్పుడు ప్రాతర్మాధ్యాహ్నములను క్రమముగాఁ జేయునెడ సాయం సంధ్యకును కాలాతిక్రమణ దోషము సంభవించును గదా?

ఇఁక- నప్పటికి సాయం సంధ్యా కాలంబును నతిక్రమించి యున్న యెడ అన్నియు కాలాతి క్రమణమును పొందినవె గాన ప్రాతస్సంధ్యాదులను క్రమముగనే చేయవలయును॥ ప్రమాదవశమునమాధ్యాహ్నిక సంధ్య రాత్రియందుచే యవలసి వచ్చునెడ సౌరసూక్తమును చెప్పవలసి వచ్చును వైశ్వానర సూక్తమును చెప్పవలయును.

ప్ర॥ రాత్రిప్రథమ యామంబును నతిక్రమించునెడ నేమిచేయవలయును

ఉ॥ నాఁడుప వాసముండి చెప్పిన ప్రాయశ్చిత్తమును మఱునాఁడు చేసికొనవలయు॥

సంధ్యాది నిత్యకర్మముల కొకదినము కాలాతి క్రమణము గలిగిన నేమి ప్రాయశ్చిత్తము?

ఉ॥ సంధ్యాది నిత్యకర్మములు చేయవలను గాక యొకదినము గతించినయెడల మరునాఁడు పవాసముండి పదునాఱు ప్రాణాయామములు చేసి వేయినెనిమిది మార్లు గాయ

కింపుఁడు. కథమాత్రమే ప్రధానము కాదనియు నందుఁ బ్రతిపాదింపఁబడు శ్రీకృష్ణపరమాత్మ నెఱుంగుటయే ప్రధానమనియు నెఱుంగఁదగు.

## ఉద్ధవుఁడు రాధాంబ నూఱడిల్లం జేయుట.

* రాధ శ్రీహరిం దలంచితలంచి తదేకతానమనస్కయై మూర్ఛిల్లెను. ఆమె దుస్థితినిగాంచి యుద్ధవుఁడు విస్మితుఁడయ్యెను. అతని మనమున భయమునకుఁగూడఁ జోటుగలదు. మృతకళేబరమాయని తోఁపఁజేయు నా జగదంబను గాంచి శిశిరోపచారసదృశములగు మధురవాక్కుల నూఱడిల్లం జేయుచు నామెకు శ్రీహరియందుగల భక్తిభావము నెఱింగి తనభక్తి చాలఁ దుచ్ఛమైనదని తలంచెను. జగత్తంతయు నట్టిదేయని నిశ్చయించెను. ఆ రాధాంబయే భాగ్యవతియన్న భావ మాయుద్ధవుని మదిఁ బాదుకొనియెను. అత్తఱి నుద్ధవుఁ డిట్లు పలికెను. కల్యాణీ! ఊఱడిల్లు మూఱడిల్లుము. జగజ్జననీ! నీకు నమస్కరించెదను. జగత్తంతయు భవత్స్వరూపమే యగు. మరల నచిరకాలమున శ్రీహరిని సందర్శింపఁగలవు. నీవలన నీజగము పవిత్రము కావలయును. నీపాదధూళిచే నీభూమి పవిత్రయగును. నీముఖమే పవిత్రము. నిన్ను సేవించు నీగోపికలే పుణ్యముచేసికొన్నవారలని నానమ్మకము. లోకములెల్ల మంగళకరస్తవములచేతను సంగీతవిశేషములచేతను నిన్నే గానము చేయుచున్నవి. నీపవిత్రయశస్సును శతక్రతుప్రభృతిదేవతలు సనకాది మహర్షులు వినుతించి కృతార్థులైరి. నీపూజయే పాపములఁ బోఁగొ

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము తొంబదినాల్గవ యధ్యాయమునుండి వ్రాయఁబడినదని యెఱుంగవలయు.

చ మనం భవేత్। బ్రహ్మయజ్ఞేతు వైకుర్యాచ్ఛ్రౌతేరాచమనం ద్విజ ఇతి॥ తథా। స్మృత్యాచమన ముక్తం తత్రైవ॥ సహా తాం గుళిహస్తే నగృహీత్వాంబు వీక్షితం। ముక్త్వాంగుష్ఠకనిష్ఠాభ్యాం త్రిః పిబేద్బ్రహ్మ తీర్థతః। తతః ప్రక్షాళ్య హస్తౌచ సంకుచ్యాఙ్గుష్ఠ మూర్ధ్వాధ॥ సహా తాంగుళిమూలైర్వత్రిః ప్రమృజ్యాత్తతో ముఖం। ప్రక్షాళ్య హస్తౌచా భ్యుక్ష్య పాదౌ శిరస్తథైవచ। మధ్యమాంగుళి మృష్టైర్వత్రిః స్పృశేద్ ఘ్రాణమూలకం। హస్తౌప్రక్షాళ్య సంస్పృష్ట్వా ఘ్రాణాదిద్వయశః పృథక్। అంగుష్ఠేన ప్రదేశిన్యా ఘ్రాణౌపశ్చాదుపస్పృశేత్। అంగుష్ఠానామికాభ్యాంచ చక్షుశ్శ్రోత్రే పృథక్ పృథక్॥ అంగుష్ఠకనిష్ఠాభ్యాం నాభింపశ్చాదుపస్పృశేత్। తలేన హృదయం స్పృష్ట్వా స్పృశేదంగుళిభిశ్శిరః। అంగుళ్యగ్రైర్దక్షిణాభిశ్చ బాహుమూలద్వయం స్పృశేత్। పణవేనోదకం ధృత్వా హ్యాత్మానం పరిషేచయేత్॥ఇతి॥ ఆపస్తంబసూత్రోదితం యథా॥ తిష్ఠన్నాచామేత్। ప్రహ్వోవా ఆసీనస్త్రిరాచామేత్। హృదయంగమాభిరద్భిః। త్రిరోష్ఠౌ పరిమృజేత్। ద్విరిత్యేకే। సకృదుపస్పృశేత్। ద్విరిత్యేకే। దక్షిణేన పాణినా సవ్యం ప్రోక్ష్య పాదౌశిరశ్చ। ఇంద్రియాణ్యుపస్పృశేత్॥ చక్షుషీనాసికే శ్రోత్రే చ। అథాప ఉపస్పృశేత్ ఇతి॥

తథాశ్రుత్యాచమనంతత్రైవ॥ దేవ్యాః పాదైస్త్రిభిః పీత్వా చాబ్లింగైర్నవభిః స్పృశేత్। సప్తవ్యాహృతి సంయుక్తా గాయత్రీ

---

యవలయును. (బ్రహ్మయజ్ఞము చేయునప్పుడు శ్రుత్యాచమనము చేయవలయునని యీనందే కలదు॥ ఆగ్రంథముననే స్మృత్యాచమనము ఇట్లు నిర్ణయింపఁబడి యున్నది.

బొటన వ్రేలిని చిటికెన వ్రేలిని వదలి కడమవ్రేళ్లు కూర్చిన చేతితో జలము గ్రహించి బ్రహ్మతీర్థముతో ముమ్మారు పానము జేయవలయును.

తరువాత చేతులు కడిగికొని- వ్రేళ్లు ముడిచి పెదవులను ముమ్మారు తుడువవలయును. కూర్పఁబడిన వ్రేళ్లతో నోరుముమ్మారు తుడుచుకొనవలయును. చేతులు కడిగికొని పాదముల మీదను శిరము మీదను నీరుచల్లుకొని నడిమి వ్రేళ్ల వెనుక భాగములతో నాసికా మూలమును ముమ్మారు తాకవలయును॥ చేతులు కడిగికొని ముక్కు మొదలగు

లోకమునఁగల యాఁడువారందఱకు నపకీర్తిని దెచ్చుచున్న దానవు. నారీమణుల మానస మొరు లెఱుంగకుండ నుండవ లయు. దానిని వెలిఁబుచ్చిన నపకీర్తియేకాని కీర్తిరాదు. ప్రయత్నమునఁ గన్నులు విప్పి చూడుము. లోక మెట్లున్న దియుఁ దెలియఁబడును. మదిని బతిభావము నునిచికొనుము. ప్రేమమును బహిర్గతముగా నొనరింపకుము. అది నారీధర్మము కాదు. శత్రుమిత్రులకు జాతితోఁ బనిలేదు. సురేశ్వరి! కార్యవశముననే శత్రువులు మిత్రులు దొరకుదురు. ప్రాజ్ఞుఁడు స్వకార్యమును సాధింపవలయును. మూర్ఖత కార్య ధ్వంస మొనరించును. రాధా! ఎవ్వఁ డెవతుకకు భర్త? ఎవ్వఁ డెవతుక కప్రియుఁడు? సమయానుసారము నివి యగు చుండును. సత్పురుషులు కార్యమును సమయమును లక్షించి ప్రవర్తింతురు. శత్రువు ధనము నపహరించుటయేకాక ప్రాణములనుగూడ హరించును. పరుషములాడును. దుఃఖము నొనఁ గూర్చు. ఇవియే శత్రువుల లక్షణములు. సత్కులప్రసూత వగు నిన్నుఁ బరిత్యజించి యంతియగాక శోకసాగరమున ముంచి నీచేతనమును బ్రాణములను గ్రహించి దారుణచిత్తుఁడై యాకృష్ణుఁ డెచటికో పోయెను. మూఢాత్మగల యోరాధా! ఇంకేల యాతని స్మరించెదవు? దారుణమగు నీ శోకమును వదలుము. ప్రయత్నమున నాత్మను గాపాడుకొనుము. ఆత్మాతిరిక్తప్రియపదార్థము లోకమున లేదు కదా!

అని యూఱడించునంతఁ బద్మావతియను గోపిక యిట్లు భాషించెను. ఆనాఁడు శ్రీహరితో యమునాతరంగిణీ పావన సలిలాంతరమున నీభావమెల్ల నెఱిఁగించితివి. వినియు నెఱింగి

వామదేవసంహితోక్తం కారణోక్తం తథైవచ। ఆరణ్యకోక్త మన్యచ్చ శ్రౌతముక్తం చతుర్విధం॥ తద్యథా వామదేవ సంహితాయాం। నమశ్శంభవ ఇత్యాది మంత్రాస్త్వాచమన పశ్చిమేషట్। భవోద్భవాయ నమ ఇతిమనుః ప్రథమః స్మృతః। వామదేవాయ వాక్యస్థా మంత్రా ఏకాదశ స్మృతాః। నమస్తే అస్తు భగవ న్విశ్వేశ్వర ఇతి స్మృతః। మహాదేవస్త్ర్యంబక స్త్రిపురాంతక ఇతీరితః। త్రికాగ్ని కాలః కాలాగ్ని రుద్రాహ్వాయ ఇతి స్మృతః। నీలకంఠశ్చ సర్వేశ్వర స్సదాశివ ఏవచ। శ్రీమహాదేవ ఇత్యేతే సంయుతా నమసాస్స్మృతాః। అష్టావింశతి నామాని కీర్తితాని మహాన్తిచ। ఏతైరాచమనాదీని కార్యాణ్యాహుర్మనీషిణః। శంభ్వాదిభి స్త్రిభిర్మంత్రైః పీత్వా శేషైశ్చ సంస్పృశేత్। ఓష్ఠద్వయంచము బుకమం

---

ల ముడిచి కొనవలయు॥ కడమ రెండిటితో శిరసున జలము జల్లుకొని- యొక వాక్యముతో కుడిచేత నీరుతీసికొని యెడమచేతిమీద ప్రోక్షింపవలయు; అనంతర మొక వాక్యము నుచ్చరించుచు పాదములమీద నీరు ప్రోక్షించి- చివరవాక్యముతో జలమును శిరమున జల్లుకొనవలయు॥ తరువాత- సప్తవ్యాహృతులు- త్రిపదా గాయత్రి గాయత్రీశిరము నను వానితో కడమ యంగములను దాకవలయు॥ అట్లుగాక- ప్రణవముతో గాని- గాయత్రితో గాని- వ్యాహృతులతో గాని చేయనగును॥ వైదికాచార నిర్ణయమునందు శంఖలిఖితుడు॥ శైవపంచాక్షర మంత్రముతో ముమ్మారు లాచమనముచేసి యొకమారు పెదవులు తుడువవలయు. ఈశానాది పంచబ్రహ్మ మంత్రములతో నాయా యాస్థానములను స్పృశింపవలెను॥ ఇది శ్రౌతాచమనము. అనియున్నది॥ గరుడపురాణమున శివపూజా ప్రస్తావమునందు "ఓంహ్రీం ఆత్మతత్త్వాయ స్వాహా" ఈమొదలగు మూడు మంత్రములతో నాచమనము చేయవలయునని యున్నది॥ స్మృతిరత్నాకరమునందు॥ శైవులకు శివనామంబులును యతులకు ప్రణవంబును వైష్ణవులకు విష్ణునామంబులును ఆచమన కృత్యంబున యోగ్యంబులని యున్నది॥ మానవ పురాణము నందు॥ ముక్తిని కోరుదురేని కేశవాది నామములను వదలిపెట్టి శంభ్వాది నామములతోడనే ఆచమనము చేయుడని యున్నది॥

వామదేవ సంహితోక్తము, కారణాగమోక్తము, ఆరణ్యకశ్రుత్యుక్తము, మన్వుక్తమునని శ్రౌతాచమనము నాల్గు విధములు॥ అందు వామదేవసంహితోక్త మెట్లనిన, నమశ్శంభవేచ ఈమొదలగు నాలు మంత్రములును, భవోద్భవాయ నమః అనునదియొక్క

మన్మథబాధ యిపుడు బాధించెడిని. నీకు శత్రువు చంద్రుఁ
డా మధుమాధవులా ? మన్మథుని శంకరుఁడు కాల్చెను గదా.
మరల నాతఁ డుదయించెనో యేమో ? రాహువు శశాంకుని
భక్షించుఁగాక. అయినను మరల నాతని రాహువు క్రక్కును.
మధువు మిత్రశోకమునఁ బ్రాణముల భరింపఁజాలక యడవుల
పాలయ్యెను. సుధాసింధువు శీతాంశుఁడు నాపాలిటికి విషసిం
ధువుగను విషాంశువుగను దోఁచెడిని. జ్వలద్వహ్ని సువేషుఁ
డనియే తలంతు. ఏలన నాతనికాహుతి ఘృతముకదా. పరిమళ
గంధవాయువు సదా ప్రాణములఁ గాల్చుచుండును. ఏలొకో?
నాయీసఖి యాహారమును మాని నిట్టూర్పులు పుచ్చుచున్న
యది. ఓ యుద్ధవా! శ్రీకృష్ణసంకీర్తన మొనరింపుము. ఆమహా
నీయుని నామస్మరణము తద్గుణవర్ణనశ్రవణము తత్కుశలవా
ర్తాసంశ్రవణము వేగమ రాధకుఁ బ్రాణముల నిలుపఁగలవు.

అని యుద్ధవుని వేఁడుచుండ శశికలయను గోపిక యిట్టు
లనియె. ఓమాధవీ! నీ వేమెఱుంగుదువు? శ్రీకృష్ణుని జీవితే
శ్వరుని మాహాత్మ్యము నీకుఁ దెలియునని నే సంభావింపను. ఏ
శ్రీకృష్ణుని బ్రహ్మాదిదేవతలు చతుర్వేదములు తెలియఁజాలకు
న్నారో, ఎఱుంగజాలకున్నవో, ఆపరమాత్మనే సత్పురుషులు
ధ్యానింతురు. తదీయపావనపాదపద్మముల నారాధింతురు.
పద్మయు సరస్వతియు దుర్గయు ననంతుఁడును మహేశ్వరుఁ
డును శ్రీహరి నెఱుంగలేకయున్నారో, సిద్ధేంద్రులు మునీం
ద్రులు మనువులు తెలిసికొనలేక చింతించుచున్నారో ఆకృష్ణుని
విధమిదియని నిర్ణయింపఁదరమా ? * సర్వాత్మయగు నిర్గుణునకు

* సర్వాత్మనః కుతో రూపం నిర్గుణస్య కుతో గుణాః=అని మూలము.

గాం చామేత్॥ ద్విః పరిమృజ్య॥ సకృదు పస్పృశ్య॥ సవ్యం పాణిం పాదౌ ప్రోక్షతి॥ శిరశ్చక్షుషీ నాసికే శ్రోత్రే॥ హృదయమాలభ్య॥ ఇతి॥ మున్యుక్తం దేవ్యాః పాదై రిత్యాద్యుక్తమేవ॥

సూత్రోదితం స్మృతి ప్రోక్తం స్మార్త మాచమనం ద్విధా॥ యథా॥ ఆపస్తంబ సూత్రే॥ త్రిప్రాచామే దిత్యాది స్మృతి ప్రోక్తం యథా॥ త్రిః పిబేద్బ్రహ్మ తీర్థత ఇత్యాద్యుక్తమేవ॥ స్కాందే శంకర సంహితాయాం॥ నామభిః కేశ వాద్యైస్తు తాంత్రి కాచమనం మతం॥ బ్రహ్మయజ్ఞాది కాలేతు శ్రుత్యాచమ నమిష్యతే॥ సంధ్యాది స్మార్త కృత్యేషు స్మృత్యాచ మనమీరితం। మూత్రాది శౌచకాలేతు పురాణాచమనం స్మృతం॥ శంభు నామాదిభిః పంచ వింశత్యా కుసుతాస్పభః॥ శంభో శంకర శాంత శాశ్వత శివస్థాణో భవానీపతే భూతేశ త్రిపురాంతక త్రిణయన శ్రీకంఠ కాలాంతక। శర్వోగ్రాభవ భర్గభీమ జగతాంనాథాకయ శ్రీసిధే రుద్రేశాన మహేశ్వరేశ్వర మహాదేవాయ తుభ్యం నమః॥ ఇతి॥

ఏవ ముదాహృత వచనాను రోధేన కేశవాది నామ్నాం తాంత్రికత్వసం ప్రతిపత్త్యాన వైదికజన గ్రాహ్యత్వం॥ అథ శేషాం పరకీయత్వా పౌరాణి కత్వాభ్యు పగమేపిన శ్రౌతస్మార్త కర్మాంగా చమన గ్రాహ్యత్వాం సిధ్యతీతి స్ఫుటం॥

---

మికలచే చెవులను, కరతలముతో రొమ్మును తాకవలయు॥ ననియున్నది॥ మున్యుక్తము గాయత్రీ మంత్రముయొక్క పాదములతోఁ జేయవలయునను వదివివరింపఁ బడియెను॥

సూత్రోక్తము, స్మృతి ప్రోక్తమునని స్మృత్యాచమనము రెండు విధములు॥ ఈ రెండు విధములు ప్రతిపాదింపఁ బడియె యున్నవి॥ పురాణాచమనమెట్లనిన స్కాందమున శంకరసంహిత యందు॥ కేశవాది నామముల చేయఁబడునది తాంత్రికాచమన మగును॥ బ్రహ్మయజ్ఞాది కాలములయందు శ్రుత్యాచమనము చేయవలయును॥ సంధ్యాది కృత్యములయందు స్మృత్యాచమనము చేయవలయును॥ మూత్రాది శౌచ కాలమునందు పురాణాచమనము చేయవలయును॥ శంభు మొదలగు నిరువదియైదు నామములఁ జేయఁబడునది పురాణాచమనమగును॥ శంభవే స్వాహా॥ శంకరాయ స్వాహా॥ శాంతాయ స్వాహా॥ శాశ్వత, శివ, స్థాణో, భవానీపతే, భూతేశ. త్రిపురాంతక— త్రిణయన, శ్రీకంఠ—

లుగలరు. వారెల్ల నాపరతత్త్వము నెఱుంగఁ జాలకున్నారు. నిర్గుణుని సగుణునిగా భావించి ధ్యానించి తత్పాదపంకజరే ణువును శిరముల ధరించుచున్నారు. వేదములు వినుతింపఁజాలక తికమక పడుచున్నవి. సరస్వతియు నీశ్వరు నాతనెఱుంగఁజాల కున్నయది. అంతియకాక భీతయై స్తుతించుచుఁ దన యశక్తత ను వెలిఁబుచ్చుచున్నది. సహస్రవక్త్రములుగల శేషుఁ డాతని వినుతింపఁ జాలక వణఁకుచున్నవాఁడు. వేదజనకుఁడగు బ్రహ్మ యు వినుతుల నలరించి తత్త్వమెఱుంగక సిగ్గుపడుచున్నాఁడు. అట్టి నిత్యుని సత్యరూపుని జగదీశుని మాధవి యజ్ఞానమున నిందించుచున్నది. దీనిచే గోపికాసభ యపవిత్రయనం బరఁగె. గోపికలజీవనము వ్యర్థము. ఈ గోపికావితతియందు మహావిభవ సంపన్నయగు రాధిక శ్రీహరిని ధ్యానించుచున్నది. దివానిశ ములు తదేకతానచిత్తయై యున్నది. ఏ శ్రీకృష్ణమూర్తినామ స్మరణమునఁ గోటిజన్మార్జితపాపరాశి పటాపంచలగునో శోక ము నశించునో అట్టి మహానుభావుని స్మరించుచు రాధ పవిత్ర చరిత్రయయ్యెను.

అనుచుండ రత్నమాల యనఁ బరఁగు గోపికామణి యి ట్లు నుడివెను. సఖి! శ్రీకృష్ణుఁడు గోవర్ధనాద్రిని వామహస్తతల మున ధరించెను. దాన జగజ్జనకుఁడగు నాతనిప్రతాపము చరి త్రము యశస్సు వర్ణనాతీతము కాలేదా? దేవరాట్టగు నింద్రుఁ డు శైలసహస్రముల భేదింపఁజాలును. భగవంతుఁడు లీలామా త్రమున నాపర్వత లక్షసంఖ్యల భేదింపఁజాలును. ఏమహానీయాం నంశకలచే యజ్ఞవరాహ ముదయించి దంతాగ్రమున వసుధను ధరించెనో వసుధాతలమున ననేకపర్వతము లాసమయమున

మన ప్రకరణేఽవిహితత్వాత్ ధర్మప్రవృత్తౌ. కృష్ణపండితీయే సాంధ్యభాష్యే చ శౌచాచమన ఏవ తేషాం విహితత్వాచ్చ తదనుష్ఠాన స్యావిహితానుష్ఠాన రూపత్వేన తద్వచనస్య స్వయం భ్రష్టోఽన్యానపి భ్రంశయతీతి న్యాయ గోచరత్వాచ్చ అనుపాదేయతాం మన్యామహే॥

## ఆచమన నియమాః.

నిబద్ధ శిఖకచ్ఛస్తు ద్విజ ఆచమనం చరేత్॥ కృత్వోపవీతం సవ్యాంసే వాఙ్మనః కాయసంయుతః। గోకర్ణాకృతిహస్తేన మాషమాత్రం జలం పిబేత్। తన్న్యూన మధికం పీత్వా సురాపాన సమం భవేత్। ముక్తాంగుష్ఠ కనిష్ఠాభ్యాం త్రిః పిబేద్బ్రహ్మతీర్థతః॥ నాచామేదాసనస్థాంఘ్రిర్నబద్ధాసన ఏవ వా। న ప్రసారిత పాదో వా బహిర్జాను కరోఽపి వా। పవిత్రకర ఆచామేత్ శుచిః కర్మార్థమాదరాత్। సపవిత్రో సదర్భో వా కర్మ కుర్వీత నాన్యథా॥

---

వునకైనన్ సర్వవేదముల యందును పరత్వము నిరూపింపఁ బడియున్నది. దీనింబట్టి కేశవాది నామములు తాంత్రికములనియు, శివనామములు వైదికములనియు నిర్ణయమగుచున్నది. తాంత్రికములగు కేశవాది నామముల కుస్వాహా శబ్దముతో సంబంధము కలుగఁ జేయుట కంటె వైదికములగు శివనామములకు స్వాహాశబ్దమును జేర్చియుపయోగించుకొనుటయే శ్రేయము॥ ఇదిగాక- తాంత్రిక శబ్దములకు స్వాహాకారమును జేర్చినను నవి వైదికములగునా? కానేరవు.

ప్ర॥ విష్ణునకు పరత్వము పాంచరాత్ర తంత్రముల యందేగాని వేదముల యందు లేదనియెట్లు విశ్వసింప వలయును?

ఉ॥ శివుఁడే పరబ్రహ్మము ఆయన యొక్క యంశమే జగము అని వేదములు చెప్పుచున్నవి. అయినను వేదములన్నియు శివపరముగా నుండఁగా నేయని యోర్వలేమితో పాంచరాత్ర వాదులు వేదముల యందును విష్ణుపారమ్యము గలదని యపార్థములు చెప్పఁ బూనిరి. వారిపద్ధతిని నిరసింప నిందజోచ్చితి ననిచెప్పుచు శ్రీమదప్పయ దీక్షితులవారు శివకర్ణామృతము నందును, శివతత్త్వ వివేకము నందును, వేదములయందు విష్ణుపారమ్యము లేదని నిర్ణయించిరి. ఈయర్థము వ్యాసపథము మొదలగు గ్రంథముల యందు మాచేతను నిరూపింపఁ బడియెను. కావున వైదికులగు వారు శ్రౌతస్మార్త కర్మాంగములగు నాచమనములందు శివనామముల గ్రహించుటయే న్యాయ్యమని యేర్పడుచున్నది.

పుము. కార్యార్థము రూపము నామము వేషమును ధరించి కార్యాంతమున వానివదలు నాపరమాత్మకు నిర్గుణునకు రూప నామవేషములతోఁ బనియేమి? ఈమాట పల్కినందులకు న న్నే మూఢురాలగు గోపిక నిందించుచున్నది. కాని యింతదనుక నామాట కేమియర్థమో యెఱుంగఁజాలకున్నది. పాప మీ మూఢగోపిక ప్రకృతిపరుండగు భగవంతుని తత్త్వమెఱుంగును గాఁబోలు? భగవంతుఁడు జ్యోతిస్స్వరూపుఁడు, పరమాత్మ, ఈశ్వరుఁడు, భక్తానుగ్రహావిగ్రహుఁడు. త్రైలోక్యజననియగు మహాలక్ష్మి యాతని పాదపద్మరజస్సును గోరుచుండును. దాసి కవలె సదా యాపరదైవమును సేవించుచుండును. భీతిచేఁగుంది పూజించుచుండును. సరస్వతియు నట్లే సేవించుచుండును. అనియె.

ఇట్లు గోపికలు భాషించుచుండఁగా నాలకించి యుద్ధ వుఁడు పులకాంచితసర్వాంగుఁ డయ్యెను. రోదనము చేసెను. క్రిందఁ బడియెను. మూర్ఛమునింగెను. భక్తిభావమున నాపర మేశ్వరుని హృదయమున నిలిపి ధ్యానించెను. గోపికల భక్తిం గాంచి తనను దుచ్ఛునిగా భావించుకొనియె. ఎట్లో స్మృతిగలిగి యిట్లుపలికెను. సకల ద్వీపములలో జంబూద్వీప ముత్తమోత్త మము మనోహరమునగు. దానియందే భారతవర్షమలరారు. అది పుణ్యప్రదము శుభదమునగు. ఇందు గొప్పసుకృతకర్మముల నొనరించి మఱొక్కతావునఁ దత్ఫల మనుభవింపఁదగు. కాన నీద్వీపము ధన్యతమము. గోపికాపదాంబుజరజస్స్పర్శమునఁ బావన మయ్యెను. పరమనిర్మలము. అట్టి యీ భారతవర్షమున కంటె గోపిక ధన్యురాలు. స్త్రీబృందమందు మాన్యురాలగు.

తత్రైవ సంకల్ప్య వంశపైత్ర్యస్మృత్యా గోత్రనామాన్విత మానసః। కు
శాదీనాం బహేనాన్యా కల్పయే దాసనం బుధః॥ వంశే దరిద్ర స్స్యా ధరిణ్యా
న్పల్లవ చిత్తభ్రమః। దర్భమయే దాసనం ధీమాన్ స్యాత్ వ్యాధి నాశనం। స
ర్వసిద్ధ్యై వ్యాఘ్రచర్మ జ్ఞానసిద్ధ్యై మృగాజినం। నాపేక్షితస్య గృహి
ణః కృష్ణసారాజినం స్మృతం। పీఠే ద్వితీయపక్షస్య బ్రహ్మచారీ మృగాజి
నే। వస్త్రాసనం రోగహరం కంబళం దుఃఖదం స్మృతం। స్వస్తికాద్యాస
నేష్వథ విశేషతః శిరాతులః। వీరాసనం స్వస్తికం వా బద్ధ్వాన్యతరదా
సనం। పద్మం వా ముక్తకం వాపి బద్ధ్వా జపము థా చరేత్॥ ఇతి॥

ఆసనలక్షణముక్తం తత్రైవ ఏకం పాదమథైకస్మిన్ విన్యస్యోరుణి
సంస్థితః। పాదేఽన్యస్మిన్ స్తథా చోరుం వీరాసనమిదం స్మృతం॥ జానూ
ర్వోరంతరే సమ్యక్ కృత్వా పాదతలే ఉభే। ఋజుకాయస్సమాసీన స్స్వ
స్తికం తత్ప్రచక్షతే॥ ఊర్వోరుపరి విప్రేంద్ర కృత్వా పాదతలే ఉభే। ప

---

## భూతాద్యుచ్చాటనము.

చంద్రజ్ఞానోత్తరమునందు॥ భూమియందున్న భూతములు తొలగిపోవుగాక. సత్కర్మములకు విఘ్నములొనర్చు భూతములు శివాజ్ఞవలన నశించుగాక అనిచెప్పియెడమకాలి మడమతో నేలమీద మూడుమారు కొట్టవలయు॥ అని యున్నది భూమికి బరువై యున్న భూతములు పిశాచములును లేచిపోవుగాక. వానిని విరోధించక యేను వైదిక కర్మము నారంభించెదను॥ అని సంకల్పించి మనసున మంత్రార్థమును భావించుచు సత్కర్మములను గాని జపమును గాని చేయవలయును॥

వెదురుకఱ్ఱ- ఇటికెలు- నేల- తృణము, చిగురుటాకులు మొదలగువాని యందు గూర్చుండు నెడ దారిద్ర్యము వ్యాధి దుఃఖము సంభవించు గాన నియ్యవి కూడదు వ్యాఘ్రచర్మమునందు గూర్చుండి జపముచేయు నెడ సర్వము సిద్ధించును కృష్ణాజినమునందు గూర్చుండు నెడ జ్ఞానము సిద్ధించును. నిష్కాముడగు గృహస్థునకు కృష్ణాజినము యుక్తమేయగును. వస్తుంతును. బ్రహ్మచారియు కృష్ణాజినము మీద గూర్చుండ నగును. వస్త్రాసనమున గూర్చుండిన రోగము తొలంగును. కంబళాసనమున గూర్చుండు నెడ దుఃఖము కలుగును. స్వస్తికాద్యాసనములతో గూర్చుండ వలయును. వీరాసనము స్వస్తికాసనమును. పద్మాసనము. ముక్తాసనము ననువానిలో నేదేనిసుఖాసనమును నవలంబించి జ

దిరుగుచుందుము. అందు సీతాదేవి పరమధన్యురాలు. జగన్మాత. పతివ్రతాతిలకము నగు. అయోనిసంభవయగు సీరాధయుఁ బూజ్యురాలు. నేను నయోనిసంభవనే యగుదును. రాధ శ్రీదామశాపవశమున నీలోకమున వృషభానునకుం బుత్రియయ్యెను. సనత్కుమారునిశాపమున మేము నిందే యవతరించితిమి. మేనకయు నేనును రాధయు నొకానొకతరుణమున మనోహరమగు శ్వేతద్వీపమున నలరారు విష్ణుమూర్తిని దర్శింపఁజనితిమి. అందు సనత్కుమారుఁడుండుట మే మెఱుంగము. మే మట నుండఁగనే యామునిని యరుదేర మే మెదురుపోక నమస్కరింపక యుంటిమి. కోపమూని యామౌని మమ్ము శపించెను. ఆముని యోగీంద్రులకునెల్ల గురూత్తముఁడగు. ఆ మౌని తల్లజుఁడు మమ్ముం జూచి యిట్లుపలికెను. మూఢలారా! మీరు భూమియందే నివసింపుఁడు. స్వర్గమునకు మరల రాఁ దగరు. దురహంకారవిశిష్టలు గాన మర్త్యులకుఁ బ్రాణప్రియలైయుండుఁడు. అనిశపించిన మే మతిభక్తి నామహామునిని నాశ్రయించితిమి. అంతఁ బ్రసన్నుఁడై యాసనత్కుమారుఁడు మువ్వురకును వేర్వేఱ నొక్కొక్కవర మొసంగెను. మొదటిదగు మేనాదేవి హిమవంతునకుఁ బత్ని కాఁగలదు. ఆమెకుఁ దొలికూఁతురు పార్వతి పుట్టును. ధన్యయను రెండవకాంత యోగివర్యుఁడగు జనకభూపతికిఁ బత్నియగు. ఆమెకు మహాలక్ష్మి సీతానామమునఁ బుట్టును. వృషభానుఁ డనువైశ్యునకు దుర్వాసుఁ డనుముని శాపకారణమునఁ గనిష్ఠపత్ని కలావతి యగును. వృషభానుఁడు యోగవేత్తలలో నుత్తముఁడు. ఆతఁడు గోకులవాసి. ద్వాపరాంతమున నాతనికిఁ గడపటిభార్య

ప్రాణాయామస్య సకల పాప నివృత్తిః ఫల మిత్యుక్తం మనునా॥ దశప్రణవ సంయుక్తాః ప్రాణాయామాస్తు షోడశ। అపి భ్రూణహనం యస్మాత్పునం త్యహరహః కృతా ఇతి॥ సచ ప్రాణాయామస్త్రిప్రకార స్తముక్తం॥ పూరకః కుంభకో రేచ్యః ప్రాణాయామస్త్రి లక్షణః॥ నాసికాపృష్ఠ ఉచ్ఛ్వాస సోధ్మాతః పూరక ఉచ్యతే। కుంభకో నిశ్చల శ్వాసో రేచ్యమానస్తు రేచకః ఇతి॥ తల్లక్షణముక్తం వ్యాసేన॥ దక్షిణే రేచకం కుర్యాద్వామే నాపూర్య చోదరం। కుంభకేన జపంకుర్యాత్ప్రాణాయామస్స ఉచ్యతే। పంచాంగు లీభిర్నాసాగ్ర పీడనం ప్రణవాభిధా। ముద్రేయం సర్వపాపఘ్నీ వానప్రస్థ గృహస్థయోః॥ కనిష్ఠానామి కాంగుష్ఠై ర్నాసాగ్రస్యచ పీడనం। ఓంకారముద్రా సాప్రోక్తా యతేశ్చ బ్రహ్మచారిణ ఇతి॥

ప్రాణాయామ విని యుక్త మంత్రార్థః

అథతద్వినియుక్తమంత్రార్థోయథా॥ ఓంభూః॥ ఇత్యనేనమంత్రేణ నానా గ్రన్యస్తలోచన స్తదభిధేయం పరమేశ్వర మంతర్భావయన్ ప్రాణాయామంత్రయం కుర్యాదిత్యాకూతం॥ ఓంకార శ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా। కంఠంభిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభావితి స్మృత్యాఓమితిబ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ ఇతిశ్రుత్యా

---

ప్రాణాయామమునకు ఫలమేమనిన, పదిమార్లు ప్రణవమును జపించుచు చేయు ప్రాణాయామములనుప్రతిదినము పదునారు మార్లు చేయు నెడభ్రూణహత్యాదిదోషము గూడ నశించునని మనువు చెప్పుటచే సకల పాపములు తొలంగుటయే ఫలమని తెలియుచున్నది॥ పూరకము కుంభకము। రేచకమునని ప్రాణాయామమునకు మూడంగములుకలవు॥ ముక్కునుండి గాలిని పీల్చుటకు పూరక మనియు॥ దానిని కదలకుండ నిలుపుటకు కుంభకమనియు॥ గాలినివదలి పెట్టుటకు రేచక మనియు పేరు॥ ఎడమ ముక్కునుండి గాలినిపీల్చి కుడిముక్కునుండి విడువవలయును. కుంభకమున జపముచేయ వలయును॥ ఐదు వ్రేళ్లతో ముక్కుపట్టుకొనుటకు ప్రణవముద్ర అనిపేరుఇదిసకల పాపములం బోగొట్టును॥ వానప్రస్థునకు గృహస్థునకును నీముద్ర హితమైనది॥ చిటికెనవ్రేలు అనామిక బొటన వ్రేలు అనువానితో పట్టుకొనుటకు ఓంకారము ద్రయనిపేరు ఇదియతికి బ్రహ్మచా

త్రము. భగవద్భక్తి నీకు దృఢముగ నెలకొనియెను. కాన ధన్యుఁడవనియె.

* ఇట్లు కలావతి భాషించుచుండఁ దులసి యచ్చటి కరుగుదెంచి యిట్లు పలికెను. ఉద్ధవా! సర్వప్రాణులయందును వేఱువేఱ దేవతలుందురు. ప్రాణము విష్ణుస్వరూపము మనస్సు. బ్రహ్మమయము. చేతన ప్రకృతిస్వరూపిణి. ప్రకృతి బుద్ధిరూపయు సర్వశక్త్యధిదేవతయు నగు. జ్ఞానము శంభుస్వరూపము. పురుషుఁడు ధర్మస్వరూపుఁడు. నిర్గుణబ్రహ్మము ప్రకృతికిఁ బరము. పరమాత్మయు నాతత్త్వమే. ఆపరమాత్మయే యీకృష్ణుఁడు. సర్వకర్మసాక్షి, సకలప్రాణిసాక్షి, సుఖదుఃఖభోక్తయు నగు. జీవుఁడు తత్ప్రతిబింబకుఁడు. నేత్రములు చంద్రసూర్యాంశములు. జిహ్వా సరస్వతీవికారిణి. చర్మము భూతత్త్వమయము. బాహువులు దిక్పాలకాంశములు. ఇవన్నియు నాత్మకుఁ బరిచారకరూపములు. ఆత్మకుఁ బ్రియములుగ నుండును. కావుననే మహానుభావులు పరమాత్మను సేవింతురు. యోగులు నిరుపమాన భక్తిచే భగవంతుని ధ్యానింతురు. కర్మములకుఁ గర్మాచరణపరాయణులకును సాక్షి పరమాత్మయే. అట్టి భగవంతునికడ రహస్యవిషయ మేమి గలదు? శ్రీకృష్ణుఁ డంతర్వర్తియై ప్రచారము సలుపుచుండును. కావున నామహానుభావుఁ డెఱుంగని దిం దే మున్నది? అనియెను.

అత్తఱిఁ గాళికయను గోపికవచ్చి యుద్ధవునితో నిట్లు ముచ్చటించెను. ఆర్యా! బాలతరుణవృద్ధులని మనుజులు ముప్వి

---

* సర్వప్రాణిషు దేవాశ్చ తిష్ఠంత్యేవ పృథక్పృథక్, ప్రాణో విష్ణుశ్చ విషయీ మనో బ్రహ్మ చ చేతనా—అని మూలము.

చ పరశివాభిధానత్వ మగ్రేస్పష్టీ భవిష్యతి॥ తస్మా దేవచాస్య పరమ మాంగళికత్వమామ్నాయ సారత్వ మిత్యాద్యుపపద్యతే॥ తత ఏవచ. ధర్మానుష్ఠాన యోగ్యతా చిత్తైకాగ్ర్యనిర్విఘ్న పరిసమాప్తి సిద్ధ్యర్థాత ద్విసియోగా కాంక్షిత సంప్రదానార్థం చాస్యాదా వామ్నాన మితి సాధు॥

భూరితిభూలోకః. ఇదమధోలోకానాం సప్తానాముప్యుపలక్షణం॥ భువరితి భువర్లోక ఇత్యాద్యనుసంధేయం॥ భూరాదీనాం సప్తానామపి భువనానాంత చ్ఛరీరత్వ తత్కార్యత్వ తచ్ఛాపస్య త్వాద్యుపస్కృత తచ్ఛేషత్వ జ్ఞాప నార్థం— పరమేశ్వరస్య సర్వాంతర్యా మిత్వాద్యుపస్కృత తచ్ఛేషిత్వ బోధనార్థంచ పరశివాభి ధానస్యతస్య ప్రణవస్య ప్రతిపదం కీర్తనం యుక్తం॥ అతఏవ॥ సప్తవ్యాహృతయ స్సప్తలోకా భూరాదయః క్రమాత్। ప్రత్యేకం ప్రణవాదిత్వాత్తన్మయా ఇతి సూచ్యత ఇత్యుక్తం॥ గాయత్ర్యర్థస్తు జపావసరే౽భిధాస్యతే॥ ఓమాపో జ్యోతిరితి గాయత్రీ శిరః॥ అస్యాయమర్థః॥ ఆపః= జలాని, ఓం= పరమేశ్వర ఏవతస్యాష్ట మూర్తిత్వాత్॥ జ్యోతిః= సౌరాది తేజః ఓం= ఈశ్వరఏవ, ఏవంరసః= మధురాదిః, అమృతం= దేవానామన్నం, బ్రహ్మ వేదః, ఏతత్సర్వం,ఓం పరమేశ్వరఏవ. భూర్భువస్సువరితి భూరాదీనాము పలక్షణం, ఏతదపి ఓం పరమేశ్వర ఏవేత్యర్థః॥ అనేన మంత్రేణ ప్రాణాయామాం స్త్రీన

---

ఎవ్వారలు ఫలకాంక్షలేక నిత్యనైమిత్తిక కర్మములచే పరమేశ్వరునారాధింతు రో వారలను గ్రహించి మలమాయాది పాశములనుండి విముక్తులను గావించునని భావము॥ దాననె పరమేశ్వరు డెవ్వని ననుగ్రహించు నో వానికే లభ్యుండగునని శ్రుతి చెప్పుచున్నది॥ దీనింబట్టి జీవునియొక్క బంధవిముక్తి పరమేశ్వరున కధీనమేయని తెలియుచున్నది॥ ప్రణవము పరమేశ్వరు నామధేయ మేయనుట ముందు స్పష్టము కాగలదు॥ దాననె ఇదిమంగళ ప్రదమగుటయు వేదసార మగుటయు సిద్ధించుచున్నది॥ ఆ కారణముననే ధర్మానుష్ఠాన సౌయోగ్యత చిత్తైకాగ్ర్యము నిర్విఘ్న పరిసమాప్తి సిద్ధించుట కును ఈ కర్మానుష్ఠాన మంతయు పరమేశ్వరు నుద్దేశించియే యను నర్థమును తెలుపుటకును ఇదితొలుత పఠింపఁ బడియెననుట యుక్తము॥

తిగా శ్రీకృష్ణుని బరమపురుషునిగా భావించి యాబుద్ధితోనే వారిని సేవించువారని తెలిసెను. ఇది యెఱుంగుటయే మనకుఁ దరణోపాయము. భగవత్తత్త్వమిట్టిదని తెలియఁజాలినంత తెలియుటకంటెఁ బురుషార్థ మింకొక్కటిలేదని నాభావము. విచారమనఁగా నిదియే. ఈవిచారమున రూఢజ్ఞాన మలవడకయే యెందఱో పెనఁగులాడుచున్నారు. తపస్సులను జేయుచున్నారు. వేదాంతగ్రంథముల నోపికంగొని త్రిప్పుచున్నారు. ఎన్నిపుస్తకములఁ ద్రిప్పినను బ్రాక్తనసత్కర్మము సమ్ముఖము కాకున్నచో నది తెలియదు. ఇది యెఱింగినవారు సుఖపడుదురు. లేకయున్నఁ బుస్తకములు వెదకివెదకి వేసారుదురు. కాని ఫలము శూన్యమే. వారియోపికం గాంచి భగవంతుఁ డనుగ్రహించినచో నించుకలాభము గలుగునేమోగాని లేకయున్న నీకష్టము వృథాయనవలసినదే. పుస్తకపఠనము నిష్ఫలమన వలనుపడదుగాని యంతతోనిల్చినచో నిష్ఫలమనక తప్పదు. చదివిచదివి యందించుకంతయు ననుష్ఠానమునందుఁ జేర్పకయున్న లాభ మిసుమంతయు లేదు. భక్తిబోధకగ్రంథములఁ బఠించిన నేమిఫలము? దాని నభ్యసింపవలయుఁ గదా. అభ్యాసమే ప్రధానము గాన దానికిం బ్రయత్నింపవలయు. దానికి సర్వభూతసమత్వము మొదటి సోపానము. భూతదయయు నట్టిదే. ఇవి రెండో దవక యున్న భగవత్సేవాభాగ్యము లభింపదు. చేసినకర్మఫలముల శ్రీకృష్ణపాదార్పణము చేయకున్న నామహాపురుషుఁ డనుగ్రహింపఁడనుట నిక్కము.

"న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. ౪

హోహా, శ్రీమతః,...గోత్రస్య,...శర్మణః ధర్మపత్నీ, సమే తస్య మహాపాతకదురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాముపాసే ఇతి సంకల్ప్య

పవిత్రముదకం బ్రహ్మముఖాఖ్యేన మంత్రేణ సంమంత్ర్య, తదుదకం స్పృష్ట్వా ఆపోహిష్ఠేత్యాది మంత్రైర్మార్జనం శిరసి సమాచరేత్॥ బ్రహ్మముఖోయం మనునా నిరుక్తః॥ ఓంకార పూర్వికాస్తిస్రో మహావ్యాహృతయో వ్యయాః। త్రిపదా చైవ గాయత్రీ విజ్ఞేయం బ్రహ్మణో ముఖమితి॥

అత్ర యద్యపి సంధ్యాత్రయ మధ్యే సాయం సంధ్యాయా ఏవ ప్రాథమ్యం తథాహి॥ శౌనకః॥ ఉపనీతో కృతాయాంతు సాయం సంధ్యాముపక్రమేత్॥ ఇతి, తథాప్యాహ్నిక క్రమానురోధేన ప్రాతస్సంధ్యా ప్రస్తుతా॥

---

దలగు మంత్రములతో శిరమున జలము చల్లుకొనవలయును॥ బ్రహ్మముఖమను మంత్రమెద్దియనిన మొదట ప్రణవంబును, తరువాత మహావ్యాహృతులును, త్రిపదా గాయత్రియు జేర్చినది బ్రహ్మముఖమను మంత్రమగు నని మనువు జెప్పెను॥

ఉపనయనము చేయగనే సాయం సంధ్యనుపక్రమింపవలయునని శౌనకుడు చెప్పిన దానిం బట్టి యిచ్చట సాయం సంధ్యను వివరించుటయె న్యాయమైనను ఆహ్నిక క్రమము బట్టి ప్రాతస్సంధ్యయే ఆరంభింపబడుచున్నది॥

సంధ్యావందనము లోని మంత్రములకు ఋషి-ఛందస్సు చెప్పవలెనని ప్రమాణము కలదు. అయినను ఆపస్తంబ సూత్రులకు నట్టి యాచారము లేదు గాన వ్రాయబడలేదు. ప్రణవముతో గూడిన మంత్రములతో మార్జనము చేయగా నెక్కుడు ఫలము కలుగును॥ ఆపోహిష్ఠా మయోభువః మొదలగు తొమ్మిది వాక్యములకు ప్రణవము చేర్చిన వానితో మార్జనము చేయు నెడ సంవత్సర కృతమగు పాతకము నశించునని శౌనకుడు చెప్పెను॥ ఋక్కు యొక్క అంతమందు గాని పాదాంతమందు గాని తృచ యొక్క అంతమందు గాని మార్జనము చేసికొనవలయునని బ్రహ్మ చెప్పెను॥ అయినను బహుప్రమాణములను బట్టియు శిష్టాచారము బట్టియు పాదాంతము నందె మార్జనము చేయవలయునని తెలియుచున్నది॥

మార్జనము అర్చనము బలికర్మము భోజనము మొదలగు వానిని దేవతీర్థము తోనే

గలరు. దిక్పాలకాదులు గలరు. నామధేయభేదములే గాని కృత్యము లొక్కటియే. ఇందఱికిని మూలసూత్ర మొక్కటియే. ఆమూలసూత్రమే పరాత్పరుఁడనియు నిర్గుణుఁడనియుఁ బిలువంబడును. త్రిమూర్తు లాపరమపురుషుని యాజ్ఞనుబూని తమకృత్యములగు సృష్టిపాలనసంహారములఁ జేయుచుందురు. ఇంద్రాదులు వారియాజ్ఞ ననుసరించి కొలఁదిలోకములకుఁ బాలకులై తమపని నిర్వహించుచుందురు. ఇందఱికి నిన్నిపనుల నియమించిన తత్త్వ మొక్కటియే యగును. అదియే సర్వసాక్షి యని పిలువఁబడును. ఆపరతత్త్వమే పుంలింగశబ్దములఁ బురాణపురుషుఁడు లోనగునామములఁ బిలువఁబడును. లింగభేదముల శబ్దములు భేదించుటయే గాని తత్త్వమునందు భేదము లేదు. ఆ పరమపురుషుని యిచ్ఛయే ప్రకృతి. భగవగదిచ్ఛ యెట్లో అట్లు ప్రపంచప్రవర్తనము సాగుచుండును. ఇట్టులుండ లోకమునఁగల మానవులు త్రిమూర్తులలో న్యూనాతిశయముల లెక్కించి పెనఁగులాడుట హాస్యాస్పదమనక తప్పునా? భగవంతు నిచ్ఛానుసారము ప్రవర్తించువారికి స్వతంత్ర మెక్కడిది? భగవత్తత్త్వము విష్ణువుగనే యవతరించి యిన్నికార్యములు చేయుచున్నాఁడన్నను దక్కిననామరూపము లాభగవంతునకు లేవన్నచో దానిమహిమమును నాశనము చేయఁబూనినట్లు కాలేదా? అది చేయఁదగు మహాకార్యమా? సర్వాంతర్యామియై సర్వజగదాధారమై నిరంజనమై యద్వితీయమగు నా పరతత్త్వమున కొకరూపమే కలదనుటకంటె దుర్వాద మేదియుండును? ఏభక్తుఁ డేభక్తురా లేరూపమున నాపరతత్త్వమును ధ్యానించునో ఆరూపమున వారిం గృతకృ

అథమార్జనోపయుక్త మంత్రార్థోయథా॥

మా॥ ఆపోహిష్ఠా మయోభువ స్తాన ఊర్జేదధాతన।
మహేరణాయ చక్షసే యోవశ్శివ తమోరసః।
తస్యభాజయతేహనః ఉశతీరివ మాతరస్తస్మా
అరంగ మామవో యస్యక్షయాయజిన్వథ।ఆపోజన యథాచనః॥

---

ద్దుపోవక ముందు నుండియే అన్నమో అన్నమోయని పొట్టగొట్టుకొను నభ్యాసము కలదని తెలియు చున్నది॥ మహే=గొప్పదియగు రణాయ= రమణీయంబునునగు చక్షసే= జ్ఞానము కొఱకు— దధాతన= నిలుపుడు॥ మిక్కిలి రమణీయమగు పారమేశ్వర జ్ఞానమును మాకొసంగు డనియర్థము॥ వః= మీయొక్క— యః= ఏ, శివతమః= మిగుల శాంతమగు, రసః= ఆనందము కలదో తస్య= నిరతిశయ మగు నాపారమేశ్వరానంద మును ఇహ= ఈజన్మము నందు— నః= మమ్ములను— భాజయతే= పొందింపుడు॥ ఈజన్మయుననె పారమేశ్వరానందము నొసంగి మమ్ములను ముక్తనొందఁ జేయుడని భావము॥ అది యెట్లన్నన, ఉశతీః= ప్రేమగల, మాతరః= తల్లులు స్తన్యాసముచే పుత్రులను పోషించి నట్లు ఆనందము నొసగ మమ్ములను ముక్తులను జేయుడంచు తాత్పర్యము॥ వః= మీయొక్క— తస్మై= ఆరసమును ఆనందమును అరం= మిగుల గమామ= పొందుదుము గాక యస్య= ఏయానందము యొక్క— క్షయాయ= నివాసము కొఱకు, జిన్వథ= ప్రేమగలిగి యున్నారో ఆయానందమును పొందుదుము గాక యనిపూర్వ వాక్యముతో నన్వయము॥ హే ఆపః= ఓయుదకము లారా నః= మాకు— ఆనంద ప్రాపక మగు పారమేశ్వర జ్ఞానమును జనయథా= సంపాదించుడు॥ జలములచేతనము లగుటంజేసి వానిం ప్రార్థింప యుక్తము గదు గాన జలాభిమాని దేవతయే ఈమంత్రమున జెప్పబడెనని గ్రహింప వలయును॥ పూర్వాచార్యులైననో జలములకు నంతర్యామి యగు పరమేశ్వరుని పరముగా నీమంత్రమును వివరించి యున్నారు॥ అయినను సర్వాంతర్యామి యగు పరమేశ్వరుడు సర్వ మంత్రములకును ప్రతిపాద్యుఁడే గాన నీమంత్రమున ప్రతిపాద్యుఁడనుటలో విశేషము లేదు॥ గాన నీమంత్రము జలాభిమాని దేవతా పరముగనె వివరింపఁ బడియెను॥ ఆపోహిష్ఠా అను మంత్రమునకు తొమ్మిది పాదములు గలవు॥ ప్రతి పాదమునను జలమును ప్రోక్షించు కొనునెడ బ్రహ్మహత్యాదోషము తొలంగును॥ అని వ్యాసుడు చెప్పెను॥ ఆపోహిష్ఠా అను మంత్రముతో జలము చల్లు కొనవలయును॥ జలములే సకలదేవతలునగు॥ దేవతలచేత నే తన్ను పవిత్రునిగాఁ జేసికొనవలయు॥ అని శ్రుతి చెప్పుచున్నది॥

నన్ను మఱువకుము. నన్ను మఱచితివా యింతకంటెఁ బాపము వే ఱొకటి యుండదు. నా వచించిన మాటలన్నియు వదలక శ్రీహరికడ విన్నవింపుము. మత్ప్రభువై పరమానందస్వరూపుఁడగు శ్రీకృష్ణుని శీఘ్రింబ తోడ్కొని రమ్ము. స్త్రీజన్మమునందు, నందును స్త్రీలనడుమ తగినప్రాణనాయకుం బడసి ఖేదమునుగాంచినది కలదా? అట్టి దౌర్భాగ్యస్థితి నాకేగలిగినది. నాకేమి యుపదేశింతువు? నాకు నుచితబోధముచేయ నేమికలదు? ఆత్మ లేకయున్న దేహులదేహములు నిష్ఫలములు. సంప్రీతితోఁ గూడినసౌభాగ్యము గౌరవము. నిత్యము నూతనమే యగు రహస్యమగు నవసంగమజనితప్రేమ మత్యంత దుర్లభము. మనసున సదా శ్రీకృష్ణునే స్మరించుదానను. మఱొకపదార్థము నామదికిం దగులదు. రాత్రులయందు నిద్రనుమాని స్మరించుట శోకవృద్ధికి హేతువగు. వత్సా! శోకసాగరనిమగ్నురాల నగు నన్నుద్ధరింపుము. అభయప్రదానము చేయుము. అది సర్వతీర్థస్నానఫలముల నొసంగును. దుర్నివారమగు మానసమును బ్రబోధింపఁ జాలకున్నదానను, శ్రీకృష్ణపరమాత్మ చరణాంభోజద్వంద్వమును స్మరించుదానను, తద్గుణములఁ గీర్తించుదానను, తన్మహిమమును వినుతించుదానను, ప్రేమసాగరమగు నాతనిహృదయమును స్మరించుదానను, తత్సౌభాగ్యమును స్మరించిస్మరించి నామనస్సు నిలుకడ గాంచకున్నయది. జగమున నేకాంతలకైన నాకుఁగల్గిన యిట్టిదుఃఖము కలదా? శ్రీకృష్ణవిరహదుఃఖమును నేనుదప్ప నితరు లెవ్వరెఱుంగుదురు? సీత యించుకయెఱుంగును. జగత్త్రయమున నేనుదప్ప దుఃఖినిలేదనియే నేను భావించెదను. నాయీయవస్థను విని యేస్త్రీ నాసాదృశ్యము నభిల

చేతనత్వేన ప్రార్థనాయోగ్యత్వాత్ పూర్వాచార్యాస్తు, అపాం వంత ర్యామీ పరమేశ్వర ఏవ ప్రకృతమంత్ర ప్రతిపాద్య ఇతి వదంతి॥ యోవ శ్శివతమోరస ఇత్యాది తత్పక్షఏవసుసంగతంచభవతి॥ తథాపి, సర్వాం తర్యామిణః పరమేశ్వరస్య సర్వమంత్ర ప్రతిపాద్యతయాన ప్రకృత మంత్ర ప్రతిపాద్యత్వ విశేషఇతి జలాభిమాని దేవతా పరతయైవ వివృతమితి జ్ఞేయం అతివ్యాసః॥ఆపోహిష్ఠాస్సు ప్రసిద్ధాసవపాదా భవన్తి తేషా దేవా దేక్షి పేద్వారి బహ్మాహాత్యాం వ్యపోహతి॥ ఇతి॥ శ్రు॥ ఆపో హిష్ఠా మయో భువ ఇత్యృగ్భి ర్మార్జయన్తి ఆపోవై సర్వాదేవతాః దేవతాభిరేవా త్మానం పూయన్త ఇతి॥

ఏవముక్త విధినా మార్జయిత్వా సూర్యశ్చేత్యపః పిబేత్। తథా చశౌనకః॥ అగ్నిశ్చేత్యను వాకేన సాయం కాలే అపః పిబేత్। సూర్యశ్చేత్యను వాకేన ప్రాతః కాలేపిబేదపః ఆపఃపున న్త్విత్య నేన మాధ్యాహ్నేచ జలంపిబేత్॥

మం॥ సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః। ం
పాపేభ్యోరక్షన్తాం। యద్రాత్ర్యా పాపమకార్షం। మనసావా
చాహస్తాభ్యాం। పద్భ్యాముద రేణ శిశ్నా। రాత్రిస్త దవలుం
పతు। యత్కించ దురితంమయి। ఇదమహం మామమృత
యోనౌ। సూర్యేజ్యోతిషి జుహోమిస్వాహా॥

---

సూర్యశ్చ అనుమంత్రము నకు స్వర్థము॥

సూర్యః= పగటి కధిపతి అనగా సూర్యమండలాభిమాని దేవతయగును॥పవలుచేయు కర్మములు ఆదేవత యొక్క వశమున నుండుగావ నాదేవతను ప్రార్థించుటయుక్త మేయగు వాస్తవము ఆదిత్యాంతర్యామి యగుపరమేశ్వరుడే ఇచటప్రార్థింపఁ బడుచున్నాఁడు సర్వకర్మాధిపతిత్వము పరమేశ్వరు నందే సమంజసము గావున నాయర్థమే యుక్తము. మన్యుః= క్రోధముపాపప్రవృత్తి క్రోధముయొక్క వశముననుండుగావ దానింప్రార్థించుటయు నుచితమే॥ మన్యుపతయః= రాగద్వేషాదులు అవికన్ను మొదలగు నింద్రియములను గాలములతో విషయముల యందుఁ బ్రవేశించిన వారిని వశపరచుచు కొనుచుండును॥ అట్లు వశపరచుకొన కుండుటకై వానిప్రార్థించుటయును నావశ్యకమే యగును॥ మన్యుకృతేభ్యః= కోపముచే చేయఁ బడిన పాపేభ్యః= పాపముల వల్లనుండి రక్షన్తాం= రక్షింతురు

పించును. మృతవృక్షము ముకుళబహుళంబగు. సమీరుఁడు
కదలకుండును. సూర్యుఁడు సముద్రుఁడు స్వస్థత నొందుదురు.
అట్టిపరమేశ్వరు నేభాగ్యముచే గర్వించి మఱతును? ఏభగవం
తునిభయమున వాయువు వీచుచున్నదో, సూర్యుఁడు తపింపఁ
జేయుచున్నాఁడో, యింద్రుఁడు వర్షించుచున్నాఁడో, అగ్ని
కాల్చుచున్నాఁడో, మృత్యువు జంతువులయందుఁ దిరుగుచు
న్నాఁడో, వృక్షములు ఫలించునో, పుష్పించునో, సముద్రము
లుప్పొంగక నిలిచియుండునో, గ్రహములు మునులు దేవతలు
తమతమ కార్యములయం దేమఱుపాటు లేకయున్నారో, అట్టి
భగవంతుఁడు శ్రీకృష్ణుఁడువచ్చి యెపుడు దర్శనమిచ్చునో తెలి
యఁజాల కున్నదానను.

కాలునకుఁ గాలుఁడు. సంహర్తకు సంహర్త. సృష్టికర్తకు
సృష్టికర్త. స్వతంత్రులకు స్వతంత్రుఁడు. అట్టి భగవంతు నేయై
శ్వర్యమదమున మఱచిపోవుదును? నా కీదుఃఖము పోవునట్లు
చేయఁగలవా రెవ్వరును లేరు. సావిత్రియు, సరస్వతియు, వేద
ములు, వేదాంగములు, సత్పురుషులు, దేవతలు, సహస్రవక్త్రుఁ
డగు ననంతుఁడు, వేదజనకుఁ డగు బ్రహ్మ, శంభుగణనాయకులు,
యోగీంద్రులును సమర్థులు కారు. స్థితికి గతి విచారింపఁదగినది.
మార్గశూన్యమందు గతివిచార మేటికి? సర్వసుఖదుఃఖశుభా
శుభాదులు కాలసాధ్యములు. ఆకాలము దుర్నివారము. జగ
ములు కాలసాధ్యములు. వత్సా! ఉద్ధవా లెమ్ము. మధురానగర
మునకుం బొమ్ము. ఈవ్రజవాసమును బరిత్యజింపుము. ప్రయా
ణము సాగింపుము. చిరకాలము కృష్ణవిరహము దుఃఖము
కొఱకగును. సుఖలేశముకూడ నపుడుండదు. మధురాపురికరిగి

పద్భ్యాం అనాక్రమితవ్యస్య ఆక్రమణాదినా, ఉదరేణ అభక్ష్య భక్షణాదినా, శిశ్నా శిశ్నేన, అగమ్యాగమనాదినా ఉక్తానాం క్రియాణా మన్యేషా మప్యుపలక్షణ త్వేన సర్వేంద్రియైశ్చ, యచ్చపాప మకార్షం తత్సర్వం రాత్రిః రాత్ర్యభిమానినీ దేవతా, అగ్నిశ్చాద్ర మావా అవలుంపతు వినాశయతు. కించ, యత్కించ నాపి ఇహజన్మని జన్మాంతరేవా కృతం దురితం పాపరాశిః మయివర్తతే ఇదం సర్వం పాపజాతం. తస్యకర్తారం, మాంచ, అమృతయోనౌ అమృతం మరణాభావః, తస్య యోనిః కారణం అథవా, అమృతః పరమేశ్వరః, అమృతస్యహావా నామధేయాసీతి మంత్రవర్ణాత్, సఏవయోనిః కారణం యస్య తస్మిన్, సూర్యే సుష్ఠుఈరయతి ప్రేరయతీతి సూర్యః తస్మిన్నాదిత్యాత్మకే జ్యోతిషి, ఆదిత్యాంతర్యామిణి స్వయం ప్రకాశ బోధైక రూపే పరమేశ్వరే అహంజుహోమి ప్రక్షిపామి పారమేశ్వరాగ్నౌ ప్రక్షిప్య తేనాగ్నినా పూర్వోక్తం పాపం భస్మీకరోమీతి భావః॥ సాయం సంధ్యాయామ పాంపానే వినియుక్తస్య అగ్నిశ్చేత్యను వాకస్యాపి సూర్యశ్చేత్యను వాకేనతుల్యోర్థః॥ ఇయాంస్తు విశేషః

మూ॥ అగ్నిశ్చ మామన్యుశ్చ........ సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా॥ అగ్నిః రాత్ర్యధిపతిః, అహః అహరభిమానినీదేవతా, సత్యే అవితథ స్వభావే, జ్యోతిషి పరమేశ్వరే, శిష్టం పూర్వవత్॥

---

దితము, పాతకము, మఱి, నాయందు గలదో ఇదం, ఈ పాపము నంతను, అట్టి పాపములను జేసిన మాం, నన్నును, అమృతయోనౌ, పరమేశ్వరుని వల్లగలిగిన సూర్యే, సూర్యుడనే జ్యోతిషి= జ్యోతిస్సునందు లేక అమృతయోనౌ= ముక్తి ప్రదుఁడును, సూర్యే=సూర్యున కంతర్యామియు నగు, జ్యోతిషి= స్వయం ప్రకాశ జ్ఞాన స్వరూపుఁడగు పరమేశ్వరు నందు, అహం= నేను, జుహోమి= హోమము చేయుచున్నాను. పారమేశ్వరాగ్నియందుంచి యాయగ్నిచే పూర్వోక్త మగు పాపమును భస్మము చేయుచున్నానని యర్థము

సాయం సంధ్యాకాలమున జలము పుచ్చుకొను నప్పుడు వినియోగింపఁ బడు అగ్నిశ్చేతను మంత్రమునకును నిదియె యర్థము॥ ఇందిది విశేషము॥ అగ్నిః= రాత్రి కధి పతియగు దేవత, అహః= పగటి యందు నభిమానము గల దేవత, సత్యే= నిజమగు- జ్యోతిషి

అన నాభక్తవర్యుఁడు వినీతుఁడై రాధాపాదారవిందములకు వందనమాచరించి లేవకుండెను. అప్పుడు మాధవియను గోపిక ప్రేమవిహ్వాలయై భక్తుఁడై వదలిపోవఁ గాల్గరాక యేద్భును ద్ధవు నూఱడించుచు నో భక్తవర్యా! వగవుడుగుము. క్షణము నిలువుము. రహస్యమై నిరుపమానమై తనరుజ్ఞానసారమును వచింతు. ఆలకింపుము. ఇది శ్రుతులయందును బురాణముల యందు నించుకగాఁ దెలుపఁబడును. కావున నతిరహస్య మన వలయును. త్రిలోకజననియగు శ్రీరాధాదేవిని బ్రశ్నింపుము. ఆమె నీకుపదేశింపఁగలదని యూరకుండెను.

ఆమాటల కానందపరవశుఁడై యుద్ధవుఁడు రాధాపదక మలములవదలి లేచి కరయుగళము ముకుళించి మహాదేవీ! నాసంశయములఁ బోకార్పుము. కరుణచే నన్నుద్ధరింపుము. ప్రాణి యేకాకియై జన్మించును. ఏకాకియై పోవును. ఇట్లే మర లమరలఁ జేయుచుండును. కర్మానురోధముచేత స్వకర్మఫల మును దా ననుభవించుచుండును. జంతువు కర్మముచేతనే పుట్టును. కర్మముచేతనే విలయమొందును. సుఖదుఃఖములు భయశోకములు. కర్మముచేతనే గలుగుచున్నవి. ప్రతిప్రాణియుఁ బ్రతిజన్మమందును భోగావశేషముచేతనే భోగమును భుజిం చుచున్నవాఁడు. మరలఁగర్మముచేతనేపుట్టి మరల లయమందు చున్నాఁడు. సాధ్వీమణీ! నాకు బహుమానపురస్సరముగా రత్నాదులిప్పించితివి. అవి నాతోఁగూడి రావుకదా. వానితో నాకేమి ఫలము? భవసాగరమును దరించుటకు నీవే దృఢమగు నౌకవు. కర్ణధారుఁడు శ్రీకృష్ణపరబ్రహ్మామే. సర్వజనులఁ బరతీ రమునకుఁ గొనిపోవువాఁడు కదా. తల్లీ! నాకొక దానమిమ్ము.

భుక్తమిత్యర్థః॥ యచ్చ,అభోజ్యం పతితాద్యన్నం యచ్చ మమసంబంధి దుశ్చరితం, పరదారగమనాది నిదానం సర్వమఘజాతం, ఆపః పునస్తుఅసతాంచప్రతిగ్రహం, ద్రవ్యం ప్రతి గ్రహ నిమిత్తం యత్పాపం, తత్సర్వమపిచ నాశయంత్విత్యర్థః తా ఆపః శేషపాపం మాం స్వాహా ప్రక్షిపామి నిరస్త సమస్త పల్లవే పరమేశ్వరే యోజయామీత్యర్థః ఇతి ప్రాశ్యాచమ్య దధిక్రాణ్ణ ఇత్యాద్యైః పునర్జలం శిరసి ప్రోక్షేత్॥ తదుక్తం పితామహేన॥ ప్రోక్షేత్సురభిమత్యాచ ఆపోహిష్ఠాది భిస్త్రిభిరితి॥ సురభిమతీ, దధిక్రాణ్ణ ఇతిఋక్॥ చంద్రజ్ఞానోత్తరే॥ పాదౌహస్తౌచసంక్షాళ్యా చమ్య బద్ధశిఖశ్శుచిః। ప్రాణానాయమ్య సంకల్ప్య సంధ్యోపాస్తిం సమాచరేత్॥ ప్రోక్ష్యాబ్లింగై ర్వ్యాహృతిభిః పరిషిచ్య సమంత్రకం పీత్వాచమ్య దధిక్రాద్యైః ప్రోక్ష్యాద్భిః పరిషిచ్యచేతి॥

మం॥ దధి క్రావ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః సురభినో
ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥

వ్యా॥ దధి క్రామతి ప్రాప్నోతీతి దధిక్రావా దధి క్రాణ్ణ ఇతి షష్ఠీ॥ దధిప్రియః కశ్చిద్దేవతా విశేషః తస్యదేవస్య అకారిషం కర్మకృతవానస్మి. కీదృశస్య జిష్ణోర్జయ శీలస్య అశ్వస్య వ్యాపినః, అశూన్వ్యాప్తా, వాజినః అన్నవతః, అకార్షమితి పూర్వేణాన్వయః, సః దేవః, నః అస్మాకం, ముఖా ముఖాని, సురభీకరత్ కస్తూర్యాది ద్రవ్యప్రదానేన సుగంధోపేతాని కరోతు, సః అస్మాకం ఆయూగంషి, ప్రతారిషత్ ప్రవ

న్నా పరమేశ్వరునందుఁ జేర్చు చున్నానని యర్థము॥

అని జలము పుచ్చుకొని, ఆచమనము చేసి— తిరుగ— దధిక్రావ్ణః మొదలగు మంత్రములతో జలమును శిరమునఁ జల్లుకొన వలయును॥

ఈసందర్భమున పితామహుండు॥ దధిక్రావణః అను ఋక్కుతోను, ఆపోహిష్ఠాది ఋక్కులతోను ప్రోక్షణము చేసికొన వలయును అనిచెప్పెను॥

చంద్రజ్ఞానోత్తరము నందును, కాలుసేతులు గడిగికొని, సిగముడి వైచికొని ఆచమనము చేసి, ప్రాణాయామ మొనరించి, సంకల్పము చేసి సంధ్యోపాసన చేయవలయు. ఆపోహిష్ఠాది మంత్రములతో శిరమునఁ జలముచల్లుకొని, జలము పానముచేసి, ఆచమనము

కాలగతియని నమ్ముము. అయినను దానిని బండితు లేయుపా యమునఁ దరింతురో తత్పద్ధతి నెఱింగించెదను.

సజ్జనులు, కాలకాలుఁడు, జగద్గురువు, నిర్గుణుఁడు, నిరీహుఁడు, పరమాత్మ, యీశ్వరుఁడు నగుపరాత్పరు సేవింతురు. ఆపరమాత్మ వదలునేని యీదేహ మప్పుడేపడును. ఆపరమాత్మనుసేవించి కాలగతిని దరింతురు. రవియే సర్వప్రాణులయాయువును హరించును. కాని శ్రీహరియందుఁ బరిశుద్ధభక్తిగల పుణ్యాత్ములజోలికిం బోఁడు. వత్సా! ఉద్ధవా! బ్రహ్మమానసపుత్రులగు నల్వురను జూడుము. వారు సనకసనందన సనత్కుమార సనత్సుజాతులనువారు. పరమభాగవతులు. వారికి స్థిరవయస్సు కలదు. మఱియు రుద్రాదులనుమించి గురువులకు గురువులై బాలకులై యనుపనీతులై పంచవర్షప్రాయులై శిశువులై వారుందురు. వా రంతరంగమున సాంద్రవయస్స్ఫురితులు. సదాసస్మితామలవక్త్రులు. దిగంబరులు నగుదురు. శ్రీకృష్ణధ్యానపూతులు. తీర్థములవలెఁ బావనులు. విష్ణుభక్తులు. వేదవేదాంగముల శంకలను దీర్చువారు. సంతుష్టమానసులు. సర్వకాల సర్వావస్థలయందును శ్రీహరినే భావించుచుండువారు. * బాహ్యపూజావిహీనులు. మానసిక పూజానిరతపూతులు. మృత్యుంజయునిమించిన శక్తిసంపన్నులు. కాలసర్పమును జయించినవారు. అట్టి సనకసనందనసనాతనసనత్సుజాతుల నిట్టి మహనీయులని యెవరు స్మరింతురో వారు తీర్థస్నానఫలమును బొంది పాతకముక్తు లగుదురు. అంతియగాక హరిభక్తియు

---

* బాహ్యపూజా విహీనాంశ్చ పూతాన్ మానసికాం స్తథా = అని మూలము.

ఇత్యర్థః॥ ఏవం భూతా యాస్తిష్ఠన్తి॥ కించ యాస్వప్సు కశ్యపః పశ్యతీ
తి వర్ణవ్యత్యయాత్ క-స్వపో జగచ్ఛక్తిషు సూర్యకోట్యజాతః అజని, ఇంద్ర
స్సురేశ్వరో యాస్వప్స్వేవాజనీత్యర్థః విరూపాబహురూపాయా ఆపః
అగ్నిం బడబాముఖం, గర్భం దధిరే గర్భస్థ జంతుత్వేన ధృతవత్య ఇ
త్యర్థః॥ తా ఆపః, నః అస్మాకం, శం సుఖనాశిన్యః స్యోనాస్సుఖదాయి
న్యశ్చ భవన్తు॥

మూ॥ యాసాగ్ం రాజావరుణో యాతి మధ్యే సత్యానృతే॥ అవపశ్యం
జనానాం।మధుశ్చుతశ్శుచయో, యాః పావకాస్తాస ఆపశ్శగ్ం
స్యోనాభవన్తు॥

వ్యా॥ మార్జన వినియుక్త మన్త్రాన్తర మాహ॥ యాసాగ్ం
రాజేతి॥ వరుణో జలాభిమాని దేవతా, యాసామపాం రాజా ప
తిరిత్యర్థః॥ సః జనానాం, సత్యానృతే పుణ్యపాపే, అవపశ్యన్ ప్రేక్ష
మాణః, యాసాం మధ్యే అస్తీతి శేషః, పంచానామపి భూతానాం
పుణ్యపాప సాక్షిత్వం ప్రసిద్ధమేవేతి జలగతం సాక్షిత్వం తదభిమా
నిని వరుణ ఉపపద్యతే॥ అత్ర. అవపశ్యన్ వివేచయన్నిత్యుక్త్వాతదా
నుకూల్యేన వరుణపదస్య దండధర ఇత్యర్థ కల్పనం యత్ప్రకాంత

---

జలములు, నః, మాకు, శం, దుఃఖమును పోఁగొట్టునవి యు, స్యోనాః, సుఖ మొసఁగు
నవియును- భవన్తు, అగుగాక॥

యాసాగ్ం రాజా అనుమంత్రమునకు నర్థము॥

వరుణః, వరుణుఁడని పేరుగల జలాభిమాని దేవత, యాసాం, ఏజల ములకు, రా
జా, ప్రభువగునో, సః, ఆవరుణుఁడు- జనానాం, జనులయొక్క- సత్యానృతే, పు
ణ్యపాపములను, అవపశ్యన్, చూచుచు, మధ్యే, జలమధ్యమునఁ గలఁడో పంచ భూత
ములకును పుణ్యపాప సాక్షిత్వము ప్రసిద్ధియే గావున జలము నందగు సాక్షిత్వము జలా
భిమాని యగు వరుణుని యందు నుపపన్నము గు చున్నది॥ ఇచట కొందఱు అవపశ్యన్,
వివేచన చేయుచు ననియర్థము చెప్పి వరుణుఁడనగా- దండధరుఁడు అనియర్థము చెప్పుచు
న్నారు॥ కానియది యుక్తము కాదు॥ ఏలన, వరుణునియందు జలాభిమానిత్వము ప్ర
సిద్ధమై యున్నదిగాన, అప్రసిద్ధి దండధరునందు గన్పించుట విరుద్ధము॥మధుశ్చుతః,తే

పాపమతులు. అర్థిజనకల్పతరువగు వాసుదేవునివదలి యే నరుఁడు విషయసుఖలోలుపుఁడగునో వాఁడు అమృతమును వదలి విషము భుజించుమూఢునకు సమానుఁ డగును. ఎవ్వని కెవఁడు పుత్త్రుఁడు ? ఎవ్వని కెవ్వతుక పుత్త్రిక ? ఎవ్వరి కెవ్వారు బాంధవులు ? భగవంతుఁడుతప్ప నాపత్తునం దేబంధు వేవాని నుద్ధరించును ? కావుననే సాధువులు దివానిశములు శ్రీకృష్ణుని భజింతురు. శ్రీకృష్ణపరబ్రహ్మము జన్మమృత్యుజరావ్యాధిహర్త. సర్వపాపసంహర్త. పరాత్పరుఁడు.

కాలమును దరించునుపాయము పరమాత్మసేవనమే. ఆనందనందనుఁడు పరిపూర్ణుఁడు. ఉద్ధవా ! వత్సా ! మదీయజ్ఞానగోచర మగుకాలగమనము నించుకవినుము. నరులు మొదలుకొని బ్రహ్మలోకపర్యంతము లోకములనుండు జీవులకీకాలగతి యవసరము. దీని నెఱింగినఁగాని కృతకృత్యులు కాఁజాలరు. సావధానముగా నాలకింపుము. సకలమునకుఁ బరస్థానము సర్వాధారము విరాట్టువే. మహావిరాట్టువనియుఁ గొందఱం దురు. ఆమహాత్ముని లోమజాలమునుండియే యసంఖ్యవిశ్వము లుద్భవిల్లెను. అన్నింటికంటె గొప్పదియు నన్నింటికంటె స్వల్పమునగునది యాతత్త్వమే. కాలారంభాత్మక మదియే. దాని తత్వ మిట్టిదని యూహింపఁ దరముకాదు. సిద్ధాదులకంటె నా విరాట్టు వుత్తముఁడు. పరమాణుస్వరూపుఁడు. ఆకారణముచే తనే మనుష్యుల కైక్యభ్రాంతి జనించెను. రెండుపరమాణువులొక్కయణు వగును. ఆయణువులు మూఁడైన నొకత్రసరేణు వనంబడు. త్రసరేణువులు మూఁడుకలిపిన నది త్రుటియనంబడు. ఆత్రుటులు నూఱుకలిసిన వేధమనఁజెల్లు. ఆవేధములు

వ్యా॥ శివేనేతి॥ హే ఆపః, శివేన కల్యాణ రూపేణ, చక్షుషా కటాక్షేణ, మా పశ్యత, మయి నిరంతరం కరుణాదృష్టిం న్యస్యతేత్యర్థః॥ శివయా తనువా కల్యాణ మూర్త్యా, మే త్వచం ఉపస్పృశత మదీయాం త్వచం స్పర్శనేన పావయతేత్యర్థః॥ తతస్స్వాకృత్యా నాహ॥ సర్వానగ్నీనితి, హే ఆపః వః యుష్మాకం, అప్సుసీదన్తి తిష్ఠన్తీత్యప్సుషదః జలస్థాన్, సర్వానగ్నీన్ బాడబాదీన్, హువే ఆహ్వయామి, కిమర్థమిత్యత ఆహ॥ మయి వర్చ ఇతి, మయి వర్చః దీప్తిః, బలం శక్తిః, ఓజః ఉత్సాహః, ఏతత్సర్వం మయి నిధత్త స్థాపయత॥ మాం వర్చస్వినం బలవన్త మోజస్వినం చ కురుతేత్యర్థః॥

ఏవం మార్జనం విధాయ పాపపురుష విసర్గమాయ జలం దక్షిణ కరే నిధాయ నాసికాగ్రం నీత్వా నిశ్వస్య వామభాగే భువి నిక్షిప్య తజ్జలం నావలోకయేత్॥ తదుక్తం వాసిష్ఠే॥ గృహీత్వా పాణినా వారి స్పృశా ఘ్రోక్తామృచం జపేత్। ఉద్ధృత్య దక్షిణేహస్తే జలం గోకర్ణవత్కృతే। నిధాయ నాసికాగ్రేతు పాపపూర్షం చ సంస్మరేత్। బిభృయాన్నాసికారంధ్రాంతు నిరుద్ధ ప్రాణ మారుతః వామే నిక్షిప్య మేదిన్యాం తజ్జలం నావలోకయేదితి॥ తత్ర వినియుక్త మన్త్రమాహ॥

---

యా, తనువా, కల్యాణ రూపముతో, మే, నాయొక్క, త్వచం, చర్మమును ఉపస్పృశత, తాకుడు॥ నాచర్మమును స్పృశించి పవిత్రము చేయుడని యర్థము॥ హే ఆపః, జలములారా, వః, మీయొక్క, అప్సుషదః, జలమున నున్న యగ్నులను, హువే, పిలుచుచున్నాను॥ ఎందున కనంగా, మయి, నాయందు, వర్చః, దీప్తిని, బలం, శక్తిని, ఓజః= ఉత్సాహమును, నాయందుంచుడు నన్ను బలవంతునిగను, ఉత్సాహవంతునిగను, దీప్తిమంతునిగను చేయుడని యర్థము॥

ఇట్లు మార్జనము చేసికొని, పాపపురుషుని వెళ్లగొట్టుటకై జలమును కుడిచేతియందుంచికొని, ముక్కువద్దఁ జేర్చి, యందు నిట్టూర్పువిడిచి, ఎడమ ప్రక్క నేలమీద వైచి, దానిని చూడఁగూడదు ఈయంశము॥ వాసిష్ఠము నందు, అవుచెపోతేఁ బట్టబడిన కుడి చేతి యందు జలము గ్రహించి తనశాఖయందుఁ జెప్పఁబడిన ఋక్కును పఠింప వలయును॥ దాని ముక్కు వద్దఁజేర్చి పాపపురుషుని దలంచి యాజలమునందు నిట్టూర్పు విడువ వలయును॥

కాలము శరదృతువనియు, మార్గపౌషములు హేమంతర్తువ నియు, మాఘఫాల్గుణములు శిశిరర్తువనియుఁ గీర్తింపఁబడును. సంవత్సరమును రెండుగ విభజించినకాల మయన మనంబడు. ఉత్తరాయణమనియు దక్షిణాయనమనియు వానిపేరులు. మాఘాదిమాసషట్క మ్ముత్తరాయణము. శ్రావణాదిమాసము లాఱును దక్షిణాయనము. శ్రావణముమొదలు పౌషమాసాంతము రాత్రి వృద్ధియగుకాలము. ప్రతిపత్తుమొదలు పూర్ణిమాంతము శుక్లపక్షమనియు, పూర్ణిమానంతర ప్రతిపత్తుమొద లమావాస్యదనుకఁ గృష్ణపక్షమనియుఁ జెప్పంబడును. ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, చతుర్దశి,కుహు, అని ప్రతిపదనంతరము వరుసగాఁ దిథులపేరులు చెల్లును. అశ్విని, భరణి, కృత్తిక,రోహిణి, మృగశీర్షము,ఆర్ద్ర,పునర్వసు,పుష్యమి,ఆశ్రేష,మఘు,పూర్వోత్తర ఫల్గునులు, హస్త,చిత్ర,స్వాతి,విశాఖ,అనూరాధ,జ్యేష్ఠ, మూల, పూర్వోత్తరాషాఢలు, శ్రవణము, అభిజిద్ధనిష్ఠలు, శతభిషము, పూర్వోత్తరాభాద్రలు, రేవతి యను నీ యిరువదెనిమిదితారలు ప్రసిద్ధింగాంచి కర్మమున కుపయోగించును. ఈతారాధిదేవతలే చంద్రునిభార్యలు. వరుసగా వారినిగూడి చంద్రుఁ డలరారుచుండును. ఇరువదేడుతారకలే చంద్రునిభార్యలని శ్రుతిసిద్ధము. శ్రవణచ్ఛాయయే యభిజిత్తనంబడు. దానింగూడి యిరువదెనిమిదితారలయ్యెనని యెఱుంగఁదగు.

ఒకానొక సమయమున శీతాంశుఁడు సుందరాంగియగు రోహిణింగూడి సల్లాపము లాడుచుండెను. శ్రవణాఖ్యతారాదేవి యవ్విధమెఱింగి క్రోధావిష్టహృదయయై తనయం దాతని

రిన పవిత్రాభ్యాము త్పూమాత జ్యం యథా సర్వదోషవినిర్ముక్తం భవతి. తద్వచ్చ మూహాపస్సర్వస్మాదేన సత్యోగ్యయ న్విత్ర భావః॥ శ్లో॥ ఆపోహిష్ఠేతివభిర్మార్జనం పూర్వముదారితం। పశ్చాదపి తథైవ స్యాద్ధి శరేషాస్తు మార్జనం॥ అథార్ఘ్యప్రదానం కర్తవ్యం తత్ర వినియుక్త మంత్రస్వ నుపదమేవ వక్ష్యతే॥ మాధ్యాహ్నిక సంధ్యాయా మర్ఘ్యప్రదాన వినియుక్తం మంత్రమాహ॥

మం॥ హగ్ంసశ్శుచిష ద్వసురంత రిక్షస ద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్। నృషద్వరసదృతసద్వ్యోమ సదబ్జాగోజా ఋతజా అద్రిజా ఋతంబృహత్॥

---

టీక యని భావము॥

ఆపోహిష్ఠా మొదలగు మంత్రములతో మార్జనము మొదట చెప్పబడియె॥ అట్టి వాని చేతను ఇంకను కొన్నిటి చేతను తరువాత మార్జనము చేసి కొనవలయును॥

అనంతర మర్ఘ్యదానము చేయవలయును॥ అందు వినియోగించు మంత్రము పదంప డి చెప్పబడును॥ మాధ్యాహ్నికసంధ్యా కాలమున అర్ఘ్యప్రదానమున వినియోగించునం త్రము హగ్ంసః అనునది॥ దీని యర్థమేమన, హంసః పరమేశ్వరుఁడు, అశుచిత్వమి వాఁడు, శు చిషత్ పవిత్రములగు కాశ్యాది పుణ్యక్షేత్రముల యందును, భక్తహృదయాదుల యం దును నుండు వాఁడు, వసుః జగములకు నివాస భూతుఁడు, అంతరిక్షసత్ అంతరిక్ష మున నుండు వాఁడు, హోతా యజమానుఁడు, వేదిషత్ అగ్నిరూపుఁడు, అతిథిః అతిథిపో లె పూజనీయుఁడు, దురోణసత్ గృహముల యందుండు వాఁడు, నృషత్ మనుష్యులు మొదలగు సకల ప్రాణులయందు నుండు వాఁడు, వరసత్ = శ్రేష్ఠములగు తీర్థాదులయం దు నుండువాఁడు, ఋతసత్ = యజ్ఞాధిపతిగాన యజ్ఞమున నుండు వాఁడు. వ్యోమస త్ = లింగాకారమున నాకసమున నుండు వాఁడు అబ్జ = జలముల యందుండు వాఁడు ఋతజాః = యజ్ఞము యందు భోక్తగా నావిర్భవించు వాఁడు, అద్రిజాః = ప ర్వతముల యందుండు వాఁడునగు పరమేశ్వరుఁడు బృహత్ = గొప్పనియు ఋతం = ఉపాసనా రూప యజ్ఞమును సిద్ధింపఁ జేయుఁగాక యని యర్థము॥

ఆచమనము, శక్తికొలది ప్రాణాయామము చేసి, దేశకాలములఁ జెప్పి, కాలాతిక్రమణ దోష పరిహారముకై ముందుగ ప్రాయశ్చిత్తార్ఘ్యమొసఁగి యర్ఘ్యదానము చేయుఁడు

ఉంగుః ద్ధతియు నిట్లే. దండద్వయము నరపలమగు శక్రాయు ర్దాయ మంత కాలము బ్రహ్మమానమున నొక పలమగు. ఇట్టి పరిమితిని ముప్పదిదినములైన బ్రహ్మలోకమున నొక్క మాసమగు. పండ్రెండు నెలల కొక్క వత్సరంబని యందును లెక్కింపఁబడు. ఆయుస్సు ధాతకు నూఱువత్సరములే. బ్రహ్మ నూఱువత్సరములు జీవించి మృతినొందఁగా నాతని యాయుఃకాలము శ్రీహరి కొక నిమేషమగు. వైకుంఠమున నిట్లే కాలమానమని యెఱుంగనగు. అందు సూర్యగతిలేదు. గోలోకమునఁ గాల మితి యిట్లేయని యెఱుంగునది. వైకుంఠవాసులకు దివారాత్రి భేదములేదు. అందుఁ జంద్రాదిగ్రహగతులు కానరావు. శింశు మారచక్రమందుఁ బరిభ్రమింపదనియు నెఱుంగవలయును. శ్రీకృష్ణమూర్తితేజస్సునఁ బగలుగలుగు. వారు శయనింప రాత్రియగు. ఇట్లు భగవల్లోకమునఁ గాలగతి సాగుచుండును. భగవంతుఁడు కాలస్వరూపుఁడు, నిరాకారుఁడునగు. సప్తపాతాళలోకములందును జంద్రసూర్యగతులు లేవు. అందుండు జీవులు దివారాత్రిభేదమున సంశయింపరు. పగలు నాగేంద్రభోగి విలసన్మాణిక్యదీప్తిచేఁ గలుగును. సంధ్యాకాలమున నగ్నిజ్వాలయగపడు. తమోవృతమై రాత్రియుండును. అందుండువారు కాలము తామ్రిప్రమాణమున నెఱుంగుదురు. భూలోకమం దెట్లో యధోలోకసప్తకంబునఁ గాలపరిమాణ మట్లేయని తెలియందగు.

కృత త్రేతా ద్వాపర కలి నామకములు నాల్గుయుగములని కీర్తితములు. పండ్రెండువేల దివ్యవర్షములపైన నాలుగు వేలు ఎనిమిదివందలు కృతయుగప్రమాణమని పరిగణింపఁబడి

మంత్రేషు జామితా నాస్తీతి ప్రసిద్ధః॥ ఋతసత్, ఋతే యజ్ఞే అధిపతి
త్వేన స్థితత్వేన ఋతసత్ అహోరాత్రాణ మధ్వరస్య రుద్రమితి పరమేశ్వర
స్యక్రతుకర్తృత్వ శ్రవణాత్ వ్యోమని తారకా లింగాకృతి నాసీదతీతి
వ్యోమసత్ ఆకాశే తారకాలింగమితి స్మరణాత్, అప్సుజలేషు జాయ
త ఇత్యబ్జాః యోఽప్సు తిష్ఠన్నితి శ్రుతేః॥ ఋతే యజ్ఞ భోక్తృత్వేన జాత
ఋతజాః, భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోకమహేశ్వరమితి స్మృతేః॥
అద్రిషు, పర్వతేషు జాతః, అద్రిజాః॥ శ్రు॥ యస్సర్వభూతేషు తిష్ఠన్నితి
శ్రుతేః ఈదృశః, పరమేశ్వరః బృహద్దధికం ఋతం, ఉపాసనాత్మకం
యజ్ఞం సంపాదయత్వితి శిష్యతే।

ఆచమ్య యథాశక్తి ప్రాణానాయమ్య దేశకాలౌ సంకీర్త్య మ
మ సంధ్యా కాలాతిక్రమణదోష పరిహారార్థం ప్రాయశ్చిత్తార్ఘ్య దానపూ
ర్వక మర్ఘ్యప్రదానం కరిష్య ఇతి సంకల్ప్య జలం గృహీత్వా ఉత్థాయ త
ర్జన్యంగుష్ఠయో రసంసర్గం యథా తథా సవ్యాహృతికయా గాయ
త్ర్యా ప్రాయశ్చిత్తార్ఘ్యం దత్వా తథైవ త్రీణ్యర్ఘ్యాణి దద్యాత్॥ యద్య
పి ప్రాతస్సాయంకాలయో స్త్రీణ్యర్ఘ్యాణి మధ్యాహ్నే తు ప్రధానార్ఘ్య
మేకమేవ॥ మధ్యాహ్నే చాంజలిక్షేపం సకృదేవ సమాచరేదితి వచ
నాదితి కేచిత్॥ తథాపి తస్య వచనస్య హంసగాయత్రీ క్రియమాణ ప్ర
ధానార్ఘ్యపరత్వం జ్ఞేయం॥ అత్రాయం విశేషః॥ మధ్యాహ్నే బ్రహ్మయ
జ్ఞాత్పూర్వ మాపస్తంబ శాఖినాం సంధ్యానుష్ఠానం యుక్తం॥ బ్రహ్మ

---

యన శాఖులైనవారో ప్రాతరౌపాసన చేసిన తరువాతగాని, మాధ్యాహ్నిక సంధ్య చేయు
క ముందుగాని బ్రహ్మయజ్ఞము చేసి తరువాతనే మాధ్యాహ్నిక సంధ్యను పాటింప వల
యును॥ ఏలన, మధ్యాహ్న స్నానకాలమున స్నానము చేసిన వస్త్రము దుక గూడదు॥
అట్లుగాక ఉదికినా ఆ స్నానము వ్యర్థ మగును॥ కావున వస్త్రము నొసఁగ నమునిచి, బ్రహ్మ
యజ్ఞము చేయ వలయు॥ తరువాత మాధ్యాహ్నిక సంధ్యను పాటింప వలయును యనియా
శ్వలాయనుఁడు చెప్పెను॥

చూపుడు వ్రేలు బొటన వ్రేలు తాకియుండఁగా అర్ఘ్యప్రదానము చేయఁ గూడ
దు॥ ఏలన, ఈరెండు వ్రేళ్లు తగిలి యుండు నెడ రాక్షసముద్ర యగును॥ దానితో నర్ఘ్య

అనాదిరేష భగవాన్ కాలోఽనంతోఽక్షరఃపరః,
సర్వగత్వాత్స్వతంత్రత్వాత్సర్వాత్మత్వాన్మహేశ్వరః.
బ్రహ్మాణో బహవో రుద్రా అన్యే నారాయణాదయః,
ఏకోహి భగవానీశః కాలః కలిరితిస్మృతః.
బ్రహ్మా నారాయణేశానాం త్రయాణాం ప్రకృతౌలయః,
ప్రోచ్యతే కాలయోగేన పునరేవచ సంభవః.
పరబ్రహ్మాచ భూతాని వాసుదేవోపి శంకరః,
కాలేనైవచ సృజ్యంతే స ఏవ గ్రసతే పునః,
తస్మాత్కాలాత్మకం విశ్వం స ఏవ పరమేశ్వరః.

కూర్మపురాణము.

దీనిచేఁ గాలరూపుఁడు పరాత్పరుఁడనియు నెందఱో బ్రహ్మ విష్ణురుద్రులు గతించిరనియు వీరెల్ల నఁగా నీ త్రిమూర్తులు ప్రకృతియందే లయింతురనఁగా వీరిని బ్రకృతియే సృజించె ననియు స్పష్టమయ్యెడిని. ప్రకృతియనఁగాఁ దృణమాత్రమని చిటికెలువేయువారలీ ప్రమాణములను జూచిన నేమనుటకు వీలులేకుండఁగలదు. నామరూపములుగలవారెల్లఁ బ్రకృతికి లోఁబడినవారే యనియుఁ బ్రకృత్యతీతుఁడు భగవంతుఁడే యనియుఁ బెక్కుసారులు వ్రాసియేయున్నాఁడనుగదా. మఱి యొక దానిని మదినునుచుకొనిన మతభేదములు రూపుమాయు నని నాకుఁగల గట్టినమ్మకము.

అనాదినిధనః కాలో రుద్రస్సంకర్షణస్స్మృతః,
కలనాత్సర్వభూతానాం సకాలః పరికీర్తితః.
సర్వభూత సమత్వాచ్చ స రుద్రః పరికీర్తితః,

నిగద వ్యాఖ్యాత్రోయం॥ ఏవం ప్రదక్షిణం ప్రక్రమ్యాచమనం కర్తవ్యం; తదుక్తం॥ మందేహానాం వినాశాయ నిక్షిప్తం జలాంజలిం। ప్రాయశ్చిత్తార్థ మాచమ్య ముచ్యతే దైత్యహత్యయేతి॥ సంధ్యాధ్యానమాహ॥

మూ॥ అసావాదిత్యో బ్రహ్మ

వ్యా॥ అసావితి, అసావితిపాఠేనా నిర్దేశః ఆదిత్యః బ్రహ్మ, పరమేశ్వరః॥ శ్రు॥ య ఆదిత్యే తిష్ఠన్నితి పరమేశ్వర స్యాదిత్యాంత ర్వర్తిత్వ శ్రవణేన శరీర శరీరిణో రభేద వ్యపదేశాదితి భావః॥ తత్త్వ మంతరాధికరణే నిరూపితమాచార్యైః॥ ఉపస్థానమంత్రో వివరణావసరే చస్పష్టముపరిష్టాద్భవిష్యతి ఇమమేవాశయ మంతరను సంధాయ ప్రబ్రూతే శ్రుతిః, అసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి య ఏవం వేదేతి ఇదం పారమేశ్వరం భావనమేవ ప్రధానం సాంధ్య కర్మత్వాహ లోకాక్షిః అసావాదిత్యో బ్రహ్మేతి యద్ధ్యానం క్రియతే న్వహం తదేవ సాంధ్యమిత్యుక్తం కర్మ బ్రాహ్మణ్య మూలకమితి॥

---

హ్మణుడు, సకలం సమస్తమగు భద్రం, శుభములను, అశ్నుతే పొందును॥ మఱియు వాడు, బ్రహ్మైవబ్రహ్మమే, సన్ అగుచు, బ్రహ్మ పరమేశ్వరుని- అప్యేతి పొందుచున్నాడు, యః ఎవ్వడు, ఏవం ఈవిధముగ, వేద ఎఱుఁగునో- వాఁడును, పరమేశ్వరుని పొందునని యర్థము॥ ఉదయ కాలమునందును అస్తమయ కాలమునందును, నాదిత్యునకంతర్యామి యగు పరమేశ్వరు నిధ్యానించు వాడు, సకల కళ్యాణముల నధిగమించి పరమేశ్వర సాయుజ్యము నొందునని భావము॥

ఈమంత్రము చూడఁగానె ఆదిత్యుడే పరబ్రహ్మయను నర్థము స్ఫురించును॥ కాని బ్రహ్మ మీమాంస యందు భాష్యకర్తలందఱును సూర్యునకంతరుఁడును, తదంతర్యామి యగు నీశ్వరుఁడే పరబ్రహ్మయని సిద్ధాంతము చేసి యున్నారు గాన యీమంత్రము సూర్యునకంతర్యామి యగు పరమేశ్వరుని పరమనియే గ్రహింప వలయు॥

ఇట్లు ప్రదక్షిణము చేసి ఆచమనము చేయవలయు॥ మందేహులను రాక్షసులను చంపుటకై మూడర్ఘ్యములనొసఁగిన ఆదోషము శమించునని స్మృతుల యందుఁ గలదు

శ్యతే, యోహ్యానేన భోగేనాపరామృష్టః స పురుషవిశేష ఈశ్వరః.''

వ్యాసభాష్యము.

''సూ. తస్య వాచకః ప్రణవః'' ౨౭

భగవంతుని నామధేయ మోంకారమని దీనిభావము. అనఁగాఁ బరమేశ్వరు నేకర్మవికారము లంటవు. రూపములేదు. ప్రణవమే యతని నామధేయము. ''దీనిభావమేమి తిరుమలేశా'' అన్నట్లు దీని సారమేమి? సర్వాంతర్యామియై సర్వసాక్షియై రూపనామములులేక కాలమూర్తియై వెలుంగువాఁ డెవఁడో ఆమహానీయుఁడే పరమేశ్వరుఁడని సిద్ధాంతము. ఇది కదల్పఁబడనిమతము. సత్యమత మిదియే. రూపాదులు భక్తులచే యథారుచి కల్పితములు. ఇట్టులుండ నాదేవునిరూపము శుభము. నాదేవుఁ డెక్కుడని బోడ్డున యజ్ఞోపవీతము దిట్టపఱచి కలహామునకుఁ బూనుట యవివేకమని యిందువలనఁ దేలును. ఏభక్తుఁ డేరూపమున నాపరాత్పరుని ధ్యానించినను, ఆరూపమునఁ బ్రత్యక్షమగు. కావుననే జ్ఞానులు

''విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః.''

గీత. ౫ అ. ౧౮ శ్లోకము.

అను గీతావాక్యము ప్రకారము భగవంతుని సర్వభూతస్థునిగా భావించి చూతురు. అందువలననే వారిదృష్టికి జాతిభేదములు కానరావు. ఒక్క భగవంతుఁడే కానవచ్చును. అట్టి జ్ఞానములేని పామరులు జాతిభేదములు పాటించుట కంటె నెక్కుడుగా దేవతాభేదములను బాటించి యీర్ష్యాపరవశులై

## ఆశౌచే సంధ్యావందనవిధిః

నన్వాశౌచే సంధ్యావందనం కథం కర్తవ్యమితి చేదాశౌచే సంధ్యావందనమర్ఘ్యాంతమిత్యుక్తం॥ యత్తు సంధ్యామిష్టించ హోమంచ యావజ్జీవం సమాచరేత్। నత్యజేత్సూతకే వాపి త్యజన్గచ్ఛత్యధోగతిమితి॥ తత్తు మానసిక సంధ్యావందనాభిప్రాయం తదుక్తం పులస్త్యేన॥ సూతకే మృతకే చైవ సంధ్యాకర్మ నసంత్యజేత్। మనసోచ్చారయేన్మంత్రాన్ ప్రాణాయామమృతే ద్విజ ఇతి॥ అత్రవిశేషమాహ వ్యాసః॥ ప్రక్షిపేత్సూతకే త్వర్ఘ్యం గాయత్రీంతు సముచ్చరన్ దత్వా ప్రదక్షిణం కుర్యాత్సూర్యం ధ్యాయేత్తతో ద్విజ ఇతి పైఠీనసిరపి॥ సూతకే సావిత్ర్యాచాంజలిం ప్రక్షిప్య ప్రదక్షిణం కృత్వా సూర్యం ధ్యాయన్నమస్కుర్యాదితి॥ ప్రయోగపారిజాతే భరద్వాజోపి। సూతకే మృతకే కుర్యాత్ప్రాణాయామమమంత్రకం తథా మార్జనమంత్రాంస్తు మనసోచ్చార్య మార్జయేత్। గాయత్రీం సమ్యగుచ్చార్య సూర్యాయార్ఘ్యం నివేదయేత్ మార్జనం తు నవా కార్యముపస్థానం నచైవహి॥ ఇతి॥

---

ప్ర॥ ఆశౌచమున సంధ్యావందనము ఎట్లు చేయవలయు?

ఉ॥ ఆశౌచమున సంధ్యావందనము అర్ఘ్యము వరకు చేయవలయునని యున్నది॥

ప్ర॥ సంధ్యను, ఇష్టిని, హోమమును, యావజ్జీవము చేయవలయును। సూతకమునందైన విడువగూడదు॥ ఇట్లు విడిచెనా అధోగతిని పొందునని లేదా?

ఉ॥ ఉన్నది కాని అపవిత్రముచే నశుచి సమయముల యందు మనస్సునందే సంధ్యావందనము చేయవలయునని తెలియుచున్నది॥ కావుననె అశుచి సమయములందు సంధ్యాకర్మము విడువగూడదు। మంత్రములను మనసున నుచ్చరింప వలయునని పులస్త్యుడు చెప్పెను॥

ఇందు వ్యాసుడు విశేషమును చెప్పెను॥ ఆశౌచమునందు గాయత్రి నుచ్చరించుచు నర్ఘ్యమును విడువ వలయు॥ ప్రదక్షిణము చేసి సూర్యుని ధ్యానము చేయ వలయునని యెను॥ సూతకమునందు సావిత్రితో నర్ఘ్యజలము నిచ్చి ప్రదక్షిణము చేసి సూర్యుని ధ్యానము చేయుచు నమస్కరింప వలయునని పైఠీనసియు చెప్పెను॥

* "ఉద్ధవా! నీకు మార్గము శుభప్రదమగుం గాక. సదా నీకు శుభములే కలుగుచుండుఁ గాక. జ్ఞానివికమ్ము. శ్రీహరిభక్తాగ్రేసరుఁడవు కమ్ము. శ్రీహరి కతిశయప్రీతిప్రదుఁడవు కమ్ము. శ్రీకృష్ణభక్తిదాస్యములను నివి రెండును శ్రేష్ఠములలో శ్రేష్ఠములు. ముక్తి పంచవిధములు. అందు భక్తి పరమము. బ్రహ్మత్వ దేవత్వ సురపతిత్వములకంటె శ్రీకృష్ణభక్తిదాస్యములు దుర్లభములు. అనేకజన్మపుణ్యాకర్మపరిపాకమున భారతవర్షమున జన్మించు భాగ్యముకల్గును. అందును హరిభక్తియొదవెనా వానిజన్మము సార్థకము. కర్మఫలము లభించినట్లే. పాపము లాతని గనుఁగొనఁజాలవు. భగవత్సమర్పణముగాఁ గర్మ మొనరించుభాగ్యము దొరకుట కడిఁది. శ్రీకృష్ణుఁ డానందించు కర్మ మొనరించు మానవునకు నీడు చేయఁజాలువాఁడును గలఁడా? సంప్రీతితో విధిపూర్వకముగా సంకల్పముచేసి సాధించు కర్మమే మంగళము. ధన్యము పరిణామసుఖావహము. వ్రతము తపము సత్యము భక్తియుఁ బూజనము తదుద్దేశముగా నుపవసించుటయు నను నివియన్నియు భగవద్దాస్య మొసంగియే తీఱును. సకలపృథ్వీదానము, భూప్రదక్షిణము, సమస్తతీర్థస్నానము, సమస్తవ్రతాచరణము, తపోనియతియు, సకల యజ్ఞములుచేయుట, సర్వదానములుచేయుట, సకల వేదవేదాంగపఠనము, తత్పాఠనము, అభయదానము, జ్ఞానదానము, అతిథిపూజయు, శరణాగతరక్షణము, సర్వదేవార్చనము, తద్వందనజపములు, విప్రవర్య దేవతల భుజింపఁ జేయుటయు, మంత్రపురశ్చరణము,

* ఇది శ్రీకృష్ణజన్మఖండను తొంబదియేడవ యధ్యాయమునుండి సంగృహీతము.

అథ షట్కాల శివపూజా పరశ్చేత్ శైవసంధ్యా ముపాస్య। సకలీకరణం కృత్వా। అరుణోదయకాలే తావసర పూజాం కుర్యాత్॥ త్రికాలపూజా పరశ్చేత్ సూర్యోపస్థానానంతరం శైవసంధ్యాముపాసీత శైవసంధ్యావిధి సూర్యోపస్థాన మంత్రి వివరణానంతరం సకలీకరణావసర పూజావిధీతు శివపూజా ప్రకరణేచ ప్రతిపాదయిష్యన్తే॥

తతో భూశుద్ధి భూత శుద్ధ్యాదీని కుర్యాత్॥ తత్ప్రయోగ స్త్వాహ్నికే ద్రష్టవ్యః॥ అథగాయత్రీ హృదయమాహ॥

మూ॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ॥

ఓమితి ఏకాక్షరం, ఏకాక్షరవాచ్య మిత్యర్థః॥ నామార్థ యోరభేదాన్వయి ఇతిన్యాయేన నిర్దేశః॥ ప్రణవో వాచక స్తస్య శివస్య పరమాత్మనఇతి శివపురాణవచనాత్॥ బ్రహ్మ, పరమేశ్వరః॥ నను ప్రణవ ప్రతిపాద్యా దేవతాంతరమితి పురాణాంత రేభ్యో జ్ఞాయతఇతి చేన్న తాదృశార్థస్య వేద విరుద్ధ త్వేన గౌణత్వా భ్యనుజ్ఞా నాత్। తథాహి। బ్ర

---

• పరిబాసింగ లేవఁజాలని రోగము నందెట్లు?

ఉ॥ అప్పుడు తండ్రినో? తమ్మునినో, శిష్యునినో- ఇతరునినో పిలిపించి వారిచే చేయింప వలయు॥ తానులేవ జాలమి నితరులు చేయునపుడు వారుమమ అని చెప్పి కొనక యజమానస్యోపాత్త దురిత క్షయార్థం అని సంకల్పము చేయవలసి యుండును॥

షట్కాలశివపూజా పరుడగు నేని అర్ఘ్యము, ధ్యానము వరకు సంధ్యా వందనము చేసిన తరువాత శైవ మంత్ర సంధ్యా వందనము నాచరించి సకలీకరణము చేసికొని అరుణోదయ కాలమునఁ జేయవలయు నవసర పూజను చేయు వలయు॥ త్రికాల పూజా పరుడైన సూర్యోపస్థాపమైన తరువాతనే శైవమంత్ర సంధ్యా వందనాముల జేయవలయు॥ శైవమంత్ర సంధ్యావిధి సూర్యోపస్థాన మంత్రముల వివరించిన తరువాతను,సకలీకరణము, అవసరపూజ అనునవి శివపూజా ప్రకరణము నందును నిరూపింపఁ బడ గలవు॥

తరువాత భూశుద్ధి, భూతశుద్ధి, అంతర్మాతృక బహిర్మాతృకము న్యాసము వాని న్యసింప వలయు వాని ప్రయోగము నాహ్నికము నందు జూడవలయు॥

గాయత్రీ హృదయము.

ఓమితి ఓమను, ఏకాక్షరం ఒక్కవర్ణముచే చెప్పఁబడువాఁడు బ్రహ్మ పరమేశ్వ

"వత్సా! జీవింపు మా"యని యాశిషముల నాతనిఖేదము వాపెను.అంత నుద్ధవుఁడా రాధికం గాంచి యాసభామధ్యభాగ మందుఁ దనవలె దుఃఖించు గోపికలకు మనశ్శాంతి కలుగునట్టు లిట్లు పల్కెను.

"ధన్యము యశస్కరము నగు భూఖండకాండమునందు జంబూద్వీప ముత్తమోత్తమము. అందు జన్మము లభించుట దుర్లభము. ఆభారతవర్షమున నేకోరికలఁ గోరి యేకర్మముల నాచరించినను ఫలము గలుగును. ఆభారతవర్షమున బృందావన ముత్తమోత్తమము. ఏలయన నీ బృందావనము రాధికా పాదారవిందరజస్స్పర్శమున నతిపవిత్ర మైనది. దీనియందు నివాసమును దేవతలు కోరుదురు. ఈ భూమితలము ధన్యము. మాన్యము. త్రిలోక దుర్లభము. సర్వవిశ్వసంపూజ్యము. శ్రీరాధాపరమపావనపాదాబ్జముల దర్శనము పూర్వపుణ్య ఫలము. మున్ను అఱువదివేలవత్సరములు పుష్కరతీర్థతటమున నతినిష్ఠ తనర విధాత వేదోక్తప్రకారము భక్తిపూర్వకముగాఁ దపంబొనరించెను. ఆతపఃఫలముగా గోలోకమున శ్రీరాధాకృష్ణ దర్శనమును గోరెను. కాని యది ఫలింపలేదు. స్వప్నమునను రాధామాధవ దర్శనము కాలేదు. దానికి ఖేదపడుచుండు నంత నాకాశవాణి సత్యమై యత్యద్భుతముగా వినఁబడియెను. పరమేష్ఠి! వారాహకల్పమునందుఁ బరమపవిత్రమగు భారత వర్షమునందు నత్యుత్తమమగు బృందావనమునందు మహారమ్య మగు రాసోత్సవసమయమున నందును రాసమండలమునందు సర్వదేవతా మధ్యభాగమునందు రాధామాధవుల దర్శించు భాగ్యము నీకుఁ గలుగఁగలదు. సంశయము లేదు. చింతింప

తస్య ఋష్యాదికం దర్శయతి॥

మూ॥ అగ్నిర్దేవతా బ్రహ్మఇత్యార్షం గాయత్రంఛందం పరమాత్మం సరూపం సాయుజ్యం వినియోగం॥

అగ్నిరితి॥ అస్యేతి శేషః అంగతి సకల వేదాన్త ప్రతిపాద్యత్వం గచ్ఛతీత్యగ్నిః పరమేశ్వరః॥ శ్రు॥ యోదేవానాం నామధా ఇతిశ్రుతేః॥ అస్య ప్రణవస్య పరమేశ్వరో దేవతేత్యర్థః। బ్రహ్మ, పరమేశ్వరఏవ ఆర్షం, ఋషిః విశ్వాధికో రుద్రో మహర్షిరితి శ్రుతేః। గాయత్రం ఛందం గాయత్రీ ఛందః పరమాత్మం సరూపం, పరమాత్మ స్వరూప మిత్యర్థః॥ సాయుజ్యం వినియోగం, మోక్షే వినియోగ ఇత్యర్థః। ఏవం ప్రణవ విద్యాం విజానీయాదిత్యాశయః॥

అథ గాయత్రీం ప్రార్థయతే॥

మూ॥ ఆయాతు వరదా దేవీ। అక్షరం బ్రహ్మసమ్మితం। గాయత్రం ఛందసాం మాతేదం బ్రహ్మజుషస్వ మే॥ యదహ్నాత్కురుతే పాపం తద

---

నియు, శివనామమే తారక మనియు రుద్రాధ్యాయమున నిశ్చయింపఁ బడి యున్నది॥ ఇదిగాక యోవేదాదౌ అను శ్రుతియు ప్రణవవాచ్యుండు మహేశ్వరుఁడేయని సిద్ధాంతము చేయుచున్నది॥ ఈ శ్రుతులకు విరుద్ధముగాన విష్ణ్వాదులు ప్రణవ వాచ్యులను నది గ్రాహ్యము కాదు॥

కావుననే యోగ సూత్రకారుఁడు మహేశ్వరుఁడె ప్రణవ వాచ్యుఁడని నిర్ధారణచేసియుండెను॥

ఆ ప్రణవ మంత్రమునకు ఋష్యాదులను దెలుపుచున్నాడు॥ సకల వేదాన్త ప్రతిపాద్యత్వమును పొందుచున్నాడు గాన అగ్ని శబ్ద వాచ్యుండగు పరమేశ్వరుఁడే దేవతయగును॥ బ్రహ్మ పరమేశ్వరుఁడే- ఆర్షం=ఋషియగును॥ గాయత్రం= గాయత్రీ, ఛందం= ఛందస్సు అగును॥ పరమాత్మం= పరమాత్మ, సరూపం= స్వరూప మగును॥ సాయుజ్యం=సాయుజ్యము- వినియోగము- మోక్షము నందు వినియోగ మని యర్థము॥ ప్రణవ విద్య నిట్లు తెలిసికొన వలయును॥

తరువాత ఆయాతు అని మొదలుగా గాయత్రిని ప్రార్థింప వలయును॥

ఆయాతు ఈ మొదలగు వాక్యముల కర్థము॥

వరదా=ఉపాసకులకు సకలాభీష్టముల నొసంగునదియు- దేవీ= నిత్యానంద

భారమునఁ గన్నీరు విడుచుచున్న యుద్ధవునింగాంచి రాధాంబ యిట్లనియె.

"వత్సా! చింతిల్లకుము. మధురానగరమున కరుగుము. శ్రీమాధవునితో నిక్కడివార్తల నన్నింటి నెఱిఁగింపుము. గోవిందు దర్శించుభాగ్యము నాకుఁగల్గఁజేయుము. దానికై ప్రయత్న మొనరింపుము. నాజన్మము నిష్ఫలము. కాలము గడచుచున్నది. మిథ్యాదురాశలు పొడలుచున్నవి. ఆశయే పరమ దుఃఖములఁ గల్పించును. నైరాశ్యమే పరమసుఖము." అనిపలికి స్మృతికిందగిలిన శ్రీకృష్ణరూపమును దిలకించి తద్వియోగమును భరింపఁజాలక రోదనము చేసెను. ఉద్ధవుఁ డమ్మానినిం జూచి తానును భృశదుఃఖితుఁడై యనుమతిఁగోరి యశోదామందిరంబున కరిగెను. ఉద్ధవుఁ డాచోటువాసి పోవఁగా రాధిక మూర్ఛిల్లెను. చేతనను బరిత్యజించి నట్లుండెను. ధ్యానతత్పరయయ్యెను. కమలదళముల శయ్యయందును జలమునందును, ప్రవాళశయ్యయందును రాధికఁ బరుండఁజేసి చేడియలు శీతలోపచారము లొనరించిరి. కన్నీరుగార్చుచు నుండిరి. ఆమె తనుస్పర్శచేత శయ్య భస్మమగుచుండెను. మరల నట్టిపానుపే యమర్పఁబడుచుండెను. చందనము నలందుచుండిరి. ఆచందన పంకము ధూళి యగుచుండెను. ఆమహావిరహజ్వరార్తినిగాంచి యాచేడియలు విస్మయం పడుచుండిరి. ఉద్ధవు నెడఁబాసిన క్షణ మొక్కయుగముగా రాధికమదికిఁ దోఁచెను. ఓహో యుద్ధవా! త్వరగా మధురాపురికరిగి హరిని బంపుమాయని వారనిరి. నా ప్రాణేశ్వరుఁ డ్వరగాఁబనుపుమా యని రాధ మదిలోఁ బలుకుచుండెను. పలవరించుచు నామాటనే రాధిక పలుకుచుంట

యద్యపి ప్రతిపాద్యస్య స్త్రీత్వాభ్యుపగమేపి తస్యాః పరమేశ్వర శక్తిత్వా దవశ్యం భావేన శక్తే రుపాసనే శక్తస్య పరమేశ్వరస్యోపాసనం సిద్ధమే వేతి న కాపి హానిః॥ తథాపి వస్తుస్థితి మనురుధ్యోక్తమితి జానన్తు సన్తః॥ అథ ప్రకృతం॥ తత్ర కిమిత్యత ఆహ॥ గాయత్రీమితి॥ ఛందసాం మాతా, సర్వేషాం వేదానాం జననీ సకలవేదసార భూతత్వాదిత్యర్థః॥ తదుక్త మాపస్తంబేన॥ సర్వేభ్యో వై వేదేభ్య స్సావిత్ర్యనూచ్యత ఇతిహి బ్రాహ్మణ మితి॥ తదేవాహ మనురపి॥ త్రిభ్య ఏవతు వేదేభ్యః పాదం పాదమదూదుహత్। తదిత్యృచోస్యా స్సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిరితి। గాయత్రీం, గాయత్రీఛందస్క మంత్రాభిమానినీ దేవతేత్యర్థః॥ ప్రథమార్థే ద్వితీయా॥ మే ఇదం, మదీయ స్తోత్రరూపం బ్రహ్మ, తపః జుషస్వ గృహాణ। త్వమితి శేషః॥ త్వమాగత్య మామనుగృహ్య మదీయం స్తోత్రం గృహాణేతి కృతం పరమేశ్వరార్పణం యతిరితి భావః॥ అత్ర కేచిత్ దేవి వేదాన్త ప్రతిపాద్యం తత్త్వముపదిశేత్యర్థా తన్న్యభ్యు పతే। విమర్శనేత్యేదమ నర్థాంతరమేవ॥ ఏతేన వేదాన్త ప్రతిపాద్య తత్త్వస్య గాయత్రీ ప్రతిపాద్యా దన్యత్వాపత్తేః తస్యచానిష్టత్వాత్॥ తస్మాదుక్తమేవ సాధీయః॥

---

గాయత్రీ ప్రతిపాద్యమునకు స్త్రీత్వము నంగీకరించినను నయ్యది పరమేశ్వరునికి యే అయితీర వలయును గాన శక్తి నుపాసించినను శక్తి విశిష్టుండగు పరమేశ్వరు నుపాసనము సిద్ధమే గాన బాధ యేమియు లేదు॥

అయినను నిజమును బట్టి ఆట్లే తెలుప వలసి వచ్చెను॥ ఇంక ప్రకృత మనుసరింతము॥ అతత్త్వమే లాటిదన, ఛందసాం మాతా = సకల వేదములకు జనని, సకల వేద సార భూత మైనది గానట్లు చెప్పబడుచున్నది॥ గాయత్రీం, గాయత్రీ ఛందస్సుగల మంత్రమునకభిమానముగల దేవతా నీవు, మే నాయొక్క తపః స్తోత్రరూపము గు తపస్సును, జుషస్వ గ్రహింపుము। నీవు వచ్చి యనుగ్రహించి నా స్తోత్రమును గ్రహింపుమని చేసి నస్తోత్రమును పరమేశ్వరార్పణము చేయుచున్నాడని భావము॥

ఇందు కొందఱు గాయత్రీ దేవివచ్చి వేదాన్త ప్రతి పాద్యమగు తత్త్వము నుపదేశించుగాక అని యర్థాంతము చెప్పుచున్నారు॥ కాని విమర్శించుచు నెడ నిది అనర్థాంతరమే యగును॥

సీ. విభుఁడు మా ప్రేమపల్లెవీథుల నేతేరఁ
  జూతుమే యొకనాఁడు చూడ్కు లలరఁ
ప్రభుఁడు మాతో నర్మభాషలు భాషింప
  విందుమే యొకనాఁడు వీనులలరఁ
దనువులు పులకింప దయితుండు డాసినఁ
  గలుగునే యొకనాఁడు కౌఁగిలింపఁ
బ్రాణేశ మమ్మేల వాసితివని దూఱ
  దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ
తే. వచ్చునే హరి మేమున్న వనముఁ జూడఁ
దలఁచునే భర్త మాతోడి తగులు తెఱఁగుఁ
దెచ్చునే విధి మన్నాథుఁ దిట్టుపడక
యెఱుఁగఁ బలుకు మహాత్మ నీకెఱుఁగవచ్చు."

ఈపద్యము లెంత హృద్యములో నేఁజెప్పకముందే మీ రెఱింగి యుందురని నమ్మెదను. గోపికభావము దీనిం బట్టిచూడఁగా విరహాతురముగాక భక్త్యతిశయమున నలరారుచున్నదని స్పష్టమగును. కౌఁగిలించుట కామమునఁ గాదని భక్తులజీవితమే తెల్పును. పండరిపురమున శ్రీపాండురంగని నేటికిని భక్తిభరమునఁ దరుణులు కౌఁగిలించి దుఃఖింతురు. అది కామముచేతనే యనుటకంటెఁ బాపము వేఱుగనుండునా? "ప్రాణరక్షకుఁడగు తన్నుఁ బ్రాణులెల్ల" అను పదము గోపికలభావమును దెల్పక మానునా? ప్రాణరక్షకుఁ డెవఁడు? పరాత్పరుఁడు గాక వేఱొక్కఁ డనవచ్చునా? మొండిపట్టుదలతో నన్న నేమోకాని యితరభావముతో నెవ్వరనరని నావిశ్వాసము. ఇఁక నవ్వలివృత్తాంతము నవధరింపుఁడు.

రించి యామె యెట్టకేలకు పోయిరమ్ము. మా కృష్ణునిం బంపు మని యనుమతినిడఁగాఁ దానిం దలఁదాల్చి రథమెక్కి ఖర్జూర కాననము వామభాగమున నుండునట్లు రథముసాగఁగా యము నాతరంగిణీతటమునకుం బోయెను. ఆమహానదీనిర్మలజలంబుల స్నానమొనరించి యందా దినముండి భుజించి రాత్రి సుఖనిద్ర నేసి మఱునాఁ డరుణోదయమున మరల స్నానాదివిధుల నాపా వనశైవలినియందే జరపి ప్రయాణము సాగించెను. ఆమార్గ మాతనిమది కచ్చెరువు గూర్చుచుండెను. గోపికాలాపము లాతని కర్ణకుహరములందుఁ బ్రతిధ్వనించుచునే యుండెను. రాధాదేవికిఁ గల ప్రీతి యచ్చెరువును గూర్చుచుండెను. బృం దావనమే యాతనిదృష్టికి గోలోకము క్షిస్థానముగాఁ గనఁబడు చుండెను. దారిఁ బోవునపుడంతయు నాతనిచూపులకు బృందా వనముగనే దోఁచెను. వేయేల? "సర్వం బృందావనం జగత్" అను భావముతప్ప వేఱేదియు నాతనికిఁ దోఁపలేదు.

కతిపయప్రయాణములకు నుద్ధవుఁడు మధురానగరమును జేరెను. భగవంతుఁ డాతనిరాక నెఱింగెను. నగరోపకంఠమున నొక్కతావున వటవిటపియుండ దానిమూలమునఁ గూరుచుం డెను. అది యేకాంతస్థలము. అందుఁగూరుచుండి తనకై శ్రమం పడు రాధాదుల కుశలవార్తలడుగుట మేలనియు, నుద్ధవుఁడు దాఁపక చెప్పుననియు నామహానుభావుఁడు భావించియే యొరు లెఱుంగకయుండ నందు వేంచేసియుండెను. శ్రీకృష్ణుఁ డింట లేకయుండ నెవ్వరేని వెదుకరా లేదా యనిమాత్రము ప్రశ్నిం పరాదు. గృహమునను వనమున నుండఁగలమహాత్ముఁడు హరి యనుమాట మఱువకుఁడు. ఇట్టిప్రశ్నముల కవకాశము దొర

సంస్కార విశేషః తస్య వినియోగ ఇత్యర్థః॥ తథావిధ సంస్కారస్య గాయత్ర్యుపదేశ సాధ్యత్వాత్॥ ఉప, సమీపే నయన ముప నేతు ర్గర్భాష్టమేవర్షే॥ వసంతే, బ్రాహ్మణ మాత్మాన ముపనయస్వేతి బ్రూయాదితి బోధాయాన వచనేన ఉపనేతారం ప్రత్యుపనేయస్య మాముపనయస్వేతి ప్రయోజక వ్యవహార ఉపనయనమితి నిర్వచనం॥ యద్వా పంచశీర్షోపనయన ఇత్యేకంపదం పంచశీర్షస్య పరమేశ్వర స్యోప సమీపే నయనం ప్రాపణం ప్రాప్తిరిత్యర్థః॥ పారమేశ్వర సాయుజ్యే వినియోగ ఇత్యర్థః॥ అయమేవార్థోయుక్తః గృహస్థాదీనా మస్యమంత్ర స్యావృత్తేయత్వేన తేషాముపనయనే వినియోగ భావాత్॥

## అథ గాయత్రీ జపనియమాః॥

తత్ర శంఖః॥ కుశబృస్యాం సమాసీనః కుశోత్తరాయాం వా కుశ పవిత్రపాణిః పశ్చిమాభిముఖ స్సూర్యాభిముఖో వా అక్షమాలా మాదాయ దేవతాం ధ్యాయన్ గాయత్రీ జపం కుర్యాదితి॥ జపాత్పూర్వ మాచమనం కార్యం॥ తదాహమనుః॥ ఆచమ్య ప్రయతోనిత్య ముభే సంధ్యే సమాహితః। శుభేదేశే జపన్ జప్య ముపాసీత యథా విధిః॥ తత్రాచమనం శ్రౌతం స్మార్తం వా కర్తవ్యం॥ ప్రణవ వ్యాహృతి యుతాం గాయత్రీం వై జపేద్ద్విజ ఇతి వ్యాసవచనాత్ ప్రణవ వ్యాహృతి యుతా గాయత్రీ జప్యా భవతి॥ సాయముపవిశ్య ప్రత్యఙ్ముఖో జపమాచరేత్ ప్రాతః కాలే తిష్ఠన్ ప్రాఙ్ముఖ ఇతి నియమః॥ తదాహ మనుః॥ పూర్వాం

---

గాయత్ర్యాః గాయత్రికి, గాయత్రీ గాయత్రి అనునది, ఛందః= ఛందస్సు విశ్వామిత్రః=విశ్వామిత్రుడు, గాయత్రీ ప్రభావము వలన బ్రాహ్మణ్యము నొందెను గాన, ఋషిః ఋషి, సవితా= పరమేశ్వరుడు దేవతా దేవత యగును॥ ఇంక గాయత్రీ స్వరూపమును చెప్పుచున్నాడు॥ గాయత్రికి, అగ్నిః= అగ్ని, ముఖం, బ్రహ్మ బ్రహ్మదేవుడు శిరః శిరము, విష్ణువు హృదయం వక్షము, రుద్రః రుద్రుడు శిఖా శిగ అగును॥ గాయత్రి గాయత్రి ప్రాణాపానవ్యానోదానసమానా పంచ ప్రాణ స్వరూపము, సప్రాణా శ్వేతవర్ణా ధనంజయ వాగక్షర రూపము, శ్వేతవర్ణా శుభ్రవర్ణము సాంఖ్యాయన సగోత్రా= సాంఖ్యాయనుడను మునియొక్క గోత్రము కలదియు, చతుర్వింశత్య

హారకుంజకుటీరపటలము గలదు. మఱియు నతిమనోజ్ఞసరోవర నికురుంబము గలదు. వానిం గాంచితివా? వికసించి భ్రమర సముదయసంకులమై పుష్పోద్యాన మందే కలదు. కనుఁగొంటివా? ఊఁడలతోఁ జూడఁదగి మహత్తరాకృతి వెలసియున్న పరమపావనభాండీరవటమహీరుహ మందే యున్నదే. దానిం జూచుభాగ్యము నీకుం గల్గెనా? గోవుల కునికిపట్టులై చూడం జూడఁ గడునింపుఁబెంచుచు నున్నగోష్ఠములు, నందు ధేనువులును నేత్రగోచరము లయ్యెనా? అందు సుందరమందిరవరమున రాధాదేవి గలదు. బ్రదికియున్నదియా. నీవా నా ప్రాణప్రియను సందర్శింపఁ జాలితివా? ఆమె నాతో నేమి చెప్పుమని యెను? ప్రియబంధూ! ఉద్ధవా! ఆవిషయమెల్ల యథార్థముగా వివరింపుము. నామనం బాతురపడుచున్నది. గోపిక లేమిపల్కిరి? గోపకుమారులు నన్నుంగూర్చి యేమి సంభాషించిరి? వృద్ధగోపకులు కుశలముగ నున్నవారుకదా. వారెల్ల నాతండ్రికి మిత్రులు. వారు నాతో నేమి చెప్పుమనిరి? బలదేవునితల్లి సాధ్వీమణి రోహిణి యేమేని చెప్పుమనియెనా? బంధువులకు బంధువులు వారిభార్యలును నాకుం జెప్పుమన్న మాట లేవి? నీ వందేమి భుజించితివి? మాతల్లిగాని రాధికకాని నీ కేమిచ్చిరి? వారు నీతో నెట్లు మాటలాడిరి? మీసల్లాపము లెట్లు చెల్లెను? గోప గోపికానికరముయొక్కయు, వారిశిశువులయు, నాజననియు, రాధికయు సంభాషణము లెట్టివి? మాతల్లి నన్ను స్మరించునా? రోహిణియు నన్నుఁ దలంచునా? రాధాదేవి నన్ను మది మఱవక యున్నదియా? మత్ప్రేమవిరహాకులయై యున్నదియా? గోపికలు నన్ను స్మృతితప్పక యనుకొనుచుందురా? గోపబాల

ప్రణవే నిత్యయుక్తస్య వ్యాహృతీషు చ సప్తసు త్రిపదాయాంచ గాయత్ర్యాం న భయం విద్యతే క్వచిదితి॥

ఆచమ్య ప్రాణానాయమ్య పూర్వోక్తైర్గుణవిశిష్టే ... ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాంగ మష్టోత్తరశత గాయత్రీమహామంత్ర జపం కరిష్య ఇతి సంకల్ప్య షడంగన్యాసం కుర్యాత్। తద్యథా గాయత్రీ సారే।

యథా॥ ఓం తత్సవితుః బ్రహ్మాత్మనే అంగుష్ఠాభ్యాం నమః। ఓం వరేణ్యం విష్ణ్వాత్మనే తర్జనీభ్యాం నమః ఓం భర్గో దేవస్య రుద్రాత్మనే మధ్యమాభ్యాం నమః ఓం ధీమహి ఈశ్వరాత్మనే అనామికాభ్యాం నమః ఓం ధియోయోనః సదాశివాత్మనే కనిష్ఠికాభ్యాం నమః, ఓం ప్రచోదయాత్ పరశివాత్మనే కరతల కరపృష్ఠాభ్యాం నమః॥ ఓం తత్సవితుః బ్రహ్మాత్మనే హృదయాయ నమః ఓం వరేణ్యం విష్ణ్వాత్మనే శిరసే స్వాహా ఓం భర్గో దేవస్య రుద్రాత్మనే శిఖాయై వషట్ ఓం ధీమహి ఈశ్వరాత్మనే కవచాయ హుం ఓం ధియో యోనః సదాశివాత్మనే నేత్రత్రయాయ వౌషట్ ఓం ప్రచోదయాత్ పరశివాత్మనే అస్త్రాయ ఫట్ భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥

---

చేయవలయునని శంఖుడు చెప్పెను॥

జపమునకుముందుగా నాచమనము చేయవలయును॥ సంధ్యాకాలముల యందు పవిత్రమగుచోటఁ గూర్చుండి సమాహిత చిత్తుఁడై ఆచమనము చేసి జపము చేయవలయునని మనువు చెప్పెను॥ అప్పుడు శ్రౌతాచమనము గాని స్మార్తాచమనము గాని చేయవలయును॥ వ్యాసుని వచనముబట్టి ప్రణవము, వ్యాహృతులు నను వానితోఁ గూడిన గాయత్రిని జపింపవలయును॥

సాయంకాలమున పడమర మొగముగా గూర్చుండియు ప్రాతః కాలమున తూర్పు మొగముగా నిలుచుండియు జపము చేయవలయును॥ మధ్యాహ్న కాలమున తూర్పు మొగముగాఁ గూర్చుండియే జపము చేయవలయును॥ ప్రాతః కాలమున నిలుచుండి జపము చేయవలయునను నియమము బ్రహ్మచారులకే యని కొందఱందురు॥

సంఖ్యానియమము నవలంబించియే జపము చేయవలయును॥ సంఖ్యానియమము లేక చేసిన జపము వ్యర్థమగునని చెప్పఁబడియున్నది॥ సంకల్పము చేయక శ్రాద్ధము చేసినను, దానము చేసినను, హోమము చేసినను, జపము చేసినను వ్యర్థమగునని చెప్పఁబడి

వస్త్రము గప్పుకొని శ్వేతచామరము లూని సఖీజనము సేవింపఁగా నిరాహారయై కృశోదరియై క్షణకాలము నిట్టూర్పులు పుచ్చుచు క్షణకాలము విలపించుచు క్షణకాలము విహ్వలించుచు విరహాజ్వరము సదా తన్ను నేఁచుచుండఁగాఁ బరుండియుండెను. దివారాత్రభేదమే యెఱుంగదు. జలస్థలభేదమూహింపదు. నరులకుఁ బశువులకుఁ గలభేద మరయఁజాలదు. ఆమెకు బంధువు లెవ్వరు? బాహ్యజ్ఞాన మారాధికకు లేదు. దాస భవద్రూపమునే స్మరించుచుండును. త్రిలోకములయందా జననికీర్తి వ్యాపించినది. అట్టియామెకు మృత్యు వెట్లు కల్గును? జ్ఞానహీనులగు దస్యువులుకూడ స్త్రీహత్యను వాంఛింపరు. తండ్రీ! ఇఁక నాలస్యముచేయక గోకులమున కరుగుము. జగన్నాయకా! తొలుదొలుతఁ గదళీవనమునకే పొమ్ము. సకలలోకముల కారాధ్యాంబ బహిఃప్రాణ మనఁదగినది. భవత్పరాయణయై సదా స్మరించుచున్నది. ప్రభూ! మిగులభక్తిగల యామెనువదలుట వ్యర్థగల్గజేయుట న్యాయముకాదు. రాధను మించిన భక్తికలవా రుండరు. ఊవలఁ కుండలేదు. ముందుండఁ బోరు. మన్మథుఁడు శంకరభీతి నిన్నాశ్రయించెను. భవద్విధప్రాణనాథునిబడసియు రాధిక కామదగ్ధ యగుచున్నది. కావున నామెను రక్షించుటొప్పు. ఆఘోరకష్టమును నిలుపఁగలవాఁడవీవెకదా. వసంతుఁడు తాపము కల్గించుచుండ శీతకరుఁడు కిరణములద్వారా దహించుచున్నవాఁడు. మలయమారుత మామెకు మహార్తిని గల్గించెడిని. ఇపు డనాథవలె సర్వవిధపీడల ననుభవించుచున్నది. తప్తకాంచనవర్ణాభమగు నామెదేహామింతరుణమునఁ గాటుకవంటి ఛాయగలిగి యున్నది. కేశ

స్తథా త్రయీశిరశ్శిఖా రుద్రో విష్ణుర్హృదయమేవచ। ఉపనసనే విని యోగస్సాంఖ్యాయన గోత్రికా త్రైలోక్యం చరణం జ్ఞేయం పృథివీకు క్షిరేవచ। ఏవం ధ్యాత్వాతు గాయత్రీం జపేద్ద్వాదశ లక్షణామితి॥ అథా క్షరఋషయః॥ విశ్వామిత్రః॥ విశ్వామిత్రో భరద్వాజో గౌతమః కుత్స ఏవచ। భృగుశ్శాండిల్యకశ్చైవ లోహితో గర్గఏవచ। శాతాతప స్సన త్కుమారస్తథా సత్యతపః స్మృతః। భార్గవః పరాశరశ్చ పుండరీకః క్ర తుస్తథా। దక్షశ్చ కాశ్యపశ్చైవ జమదగ్నిశ్చ వత్సకః విమల శ్చాంగి రాశ్చైవ అత్రిఃకండూ స్తథైవచ। కుంభయోని శ్చతుర్వింశో ఋషయ పరికీర్తితాః॥ అథఛందాంసి॥ గాయత్ర్యుష్ణి గనుష్టుప్చ బృహతీ పంక్తి రేవచ। త్రిష్టుప్చ జగతీచైవ అనుష్టుప్పంక్తి రేవచ। జగతీష్టరాపంక్తి ర నుష్టుప్పంక్తి రేవచ। అక్షరపంక్తి రనుష్టుప్చ జగతీ త్రిష్టుభాతథా। జగత్యా నుష్టుభాచైవ అనుష్టుప్ త్రిష్టుభాతదా। త్రిష్టుప్చజగతీచైవ దేవీ గాయత్రి రుచ్యతే గాయత్ర్యాస్తు చతుర్వింశ చ్ఛందాం స్యక్షరశః క్రమాదితి॥ అథాక్షరదేవతాః॥ అగ్నిః ప్రజాపతిశ్చైవ సోమఈశానఏవచ। అప్యోథ

---

యందుగాని న్యాసముద్రాదులు లేమింకేసి వైదికములు కానేరవని కొందఱందురు. కాని యుక్తముకాదు॥ న్యాసముద్రాదులు వేదతుల్యములగు శివాగమముల యందును. చెప్ప బడుటను, శిష్టులందఱిచే నవలంబింపఁబడియుండుటను ఇవ్వాని వైదికములే యగును ఆయినను న్యాసాదులా వశ్యకములు కావని కొందఱు చెప్పు వచనములు శివాగమద్వేష మున్నే చెప్పఁబడియెగానను- సంధ్యాది కర్మలోపముల గలిగించునవి గానను ఇట్లు చె ప్పినవారు విధిహింసకులనియే గ్రహింపవలయును॥

గాయత్రికి— గాయత్రీ ఛందస్సు—సవితృ దేవత-అగ్ని ముఖము, విశ్వామిత్రుఁడుఋషి, ఋగ్యజుస్సామములు శిరస్సు- రుద్రుఁడు శిఖ, విష్ణువు హృదయము, ఉపాసన మున విని యోగము, సాంఖ్యాయనగోత్రము, త్రైలోక్యము చరణము, పృథివి కుక్షి, ఇట్లు పండ్రెం డు లక్షణములు గల గాయత్రిని ధ్యానము చేసి జపము చేయవలయును॥

విశ్వామిత్రుఁడు, భరద్వాజుడు, గౌతముడు, కుత్సుడు, భృగువు, శాండిల్యుడు లోహితుడు, గర్గుడు, శాతాతపుడు, సనత్కుమారుడు, సత్యతపుడు, భార్గవుడు, పరాశ

## గోకులముననుండువారికి హరి స్వప్నమున దర్శనమిచ్చుట.

స్వప్నమున నెల్లర కొక్కపర్యాయమే దర్శనమిచ్చెను. రాధ నూఱడించెను. సుదుర్లభ మగుజ్ఞానము నుపదేశించెను. క్రీడచే నారాధికను సంతోషపఱచెను. యథోచితముగా గోపికల నానందపరవశలను జేసెను. యశోదనూఱడించి స్తన్యము ద్రావెను. గోపకులను గోపశిశువులను బోధించి విజ్ఞానవంతుల నుగా నొనరించెను. వారికిట్లు జ్ఞానమునుపదేశించి మరల వారి కట్టియార్తి కలుగకయుండఁజేసి మధురానగరమున కరిగెను. తెల్లవాఱె వారెల్ల రాత్రివృత్తాంతమును దలంచుకొనుచు శ్రీకృష్ణునిలీలల కానందపరవశ లగుచుఁ దద్దర్శనము సదా తమ కగుచున్నట్లే తదుపదేశమున నూహించి పూర్వమువలె దుఃఖింపక సర్వాంతర్యామి లేనిచోటును గలదాయని నెమ్మదినుండిరి. శ్రీహరియు వారినూరార్చి తనపని సఫలమాయెనని యూహించుచుఁ దా నవతరించినదెందులకో యాకృత్యముల నొనరింపఁ దలంపుఁగొనియెను.

మహామతులారా! ఈకథను బఠించితిరి. దీనియందు విశేష మేమేని కలదా యనుప్రశ్నమునకు సమాధానము వ్రాయక తప్పదుకదా. ఇందొక్క గొప్పవిషయమున్న అదియే యిద్దానినుండి గ్రహింపఁదగువిషయము. దాని నాలకింపుఁడు.

ఉద్ధవుఁడు పరమభక్తుఁడు. ఏకాంతసేవను గోరుచుండు వాఁడు. వెడలునప్పుడు రాధ యనన్యగతిక కావున మాశ్రీకృష్ణునింబంపుమీాయని యూరకుండెను. యశోదామందిరమున కరిగి యామెకు నచ్చఁజెప్పి సెలవంది యమునాతీరమునకుం బోయెను. నదియందు స్నానముచేసి భగవంతుని ధ్యానించెను.

ప్రహ్లాదినీ ప్రభా నిత్యా విశ్వభద్రా విలాసినీ। ఈశ్వరీ విజయా శాంతా కాంతి ర్దుర్గా సరస్వతీ। విరూపావి శదాచే శా వ్యాపినీ విమలా తథా। తమోపహారిణీ సూక్ష్మా విశ్వయోనీ ర్జయా వహా। పద్మాలయా పరాశోభా గదారూపేతి శక్తయః॥ అథకర న్యాసః॥ విశ్వామిత్రః॥ ఆదావస్త్రేణసంశోధ్య కరన్యాసం తతశ్చరేత్॥ అథాక్షర న్యాసః॥

తత్కారం విన్యసేత్పాదాంగుష్ఠద్వయే ద్విజః। సకారం గుల్ఫదేశేతు వికారం జంఘయోర్న్యసేత్। జాన్వోస్తు విద్ధితుః కారం వకారం చోరు దేశతః। రేకారం విన్యసేద్గుహ్యే ణికారం వృషణే న్యసేత్ కటి దేశేతు యం కారం భకారం నాభిమండలే। ర్గోకారం జఠరేయోగీ దేకారం స్తనయోర్న్యసేత్। వకారం హృదివిన్యస్య స్యకారం కంఠపవతు। ధీకారమాస్యే విన్య

దినాలుగక్షరముల యొక్క శక్తులు.

తరువాత కరన్యాసము చేసికొనవలయు వస్త్రముతో చేతులు బాగుగా తుడిచి కొని కరన్యాసము చేసికొనవలయునని విశ్వామిత్రుడు చెప్పెను.

అక్షర న్యాసము.

గాయత్రియొక్క ఇరువదినాలు గక్షరములను తనశరీరమునందు న్యసింపవలయును.

తత్ అనుదానిని కాలిబొటన వ్రేళ్ళయందును, స అనుదానిని చీలమండలి యందును, వి అనుదానిని పిక్కల యందును, తుః అనుదానిని మోకాళ్ళ యందును' వ అను దానిని తొడలయందును, రే అనుదానిని గుహ్యమునందును, ణి అనుదానిని వృషణముల యందును, యం అనుదానిని మొల యందును,భ అనుదానిని బొడ్డునందును, ర్గో అనుదానిని కడుపు నందును, దే అనుదానిని స్తనముల యందును, వ అను దానిని హృదయము నందును, స్య అనుదానిని కంఠమునందును, ధీయనుదానిని నోటియందును, మ అనుదానినిదవడలయందును, హి అనుదానిని ముక్కుకొనను, ధి అనుదానిని కనులయందును, యో అనుదానిని కనుబొమల నడుమను, యో అనుదానిని మొగము నందును, నః అనుదానిని ఎడమ చెవి యందును, ప్ర అనుదానిని కుడిచెవియందును, చో అనుదానిని ఫాలము నందును, ద అనుదానిని చెక్కిళ్ళయందును, యాత్ అనుదానిని శిరమునందును, న్యసింప వలయు. ప్రతి అక్షరము న్యసించునపుడు ప్రణవమును మొదటను, నమః యను పదమును చివరను చేర్చి ఓం తత్ నమః యని మొదలుగా అక్షరన్యాసము చేయవలయు.

సత్యస్వరూపుఁడగు భగవంతునిభావ మదియానా? కాదు కదా. మఱేమనఁగా, స్త్రీలయందు వృథాపవాదములు కల్పించి దూషించునపు డా స్త్రీలమర్యాద రక్షించుపొంటె సజ్జనుఁ డిది యసత్యము, వృథాకల్పితము అని తా నెలుఁగఁజెప్పిన వారి కది రక్షణ మగునుగాన నపు డసత్యదోషములేదని యెఱుంగఁ దగు. నర్మోక్తు లనఁగాఁ జమత్కారపుఁబలుకులు. అవి పరస్పరానురాగమును వెలిబుచ్చునవి. వానినే స్త్రీపురుషుల సరసాలాపము లందురు. అందేమాత్రము దోషములేదని భావము. అనఁగా నామాట లెవ్వారికిని బాధగల్గించునవి కావు. కనుక దోషమావహిల్లదని యెఱుంగునది. వివాహముల యందు నసత్యదోషము లేదనఁగా భావమేమి? వధూవరులకుఁ గల దోషములు దాఁచిపెట్టి యసత్యములైనఁ బలికి వారి జతకూర్చిన నసత్యము లేదని కొందఱర్థము చెప్పుదురు. అట్లైనచో

"శ్లో. యస్తు దోషవతీం కన్యామనాఖ్యా యోపదాపయేత్,
తస్య తద్వితథం కుర్యాత్కన్యాదాతు ర్దురాత్మనః."

మనుస్మృతి ౯ అధ్యా. ౭౪ శ్లో.

అను నీప్రమాణము వ్యర్థమగును. కావున వివాహోద్యుత్సవ సమయములయందు వేళాకోళములు చేసికొనుతఱి నన్నృత దోషము లేదనియే గ్రహింపవలయును. వృత్త్యర్థమై యసత్యములాడినఁ బాపము లేదనఁగా సంసారవృత్తి యెట్లని ప్రశ్నించినపు డున్న దున్నట్లు చెప్పక దాఁచినను బాపము లేదని యూహింపం దగును. ప్రాణసంకటముతఱిఁ దద్రక్షణార్థమై యన్నృతము పల్కినను బాపమంటదు. గోబ్రాహ్మణుల కొఱకనఁగాఁ బ్రాణాపాయము నిర్నిమిత్తముగాఁ గలుగుచున్నపుడనియే

తి॥ ణికారం చింతయేద్యోగీ విద్యుత్తుల్యసమప్రభం। గురుతల్పకృతం పాపం తత్‌క్షణాదేవ నశ్యతి॥ యంకారం తారకావర్ణ మిందుశేఖర భూషణం। యోగినాం వరదం ధ్యాయేత్ బ్రహ్మహత్యా వినాశనం। భకారం కృష్ణవర్ణంతు నీలమేఘ సమప్రభం॥ ధ్యాత్వా పురుషహత్యాదిపాపం నాశయతి ద్విజః॥ గోకారం రక్తవర్ణంతు కమలాసన సంస్థితం। గోహత్యాయా కృతంపాపం నాశయంతం విచింతయేత్। దేకారం మరకతశ్యామం కమలాసన సంస్థితం। సతతం చింతయేద్యోగీ స్త్రీహత్యా దహ్యతే పరం॥ వకారం శుక్లవర్ణంతు జాతిపుష్ప సమప్రభం। గురుహత్యాకృతం పాపం ధ్యాత్వా దహతి తత్‌క్షణాత్। స్యకారం చింతయేత్పీతం సువర్ణద్యుతి సన్నిభం। మనసాయత్కృతం పాపం తత్‌క్షణాదేవ నశ్యతి॥ ధీకారం చింతయే దిందుకుందపుష్ప సమప్రభం॥ పితృమాతృవధాత్పాపాన్ముచ్యతే నాత్రసంశయః॥ మకారం పద్మరాగాభం చింతయేద్దీప్తతేజసం। పూర్వజన్మార్జితం పాపం తత్‌క్షణాదేవనశ్యతి॥ హికారం శంఖవర్ణంతు పూర్ణచంద్ర సమప్రభం। అశేష పాపదహనం ధ్యాయేన్ని

---

మువలనగలుగు పాపము నశించును॥ ణి యనుదాని మెఱుపుతో తుల్యమగు ప్రకాశము చున్న దానిగ భావించునెడ గురుతల్ప గమనమువలనం గలుగు పాపము తొలంగును॥ యం అనుదానిని చుక్కతో సదృశమగు వన్నె గలిగి పరమేశ్వరుని కలంకారముగా నున్న దానిగా భావించునెడ బ్రహ్మహత్యాది పాతకము లడంగును. భ అనుదానిని నీలమేఘము వోలె నల్లగా నున్నదానిగా ధ్యానించునెడ నరహత్యాది పాపములు తొలంగును॥ గో అనుదానిని ఎర్రనివన్నెగలిగి పద్మాసనమున నున్నదానిగా భావించునెడ గోహత్యాది దోషము లంటనేరవు॥ దే అనుదానిని మరకతమువోలె పచ్చని వన్నెగలిగి పద్మాసనమున నున్న దానిగా భావించునెడ స్త్రీహత్యయు దగ్ధమైపోవును॥

వ అనుదానిని జాతిపుష్పమువోలె తెల్లని వన్నెగలిగియున్న దానిగా భావించునెడ గురుహత్యాది దోషములు నశించును॥ స్య అనుదానిని బంగరువోలె పచ్చగా నున్నదానిగా భావించునెడ మానసికములగు పాపము లెల్లను నశించును॥ ధీ అనుదానిని చంద్రునివోలె తెల్లగానున్న దానిగా భావించునెడ పితృమాతృవధములవలన గలుగుపాపములు నశించును॥ మ అనుదానిని పద్మరాగమణివోలె నెర్రగా నున్నదానిగా ధ్యానము చేయునెడ

పాఠకమహాశయులారా! లోపలికథను మఱచి మధుర లోనేయున్నట్లు శ్రీకృష్ణుని భావించి కథఁ జదువుఁడు. పురాణ భేదములనుబట్టి కథ మార్పునొందును. కాని ఫలమొక్కటియే. దీని వ్రాయుటకు హేతువు లేకపోలేదు. రాసక్రీడ మరల సాగును. చిరకాలము రాధామాధవులకు వియోగము సంభవించును. కాన నడుమ వారికూడికను దెలుపుట మహాలాభము. భక్త్యుద్దీపకము. కాన నోపికమైఁ బఠింపుఁడు. దానివిధ మీరీతి యని తలంపుఁడు.

ఉద్ధవునిమాట లాలకించి శ్రీహరి భక్తవత్సలుఁడు కావునఁ దాను వారికడఁ జేసియున్న శపథము స్మరించి గోకులమున కరుగ మదినెంచెను. మధురానగరమునఁ గల కార్యభారము నుదీర్ప బలభద్రు నునిచిపోవుట మేలని నిశ్చయించెను. కార్యజాలముల నన్నకుం దెల్పి దివ్యస్యందనం బెక్కి-యుద్ధవా! మరల నాతోఁటి గోకులమునకు రమ్మాయని పిలిచి యతఁడు మహాప్రసాదంబని తోనరుదేరఁ బ్రయాణమయ్యెను. భక్త మనోరథముల నీడేర్ప నూహించెను. స్యందన మతివేగంబ చనుచుండఁగాఁ దొలుతొలుత గోవర్ధనాద్రియు నావిదప గోకులము ను గనఁబడఁగా వానిం గాంచుచు బృందావనమునకుం బోయెను. యమునాతీరము మనోహరమై యుండునది గాన

---

యమునుండి సంగ్రహింపఁబడినది. దీని ప్రకారము శ్రీహరి మధురనుండి గోకులమున కరుగుదెంచునని తలంపఁజను. కావున నీపురాణము ననుసరించిన యీకథను జదువునపుడు లోపలికథను మఱువవలసి యుండును. స్వప్నదర్శన మిచ్చెనన్నకథ యిట మఱచి మధురనుండి వచ్చి గోకులమును చేరెనని చదువుఁడు.

తస్య మృతకం చ నవిద్యతే। సాక్షాద్భవత్యసౌ బ్రహ్మ స్వయంభూః పరమేశ్వరః॥ యస్త్వేతాం నవిజానాతి గాయత్రీం తు యథావిధి। కథం తం సూతకం తస్య మృతకం చ సదైవహి। నైవదాన ఫలం తస్య నైవ యజ్ఞ ఫలం భవేత్॥ నచ తీర్థఫలం ప్రోక్తం తస్యైవం సూతకే సతి॥ పాదాది కుక్షి పర్యంతం శిరః ప్రభృతి వక్షసి। కర్తవ్యాః కామిభిః న్యాసో గృహస్థై రితి నిర్ణయ ఇతి॥ పదన్యాస మాహ స ఏవ॥ దక్షిణాంగుష్ఠమారభ్య యావద్వామకనిష్ఠికా। దశైతాని పదే న్యస్య క్రమేణైనం న్యసేత్సుధీః శిరో భ్రూమధ్య నయన వక్త్ర గండేషు చైకమాత్। హృన్నాభి గుహ్యదేశేషు జానుపాదద్వయే న్యసేత్॥ చంద్రికాయాం॥ ప్రతిపాదమృష్యాది కముక్తం॥ తత్సవితురిత్యస్య విశ్వామిత్ర ఋషిః। గాయత్రీ ఛందః। బ్రహ్మా దేవతా॥ భర్గో దేవస్యేత్యస్య గాయత్రీ ఛందః। విశ్వామిత్ర ఋషిః విష్ణుర్దేవతా॥ ధియో యోన ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః। గాయత్రీ ఛందః। రుద్రో దేవతేతి॥

---

తాశౌచములును నుండ నేరవు॥ ఇట్లు ధ్యానము చేయువాడు కేవలము బ్రహ్మస్వరూపుడే యగును॥ ఈవర్ణధ్యానమెఱుగని వానికి జాతాశౌచ మృతాశౌచము లెల్లప్పుడు నుండి తీరును కాన వానికి దానఫలము యజ్ఞఫలము తీర్థఫలంబును లభింప నేరవు॥ కోరికలు గల గృహస్థులు పాదములు మొదలుకొని కుక్షివరకును శిరము మొదలుకొని, వక్షము వరకును న్యాసము చేసికొన వలయును॥

మఱియు, గాయత్రియందున్న తత్ అని మొదలగు పదిపదములను. శిరము, భ్రూమధ్యము, నేత్రములు, నోరు, చెక్కిళ్లు, హృదయము, నాభి, గుహ్యము, మోకాళ్లు పాదములు అను పదిచోట్లను న్యసించుకొనవలయు॥ ఇది పదన్యాసమని చెప్పఁబడును॥

ఇది కాక, గాయత్రి యందగు మూడుపాదలకు వేర్వేరుగా ఋష్యాదికము చెప్పఁబడియెను.

నిత్యాను చేయు జపమునందు ఋషి మొదలుగ షడంగ న్యాసము అవశ్యకము॥ ఫలాపేక్ష్యయును పేక్షించు నెడ వర్ణ న్యాసాదికము చేసికొని కరన్యాస పూర్వముగ షడంగ న్యాసము చేసికొనవలయు॥ కరహృదయాది న్యాసములు చెప్పఁబడియెను॥

శ్రీకృష్ణమూర్తి యాగమనమున మఱింతయింపుగా నుండెను. గోపులు గుంపులుగుంపులుగాఁ గూడి వ్రజాధిపుఁడయి యల రారు శ్రీకృష్ణునిం బొడఁగాంచి మహానందమునఁ బరుగెత్తసాగెను. ఎపుడెపుడు శ్రీకృష్ణుని జేరుదుమా యనునూహాలఁ దోఁకలు పైకెత్తి యంబారవంబులఁ గావించుచు నవి పరుగు వాఱి శ్రీహరిం జేరవచ్చెను. వానిపొదుగులనుండి క్షీరములు ధారలుగాఁ బ్రవహింపసాగెను. చెవులనిక్కించి యవి వచ్చుచుండ వత్సవ్యూహము వానివెంటఁ బరుగిడుచుండెను. ధేనువులు సగము నములుచున్నగడ్డి గంటలతోఁ గన్నీరుపాఱుచుండఁగా నంబాయనుధ్వనులు వెలయించుచుఁ దమకష్టములు గట్టెక్కెనని నిశ్చయించి పరుగెత్తెను. అరుణకాంతులు ప్రజ్వరిల్ల నరథుఁడైవచ్చు శరత్కాలఖరకిరణుని మేఘము లావరించినట్లు శ్రీకృష్ణుని జుట్టుకొని నిల్చెను. నలుప్రక్కలఁ జుట్టుకొని యాధేనువులును వత్ససముదాయమును శ్రీకృష్ణరథమును గదలకయుండఁ జేసెను. గుఱ్ఱములు నిలువఁబడియె. ఉద్ధవుఁడావిచిత్రవృత్తమెఱింగి యచ్చెరుపడి చూచుచుండెను. శ్రీహరి యానందమునఁ దన్నుంజూచు నాధేనువ్రాతమును జూచుచు వానిపేరులు వేఱువేఱ నుచ్చరించుచు వానిం బిల్చుచుఁ జెంతకుం బోయి బుజ్జగించుచు దువ్వుచు ముద్దిడుకొనుచు శ్రీకరమగు తనహస్తపద్మమున వానిందడివి కుశలమును విచారించుచుఁ జూచువారి కచ్చెరువు కల్గించుచుండెను. ఉద్ధవుఁడాభగవద్విచిత్రచరిత్రమును దిలకించి బ్రహ్మానందసుఖమనుభవించుచుండెను.

క్రాంతం తతో ముద్గర పల్లవావితి॥ ఏతాసాం లక్షణ మాహ నారదః॥ సమ్ముఖం సమ్మతౌ హస్తావుత్తానౌ కుంచితాంగులీ। కుంచితావగ్రాః అంగుళయ ఉక్తలక్షణాయ యోర్హస్తయోస్తౌ సమ్ముఖం నామముద్రా॥ సంపుటం పద్మకోశాభౌ కరావన్యోన్య సంహతౌ॥ పద్మముకుళాభాకరౌ సంపుటం నామముద్రా॥ వితతం సంహతం హస్తావుత్తానావాయతాంగుళీ॥ ఆయతాః ప్రసారితాః అంగుళయో ఉక్తలక్షణాయయోస్తౌ ఇతి తన్నామముద్రా॥ విస్తీర్ణ సంహతౌ పాణి మిథోఽశ్లిష్టాంగుళిర్ద్వయోః। ముక్తాంగులీ ద్వయాభ్యాం పాణిభ్యాం తౌ మిథస్సంహతౌ॥ విస్తీర్ణం నామముద్రా॥ సమ్ముఖౌ సక్తయోః పాణ్యోః కనిష్ఠా ద్వయేన యోగశ్శేషాంగుళీనాం వైరళ్య మంగుష్ఠ ద్వయమారభ్యానామికాంతం యావద్ద్విముఖం త్రిముఖం చతుర్ముఖం పంచముఖం నామముద్రా భవంతి॥ తత్రవకారే ద్విముఖం రేకారే త్రిముఖం ణికారే చతుర్ముఖం యకారే పంచముఖం, భకారే అంగులీనాం సంయోగాత్పూర్వయోగవినాశనః॥ తిర్యక్త్వం యుజ్యమానా గ్రాసం యుక్తాంగుళిముఖా హస్తౌ షణ్ముఖమిత్యుక్తా ముద్రా ముద్రావిశారదైః॥ పూర్వయోగః కనిష్ఠాద్వయసంయోగ స్తద్వినాశే ఇతరాంగులీనాం సంయోగ స్తిర్యక్త్వం యుజ్యమాన మగ్రం యయోస్తథా॥ సంయుక్తమంగుల యోస్తౌ షణ్ముఖం నామముద్రా॥ ఆకుంచితాగ్రా సంయుక్తౌ వ్యక్తౌ హస్తా వధోముఖం। ఈషద్వక్రాగ్రావధః కృత్వా హస్తౌ అధోముఖముద్రా॥ ఉత్తానౌ తాదృశావేవ వ్యాపకాకుంచితౌ కరౌ। వ్యాపకాంజలికం నామముద్రా ప్రోక్తా విచక్షణైః॥ అధోముఖౌ బద్ధముష్టి ముక్తాగ్రాంగుష్ఠకౌ కరౌ। శకటం చ తదిత్యుక్తం॥ ముక్తాగ్రావంగుష్ఠౌ యయోరుక్త లక్షణయోః కరయోస్తౌ శకటం నామముద్రా॥ యమపాశమితః పరం॥ బద్ధముష్టికయోః పాణ్యో రుత్తానా వామతర్జనీ। కుంచితాగ్రాన్యయా ముక్తా తర్జన్యా బద్ధవక్రయా। ఉక్తా యమపాశం నామముద్రా। ఉత్తాన సంధిసంలీన బద్ధాంగుళితలౌ కరౌ। సమ్ముఖౌ ఘటితౌ దీర్ఘాంగుష్ఠౌ గ్రథిత ముచ్యతే॥ ఉత్తానాని సంధిసంలీనాని బద్ధాన్యం గుళితలాని యయోస్త

యరిగిరి. యశోదయు నందనుఁ జూచుకౌతుకమున నింటనుండఁ జాలక వారివెంటఁ దాను నరిగెను. పూర్ణకలశము కుంభస్థలమున నమరించి సిందూరము ముఖమున నలంకరించి సువర్ణాభరణములఁ గైచేసి భద్రదంతావళమును ముందుఁబోవున ట్లాజ్ఞాపించి నందభూపతి దానివెంటఁ దానును, దన్నుంగూడి తక్కిన వారును నడుచుచుండఁగా వడివడి నరిగెను. వృషభానుఁడు కలావతింగూడి తాను నందునిపరిసరముననే పోయెను. నందుఁడు, నుపనందుఁడు, వృషభానుఁడు, వృద్ధగోపకులు, తరుణగోపకులు, నర్భకులు, పూలహారములు, వేణువులు, గుంజాహారములు గైకొని మహానందసాగరమున నోలలాడుచుఁ బోయిరి. గోపకులు కొందఱు సంతోషమున నొడలెఱుంగక శ్రీకృష్ణబాలక్రీడల గేయములుగా నొనరించి పాడఁ జొచ్చిరి. కొందఱు నాట్యమొనరించుచుఁ బాడిరి. చేలాంచలము లెగురవైచుచుఁ గొంద ఱెగురసాగిరి. తక్కినగోపబాలకులు వేణువులూదుచు ఢక్కానాదములఁ జేయుచు శ్రీకృష్ణునకుఁ దమరాక నెఱింగించుచు నెప్పుడెప్పుడు కృష్ణునిం జూడఁగల్గుదుమా యనువాంఛలఁ బోయిరి.

ఈ కోలాహలము సఖీముఖమున నాలకించి శ్రీరాధిక యొట్లో శయనమునుండి లేచెను. ఆకుశలవార్త తనకుం దెల్పినందులకుఁ దనవిభూషణముల నొసంగి గారవించెను. నవపద్మిని తనపరిమళమును వాయువున కొసంగినట్లు తనయాభరణములనెల్ల నొసంగి మఱిమఱి యావృత్తాంతము నడిగెను. క్షణమైననుండఁజాలక శిబిక నారోహించి బయలుదేఱెను. మైథిలగోపికలసంఖ్యలుగా నామెను బరివేష్టించి పోయిరి. శ్రీధర

ముద్రాతు మోదనో ద్దేవీం ద్రావయే ద్దూరతస్తథా। సజాతు దర్శయేన్ముద్రా మహాజన సమాగమే। క్షుభ్యంతి దేవతా స్తస్య ఫలంచ నశ్యతం భవేత్॥ అర్చనే జపకాలేతు ధ్యానే కామ్యేచకర్మణి। తత్తన్ముద్రాః ప్రయోక్తవ్యా దేవసాన్నిధ్య కారకాఇతి॥ అథ ధ్యానం। మూ॥ ముక్తావిద్రుమ నీలహేమ ధవళచ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై।

ర్యుక్తామిందు నిబద్ధరత్న మకుటాం తత్వార్థ వర్ణాత్మికాం।
గాయత్రీం వరదాభయాం కుశకశా శ్శుభ్రం కపాలం గదాం।
శంఖంచక్ర మథారవింద యుగళం హస్తైర్వహస్తీంభజే॥

ముక్తేతి॥ పశ్చిమం పాశహస్తస్య ఛాయయా చంద్రసన్నిభమితి వాతూలోక్త్యా సద్యోజాత ముఖస్య ముక్తావర్ణత్వం యుక్తం॥ ఏవం

---

లియ కున్నయెడ గాయత్రి జపము సఫలము కాజాలదు॥

దేవత నానంద పరచి, మనసు కరగించు నదిగాన ముద్రయని చెప్పబడును॥ ఇట్టి ముద్రలను జనసముదాయము నందు కనబరచు నెడ విఫలమగుట యె గాక దేవతలుక్షోభనొందుదురు॥ పూజ, జపము, ధ్యానము, కామ్య కర్మములు, చేయునప్పుడు దేవతాసాన్నిధ్యమును గలిగించు నాయా ముద్రలను ప్రయోగింప వలయును॥

ధ్యాన శ్లోకార్థము.

ముక్తావిద్రుమ నీలహేమ ధవళచ్ఛాయైః తెలుపు— ఎఱుపు, నలుపు, పసుపు, తెలుపువన్నెగల॥ ముఖైః అయిదుముఖముల తోడను, త్రీక్షణైః ప్రతిముఖమునను మూడేసి కన్నుల తోడను యుక్తాం కూడినదియు ఇందు నిబద్ధరత్న మకుటాం= ఇందు—చంద్రునితో నిబద్ధ, కూర్పబడిన, రత్న, రత్నరత్నమయమైన, మకుటాం= కిరీటము కలదియు, తత్వార్థవర్ణాత్మికాం= తత్వ, పరమేశ్వరుండె అని, అర్థ, అర్థముగల, వర్ణ, ప్రణవము, ఆత్మికాం— స్వరూపము గాగలదియు, వరదా భయాంకుశ కశాః, వరద, వరము, అభయ, అభయము, అంకుశ, అంకుశము, కశాః కొరడాయును, శుభ్రం, తెల్లని, కపాలం, బ్రహ్మకపాలమును, గదాం= గదను, శంఖం= శంఖమును, చక్రం=చక్రమును, అథ=ఇంకను, అరవింద యుగళం= రెండుకెం దామర పూవులను, హస్తైః= పదిచేతులచేత, వహంస్తీం= ధరించియున్న, గాయత్రీం= గాయత్రీ ఛందస్సుగల మంత్రమునకు దేవతయగు పరమేశ్వరుని, భజే=- సేవించు చున్నాను॥

ఈశ్లోకమున గాయత్రీం అని విశేష్యము నందు స్త్రీలింగము కలదుగాన శక్తిపరమగు నేమోయని తోచుచున్నది కాని యిందగు విశేషములను బట్టి పరమేశ్వరుండే యని తోచుచున్నది॥ ఎట్లన, పంచాక్షరీ అనచో, స్త్రీలింగము కలదు॥ ఆ స్త్రీలింగమ

నెక్కించి తాను నరదమెక్కి తక్కినవా రుచితరీతి యానముల నధిరోహింపఁగా గోబృందములు తనస్యందనము వెనుకొని వచ్చుచుండఁగా నందనగరమును బ్రవేశించెను. ఆ పురప్రవేశ సమయమునుగాంచి దేవత లంబరమునుండి హరిపైఁ బుష్పవృష్టిని గురియించిరి. పురగోపికలు సేసలు చల్లిరి. గోపకులు జయజయ నాదములు సేసిరి. ఆ యుత్సవమునుసందర్శించు మహాభాగ్యముగల యుద్ధవుఁడు ధన్యుఁడు. సాక్షాత్సందర్శన మట్లబ్బుట పూర్వపుణ్యముచేతనే కదా. అపుడు గోపకులెల్ల శ్రీకృష్ణా! గోకులమునకు జీవనము నీవే. అని గద్గదస్వరములఁ బల్కిరి. తమయదృష్టమునకుఁ బారములేదని వారెల్ల భావించిరి.

మహాశయులారా! ఈ కథాసారము నించుక వినుఁడు. కథ భేదముగానున్నదను విషయమునుగూర్చి విచారింపకుఁడు. గోకులమున నున్నవారికెల్ల దర్శనమిచ్చి వారల చింతదీర్చుటయే యిట ప్రధానముగాని వేఱుకాదు. భగవంతుఁడు ప్రయాణమై యంతకుముందు గోకులమున కరిగివచ్చిన యుద్ధవుని మరల రమ్మని శ్రీహరి కోరెను. ఏల? ఉద్ధవునకుఁ గల మోహావేశమును దొలఁగించుటకే. తనమహిమము నాతనికిఁ దెలిపి యాతని భక్తిభావమును దృఢపఱచుటకు మరల రమ్మనియె. బోధచేయుటచేతఁగాక భక్తి దృష్టాంతములచే మిగుల దృఢత్వమందును. భగవంతుఁడనిర్వచనీయమహిముఁడు, సర్వాంతర్యామి యనువిషయము పుస్తకములలోఁ జదువుటకంటెఁ గన్నులారగాంచిన మఱింతమేలు. ఈవిషయము దీనినుండియే మనకు స్పష్టమగును. శ్రీకృష్ణుఁ డుద్ధవుఁడును రథమున నొక్కచోటఁ గూరుచుండి గోకులమున కరిగిరి. బృందావనమును

ర్థ వర్ణాత్మికాం = తత్త్వం = పరమేశ్వరః, సోఽర్థో యస్య వర్ణస్య తద్రూపాం ప్రణవాత్మికా మిత్యర్థః॥ అథవా తత్త్వ ప్రతిపాదక ధర్మ పదాన యన భూతసర్గ హ్యాదయా మిత్యర్థః॥ భర్గ పదస్య మధ్యమవాదే వర్ణమానత్వాత్॥ వరదేత్యాది స్పష్టం॥ ఉక్త లక్షణాం గాయత్రీం, గాయత్రీఛందస్కాం మంత్రదేవతాం భజేదిత్యన్వయః॥

యద్యప్యత్రధ్యానే స్త్రీలింగ విశేషేణ ప్రతిపాద్యా శక్తిరితి సప్రతీయతే తథాపి పంచవక్త్రిత్వాద్య సాధారణలక్షణైః పరమేశ్వర ఏవ ధ్యేయఇతి జ్ఞాయతే॥ యథా ఓంకార వదనాదేవి నా యకార భుజద్వయీ॥ శికారం దేహ మధ్యాన నమస్కార పదద్వయీ॥ పంచాక్షరీ పరా విద్యా సతానా లింగరూపిణీత్యాదా పంచాక్షరీతి ద్విగు సమాసవిషయత్వే స్త్రీలింగ శ్రవణానార్థ సత్వం భవతి తద్వత్ ప్రకృతేపి బుద్ధిస్థస్య వా, దేవతేతి శబ్దస్థస్యవా స్త్రీత్వస్యార్థస్థత్వా భావాత్ నతావతా పరమేశ్వర పరత్వవిరోధః॥ నను, ప్రకృతే శంఖ చక్రాది సాధనసంపత్తిసమ వధానేన శంఖ చక్రలాంఛనో భగవాన్వాసుదేవ ఏవధ్యేయ ఇతి సిద్ధ్యతీతి చేన్న శంఖ చక్రాది సాధనానాం స్వరూపేఽసమవేతత్వేన తేషాం స్వరూప లక్షణ త్వాభావాత్॥ స్వరూప లక్షణానాం చ చంద్ర శేఖర త్వత్రిణేత్రత్వ పంచ వక్త్రిత్వ సద్యోజాతాది పంచ బ్రహ్మ ముఖ నియత వర్ణత్వ రూపాణామసాధారణానాం పరమ శివైకాంతిక త్వేన తైరస్య స్వరూపస్య పారమేశ్వర త్వనిర్ధారణాచ్చ॥ తద్యథోక్తమేవయుక్తం॥

అత్ర కేచిత్॥ కాలత్రయేపి క్రమశస్త్రిమూర్తి రూపత్వేనవా త్రిశక్తి రూపత్వేనవా గాయత్రీధ్యేయేతివదన్తి॥ తదయుక్తం॥ తత్ర తు

---

ఈ సంధ్యఘుస, మూడు కాలములయందు త్రిమూర్తి రూపము గాగాని, త్రిశక్తిరూపముగా గాని గాయత్రిని ధ్యానము చేయవలయునని కొందఱు చెప్పుచున్నారు కాని యది ముఖ్యము గాదు. అట్లుచేయు నాచార మెందును లేదు. కావునసే, గృహ్యపరిశిష్టమునందు: సంధ్యయనునదియే మంత్రదేవత॥ దానినెల్లప్పుడు నేకరూపముగనే ధ్యానము చేయవలయును॥ నని ముఖ్యపక్షము మొదట: జెప్పి, భిన్నరూపముగ నైనను జేయున

అది మూర్ఖత్వముగాదా యనుటయే మోఱకుఁదనము. అది దృఢభక్తిని సూచించును. భక్తులందఱు నీమార్గమునే యవలంబించిరి. కాంచీపురవాసియగు శ్యామకృష్ణభక్తుఁడు,

"నినువినాగా మఱి దిక్కెవ్వరున్నారు."

అని పట్టుపట్టెను. ఆపరాకాష్ఠయే యాతనికి దేవీసాక్షాత్కారమును గల్గించెను. అది పట్టుదలమాత్రమే గాక భగవంతునిపైఁగలవిశ్వాసమును దెల్పును. అట్టివిశ్వాసము సదా నిలుకడఁగాంచినచోఁ గృతకృత్యులమగుట కేశంక లుంఁడవు. ఈవిషయమే ప్రకృతగోచరిత్రమునుండి తెలిసికొనవచ్చును. నందాదులచరిత్రమును గూర్చి యీవఱకే వ్రాసితిని గదా. దీనిచే నుద్ధవునకొక గుణపాఠమును భగవంతుఁడు నేర్పెను.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ३०
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ३౧
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః."

భగవద్గీత. ౬ అధ్యా.

ఈ వాక్యములసారమే గుణపాఠము. ఉద్ధవా! ఈగోవులచరిత్రమును దిలకింపుము. గోవులయాత్మ నేనే. నాయందే

### మంత్రః.

ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణియం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్॥ అథ గాయత్రీ మహామంత్రార్థ నిర్ణయః॥

ఇహ యద్యపి యస్సవితా నః ధియః ప్రచోదయాత్, తస్య సవితుర్దేవస్య వరేణ్యం తత్ భర్గః=తేజః, ధీమహి=ధ్యాయామహీతి కేచిద్వ్యాచక్షతే॥ తత్ర భర్గస్తేజ ఆలోకా విత్యాదిని ఘంటవః శ్లో॥ యోదేవస్సవితా స్మాకం ధియో ధర్మాది గోచరాః। ప్రేరయేత్తస్య యద్భర్గస్తద్వరేణ్య ముపాస్మహే ఇత్యాది స్మృతి వచనాని చ ప్రమాణాని భవన్తి తథాపినాయ మర్థో వైదికానాం భవతి సమ్మతః బహుతర శ్రుతి న్యాయ విరుద్ధత్వాత్.

తథాహి ఇయంహి ఋక్ గాయత్రీ పఠ్యతే వేదేషు సర్వేష్వపి॥ తదీయంహి భర్గపద మకారాంత మేవేతి జ్ఞాయతే శ్రుతిలింగాదితాత్పర్య లింగైః.

---

### గాయత్రీ మహామంత్రార్థము.

ఇచ్చోట, యః= ఏ, సవితా= సూర్యుండు, నః= మాయొక్క, ధియః= బుద్ధులను, ప్రచోదయాత్= ప్రేరణ చేయునో, తస్య= ఆ- సవితుః= సూర్యుండనే, దేవస్య= దేవుని యొక్క, వరేణ్యం= శ్రేష్ఠమగు, తత్ = ఆ, భర్గః= తేజస్సును, ధీమహి=ధ్యానము చేయుచున్నామని కొందఱు మంత్రార్థము చెప్పుచున్నారు॥ దీనికి, "భర్గస్తేజ ఆలోకా"అను నిఘంటువు, యోదేవస్సవితా అను స్మృతి వచనంబును మాత్రము ప్రమాణములగుచున్నవి॥ కాని యీయర్థము పెక్కు శ్రుతులకు, న్యాయములకును విరుద్ధమైనది కాన వైదికులు గ్రహింప దగినది కాదు॥ ఎట్లన, గాయత్రి అను నీఋక్కు అన్ని వేదముల యందును పఠింపఁబడుచున్నది. ఇందున్న భర్గపదము శ్రుతి లింగాది తాత్పర్య లింగములచే అకారాన్తమనియే తెలియుచున్నది.

ప్ర॥ ఈ మంత్రార్థము నెడ సంశయము గాని, సంశయ బీజము గాని లేనప్పుడు ఈ విచార మెందులకు?

ఉ॥ ఇందు రెండు గలవు ఎట్లన, ఈ మంత్రమున భర్గః అని యొక పదమున్నది॥

## రాధికను శ్రీహరి యూఱడించుట.

* శ్రీహరి గోకులమును బ్రవేశించి యాదినము గడ పెను. అందఱతో సంభాషించెను. ఎల్లవారికిఁ దనవృత్తాంత మును దెలిపెను. మధురానగరమున జరిగిన వార్తలెల్లఁ దెలియఁ బఱచెను. వారు తద్వియోగమున ననుభవించిన కష్టముల నెల్లఁ దెలిపిరి. భగవంతుని యుపదేశమున నూఱడిల్లిరి. శ్రీహరి యొనరించిన యద్భుతకార్యముల కానందపరవశులైరి. భగవం తుఁడే శ్రీకృష్ణుఁ డని నమ్మిరి. ఎందున్నను మనల రక్షించుచునే యుండునన్న విశ్వాసము గలవారైరి. సాయంకాలము దనుక శ్రీకృష్ణు నెడఁబాయకయుండిరి. సాయం సమయమున రాధిక శ్రీకృష్ణుని దోడ్కొనిరా దూతిక నంపెను. తదాహూతుఁడై శ్రీహరి రాధామందిరమున కరిగి యామె మనోవ్యథను దీర్ప నెంచెను. ఒక్కఁడే శీతలచ్ఛాయగలిగి మనమున కానందమును గల్గించు కదళీవనమునకుం జనియెను. ఆవన మెట్టి సంతాపము నైనఁ దొలఁగించునట్టిది. అందలి తరువరములు శీతలచ్ఛాయల నామోదము నింపుచుండునవియే. వాయు వందుఁ బ్రవేశించిన వారి మనఃపరితాపమును స్పర్శమాత్రమునడంచునది. శుకకోకి లాలాపములు శ్రవణకుహరసుఖకరములు. ఏవిషయము నాలో చించినను సంతాపమును బోఁగొట్టునదియే. అట్టిదయ్యును రాధి కను శ్రీకృష్ణవియోగమునఁ గల్గిన పెనుతాపమున నావన మెల్ల భస్మీభూతమయి యుండెను. రాధిక శ్రీకృష్ణుఁడువచ్చి తన్ను రక్షించునన్న యాశచేతనే జీవించినది. లేకున్న నెన్నఁడో భస్మ

---

* ఈవిషయమును గర్గసంహిత మధురాఖండము ఇరువదవ యధ్యా యమునుండి సంగ్రహీతము.

వితుస్సూర్యస్య వరేణ్యముపాస్యమిత్యర్థ సంభవాత్॥ నచ భర్గపదస్యాకారాన్తత్వే తదితి నపుంసకత్వేన తయోర్లింగవిరోధస్స్యాదితి వాచ్యం తస్య య ఇతి పుంస్త్వానురోధేనావ్యయత్వే సంప్రతిపత్త్యా బ్రహ్మవాచకతయా విశేష్యత్వే నాన్వయ సంభవాత్॥ నచ, అనుపసంజాత విరోధితయా ఉపక్రమస్య ప్రబలత్వేన యః ఇత్యుపసంహారగత పుంస్త్వానురోధేన ఉపక్రమగత తదితి క్లీబత్వ బాధనం నన్యాయ్యమితి వాచ్యం యః ఇతి పుంస్త్వస్యోపక్రమగతత్వాత్॥ నచ పాఠక్రమానురోధేన తదిత్యస్యైవోపక్రమగతత్వమితి వాచ్యం విశ్వజిదధికరణోక్త 'అర్థతో హ్యసమర్థానా మానంతర్య మకారణ' మిత్యుక్త రీత్యా పాఠక్రమస్య దుర్బలతయా అర్థక్రమానురోధేన యః ఇతి పుంస్త్వస్యోపక్రమగతత్వాత్॥ నచ, అర్థతో హ్యసమర్థానాం తథాత్వేపి ప్రకృతే తత్సవితుర్వరేణ్యమితి సమర్థతయా పాఠక్రమానురోధేన తదిత్యస్యైవోపక్రమికత్వ మితి వాచ్యం తచ్ఛబ్దస్య యచ్ఛబ్దాపేక్షితయా సాపేక్ష

---

ప్ర॥ భర్గపదము నకారాన్తముగా నంగీకరించు నెడ సవితు, అనునవి యెట్లు న్వయించును?

ఉ॥ సవితుః=సూర్యునకు- వరేణ్యం=ఉపాస్యమగును అని యర్థము చెప్పుటచే నిందేమియు బాధకము లేదు॥

ప్ర॥ భర్గః అను దానిని కారాన్త పుంలింగముగా గ్రహించిన యెడ మంత్రమున మొదట తత్ అను నపుంసక లింగముతో విరోధము రాదా?

ఉ॥ రాదు॥ యః అనుచోట నున్న పుంలింగమును బట్టి తత్ అను పదము నపుంసక లింగము కాదనియు, అవ్యయమే అయి బ్రహ్మమును బోధించును గాన- సవితుః=సూర్యునకు- వరేణ్యం ఉపాస్యమగు- తత్= ఆశివ తత్త్వమును- ధీమహి= ధ్యానము చేయుచున్నాము అని తత్ అను దానిని విశేష్యముగా న్వయించుటచే నిందేమియు బాధకము లేదు॥

ప్ర॥ మంత్రమున మొదట తత్ అని నపుంసక లింగము కలదు. చివర యః అని పుంలింగము కలదు॥ ఉపక్రమమే ప్రబలమని పూర్వమీమాంస యందుగలదు ఇట్లుండగా మంత్రముయొక్క చివరనున్న యః అను పుం లింగమును బట్టి మొదటనున్న తత్ అను నపుంసక లింగమును అవ్యయముగా నంగీకరించుట న్యాయ్యమగునా?

నకుఁ బోయియున్నందున శృంగారము చేసికొనకుండెను గదా. చందనానులేపము తాంబూలము వదలియుండెను. మిష్టాన్నమునుగూడ వదలియే యుండెను. దివ్యశయ్యపైఁ బరుండుటయు మానెను. నవ్వుగాని వేడుకమాటలుగాని వదలియుండెను. శ్రీకృష్ణుఁడు పరిపూర్ణుఁడు. రాధిక పరిపూర్ణ ప్రియురాలు. అట్టి వారికి వియోగము సంఘటిల్లినపుడు వారి చిత్తవృత్తు లెట్లుండునో యెవ్వరెఱుంగరు. ఆ రాధ కుశలప్రశ్నానంతరము గద్గదకంఠియై మాటలు తొట్రుపడుచుండఁగా నిట్లు పల్కెను.

ప్రాణేశా! ఎంతదూరమున మధురానగరమున్నది? ఎప్పుడువచ్చితివి? అందేమి చేయుచుందువు? అశేషసాక్షీవగు నీ వియోగమువలనఁ గల్గిన రహోదుఃఖము నేమని వచింపఁజాలుదు? దమయంతియు మైథిలియుఁ బడిన కష్టములకంటె నీ కష్టమెక్కుడా యన్న వారికి శత్రువుండెను. నే నేశత్రువు వలన నీ వియోగదుఃఖము గల్గెనని వచియింతును? గోపికలు చెప్పఁగూడదా యందువేమో? వారును నావలెనే వెతలఁగుందుచున్నవారు కాన శ్రమములను బలుకఁజాలరు. శరత్కాలచంద్రచకోరములకు నవజలధరమయూరికలకు నెట్టి సంబంధమో శ్రీబృందావన చంద్రుఁడవగు ఘనశ్యాముని నిన్నుఁ జూడ నుత్సహించుచుందును. మరల నిన్నినాళ్లకు నీమిత్రుఁడగు నుద్ధవుఁడు ధన్యుఁడు కావున నిన్నిటకుఁ దోడితెచ్చెను ఈగోకులమున నీప్రేమమునకు నట్టి పాత్రుఁడు లేఁడు. కావున నే యీమహా కార్యమునకు నుద్ధవుఁడే హేతువు.

క్తమితి వాచ్యం, శ్రీనీలకంఠాచార్య శ్రీసుదర్శనాచార్య శ్రీమదప్పయ్యదీక్షితాదిభిర్బహుభి రదంతత్వేన సర్గాంగీకృతత్వాత్ ॥ సర్వేష్వపి ప్రమాణేష్వదంతత్వేనైవ ప్రమితత్వాచ్చ ॥

తథాహి, తలవకారిణాం బ్రాహ్మణే ॥ ద్వితీయో భర్గమయః పాదః, మైత్రాయణీయే ॥ బుద్ధయో వై ధియస్తా యో నః ప్రచోదయాదిత్యాహుః బ్రహ్మవాదినోఽథ భర్గ ఇతి యో హ వా అస్మిన్నాదిత్యే నిహితస్తారకేఽక్షిణి చైష భర్గాఖ్యః భాభిర్గతి రస్య హీతి భర్గః, భర్జయతీతి వైష భర్గ ఇతి రుద్రో బ్రహ్మవాదినోఽథ భర్గ ఇతి భాసయతీమాన్ లోకానితి రంజయతీమాని భూతాని గచ్ఛతి ఇతి గచ్ఛత్యస్మిన్నాగచ్ఛత్యస్మాదిమాః ప్రజాస్తస్మాద్భారగాద్భర్గ ఇతి ॥ అమృతాఖ్యశ్చైతా మంతా గంతా ఇతి ఏష హి ఖల్వాత్మేశాన ఇతి, ఏవం శ్రీ

---

ఉ॥ ఎవ్వడు మాబుద్ధులను ప్రేరణ చేసెనో వానిని ధ్యానము చేయుచున్నాము. ఇటు యుక్తము కాదు. ఎవ్వడు మాబుద్ధులను ప్రేరణ చేయుచున్నాడో వాని తేజస్సును ధ్యానము చేయుచున్నామని ఇట్లు బుద్ధులను ప్రేరణచేయునది యొక్కరును, ధ్యానము చేయబడునది ఇంకొక్కరునని వ్యధికరణముగా స్థాపించేయుట యుక్తము కాదు.

ప్ర॥ పెక్కురు భర్గపదము సకారాంతమని గ్రహించిరి గాన దాని సకారాంతమ నటు వ్యాఖ్య మెట్లు?

ఉ॥ శ్రీనీలకంఠాచార్యులు, శ్రీసుదర్శనాచార్యులు, అప్పయ్య దీక్షితులవారు మున్నగు వారు పెక్కురు భర్గపదము నకారాంతముగానె గ్రహించిరి గాన నిది న్యాయమే యగును.

అన్ని ప్రమాణముల యందును. భర్గపదమకారాంతమనియె గ్రహింపబడియున్నది ॥ ఎట్లన, తలవకార బ్రాహ్మణమునందు ॥ గాయత్రి రెండవ పాదము భర్గమయమైనది యనికలదు. గాయత్రిలోని భర్గపదము సకారాంతమేయగునెడ భర్గోమయః అని యుండవలయును గాని భర్గమయః అనియుండ నేరదు దీనిం బట్టి భర్గపదమకారాంతమనియే యేర్పడుచున్నది ॥

మైత్రాయణీయమునందును, భర్గాఖ్యః అని కలదు. ఆపదము సకారాంతమే యగునెడ భర్గఆఖ్యః అని యుండవలయును గాని భర్గాఖ్యః అని యుండదు. దానిం బట్టియు

వేశము గల్గుతఱిఁ బరమాత్మను జూడఁజాలదు. ఆయావర ణము పోఁగాఁ గాంచఁగల్గును. సంసర్గము వదలగా బంధములు వదలును. అదియే ముక్తిమార్గము. ఈ రెండును మనఃకారణ ములు. మనోజయమున సర్వవిజయము గల్గును. అసంగుఁడై నేనుతప్ప నింకెవ్వరుండఁగలరు? పరాత్పరమును గుఱించిన మనోభావము ఏకాంతస్థితిని గల్గును. కావున నాయందుఁ బ్రేమ యే ప్రధానముగా నుంచఁదగును. ప్రేమముతో సమానమై నది నాదయకుఁ బాత్రమైనది వేఱొకటి కానరాదు.

అని శ్రీకృష్ణుఁడుపలుక నాలకించి యారాధాదేవి సుప్ర సన్నయై గోపికలంగూడి శ్రీహరిని భక్త్యతిశయమునఁ బూజిం చెను. వివిధభంగుల నలరించెను. సాక్షాత్పరమేశ్వరునిగా ధ్యానించెను. తాను ప్రకృతియే యన్న పూర్వవృత్తాంతమును స్మరించెను. రాత్రియం దించుక గడచెను. శ్రీకృష్ణపరబ్రహ్మము రాసమండలవిహారమున రాధిక నలరింప నెంచెను. రాధను గోపికలంగూడి రాసమండలమున కరిగెను. అందు మురళీనాద మొనరించెను. ఆ యమునాతీరమున మనోహరమగు నారాస మండలమున మనోజ్ఞవేణునినాదము చేయఁగా రాసగోపికలభ్య ర్థింపఁగా నానందమందుచు రాధికంగూడి యథోచితవిహార ముల నొనరించెను. గోపికలెల్ల శ్రీకృష్ణుంగూడి రాసక్రీడను గావించిరి. * ఆసమయమున నారాసమండలమున నెందఱుగో పికలుండిరో యన్నిరూపములఁ దాల్చి కృష్ణుఁడు రాసనృత్యము గావించెను. బృందావనపతి కదా శ్రీగోపాలుఁడు. క్వణన్నూ

---

* యావతీర్గోపికా రాసే తావద్రూపధరో హరిః, రేమే బృందావనే దివ్యే హరిర్బృందావనేశ్వరః=అని మూలము.

క షష్ఠీఘటితేన వాక్యేన ధీచోదన లక్షణ స్వోపులింగ యత్పదపరాస్యాష్టే భర్గశబ్దితే ప్రతిపాద్యతే॥ ఏవంచ స్వామ్యం భర్గాఖ్యస్య స్వత్వం చాదిత్య మండలస్య సిద్ధం॥ ఇదంచ భర్గశబ్దస్య సాంతత్వే నోపపద్యతే॥ తస్యాలోక చేతసోరూపత్వేన ఆదిత్య మండల స్వామ్య విశిష్ట పరమేశ్వర బోధకత్వం నాస్తి. అస్తి చాకారాన్త భర్గపదస్య తస్మాత్సవితృ మండలస్వామ్య లింగేనాపి భర్గపద స్యాకారాన్తత్వం॥

నను ఆదిత్యమండల స్వామ్యస్య పరమేశ్వర లింగత్వే ఏత దేవం భవేత్॥ తదేవ నసిద్ధమితి చేన్న బహుప్రమాణానురోధేన తస్యతథాత్వ సిద్ధ్యాత్॥ తథాహి గ్రహయజ్ఞే ఆదిత్యమండలస్య తన్మండలాధిష్ఠాతు రాదిత్యస్యచ పరమేశ్వర ఏవ స్వామీతి నిరధారి॥ నైవం దేవ

---

ఉ॥ షష్ఠికి స్వస్వామిభావరూపసంబంధమర్థముకలదు గాన, సవితుః అను షష్ఠీవిభక్తిచే స్వత్వము ఆదిత్య మండలమునకును స్వామిత్వముభర్గశబ్ద వాచ్యుఁడగు పరమేశ్వరునకును కలదని యేర్పడుచున్నది॥ ఈషష్ఠిచే ప్రతిపాద్యమగు ఆదిత్య మండల స్వామ్యముభర్గశబ్దమునకారాన్తముగా గ్రహించిననే గాని కుదురనేరదు॥ సకారాన్తభర్గపదమునకు వెలుఁగు, చేతస్సనియే యర్థముకలదుగాని యాపదము ఆదిత్యమండల స్వామ్యముతో గూడిన పరమేశ్వరుని బోధింప నేరదు॥ అకారాన్త భర్గపదమైనచో అట్టి పరమేశ్వరుని బోధించును కావున, ఉపక్రమమునందున్న సవితుః అను షష్ఠిచే గమ్యమానమైన సూర్యమండల స్వామ్యమను పరమేశ్వర లింగమును బట్టియు, భర్గపద మకారాంతమనుటయే న్యాయ్యమగును.

ప్ర॥ సూర్యమండల స్వామ్యము పరమేశ్వర లింగమే యగునేని సంతేయగు. అద్దాని పరమేశ్వర లింగమనుట యెట్లు?

ఉ॥ అనేకములగు ప్రమాణములను బట్టి ఆదిత్యమండల స్వామ్యము పరమేశ్వరుని దేయని స్పష్టమగుచున్నది.

గ్రహయజ్ఞమునందు॥ ఆదిత్య మండలమునకును, ఆమండలముననున్న ఆదిత్యునకును పరమేశ్వరుఁడే అధిపతి యని నిర్ణయింపఁబడియున్నది॥ గాని యింకొక దేవత అధిపతియని చెప్పఁబడి యుండలేదు.

రాధిక యానందపరవశయై వెంటవచ్చుచుండఁగాఁ గాంచనలతికావృతమగు నాపర్వతమున విహరించెను. అందొకసరోవరము కలదు. అది బదరీనాథునిచేఁ బూర్వము నిర్మింపఁబడినది. దాని యంద మున్నదున్నట్లు పలుక నేరికే నశక్యము. అందుఁ బెళుకుచేపలు నడయాడుచుండును. కూర్మములు మందగతులఁ గ్రీడించుచుండును. మొసళ్లు లోలోనం దిరుగుచుండును. హంస సారసాదిపతత్త్రివర్యములు సుందరమందగమనములఁ గనుఁగొనఁదగినట్లు విహరించుచుండును. వేయిదళములుగల కమలము లందు సదా వికసించియే యుండును. భ్రమరములు ఝుంకారముల దిక్కులఁ బిక్కటిల్లఁ జేయుచుండును. పుంస్కోకిలాలాపములు శ్రవణపర్వ మొనర్చుచుండును. మనోహరసారసపరిమళము ఘ్రాణరంధ్రముల విందునకుఁ బిల్చుచుండును. మందమారుతమెల్లర కాతిథేయ సత్కారముల నొనరించుచుండును. అట్టి దేవసరోవరమున మహాలక్ష్మియగు రాధికం గూడి నందనందనుఁ డానందించుచుండెను.

## ఋభుమునికి హరి ముక్తి నొసంగుట.

ఆదేవసరోవరతీరమున నొక్కచోట నొంటికాలిపై నిలువంబడి నియతిదప్పక యొకముని తప మొనరించు చుండెను. ఆతనిని ఋభుఁడని యందురు. మహామునిరే యని యంద ఱామహాత్మునిఁ గీర్తింతురు. సదా శ్రీకృష్ణధ్యానతత్పరుఁ డై యమ్ముని ప్రపంచమును మఱచియుండెను. అఱువదియాఱువేల దివ్యసంవత్సరములు నిరాహారుఁడై జలపానము నైనఁ జేయక యమ్ముని యుండెను. ఆమహామునిని శ్రీకృష్ణమూర్తి యందుఁ గనుఁగొనెను. రాధిక యాతనిం జూచి ప్రహాసము మోమున

భర్గాఖ్య ఇత్యుక్త్వా భర్గోవై రుద్ర ఇతిచ వివృతం॥ తథా యజుష్షు కాఠక బ్రాహ్మణే ద్వితీయాష్టకే అష్టమే ప్రశ్నే షష్ఠేఽనువాకే। ఆదేవో యాతు సవితా సురత్నః ఇత్యారభ్య ఇమా రుద్రాయ స్థిర ధన్వనే గిరః క్షిప్రేషవే దేవాయ స్వధామ్నే। అషాఢాయ సహమానాయ మీఢుషే. తిగ్మాయుధాయ భరతా శృణోతన॥ ఇతిసూర్యమండలం వర్ణయిత్వా శ్రుతిః తత్రచ స్వధామ శబ్దేన స్వమహిమ ప్రతిష్ఠితం పరంరుద్రం స్వామినముపసంజహార। తథా యజుష్షు రుద్రసంహితా సహితే చతుర్థ కాండే తథారణ్యకే ఉభయత్ర ఏవ గాయత్రీ పఠ్యతే॥ తత్రచ రుద్ర మాహాత్మ్యం విపుల మామ్నాయతే। తథా మహోపనిషదిచ॥ రుద్రః స్పష్టం స్వామ్యుక్తః ఏతేన ఛాందోగ్యాదౌ యథాకప్యాసం పుండరీక మేవ మక్షిణీతి వాక్య మవలంబ్య యన్నారాయణస్య మండల స్వామ్య మన్యే వదంతి తన్నిర్మూలం॥ అత్ర ప్రతిపాదితేషు రుద్రపశుపతీశాన ప్రభృతి శ్రుతిశతైః ఆదిత్యమండల స్వామ్యస్య పరమేశ్వర లింగత్వ సిద్ధేః॥

---

మైత్రాయణీయము నందును- యోహవా అనుశ్రుతి॥ సూర్యుని యందును- కన్టి నల్లగుడ్డు నందును నున్నవాఁడు భర్గుఁడని చెప్పి- భర్గుఁడనగా రుద్రుఁడే యని స్పష్టీకరించెను॥ మహాబ్రాహ్మణము నందును- రెండవ అష్టకము- ఎనిమిదవ ప్రశ్నము- ఆరవ అనువాకము నందు॥ ఆదేవః అని సూర్యుని ప్రస్తావించి- ఇమారుద్రాయ ఈ మొదలగు వాక్యములచే పరమేశ్వరుఁడే సూర్యాధిపతి అని తెలిపెను॥ యజుర్వేదమున- రుద్ర సంహితతో గూడిన చతుర్థకాండము- ఆరణ్యకమునను వానియందె గాయత్రి పఠింపఁబడుచున్నది॥ ఈరెండుతావులను రుద్రమాహాత్మ్యము సవిస్తరముగాఁ గలదు॥ అట్లే-మహోపనిషత్తు నందును రుద్రుఁడే అధిపతియని స్పష్టముగాఁ జెప్పఁబడియెను॥

ఈకనఁబరచిన ప్రమాణముల వల్ల నేమి తేలెనఁగా- ఛాందోగ్యము మొదలగు వానియందు పుండరీకములఁ బోలు రెండు కన్నులుగల వాఁడని చెప్పు వాక్యమును బట్టుకొని సూర్యమండలాధిపత్యము నారాయణునకే యని యితరులు చెప్పు మార్గము నిరాధారమైనదని యేర్పడెను॥ ఏలందురా?

లోగడ కనఁబరచిన ప్రమాణముల యందును- రుద్రుఁడు- పశుపతి- ఈశానుఁడు అంబికాపతి ఈ మొదలగు శ్రుతి శతములచేత సూర్యమండలాధిపత్యము పరమేశ్వరలిం

అని వినుతించి శ్రీకృష్ణపాదారవిందద్వంద్వమునందు నానందబాష్పములు ప్రవహించుచుండఁ బ్రేమానందసమాయుక్తుఁడై ప్రాణముల వదలెను. వెంటనే యాతనిదేహము నుండి యొకజ్యోతి బయలువెడలి దశసూర్యప్రకాశమును గ్రిందుపఱచుచు దశదిశల వెలుంగఁజేయుచు శ్రీకృష్ణునియందుఁ జొచ్చి మఱుగుపడియెను. ఆమహాభక్తునిభక్తిని బ్రేమలక్షణమును దలంచి యానందాశ్రుకణముల వదలుచుఁ బ్రేమాతిశయమున మరల నామునిచంద్రుని బిలిచెను. వెంటనే శ్రీహరిపాదారవిందములనుండి శ్రీకృష్ణసారూప్యముగల యాముని కోటికందర్పలావణ్యము మెఱయ శిరస్సువంచి చేతులుజోడించి భగవంతుని హృదంతరాళమున నిలిపి వెడలి భగవంతునెదుట నిలిచెను. రాధామాధవులకు ప్రదక్షిణక్రమమున వందనము లాచరించెను. దివ్యస్యందనము తోఁప నందెక్కి శ్రీహరి యనుమతింబడసి గోలోకమునకుం బోయెను. శ్రీరాధికయు విస్మయావిష్టహృదయయై యామహామునికి లభించిన ముక్తినెఱింగి యానందబాష్పముల విడుచుచు భగవంతుని జూచుచుండెను.

మహామతివిభవులారా! ధన్యులారా! రాధాదేవిని భగవంతుఁడోదార్చుఘట్టమును జదివితిరి. వియోగమనునది మనకుం గల్గుననుట కల్లయని రాధకు హరి యెఱింగించి నీవృత్తాంతమును దలంచుకొమ్మని హెచ్చరించెను. అనఁగా శాపవశమున మానవలోకమున నవతరించిన పరదేవినని యొకమాఱు తలంచుకొనుమా అనికదా దీనిభావము. పరాశక్తినని యెఱింగినచో నాతోటివియోగము నీకుం గల్గునన్న మూఢవిశ్వాసము పటాపంచలగునని హరి హెచ్చరించెను. దీనిచే రాధయని గో

ప్రాణ్యేవ లింగాని యథా దర్శితముం కపర్దిన మీశాన మిత్యాది ప్రతి
పాదితం॥ ఏవంచాత్ర శ్రుతౌ అంతరాదిత్య దహర వైశ్వానరాక్షి వి
ద్యాది సిద్ధ పదం తర్యామి భావేన దేవ మనూద్య రుద్ర ఇతి భర్గ ఇతి
చ శ్రుతిద్వయేన పరమేశ్వర ఏవేతి నిర్ధారితం॥ తథా తైత్తిరీయేపి ఆది
త్యోవై తేజ ఇత్యారభ్య బ్రహ్మైతదమృత ఏష పురుష ఏష భూతా
నామధిపతిరితి శ్రూయతే॥ భూతపతిత్వంహి పారమేశ్వరం లింగం॥ య
థా ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానా మితి ఇదంహి ప
రమేశ్వరే యథా శ్రుత్యా ఉపలభ్యతే॥ నతథా పంకజాక్షాదిషు॥ కిం
చ నమోహిరణ్య బాహవే హిరణ్యరూపాయ హిరణ్య పతయేంబికా
పతయ ఉమాపతయే పశుపతయే నమోనమఇతి॥ అత్రహి ఛాందోగ్య
సిద్ధం హిరణ్య రూపమనూద్య తద్వసు పశుపత్యుమాపత్యంబికాపతి
శబ్దైః పరమేశ్వర ఇతి స్పష్టం నిర్ణాయి॥

అపిచ ద్రుత కనక సవర్ణత్వ రూప పారమేశ్వర లింగాద ప్యాది
త్యమండలస్థాన్యాం పరమేశ్వరస్యైవ సిధ్యతి తథాహి హిరణ్యవర్ణత్వం

---

ర్థము మన్నదని, అంతరాదిత్య విద్యయందును, దహరవిద్యయందును, వైశ్వానర విద్యయం
దును, అక్షివిద్య మొదలగు వానియందు అంతర్యామిగా నేర్పడియున్న దేవుని ననువా
దముచేసి యాదేవుఁడు రుద్రుఁడనియు, భర్గుఁడనియు చెప్పుచు నీమైత్రాయణీ యశ్రుతి
పరమేశ్వరుఁడే యని నిర్ణయించెనని స్పష్టమగుచున్నది॥

తైత్తిరీయము నందును, ఆదిత్యుని ప్రస్తావించి, భూతాధి పతియని చెప్పఁబడి యు
న్నది॥ ఈశాన స్సర్వవిద్యానాం అను శ్రుతి యందు భూతాధిపత్యము పరమేశ్వరుని దేయ
ని చెప్పఁబడుటను, భూతేశః ఖండపరశుః ఈ మొదలగు నిఘంటువులను బట్టియు భూ
తాధిపత్య మీశ్వర లింగమే యగును॥ ఇయ్యది విష్ణులింగమనుట కెవ్వఁడమగు ప్రమాణం
బును లేదు॥

ఇదిగాక, ఛాందోగ్యము నందు, హిరణ్యరూపం అని మొదలుగా సూర్యునందు
న్న పురుషుఁడు హిరణ్య రూపుఁడని చెప్పిన దేవుని ననూదించి, హిరణ్య బాహవే అను
శ్రుతి, పశుపతి, ఉమాపతి, అంబికాపతి ఈ మొదలగు శబ్దములచే నా దేవుఁడు పరమేశ్వ
రుఁడే అని స్పష్టముగా నిర్ణయించినది॥

చుఁగాక. యోగాభ్యాసము చేయువారి కిట్టిశక్తు లలవడుట కడు సులభము. అది లేనివారి కింతకంటెఁ గష్టమేదియు నుండదు. ప్రమాణము కలదాయన్న వినుండు.

"సూ. కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః." 30

పాతంజలయోగశాస్త్రము, విభూతిపాదము.

"జిహ్వాయా అధస్తాత్తంతు స్తంతోరధస్తాత్కంఠః తతోఽధస్తాత్కూపః. తత్ర సంయమాత్క్షుత్పిపాసే న బాధేతే." అని వ్యాసభాష్యము.

"కంఠే గళే కూపః కంఠకూపః. జిహ్వామూలే జిహ్వాతంతోరధస్తాత్కూపఇవ కూపో గర్తాకారః ప్రదేశః ప్రాణాదేర్యత్సంస్పర్శాత్పిపాసాదయః ప్రాదుర్భవంతి తస్మిన్ కృతసంయమస్య యోగినః క్షుత్పిపాసాదయో నివర్తంతే. ఘంటికాధస్తాత్స్రోతసా ధార్యమాణే తస్మిన్ భావితే భవత్యేవంవిధా సిద్ధిః." అని భోజరాజవృత్తిః.

తా. కంఠము లోపలిభాగమునఁ బ్రాణాదులస్పర్శము చేత నాఁకలిదప్పులను గలుగఁజేయు గర్తము, అనఁగా లోఁతుగానుండు భాగమునందు సంయమనము చేసినచోఁ బ్రాణాదుల స్పర్శము తప్పిపోయి క్షుత్పిపాసానివృత్తి యగును.

పైప్రమాణమును బరికించితిరి గదా. క్షుత్పిపాసలను జయించుట యోగాభ్యాసరతున కతిసులభము. అంతియగాక చిరకాలము జీవించుటయు లంబికాది యోగబలమున నని యెఱుంగదగు. మనకు యోగశాస్త్రాభ్యాసము లేనికారణమున నిన్నిశంకలు గలుగుచున్నవి కాని రవంతయే నదియుండిన నిట్టిశంకలు గలుగవు. అతీతానాగతజ్ఞానము పరకాయప్రవే

భవితు మర్హతి॥ తస్మాదాపక్రమికేణ లింగేన తత్ప్రత్యభిజ్ఞాబలలబ్ధ స్వత్యంతర స్థితశ్రుత్యవిరుద్ధేర్థే సమన్వయ స్స్వాభావ్య ఇతిసిద్ధం॥

అత్రేదమవధేయం॥ అంతరాదిత్య విద్యాయాం కప్యాసం పుండరీకమేవ మక్షిణీతి వాక్యంవా పుండరీక సదృశాక్షిద్వయ వైశిష్ట్యలింగం వా భవతి పరేషామనుకూలం॥ అస్మాకంతు రుద్ర భర్గేశానపశు త్యంబికాపత్యుమాపతి శ్రుతయః హిరణ్యరూపత్వ భూతాధిపతిత్వ సూర్యమండలస్వామ్యాది లింగజాతం చానుకూలం॥ తథాచ లింగం వాక్యం వా ప్రబలం శ్రుతిశతం లింగజాతంవా బాధితుం నశక్నుహితి॥ కించ పరగృహీతం పుండరీకాక్షత్వ మస్మదనుకూలమేవ॥ బ్రాహ్మణస్య ద్వ్యపుత్రా వహ్నికల్పా విత్యుక్త్వా తస్యతృతీయః పుత్రోన నాస్తీతి ప్రతీయతే కింతు తత్రద్వావేవాగ్నికల్పావితి॥ ఏవ మిహాపి ద్వేఏవ వికసిత పుండరీక సదృశే లోచనే తృతీయంతు ముకుళితతయా తాదృశంన భవతీ త్యేవ

---

చెప్పఁబడినది॥ ఈలింగమును బోధించు హిరణ్యవర్ణాయ అనుశబ్దము తైత్తిరీయము లోని హిరణ్యబాహవే అను వాక్యము నందుగలదు॥ ఈవాక్యము ఉమాపతి- పశుపతి మొదలగు శ్రుతులచే హిరణ్మయత్వలింగము పరమేశ్వరుని దేయని నిర్ణయించినది॥ ఆకారణము వలన ఛాందోగ్యమున- మొదటనున్న హిరణ్మయత్వలింగము చే దీనికి సమానార్థముగల తైత్తిరీయ మంత్రమున నున్న పశుపత్యాది శ్రుతులకు విరుద్ధము గాని పరమేశ్వర పరత్వ రూపము గు నర్థమునందు సమన్వయము చేయుట యే న్యాయము॥

ఇందిది గ్రహింప వలయు॥ ఏమనిన- అంతరాదిత్య విద్యయందు- కప్యాసా అను వాక్యముగాని- కమలంబులం బోలు రెండు కన్నులు గలిగియుండుట యను లింగముగాని విష్ణు పరత్వము చెప్పువారి కనుకూలమగును. మాకైనచో- రుద్రుఁడు భర్గుఁడు- ఈశానుఁడు- పశుపతి- అంబికాపతి- ఉమాపతి- అను శ్రుతులును- హిరణ్య రూపత్వము- భూతాధిపతిత్వము- సూర్యమండల స్వామ్యము నీమొదలగు లింగంబులను ననుకూలములగును॥ శ్రుతికంటె లింగంబును- లింగముకంటె వాక్యంబును తక్కువ ప్రమాణంబులని పూర్వతంత్రమున కలదుగాన ఒక్కలింగము అనేక శ్రుతులను, ఒక్కవాక్యము పెక్కుశ్రుతి లింగములను బాధింపఁ జాలదు॥

ఇదిగాక- పరలు తమకు సాధకమని గ్రహించిన పుండరీకాక్షత్వము మాకు నను

తావద్విదధీత బుధః
ప్రాణాయామం సమాహితో విధివత్,
యావత్సంభవతి భువి
ప్రాణాయామస్యోత్తమస్య గుణః. ౨౮

అయం ప్రాణాయామస్సకలదురితధ్వంసనకరో
విగర్భః ప్రోక్తోఽసౌ శతగుణఫలో గర్భకలితః,
జపధ్యానాపేతస్సతు నిగదితో గర్భరహిత
స్సగర్భస్తూన్ముక్తో మునివరివృతై ర్యోగనిరతైః. ౨౯

శుచిః ప్రాణాయామాన్ ప్రణవసహితాన్ షోడశవశీ
ప్రభాతే సాయం చ ప్రతిదివసమేవం వితనుతే,
ద్విజో యస్తం భ్రూణప్రహరణకృతాంహోఽభికలితం
పునంత్యే తేమాజాదిహాదురితతూలౌఘదహానః. ౩౦

త్రాయంత్యమీ షడ్భిరపీహ మాసై
ర్జన్మాంతరోపార్జితపాపపుంజాత్,
సంవత్సరాద్బ్రహ్మపదం తదేకం
ప్రకాశయంత్యేవ యదచ్యుతాఖ్యమ్. ౩౧

ఇహ రేచకపూరకౌ విధాయ
స్థిరధీః కుంభకమేవ కేవలం యః,
సతతం కురుతే మనోజవత్వం
లభతే వీతజరామయస్స మర్త్యః. ౩౨

నహి తస్య సుదుర్లభం త్రిలోక్యా
మిహ యః కేవలకుంభకే నిషణ్ణః,
అణిమాదిగుణాష్టకం కరస్థం
నను తస్యైవ నిరస్తమృత్యుభీతేః. ౩౩

సిధ్యతి చేతనధీప్రేరకత్వాచ్చ శాంకర లింగమేవ॥ తథాహి వేదేషు హి సనో దేవ శ్శుభయా స్మృత్యా సంయునక్తు॥ సనో బుద్ధ్యా శుభయా సంయునక్తు॥ తగ్ంహ దేవమాత్మబుద్ధి ప్రకాశం ముముక్షో జాలవాసినః యేనేదం భ్రామ్యతే బ్రహ్మచక్రమితి తథా శివ సంకల్పోపనిషది పారమేశ్వర్యా ప్రార్థనయా మనసశ్శివసంకల్పత్వం సంపాదనీయమితి ప్రతిపాదితం దేవతాంతరే బుద్ధిప్రేరకత్వం శ్రుత్యా క్వాపి చ నోచ్యతే॥ పాశుపత బ్రహ్మోపనిషది చ॥ స్వతశ్శివః పశుపతి స్సాక్షీ సర్వస్య సర్వదా। సర్వేషాంతు మనస్తేన ప్రేరితం నియమేనతు॥ ఇత్యుక్తం॥ తలవకారోపనిషది చ కేనేషిత మిత్యాదినా ధీప్రేరకత్వం బ్రహ్మలక్షణతయా జిజ్ఞాస్య ముపోద్ఘాత్య అన్తే హైమవత్యుపదేశాత్ బ్రహ్మణో నిర్ణయేన ధీప్రేరకత్వ మనితర సాధారణం పారమేశ్వరం లింగం॥ తథా అథర్వ శిరసి॥ ప్రాణేష్వంతర్మనసో లింగ మాహురితి యజుష్షు॥ ప్రాణానాం గ్రంథిరసి రుద్ర ఇతి తథా ప్రపదే॥ త్వయా ప్రసూత ఇదం కర్మ కరిష్యామీతి॥ ప్రాయశ్చి

---

నను, దీనిం బట్టి గాయత్రి యందున్నది అకారాన్త భర్గపదమే అనియు, ఆపదమునకు వాచ్యుడగు పరమేశ్వరుఁడె గాయత్రికి ముఖ్యార్థమనియు స్పష్టముగ నున్నది॥

ఇదిగాక, పాఠక్రమమును బట్టి మంత్రము యొక్క చివరనున్నదియును, ఎవ్వఁడు మాబుద్ధులను ప్రేరణ చేయునోయను చేతనధీప్రేరకత్వ లింగమును బట్టియు భర్గపదమకారాంతమేయని తెలియుచున్నది॥ అది యెట్లనిన, వేదములయందు, ఆదేవుఁడు మాకు మంచి స్మృతి నొసఁగుఁగాక, ఆదేవుఁడు మాకు మంచి బుద్ధి నొసఁగుఁగాక, జీవుల బుద్ధిని వికసింపఁ జేయు నద్దేవుని, ఎవ్వనిచే నీజగము భ్రమింపఁ జేయఁబడు చున్నదో అనియు నున్నది॥ శివ సంకల్పోపనిషత్తునందును, పరమేశ్వరుని ప్రార్థనచే మనస్సునకు శివసంకల్పత్వమును సంపాదింప వలయునని ప్రతిపాదింపఁ బడియున్నది॥ ఈధీప్రేరకత్వము దేవతాంతరమునకు న్నట్లు శ్రుతి యెచ్చటను చెప్పియుండలేదు॥ పాశుపత బ్రహ్మోపనిషత్తునందును, పశుపతియగు శివుఁడు సర్వమునకు సాక్షియగును॥ అద్దేవునిచేత అందఱియొక్క మనస్సు ప్రేరేపింపఁబడు చున్నది॥ అనియున్నది॥

తలవకారోపనిషత్తునందును, ఎవ్వనిచే ప్రేరేపింపఁబడు చున్నది అనిధీప్రేరకత్వము బ్రహ్మలక్షణముగా నుపోద్ఘాతముచేసి, కొనకు పార్వతీదేవి యొక్క యుపదేశము

భగవంతుఁ డుపదేశింపలేదా? వీని నన్నింటి నాలోచింపఁగా యోగాభ్యాసము లేనిదే మనోదార్ఢ్యమును బొంద నవకాశము లేదని స్పష్టమగును. కావుననే,

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్."

అనునర్జునుని ప్రశ్నమునకు

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే."

"అభ్యాసో నామ చిత్తభూమౌ కస్యాంచిత్సమానప్రత్యయా వృత్తిశ్చిత్తస్య." అని శంకరభాష్యము.

"అసంశయాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః."

అసంయతాత్మనా అభ్యాసవైరాగ్యాభ్యాసమసంయతః ఆత్మా అంతఃకరణం యస్య సోఽయమసంయతాత్మా. తేన అసంయతాత్మనా యోగః దుష్ప్రాపః దుఃఖేన ప్రాప్యత ఇతి మే మతిః. యస్తు పునర్వశ్యాత్మా. అభ్యాసవైరాగ్యాభ్యాం వశ్యత్వమాపాదితః ఆత్మా మనో యస్య సోఽయం వశ్యాత్మా తేన వశ్యాత్మనా తు, యతతా భూయోఽపి ప్రయత్నం కుర్వతా శక్యః అవాప్తుం యోగః ఉపాయతః. యథోక్తాదుపాయాత్." అని శంకరభాష్యము.

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున". ౪౬
గీతాశాస్త్రము ౬ అధ్యా.

వితా నః ధియః ప్రచోదయాత్ తస్య సవితు ర్దేవస్య వరేణ్యం భర్గః = ధీప్రేరకత్వరూపం తేజః ధీమహీతి వ్యాఖ్యానే న కోపి దోషః యో దేవస్సవితాస్మాకం ధియో ధర్మాదిగోచరాః ప్రేరయేత్తస్య యద్భర్గస్తద్వరేణ్య ముపాస్మహే ఇతి స్మృతివచన మప్యత్రానుకూల మితి చేదుచ్యతే। యత్తదో శ్శ్రుతయో స్సంభవతి సామానాధికరణ్యే తదుత్సృజ్య యత్తదీ చాన్యే అధ్యాహృత్య వాక్యార్థ వర్ణన స్యాయుక్తత్వాత్॥ ఉక్తస్మృతివచనస్యచ ఉదాహృతానేక శ్రుతివిరుద్ధతయా విరోధాధికరణ విషయత్వాచ్చ॥ ఏవంచ పుంస్త్వ శ్రుతిభి ర్లింగైశ్చ గాయత్రీగత భర్గపదస్యాకారాన్తత్వం సిద్ధం॥ ఏవం వాక్యాదిభిరపి॥

తథాహి అక్తాశ్శర్కరా ఉపదధాతి తేజో వై ఘృత మితి శ్రూయతే॥ అత్రాంజనకరణ ద్రవద్రవ్యానిర్ణయే సమనంతరస్తు తస్యాజ్యస్య తత్త్వేనాన్వయః తేజో వై ఘృతమితి వాక్యేన సిద్ధః॥ ఏవమిహాపి భర్గశబ్ది

---

గ్రహింపఁ బడియెను॥ కావునను, అట్టి పుంస్త్వమునకు విరోధింపని అకారాన్తముగు భర్గపదమే గాయత్రిలోనిదని, దీనిచేతను తెల్లముగు మన్నది॥

ప్రి॥ యః అనుపదముచే సవితృశబ్దార్థమును గ్రహింప వలయు, ఏసూర్యుఁడు మాయొక్క బుద్ధులను ప్రేరణ చేయునో ఆసూర్యదేవుని యొక్క, శ్రేష్ఠమగు నాతేజస్సును ధ్యానము చేయుచున్నామని యర్థము చెప్పిన నేమిదోషము? యోదేవః అను స్మృతి వచనమును నీయర్థమునకే అనుకూలము గానున్నది గదా?

ఉ॥ ఈమంత్రమునందు, తత్ అనునొక తచ్ఛబ్దంబును, యః అనునొక యచ్ఛబ్దంబును గలవు। ఏభర్గుఁడు మాబుద్ధుల ప్రేరణ చేయునో ఆతత్త్వమును ధ్యానము చేయుచున్నామని యన్వయించిన యెడ నీరెండు శబ్దములకు సంబంధ మేర్పడును॥ ఇట్లు లన్వయింపక, ఏసూర్యుఁడు అని యర్థము చెప్పునెడ మంత్రములోని యత్తచ్ఛబ్దములు రెంటికిని సంబంధము తెగిపోవును॥ యచ్ఛబ్దార్థము తచ్ఛబ్దార్థమును, తచ్ఛబ్దార్థము యచ్ఛబ్దార్థమును ఆకాంక్షించుచుండుట సర్వసమ్మతము॥ ఎట్లనిన, ఎవఁడు చేసెనో అనఁగానె ఎవఁడు అనునది వాఁడు అనుదాని నపేక్షించును, వాఁడు అనఁగానె ఎవఁడు అనుదాని నపేక్షించుచుండును। ఇట్లుండ, ఏసూర్యుఁడు ప్రేరణ చేసెనో అనఁగానె, ఏఅను దానిం బట్టి ఆసూర్యుని యొక్క అని చెప్పవలయుఁగాన తస్య అని వేరొక తచ్ఛబ్దము న

నామె శాపఫల మనుభవింపఁ గలదనియుఁ దనమహిమమును ప్రత్యక్షమున నామెకాంచిన మోహపాశములకుఁ దగులనిమన స్సు కలదగుననియు భగవంతుని భావము. కావున నీ పుణ్యచరి త్రమునుండి యిట్టి మహత్తరవిషయములఁ దెలిసికొనవలయును. తెలిసికొనినంతమాత్రమునఁ బూర్ణఫలము గలుగదనియు దాని నభ్యసింపవలయుననియు నదియే యత్యుత్తమమనియు నెఱుంగఁ దగును. ఇంక నీచర్చనూని యుపరి తనవిషయమును వ్రాయఁ బూనెదను. దాన శ్రీరాధామాధవుల యత్యద్భుతచరిత్రము తెలియఁగలదు. ఆ పుణ్యతమచరిత్రమును శ్రద్ధధానులరై పఠింపుఁడు. మనస్సు నేకాగ్రతనొందఁజేయఁ బ్రయత్నింపుఁడు.

## ఋభుచరిత్రాంతర్గత నారదచరిత్రము.

* ఆయద్భుతవృత్తాంత మెఱింగి రాధిక ప్రాణేశుం గాంచి యిట్లని ప్రశ్నించెను. శ్రీకృష్ణా! ఈముని పరమధ న్యుఁడు. నీయం దధిక ప్రేమవంతుఁడు. నీసారూప్యము నొందెను. నీవును బాష్పవారిపూర్ణనేత్రుఁడ వైతివి. పాప హరణా! ఈ మునిశార్దూలుని దేహమును సంస్కరించు టొప్పుఁగదా. ఈదేహము తపస్సమాధిచేఁ బ్రజ్వలజ్వలనాకృ తిరై మెఱయుచున్నది. అని రాధిక ప్రశ్నింపఁగా శ్రీకృష్ణుఁ డుత్తరముచెప్పునంతలో నాదేహము నదీరూపమై పాపమును వహించుచు నారోహితగిరిఁ బ్రవహించెను. రాధాంబ యత్యం తవిస్మయావిష్టహృదయ యయ్యెను. కావున నందనందనునితో నిట్లు పలికెను. జగన్నాథా! ఈ మహామునితనువు నదీరూప

---

* ఇక్కథ గర్గసంహిత మధురాఖండము ఇరువదొకటవ యధ్యాయ మునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగనగు.

అగ్నావినియుక్తాయాః సావిత్ర్యాః కథం పరమేశ్వరపరత్వమితి చేన్న వి
దాహ్నిగార్హపత్యముపతిష్ఠత ఇత్యాదావన్యపరాయా అపి ఋచోऽన్యత్ర వి
నియోగసంభవాత్ యథాస్య చ పునర్వినియుక్తస్య (శ్రీ)రుద్రాధ్యాయ
స్య పరమేశ్వర పరత్వమవ్యాహతం తథాస్యా అపీత్యవిరోధః॥

తథా సోమాఖ్యస్య త్రైహానుక్రమే— సాహి సావిత్రీతి, సవి
తృస్వామ్యాం చ శైవం లింగమితి నిర్ణీతం॥ గాయత్ర్యాశ్చ బ్రహ్మవిద్యాయా
న సంభవతి కేవలమాదిత్యః పరమార్థః— తస్య హ్యావిర్భూతత్వా అంతస్తద్ధ
ర్మోపదేశాదిత్యధికరణే సర్వైరపి భాష్యకర్తృభిర్నిర్ధారణాత్॥ తస్మా
త్ సవితృమండలస్వామీ పరమేశ్వర ఏవ మంత్రప్రతిపాద్య ఇతి తేనాపి త
ద్వాచకం భర్గపద మకారాంత మేవ భవతి॥

---

ము కలుగగా, తేజో వైష్ణవం అను వాక్య శేషమును బట్టి నెయ్య అని తెలియుచున్నది॥
అట్లయిందును, భగశబ్దార్థ మేమియని సందేహము కలుగగా పూర్వము చెప్పిన మై
త్రాయిణీయవాక్యమును బట్టి రుద్రుడే అని యేర్పడును॥

మఱియు, యజుర్వేదమున గాయత్రి నాలుగుమార్లు పఠింపబడుచున్నది॥ ఒక్క-మూ
ఱు వ్యాహృతులు, శిరము ననువాని తోడను, మునుపు గాయత్రి మాత్రంబును కలదు॥
అగ్ని చోట్లను-రుద్రమాహాత్మ్యమును చెప్పువాక్యములు గాయత్రికి పూర్వోత్తరములయం
దు గలవు॥ దానిం బట్టియు, గాయత్రి యందున్న భర్గపదము కారాంతమే అని తెలియు
చున్నది॥ ప్రకరణము వలనను అట్లె తేలుచున్నది॥ ఎట్లనిన.

గాయత్రి యజుర్వేదమున- అరుణకేతుకము- అగ్నికాండము- అను వానియందు గ
లదు॥ అగ్నిచోట్లను అగ్నియందె వినియోగము॥ అగ్ని రుద్రుడే యని అగ్నికి రుద్రతాదా
త్మ్యము చెప్పబడియున్నది దానిం బట్టియు నీభర్గపదము రుద్రవాచకము గావలయు గా
వ నకారాంతమనియు స్పష్టమగుచున్నది॥

ప్ర॥ అగ్నియందు వినియుక్తమైన సావిత్రి పరమేశ్వర పరమనుటయెట్లు?

ఉ॥ ఇంద్రుని గెప్పు మంత్రముతో గార్హపత్యాగ్నిని స్తోత్రము చేయవలయునని
యున్నది॥ దీనిం బట్టి మంత్రార్థ మొక దేవతను చెప్పినను ఆమంత్రమునిం కొక దేవత వి
షయమై వినియోగింప వచ్చునని తెలియుచున్నది॥ కావునె, మహాగ్ని చయనమున వినియో
గింపబడిన రుద్రాధ్యాయమును పరమేశ్వర పరమని గ్రహించుచునె యున్నారు॥ అట్లె
యుండును గాయత్రి పరమేశ్వర ప్రతిపాదకమె యని గ్రహింపబడుచున్నది॥

ష్టిని వదలిపెట్టుము. విశేషించి దుఃఖాతురుఁడ వైతివి. అని భాషించు నారదుం జూచి యానలువ క్రుద్ధుఁడై పెదవు లదరుచుండ నిట్లు శపించెను. దుర్మతీ! సర్వదా గానరతుఁడవై కల్పకాలము గంధర్వుఁడవై యుండుము. రాధాదేవీ! ఆమాట బ్రహ్మనోటినుండి వెడలఁగనే యానారదుఁ డుపబర్హణుఁ డను గంధర్వుఁ డయ్యెను. గంధర్వపతియు నయ్యెను. స్వర్గమున నొకకల్పముమాత్రము గంధర్వపతియై యుండెను.

ఒక్కనాఁడు బ్రహ్మలోకమునకు స్త్రీపరివృతుఁడై యా గంధర్వపతిరూపముననున్న నారదుఁ డరిగెను. సుందరీమణులయందు మనస్సుంచి తాలవివర్జితముగా గానముచేసెను. అదివిని మరల బ్రహ్మ యానారదుని శూద్రయోనిం బుట్టుమని శపించెను. ఆకారణముననే నారదుఁడు దాసీపుత్త్రుఁడుగాఁ బుట్టెను. సత్సంగవశముననే పూర్వము బ్రహ్మపుత్రత్వము నొందెను. నాయందలి భక్తిభారమున గానముచేయుచు భూమి నెల్లఁ గ్రుమ్మరుచుండెను. మునీంద్రుఁడు విష్ణుభక్తుఁడు మత్ప్రియుఁడు జ్ఞానభాస్కరుఁడు నయ్యెను. విశేషించి వచింపనేల? నామనస్సు నారదుఁడనియే తలంపుము. ఒకానొకప్పుడు నారదముని లోకములఁ గాంచుచుఁ దిరుగుచు నీలావృతమను భూఖండమును జూడఁబోయెను. సర్వత్ర గతికలవాఁడు కదా. ఏచోట జంబూనది ప్రవహించెనో ఏ నదియందు జంబూఫలరసము కలియుచుండునో ఆచోటికిం బోయెను. ఆనదిఁబుట్టిన స్వర్ణమే జాంబూనదమనఁ బిలువఁబడునని యెఱుంగుము.

ఆదేశమున వేదనగరము గలదు. అది రత్నప్రాసాద నిర్మితము. అందు దివ్యనారీనరు లుందురు. ఆనగరవరము నార

విన్నంతనే నారదునకు విస్మయము మదిఁ దోఁచెను. నడచుచుఁ బరిహాసోక్తుల నిట్లు పల్కెను. రాగములారా! ఆమునికే కా రణమునఁ గాలతాళజ్ఞాన మలవడును? స్వరయుక్తమగు నాజ్ఞా నము కలుగునో నాకుం దెలుపఁగలరా? అన విని యారాగము లిట్లు బదులిడెను. వైకుంఠనాథుని సాధ్వీప్రియురాలు సరస్వతి యగు. ఆమె యెప్పుడామునికీవిషయము శిక్షారూపముగాఁ జెప్పునో యప్పుడామునికాలజ్ఞుఁ డగును. అన విని నారదుఁడు దీనవత్సలుఁడై సరస్వతీప్రసాదార్థము గిరివరమున కరిగెను. దివ్యవర్షశతము దుష్కరమగు తపస్సానరించెను. ఆహారమును మాని జలపానము చేయక వాణీధ్యానతత్పరుఁ డయ్యెను. ఆప ర్వతము శుభమను పేరు గలదయ్యును నారదశైలమనఁ బ్రసి ద్ధిని గాంచెను. తపస్సు పూర్ణముకాఁగా వాగ్దేవియగు శ్రీసర స్వతి ప్రత్యక్షమయ్యెను. ఆమెయే విష్ణుప్రియ యగు. ఆపరమే శ్వరిం గాంచినంతనే త్వరపడి లేచి నతాననుండయి తద్రూప గుణమాధుర్యస్తుతి నీప్రకారము చేసెను. రవికోటిభాసమాన రత్నతాటంకకేయూరకిరీటకంకణములఁ దాల్చి స్ఫురత్క్వణ న్నూపురరావములచే నలగారుచుఁ గోటిశశాంకుల ధిక్కరించు ముఖముగల యో సరస్వతీ! నీపాదములకు వందన మాచరిం చెదను. కలహంసగతులఁ గ్రిందుసేయు పదగతివిశేషముల నొప్పుచు నిర్ధౌతముక్తాఫలహారవితతి ధరించిన కరుణానీరధివగు సరస్వతీదేవీ! నిన్ను భజించువాఁడను. వరాభయపుస్తకవల్లరికల ధరించిన కరసరసిజద్వయముగలిగి శుభముల నీయఁజాలి జగత్స్వ రూపురాలవై బ్రహ్మమయివై యలరారు నీ దివ్యరూపమును ధ్యానించువాఁడను. తరంగితక్షౌమదుకూలమును ధరించిన

భానసా దేవ సాంతసపుంసకత్వా ద్వితీయాంత త్వమపి ప్రథమాంత ఏవాన్వ
న్తం భవతి॥ గాయత్రీ వాక్యజన్య శాబ్దబోధోత్తరం మైత్రాయణీయ
గాయత్రీ వ్యాఖ్యాన వాక్యాదేవ తదవగంతవ్యం॥ నహి మూలార్థం
మూలగతపదై ర్వ్యుత్పాదనేన ప్రతీయమాన ముపేక్ష్యమూలార్థ జ్ఞా
నాయ వ్యాఖ్యానం పశ్యన్తి విబుధాః॥ కింతు మూలగతపదైః అవగత
మూల పదార్థస్య బాధప్రతి సంధానేవా మూలార్థస్య ప్రతిపత్తా
వా వ్యాఖ్యానాపేక్షా॥ ప్రకృతేచ గాయత్రీ మూల రూపార్థః సాన్న న
పుంసక భర్గః పదశక్త్యైకజః కర్తృక ధ్యానమితి ప్రథమం న బాధితః॥ గా
యత్రీ వాక్య జన్య బోధకాలే వ్యాఖ్యానవాక్యార్థ స్యానుపస్థితేః ప్ర
త్యుత భర్గపదస్య శివపరత్వేన బాధబుద్ధి రుపజాయతే ప్రథమాయా
కర్తృత్వబుద్ధి ప్రతిబంధాత్॥ ప్రథమాయా శ్ఛందసి వ్యత్యయ స్యాశ్రిత.
కల్పనయా కర్మార్థం త్వోత్తర కాలిక బోధజనక మైత్రాయణీయ వ్యా
ఖ్యాన వాక్యాధీనమితిన ప్రాథమికగాయత్రీ వాక్యజన్యబోధవేళాయాం సం
భవతీత్యర్థః సర్వాత్మ నైకబోధే శివస్యకర్తృత్వ ప్రతీతిరితి తన్మూ
లం॥ ఛందసి వ్యత్యయస్య వైయాకరణ సమ్మతత్వ మివ దూరాన్వయ
స్య అలౌకికార్థ స్వీకారస్యచ ప్రాశస్త్య బోధక విషయ వ్యాఖ్యాన వాక్యజా
త ప్రామాణ్య వాక్యబలాత్ మీమాంసక సమ్మతత్వాత్॥ తథైవ పశ్య
జదధి సేనా భగవతా జైమినినా అర్థతో హ్య సమర్థానా మానంతర్య
స్య సంబంధ ఇతి తథా త్యాగ్రే క్త్యోక్త్వా॥ దూరస్థేనాపి తేనసః అర్థతోహ్య

---

ట్లు గ్రహింపఁ బడిన తరువాత మైత్రాయణీయశ్రుతి యెట్లు వచించిన నేమిలాభము?
లోకమున నెవ్వైనను పండితులు మూలము మీదనర్థము గాకున్నయెడ వ్యాఖ్యానము యా
తురగాని మూలార్థము నిరర్థకముగా తెలియుచుండ వ్యాఖ్యానము నేలచూతురు? కా
వున మైత్రాయణీయశ్రుతిని బట్టి గాయత్రిలోని భర్గపద మకారాంతమనుట యుక్తి
యుక్తము కానేరదు॥

ఉ॥ మూలములోని పదములకు వ్యాఖ్యానము నపేక్షింపక తోచినట్లు లక్షముచే
సి కొనుటెడ పెక్కుబాధలు తటస్థించును॥

ప్ర॥ ఎట్లు?

దుంబురుఁ డనుగంధర్వుని శిష్యునిగా గ్రహించి యావిద్య నెల్ల నిచ్చెను. నాగుణకీర్తనము నుపదేశించెను. వీణావాదన పద్ధతి నెఱుకపఱచెను. ఆవల నీమహావిద్య నెవరియెదుట గానము చేయఁదగును. ఇది గానరూపమగు మనోహరకళ కదా. దీనిని వినఁదగిన పాత్రమెవ్వరని వెదకుచు నారదముని శక్రుసభ కరిగెను. అందు నింద్రుఁ డనిర్వృతుఁడై యుంటనెఱింగి తుంబురుంగూడి సూర్యలోకమున కేగెను. అందు రవి స్యందనముతోఁ బరుగిడుచుండెను. ఆతనింగాంచి యీతఁ డిద్దానివినఁ బాత్రుఁడు కాఁడని శంకరుపార్శ్వమున కరిగెను. అందుఁజని శంకరుని జ్ఞానతత్వజ్ఞునిగను ధ్యానస్తిమితలోచనుఁగను దెలిసికొని బ్రహ్మలోకమునకుఁ బోయెను. సదా సృష్టికార్యవ్యగ్రుఁడై యున్న యాపరమేష్ఠిని గనుంగొని వైకుంఠమునకేగి సర్వలోకనమస్కృతుఁడగు నారాయణమూర్తిం జూచెను. ఆతఁ డేభక్తునికొఱకో యెచ్చటికోపోవ నుంకించుచుండు టెఱింగి భక్తవత్సలుఁడగుట నాతురపడి యెందో పోవనున్నాఁ డీతఁడు విననర్హుఁడు కాఁడని నిశ్చయించి తుంబురుంగూడి పోయెను. వృషభానుపుత్రీ! యోగీశ్వరులకు మూఁడులోకములలో బాహ్యాభ్యంతరములయందు గతిగలదని చెప్పుదురు. కర్మములచే వారు కట్టఁబడరు. కోటిబ్రహ్మాండముల దాఁటి యామునీశ్వరుఁడు ప్రకృతికంటె నుత్తముఁడగు భగవంతుఁడుండు గోలోకమునకుఁ బోయెను.

విరజానదీకల్లోలమాలికల దాఁటి మనోహరబృందావనమునకుం బోయెను. దానికిసమాన మదియేగాని రెండవది కానరాదు. భృంగఝుంకారనినాదము లా బృందారణ్యమున మిక్కి

కించ ఆజ్యేన జుహోతి సమిధా జుహోతి, దధ్నా జుహోతి పయసా జుహోతి, ఆగ్నేయేన స్థాలీపాకేన యజతే ఇత్యాదావివ ఉద్భిదా యజేత బలభిదా యజేత విశ్వజితా యజేత అభిజితా యజేత ఇత్యాదిష్వపి ఉద్భిదాదిపదానాం విధివాక్యగతయా ప్రాధాన్యాత్ తద్గత్యైకదైః ఆకాంక్షిత విధాన సంభవాత్ తమపనీయ యోగనామధేయత్వా స్వీకరణ మయుక్తమేవ స్యాత్ తస్మాత్పూర్వోక్త మయుక్తం॥

నను మైత్రాయణీశాఖాపఠితవ్యాఖ్యానేన సావిత్ర్యర్థ నిర్ణయో న యుజ్యతే॥ తస్యాశ్శాఖాయాః సర్వసమ్మత ప్రామాణ్యకత్వాభావాదితి చేదుచ్యతే। ఇతి బ్రాహ్మణ మితి బ్రాహ్మణమితి మంత్ర బ్రాహ్మణయో ర్వేద నామధేయత్వమితిచ కల్పసూత్రకారా మంత్రబ్రాహ్మణయో రవిశేషేణ ప్రామాణ్యం నిరదైక్షుః॥ తథా చోదనా లక్షణోర్థో ధర్మ ఇతి విధేరేవ బ్రాహ్మణస్య ముఖ్యం ప్రామాణ్యమంగ్యకార్షీద్భగవాఞ్జైమినిః॥ కించ తేన ద్వితీయాధ్యాయే విధిమంత్రయో రైకార్థ్యమైకవాక్యాదితి మంత్ర బ్రాహ్మణయో రైకవాక్యత్వమంగీకృతం॥ తథత్రాపి బ్రాహ్మణాత్మకస్య మైత్రాయణీయ శబ్దస్య చైకశబ్ద్య మవిరుద్ధం॥

---

మఱియు— ఆజ్యేనజుహోతి॥ ఈ మొదలగుచోట్ల ఆజ్యము మొదలైనవి హోమకరణ ద్రవ్యములుగా గ్రహింపఁబడుచున్నవి॥ అయినను— ఉద్భిదాయజేత- ఈ మొదలగుచోట్ల ఉద్భిదాదిపదములు బ్రాహ్మణ వాక్యములనుబట్టి యాగనామధేయములుగానె గ్రహింపబడుచున్నవి॥ ఇఁక- శ్రుతివాక్యములకు మొదట తోఁచిన యర్థమునె గ్రహించి బ్రాహ్మణలభ్యమును త్యజింపవలయునని చెప్పినయెడ శ్యేనాది పదములకు యాగనామధేయత్వము గ్రహించుట మొదలుగా విరుద్ధములే కావలయుఁగదా?

ప్ర॥ మైత్రాయణీశాఖకు అందఱు ప్రమాణముగా నంగీకరింపరుగాన దానిబట్టి గాయత్రి కర్థనిర్ణయము చేయుట యుక్తమగునా?

ఉ॥ కల్పసూత్రకారులు మంత్రములకు- బ్రాహ్మణములకును వేదమను పేరుగలదని చెప్పి వాటిని సమానముగనె గ్రహించుచున్నారు॥ జైమిని మహర్షి విధిని చెప్పు బ్రాహ్మణమునకే మంత్రభాగముకంటె విశేష ప్రామాణ్యమును నిర్ణయించియుండెను॥ కావున- బ్రాహ్మణరూపమైన మైత్రాయణీయ శ్రుతికిని మంత్రరూపమైన గాయత్రికిని సమానార్థకత్వము యుక్తమే యగును॥

కొసంగి జలత్వమొందితిని. ఏజలము నాశరీరమునఁ బుట్టినదో యది బ్రహ్మద్రవమని పెద్దలు పిలుతురు. ఆ బ్రహ్మద్రవముననే కోటి కోటి బ్రహ్మాండములు పొరలాడుచుండును. స్వర్గఫలంబుం బోని యత్యున్నతమగు తజ్జలమునఁ బ్రకాశగర్భమగు నీబ్రహ్మాండము మత్పదమని యెఱుంగుము. దానిని భేదించుకొని యామన్వంతరమున వచ్చిన నాపాదోదకమునే స్వర్ధుని యనియు నాకాశగంగ యనియు నందురు. పాపహారిణియగు గంగాతరంగిణి యదియే యని నమ్ముము. ఆ గంగానదియే యంబరమున మందాకినియనియు, భూలోకమున భాగీరథియనియు, పాతాళమున భోగవతియనియు నీ మూఁడుపద్ధతుల నలరి త్రిపథగామినియనఁ బ్రఖ్యాతిం గాంచినది. దానిలో స్నానము చేసినను, దూరముననుండి పలుమాఱు భక్తియుక్తులై స్మరించినను రాజసూయాశ్వమేధాదిక్రతుఫలము దొరకుట దుర్లభమనం జనదు.

ఎవరుగాని శతయోజనదూరముననున్నను గంగాగంగా యని పలుకుదురో వారి సకలపాపములు నశించును. విష్ణుసాయుజ్యము లభించును * గంగాదర్శనమున శతజన్మపాపములు తొలఁగును. జలపానమున రెండువందలజన్మముల పాపములు నశించును. స్నానమున సహస్రజన్మపాపములును గలియుగమునఁ దొలఁగును. జాహ్నవీనదిని దర్శించువారి జన్మము సఫలము. ఏనరులు కలియుగమున జాహ్నవీనదిని జూడరో వారిజన్మములు వ్యర్థములు సుమీ! రాధికా! నీభయమున

---

* దృష్ట్వా జన్మశతం పాపం పీత్వా జన్మశతద్వయం, స్నాత్వా జన్మసహస్రేణ హంతి గంగా కలౌయుగే = అనిమూలము.

విరజాంగన నదీరూపమును దాల్చెనో విరజాతనయులును నదీరూపములఁ దాల్చిరో విష్ణువెట్లు కృష్ణానదీరూపమును ధరించెనో సదాశివుఁడెట్లు వేణీనదీరూపమును వహించెనో బ్రహ్మకకుద్మినీనదీరూపధారి యయ్యెనో అప్సర గండకీతరంగిణి యెట్లయ్యెనో అట్లే యీ ఋభుమునియు నదీరూపమును ధరించెనని తెలియవలయు. ఎవరికిఁ బ్రేమ లక్షణయగుభక్తి నిలుకడఁగాంచునో వారు నదీరూపు లగుదురు. సంశయములేదు. ఈ చరిత్రము పరమపవిత్రము. పాపలతాలవిత్రము. దీనిని వినిన సన్నిలోకములను దాఁటి నాలోకమునకే తెంతురు. అని ఋభుచరిత్రమును దెలిపి రాధాదేవినిగూడి యాపర్వతమునుండి మాలతీవనమునకుం బోయెను భక్తవత్సలుఁడగు భగవంతుఁడు గోపికావిరహము నెఱింగెను. కావున వారి మనోవ్యథను దీర్పఁ బొంచి యమునాపులినమున కరిగెను. అందందు శ్రీకృష్ణుని వెదకుచున్న గోపిక లాతురంబున గతవ్యథలై నీలమేఘశ్యాముఁడగు నాలీలామానుషవిగ్రహుని మెఱపుఁదీఁగెలు ఘనము నాశ్రయించిన చందమున నాశ్రయించిరి. యమునాతరంగిణీ తీరమునఁ గనుపట్టు బృందావనమున శ్రీకృష్ణుఁడు గోపికానికురుంబపరివేష్టితుఁడై వంశీనాదముఖరితదిగ్వలయుఁడై వేడుకఁ గాలముపుచ్చెను. ఆవేణునాదమున గోపికలు మూర్ఛితలైరి. నది వేగరహితయయ్యెను. పక్షులు కదలకయుండినవి. దేవతలు మౌనముద్రలం దాల్చిరి. దేవాధీశులందఱు స్తంభితాంతఃకరణులైరి. తరువరములు జలత్వము నొందినవి. జగంబంతయు నిద్రాత్వము నొంచెను. రాధికకు గోపికలకును మనోరథంబగు రాసవిహారమును సలిపి శ్రీకృష్ణుఁడు బ్రాహ్మముహూర్తమున

కించ, తేనైవ వాక్యేన, సవితుర్వరేణ్యం తదిత్యుక్త్వా, దేవస్య సవితుర్వరేణ్యం తత్ ధీమహీత్యస్మదుక్తాన్వయ స్యైవానురోధేన, వరేణ్య శబ్దస్య భర్గ శబ్ద విశేషణత్వస్యాప్రదర్శనేన, పరైః ప్రదర్శ్యమానస్య వరేణ్యంభర్గ ఇత్యన్వయస్య శ్రుతివిరుద్ధత్వ సంప్రతిపత్తేః॥ ఏవంచ, భర్గపద స్యాకారాన్తత్వ నిశ్చయేన గాయత్ర్యాః పరమేశ్వర ప్రతిపాదకత్వం సర్వప్రమాణ సిద్ధ మిత్యలమధికేన॥

జపవిధిః.

గాయత్రీ మష్టోత్తరశతం జపేత్, ప్రాతస్తిష్ఠన్ సాయం మధ్యాహ్నయో రాసీనః॥

జపావసానం.

శ్రౌతాచమనం కృత్వా ప్రాణానాయమ్య, ఏవంగుణవిశిష్టే— ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాంగ గాయత్రీ మంత్ర జపావసానం కరిష్యే ఇతి

---

ప్ర॥ అదియేల?

ఉ॥ సవితృశబ్దమునకు సూర్యుఁడని యర్థము చెప్పిన కుదురదు కాన లోకసిద్ధమగు రూఢిని వదలి లక్షణచే గాని, కేవలయోగముచేగాని, పరమేశ్వరుఁడను నర్థము చెప్పకొనవలయు॥ సవితృశబ్దమునకు పరమేశ్వరుఁడని యర్థముచెప్పి యాదేవుని తేజస్సును ధ్యానము చేయుచున్నామనుట కంటె భర్గశబ్దమునకె పరమేశ్వరుఁడను నర్థముగాన పరమేశ్వరుని ధ్యానించుచున్నామనుటయే లాఘవమగును, భర్గస్సీరేత ఆలోకా అను నిఘంటువునుబట్టి యనేక ప్రమాణములను, న్యాయ్యములను బాధించుట యుక్తముగాదు॥

మఱియు, మంత్రోపనిషత్తులోని, యుదాత్తః అను మంత్రము నందు॥ శివఏవకేవలః॥ తదక్షరం తత్సవితుర్వరేణ్యం॥ అని, శివుఁడె సూర్యునకు నుపాస్యుఁడు కాఁడు అనుటచే గాయత్రీ ప్రతిపాద్యుఁడు శివుఁడే యని స్పష్టమైనది॥

ఇదిగాక, నీమంత్రము నందు॥ సవితుః వరేణ్యం తత్ అని యుండుటచే, దేవస్య సవితుః, వరేణ్యం, తత్, ధీమహి అని మేముచెప్పిన అన్వయమే కనఁబడుచున్నదిగానను, పరులు చెప్పినట్లు వరేణ్యం అనుపదము భర్గః పదమునకు విశేషణముగాఁ జెప్పఁబడి యుండలేదు గావునను, ఇతరులు చెప్పుచున్న, వరేణ్యం, భర్గః అను నన్వయము శ్రుతి విరుద్ధమని నిశ్చయమైనది॥

కనఁబడునట్లు చేయఁజాలదు. దానిని దుడిచినఁ గనఁబడుపఁ గలదు. అట్లే దుష్కర్మఫలముల ననుభవించువారి కజ్ఞానాంధకారము సాంద్రముగ మనోదర్పణము నాచ్ఛాదించి యుండును. అది జ్ఞానభాస్కరోదయమునఁ గాని నశింపదు. అట్టివారికడఁ గూరుచుండి యింద్రియాతీతవిషయములఁ దెలుపఁబూనువారి ప్రయత్నము పనిలేనిమంగలి పిల్లితల గొఱిగెనన్న సామెత వంటిది. అట్టివారి కింకను దెలుపఁబూనిన వ్యర్థకాలక్షేపము చేసిన ట్లగునుగదా? కావున వారితో సంభాషింపకుండుటయే సముచితము. అయిన వారికెన్నటికిని దెలియకున్న నెట్లు? వారికి సత్కర్మాచరణబుద్ధి యుదయించు టెట్లు? అన్న ప్రశ్నము రాఁ దగును. సమాధాన మేమనఁగా వారి యసత్కర్మఫల మనుభవమునఁ జాలభాగము క్షీణింపఁగా యత్కించిత్సత్కర్మ ఫలము పొడసూపును. ఇది నిక్కువము. దాన నించుక సద్గోష్ఠి కతఁడు ప్రయత్నించును. ఆమార్పు సాధువు లెఱుంగుదురు. కాన నట్టితఱి వాని కించుకహితమును బోధింతురు. దాన నాజీవుఁడు వృద్ధికి రాఁదగు కర్మముల నొనరింపఁ బ్రయత్నించును. ఇది యప్రతిహతసిద్ధాంతము. ప్రకృతవిషయము నింక వినుఁడు.

యోగులు జ్ఞానభాస్కరప్రతిధ్వంసితకల్మషాంధకార లేశులు. కావున నెప్పుడో వారికిఁ గాంక్ష గలుగును. అది లోకోపకారమున కగు. సృష్టిచేయుమూహ వారికింగల్గిన నది భగవంతునియాశయమని వారు నమ్ముదురు. కాఁబట్టి యట్టితఱి నా వాంఛాపూర్తికి సంకల్పించి యేయవయవమును వీక్షింతురో యందుండియే యావాంఛ ఫలించును. మానసపుత్త్రు లట్టివారేయని యెఱుంగఁదగు. బ్రహ్మ పరమేశ్వరానుగ్రహ

త్రౌ చాపి సన్ధీయతే తదేవ వరుణో గృహ్ణాతి తమేవ ప్రాత రుపస్థాయ రాత్రికృతాత్పాప్మనో ముచ్యతే ఽహ్నా చాపి సన్ధీయతే మిత్రశ్చైనం స్వర్గం లోకం నయతి॥ స ఏవ మేవాహోరాత్రయో స్సన్ధిషూపతిష్ఠమానో బ్రహ్మభూత మభిజయతీతి॥ మధ్యాహ్నోపస్థాన మాహ స ఏవ॥ దర్భేష్వాసీనో దర్భాన్ధారయమాణః ప్రాఙ్ముఖ స్సావిత్రీం సహస్రకృత్వ ఆవర్త యేచ్ఛతకృత్వోఽపరిమితకృత్వో వా దశావర మథాదిత్య ముపతిష్ఠతే। ఆసత్యేనోద్వయం తమసస్పరి ఉదుత్యం చిత్రం తచ్చక్షు ర్దేవహితం య ఉదగా దితి॥

అత్ర యద్యప్య థాదిత్య ముపతిష్ఠత ఇత్యనేనోపస్థాతవ్య ఆదిత్య ఇతి ప్రతీయతే॥ తథాపి సన్ధ్యోపాసనస్య ప్రస్తుతతయా తదవిరోధాయాదిత్యపదస్య సన్ధ్యాపరత్వమేవ గ్రాహ్యం, అన్యథా సన్ధ్యోపాసన మారభ్య తదసమాప్త్యైవ దేవతాంతరోపస్థానస్య విరుద్ధత్వాత్, అత ఏవ, సాయం సన్ధ్యాముపస్థాయ తేన తస్యాం త్వముచ్యత ఇతి భగవతా బోధాయనే నాప్యుపస్థానస్య సన్ధ్యాకర్మకత్వమేవేతి నిర్ణీతం, సన్ధ్యాం

---

మంతయు రాత్రితో గూడును॥ దానిని వరుణుండు గ్రహించును॥ ఇట్లే ప్రాతః కాల మున నుపస్థానము చేయునెడల రాత్రిచేసిన పాపమంతయు పగలుతోం గూడును॥ దానిని మిత్రుండు గ్రహించును॥ అని మొదలుగా బోధాయనుండు చెప్పెను॥

మధ్యాహ్నమునందు॥ దర్భలయందు గూర్చుండి, దర్భలనుధరించి, ప్రాఙ్ముఖుండై సావిత్రిని వేయిమార్లుగాని, నూరుమార్లుగాని, పదిమార్లుగాని, జపించి, ఆసత్యేన, ఉద్వయం, ఉదుత్యం, చిత్రం దేవానాం, తచ్చక్షుః, యఉదగాత్ అను మంత్రములతో నుపస్థానము చేయవలయును॥

ఇచ్చట, ఆదిత్య ముపతిష్ఠతే అను వాక్యమునుబట్టి సూర్యనుద్దేశించి యుపస్థానము చేయవలయు నని తోచుచున్నది॥ అయినను సంధ్యోపాసనము ప్రకృతము గావున అది విరోధింపకుండుటకై ఆదిత్యపదమునకు సంధ్యాపరత్వమే చెప్పవలయును॥ అట్లు అంగీకరింపకుండునెడ, సంధ్యోపాసనము నారంభించి, అది ముగింపకయే వేరొక దేవత కుపస్థానము చెప్పుట విరుద్ధ మగును॥ కావుననే, సాయం సంధ్యా ముపస్థాయ అని బోధాయనుండు సంధ్యనే ఉపస్థానము చేయవలయునని నిర్ణయించి యున్నాడు॥ సంధ్య

ప్రశ్నింతురా? సమాధానము చిత్తగింపుఁడు. గానకళ లోకమున వెలయవలయు. దానిచే స్తుతిపాఠములు వృద్ధిగాంచును. దానఁ బ్రాణికోటి భగవద్భక్తి నలవరించుకొనును. దానినుండి భగవత్కారుణ్యఁ బడయఁగలరు. ఈయూహ భగవంతుని మదిఁ గలిగినవెంటనే శాపవాక్కు తదనుగుణముగా వెలువడియె. దాన నాముని గంధర్వుఁ డయ్యెను. ఇంతమాత్రమున భగవంతునిసంకల్పము పూర్ణముగా ఫలింపలేదు. గానకళ సంపూర్ణాకృతిం గాంచవలయునని కదా పరమేశ్వరసంకల్పము. అది నెఱవేఱవలసినదియే కదా. కావున నారదుఁ డొకనాఁడు గంధర్వనారీపరివృతుఁడై బ్రహ్మలోకమునకుంబోయి తాళహీనముగా గానము చేసెను. బ్రహ్మకు మరలఁ గోపముకలిగి మరల శపించెను. తత్ఫల మనుభవించుచుఁ దిరుగుచుండఁగా భగవంతుని సంకల్పబలమున నొకయడవిలో నగరమొకఁడు కనఁబడియెను. వేదనగరమని దానిపేరు. వాస్తవముగా నది నగరముకాదు. అందున్నవా రంగహీనులుగా నారదునకుఁ గానఁబడిరి. కారణమడుగఁ దమరెల్ల రాగములనియు నారదుఁడు తాళవిహీనముగా గానముచేసెనను లోనగువిషయములఁ దెల్పి సరస్వతి నారాధించిన నాకళయందుఁ బూర్ణపాండిత్య మలవడుననియు వా రుపదేశించిరి. నారదుఁడు సిగ్గుపడి సరస్వతి నారాధించెను. ఆమె విష్ణుపత్నియని చెప్పఁబడినది కదా. అదెట్లు? వినుఁడు. విద్యలన్నియు భగవంతుని వశంవదలు. ఈ గానకళాధిదేవత సరస్వతి. క్రొత్తగా సృజింపఁబడునదెల్ల భగవదనుగ్రహపాత్రము కదా. కావున నీ గానకళాధిదేవత సరస్వతి విష్ణుపత్ని యగుట కేమిసంశయము? వేదకళకు సరస్వతి యని సావిత్రి

రపి స్తౌతి- మిత్రఇతి మిత్రః- జనాన్ = ఉభయకర్మపరికర్మితా న్జనాన్ ప్రజానన్ సర్వమిదంకరతలామలకవత్ పశ్యన్ = అనుగృహ్ణ న్నిత్యర్థః. మిత్రస్సూర్యః- యాతయతి, స్వేస్వే కర్మణి యోజయతి= పూర్వకర్మా నుసారేణ ప్రేరయతి॥ కించ, మిత్రఏవ, పృథివీం, వృష్టిప్రదానేన పృథివీ స్థంప్రాణిజాతం॥ దాధార= ররక్ష॥ ఉత= అపిచ, ద్యాందివమపి; సకల భువనానా ముపలక్షణం చైతత్ దాధార॥ అపిచ మిత్రః కృష్టీః= కృష్టయః ప్రజాః, పుణ్య పాపయో ర్వర్తమానాస్తాః అనిమిషా, అనిమిషేణ దివ్యేన చక్షుషా అభిచష్టే=అభిముఖ్యేన= పశ్యతి, తస్మై, సత్యాయ= నిత్యరూపాయ, మిత్రాయ, హవ్యం= చరుపురోడాశాదికం, ఘృతవత్ = ఘృతసిక్తం విధేమ= దద్మఇత్యర్థః॥ హేమిత్ర, సః, మర్తః= మర్త్యః, ప్రాస్తు= భవతు, కీదృశః, ప్రయస్వాన్= ప్రయః= అన్నం, తద్వాన్ భూమ్ని మతుప్ప్రత్యయః॥ బహ్వన్నవా న్భవత్విత్యర్థః॥ కోసౌ యజమానః, తే, తుభ్యం ఆదిత్యం, అదితేః పుత్రం ప్రవతేవ, యోగాఖ్యకర్మణా ప్రకృతత్వాత్ ఘృతవత్ హవిరితిసంబధ్యతే॥ శిక్షతి, దదాతి కర్మణి యో హవిర్దదాతి స ప్రయస్వాన్ భవత్వితి యావత్॥ న కేవల మన్నవా నేవ భవతు॥ కింతర్హి నహన్యతే మృత్యునా, నజీయతే జ్యావయోహసా శతసంవత్సరలక్షణా దాయుషః,నజీయతే, జేతుం నశక్యతే త్వోతః త్వయారక్షితః ఉత ఇతి వేఘారక్షణార్థ స్త్యైత ద్రూపం ఏనం త్వయా రక్షితం అంహః పాపం నాశ్నోతి నప్రాప్నోతి అంతితస్సమీపే

---

మిత్ర సూర్యుఁడు, కృష్టీః= ప్రజలను, అనిమిషా= రెప్పపాటులేని దృష్టిచే,అభిచష్టే= చూచుచున్నాఁడు. తస్మై= అట్టి, సత్యాయ= నిత్యస్వరూపుఁడగు సూర్యనికొఱకు, హవ్యం= హవిస్సును, ఘృతవత్= నేతితోఁగూడ, విధేమ= ఇచ్చుచుము॥= మిత్ర= సూర్యుఁడా సః= ఆ, మర్తః= మర్త్యుఁడు, ఎటువంటి వాఁడన, ప్రయస్వాన్ అధికమగు నన్నము కలవాఁడు. ప్రాస్తు= అగుగాక. యః= ఎవఁడు, తే= నీకొఱకు, ఆదిత్యః= సూర్యుఁడనుట నిన్ను దేశించి.

అనఁగాఁ బాదోదకమే బ్రహ్మద్రవమను పేరఁ బరఁగెను. అదియే మందాకిని. అదియే భాగీరథి. అదియే భోగవతి. పుణ్యలోకముల గోలోకమెట్టిదో యీనదియు నట్టిదియే. సాక్షాచ్ఛ్రీకృష్ణపాదారవిందసంభూతము. శ్రీకృష్ణుఁడు పరబ్రహ్మము. తజ్జనితంబగు నీనదియుఁ బరమపావనము. కావునఁ దన్నదీస్మరణజలపానస్నానాదులకంటె సత్కర్మములు లేవని సాధుపురాణసమ్మతము. దూరముననుండి గంగాస్మరణముచేసినను జాలుననిరి. ఏల? మనస్సు ప్రధానముగదా. మనస్సుచే స్మరించుటయే చాలును. కాయికవాచికములకంటె మనస్సుచేఁ జేయఁబడినకర్మ మనంతఫలప్రదము.

"మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః."

అన్నసూక్తి సుప్రసిద్ధమే కదా. ఈ గంగామాహాత్మ్యప్రస్తావమున మఱికొన్నివిశేషములు పొడకట్టినవి. విష్ణువు కృష్ణానదియని, శంకరుఁడు వేణీనదియని, బ్రహ్మ కకుద్మినియని కనుపట్టెడిని. అనఁగా నీనదులలో స్నానము చేయుతఱి నాదేవతాధ్యానము చేయవలయునని దీనిసారము. ఆభావమున స్నానముచేసిననే యనంతఫలము. కాని యూరకస్నానముచేయుట యింత ఫలము నీఁజాలదని మనము గ్రహింపవలయును.

"శ్రుతి. ఆపః పునంతు పృథివీం పృథివీ పూతా పునాతు మాం."

అన్నశ్రుతి జలము పవిత్రపదార్థములలో నతిపవిత్రములని హెచ్చరించునది. నారాయణమూర్తి యుదకస్వరూపుఁ డనుట సుప్రసిద్ధమే కదా. కాఁబట్టి భగవద్రూపములు జలములని భావించుచు నందు స్నానముచేయవలయుననియు దీని ముఖ్యతమసారము. ఇదియే దీనినుండి మనము గ్రహింపఁదగినవిష

షు. సితాౕ స్వస్వ న్యవహారేషు పరివేశయ న్నిత్యర్థః॥ హిరణ్మయేన, స్వర్ణమయేన రథేన సవితా కర్మ ప్రసవితా భువనా, భువ నాని జగంతి పశ్యన్, ఆయాతి, ఆగచ్ఛతి॥ తాదృశం సవితారం ధ్యాయామ ఇత్య ర్థః॥ కించ, వయం తమసస్పరి, అంధకారస్యోపరి స్థితం, తన్నాశక మి త్యర్థః, జ్యోతిః, తేజోమయం, ఉత్తరం, ఉత్కృష్టతమం, దేవం, దేవశీలం దేవత్రా, దేవానాం, త్రాతారం సూర్యం, ఉత్పశ్యన్తః ఉద్వీక్షమాణాః, ఉత్తమం, నిరతిశయం, జ్యోతిః, తదంతర్యామిణం పరమేశ్వరం, అగన్మ, ప్రాప్నుయామ॥ ఉత్య ఉ, ద్వావపి, నిపాతా వవధారణార్థకౌ, త్యం, తం, జాతవేదసం, దేవం కేతవః, సహస్రసంఖ్యా దీధితయః, ఉద్వ హన్తి, ఉద్గమయన్తి, ఉదస్ఫురయన్తివా, కిమర్థం, దృశే, దర్శనాయ, వి శ్వాయ, విశ్వస్య, సూర్యం, సరణశీలం, దేవానాం, అగ్న్యాదీనాం మ ధ్యే, చిత్రం, అద్భుతం, పూజ్యంవా, అనీకం, అనీకశబ్దస్సేనావాచకః, దేవద్విషాం సేనాపనోదనార్థం స్వయందేవానాం సేనారూపం, ఉదగా త్, ఉద్గచ్ఛత్, మిత్రస్య, వరుణస్య, అగ్నేః, చక్షుః చక్షుస్థానీయం చక్షుర్దేవానా ముతమను ష్యాణా మితి శ్రుతేః— జగతః— జంగమస్య

---

ఆసత్యేన— అంతట సత్యస్వరూపుండును, రజసా— రంజనాత్మక మగు తేజోమం డలముతో, వర్తమానః— ప్రవర్తించుచు, అమృత్యం— దేవతల నుపర్త్యం, మనుష్యులను, ని వేశయన్, జీవింపఁ జేయుచు! తన కాంతితో స్వాయా లోకముల యందున్న వారలను త మతమ వ్యవహారముల యందు ప్రవేశ పెట్టుచుననుట॥ హిరణ్యయేన' స్వర్ణమయమైన' రథేన, రథముతో సవితా, సూర్యుఁడు, భువనా, లోక ములను, పశ్యన్ చూచుచు, ఆ యాతి, వచ్చుచున్నాఁడు॥ అట్టిసూర్యుని ధ్యానింతుమనుట మఱియును వయం, మేము, త మసస్పరి, అంధకారము నణచునట్టి జ్యోతిః, తేజోమయుండును, ఉత్తరం, శ్రేష్ఠుఁడును దేవం, క్రీడన శీలుఁడును' దేవత్రా, దేవతలను రక్షించుఁడును, నగు సూర్యం సూర్యుని, ఉ త్పశ్యన్తః, చూచుచు ఉత్తమం నిరతిశయమగు జ్యోతి పరమేశ్వరత్వ మును అగన్మ పొందుదుముగాక॥ ఉత్ ఉ॥ తప్పక పొందుదుముగాక॥ త్యం, ఆ, జాత వేదసం వేదము లయందుఁడగు దేవం సూర్యుని కేతవః, వేలకొలఁది కిరణములు దృశే దర్శనము కొఱకు ఉద్వ హన్తి మోయుచున్నవి॥ విశ్వాయ జగమునొక్క సూర్యం ప్రవర్తనకు కారణ భూతుఁడును,

గోపాలకుల నుచితరీతి నాశ్వాసించి వారి మనస్సంశయములం బాపి చక్కనిజ్ఞానము నుపదేశించి వారియనుమతి నెట్లో పొంది దివ్యస్యందన మధిష్ఠించి మధురానగరదర్శనత్వరచే నందగోకులమునుండి బయలువెడలెను. దూరభూమి కరుగుచున్న యాశ్రీహరి వియోగమున కోర్వఁజాలక వ్రజవాసులందఱు ఉవ్విళ్లూరు కోరికల వెంటఁ బోయిరి. భూమండలమున భగవంతునిసాక్షాద్దర్శనము దుర్లభము. అట్టియెడ సర్వదా చూచుచున్నను వారికిఁ దృప్తియనుమాటయే కలుగలేదు. వారి ప్రీత్యతిశయమును వర్ణింప నెవరితరము? శ్రీధరుని ముఖచంద్రునిఁ జూచు కొలఁదిని వారినయనము లనిమేషములై యుండెను ఎట్టకేలకుఁ బ్రేమవిహ్వలులై యిట్లు పలికిరి.

శ్రీకృష్ణా! సత్వరంబ రమ్ము. వ్రజముననివసించు మాకెల్ల నీవకదా దిక్కు. దర్శన మిమ్ము. దేవతల కమృత మొసంగినట్లు మాకుఁ ద్వరగా దర్శనమిమ్ము. యశోద నిన్నుఁజూచియే మహానందము నొందును. ఆమె యానందమునకుఁ గొఱంత కల్గనీయకుము. నందనందనా! వ్రజవాసుల కానందంబన నీవకదా. జీవనము నీవేకదా. వ్రజమునకు ధనము నీవే. కులమునకు దీపము నీవే. మహాత్ములకు మోహము నీవే. వేసవియందు గ్రీష్మాదిత్యకిరణతప్తులకు శీతలోదకమెట్లో, శీతార్దులకు వహ్నియెట్లో, జ్వరార్తుల కౌషధమేలాగో, మృతుఁడగు మానవునకు నమృతవృష్టి యెట్లో అట్లే వ్రజమునకంతటికి నీదర్శనము జీవనప్రాయము. కావున సర్వదా యిందే యుండుము. విశేషించి పలుకనేల? ఈజన్మమునఁగాని పూర్వజన్మమునఁగాని మేమేమేని సుకృత మొనరించియున్న దానికి ఫలముగా మా

తాం స్యామ, జ్యోక్ - చిరకాలం, సూర్యం – ఉక్తలక్షణం, దృశే - పశ్యేమ శరదశ్శత మితి పూర్వేణాన్వయః॥ మహతః, అర్ణవాత్ - మహాసముద్రాత్, సరిరస్య - సలిలస్య, మధ్యాత్, యః, బిభ్రాజమానః - విశేషేణ ప్రకాశమానస్సన్, ఉదగాత్ = ఊర్ధ్వమగచ్ఛత్, సః, ప్రసిద్ధః, వృషభః - శ్రేష్ఠం, లోహితాక్షః - పంకజాక్షః, విపశ్చిత్ - శుద్ధదృష్టిః, సూర్యః, మనసా, మాం - పునాతు = శోధయతు, స్వాంతర్యామిభూతె పరమేశ్వరపరిగ్రహయోగ్యం కరోత్విత్యర్థః॥

సాయముపస్థాన మంత్రమాహ।

మం॥ ఇమం మే వరుణ శ్రుధీహవమద్యా చ మృడయా త్వామవస్యురాచకే। తత్త్వాయామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశగం సమాన ఆయుః ప్రమోషీః॥ యచ్చిద్ధితే విశో యథా ప్రదేవ వరుణ వ్రతం॥ మినీమసి ద్యవిద్యవి। యత్కించేదం వరుణ దైవ్యే జనేభి ద్రోహం మనుష్యాశ్చరామసి। అచిత్తీ యత్తవ ధర్మాయుయోపిమ మానస్తస్మాదేనసో దే

---

వాచ = దుర్వాదములను ఖండించుచుండుము గాక॥ అజీతాః = వేదవిరుద్ధముగా వాదించు కుతార్కికులతో నోడిపోని వారము, స్యామ = అగుదుము గాక॥ జ్యోక్ = చిరకాలము, సూర్యం = సూర్యుని, దృశే = చూచుచుందుము గాక॥ మహతః = గొప్పదియగు, అర్ణవాత్ = సముద్రములోని సరిరస్య = జలముయొక్క, మధ్యాత్ = నడుమనుండి, యః = ఎవ్వఁడు, బిభ్రాజమానః = మిక్కిలి ప్రకాశించుచు, ఉదగాత్ = ఉదయించెనో, సః = ఆ, వృషభః = శ్రేష్ఠుఁడును॥ లోహితాక్షః - కమలంబులంబోలు నేత్రములుగల వాఁడును॥ విపశ్చిత్ – శుద్ధదృష్టియునగు, సూర్యః, సూర్యుఁడు, మనసా - మనస్సుచేత, మాం - నన్ను, పునాతు - పవిత్రునిఁ జేయుగాక॥ అనగా అంతర్యామియగు పరమేశ్వరుఁడు పరిగ్రహింపదగినవానిఁగాఁ జేయుఁగాక అని భావము॥

సాయంకాలమున నుపస్థానము చేయుమంత్రముల కథ॥

పూర్వము శునశ్శేపుఁడను ముని పశువుగా యూపస్తంభమునకు కట్టివేయఁబడియుండి దానినుండి విమోచనము పొందఁగోరి వరుణుని నీమంత్రముతో స్తోత్రము చేసెను॥

నొక్కరథముపైఁ గూరుచుండఁజేసి శ్రీదామాదిసఖులను వేఱొక్కరథముపై నెక్కించి తాను రథమెక్కిన శ్రీకృష్ణునిరూపమును మదినిలిపి ధ్యానించుచుఁ జనిరి.

ఉద్ధవుఁడు రథముఁ దోలెను. హరి యాయామనోహరభాగములంజూచుచు నానందించుచు మున్ను తా గోపబాలకులంగూడి విహరించినతావు లివిగదా యని స్మరించుచు నుద్ధవునకుం దెల్పుచు గోవులమేపినతావు లివియని బ్రహ్మ యావుల నంతర్ధానముచేసినతా విదియని మరల నా ధేనువు లెప్పటియట్లు కనఁబడిన దీచోటనేయని కనఁబఱచుచు రథగమనమును మెచ్చుకొనుచుఁ దన్నుదర్శించువారి నాదరించుచుఁ బర్వతములను గాననములను దాఁటి మధురానగరమును జేరెను. ఈచరిత్రము పరమపావనము. సదా స్మరింపఁదగినది.

బలరాముఁడు కోలదైత్యుని వధించి మునులకు వరమిచ్చుట.

* మధురానగరమును శ్రీకృష్ణుఁడు ప్రవేశింపఁగా నందున్నవా రానందపరవశులైరి. శ్రీహరి మరలరాఁడేమో వ్రజవాసు లడ్డుపడి రాకుండఁజేయుదురేమో యన్నసంశయములు దొలఁగెను. కొలఁదిదినములు సుఖముగాఁ గాలముగడచెను. దినమొకగడియగాఁ గాలము గడచుచుండెనే కాని శ్రీకృష్ణసందర్శనతృప్తి యందెవ్వరి కేదినమునందును గొఱంతగాంచకుండెను. మధురానగరమునకు నించుక దూరముననున్న దేశమునఁ బ్రజలనెల్లఁ గోలనామకదైత్యుఁడు బాధించుచుండెను. వాని బాధల నోర్వఁజాలక ప్రజలెల్ల శ్రీకృష్ణబలరాములకుఁ దెలుపు

---

* ఈవిషయము గర్గసంహిత మధురాఖండము ఇరువదినాల్గవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

మిత్యత్ర ఆహ॥ మానఇతి,నఇతియజమానాద్యపేక్షయా బహువచనం, నః, అస్మాకం, ఆయుః, జీవితం, మాప్రమోషీః, మాప్రణాశయ॥ అస్మాకం వేదోక్తం, పరిపూర్ణ మాయు ర్దేహీత్యర్థః॥ యత్, చిత్ ఇతి చ నిపాతావనర్థకౌ పాదపూరణార్థౌ, హేదేవ, వరుణ, తే, తవ, వ్రతం, ఉపాసనారూపం వ్రతం యత్, తత్, విశోయథా, వివేకశూన్యాఇవ, ద్యవిద్యవి, దివసే దివసే, ప్రతిదివస మిత్యర్థః, వయ మితి శేషః॥ ప్రమినీమసిహి, హింసితవంతః, వ్రతలోప నిమిత్తక మదీయాపరాధం క్షమస్వేతి వాక్యశేషః, యత్కించేతి, హేవరుణ, యత్కించిత్, ఇదం, ఈదృశం, దైవ్యే, దేవసమూహే, జనే, భావేపీత్యర్థః,అభిద్రోహం, అపరాధం, అచిత్త్యా, అజ్ఞానేన, మనుష్యాః, అజ్ఞానినో వయం, చరామసి, కుర్మః॥ కించ, తవ, యత్, యదపి, కర్మ, త్వదీయం-ధర్మం, యుయోపిమ, నాశయామః, దేవ, తస్మాత్, ఏనసః, ద్రోహాత్, నః, అస్మాన్, మారీరిషః, మాహింసీః, ధర్మలోప నిదాన మేనః పరిహృత్య, అస్మాన్పాలయేత్యర్థః॥ కించ, కితవాసోన, ధూర్తా ఇవ, స్వ

మానము, మా యిష్టపయుక్షు, అహేడమానః-అనాదరము చేయక, అబోధి- గ్రహింపుము అవిన్నప మేమనిన॥ నః- మాయొక్క, ఆయుః- జీవితమును, మాప్రమోషీః- అపహరింపకుము॥ మాకు వేదోక్తమగు నాయువును పూర్ణముగా నొసఁగుమని యర్థము॥ హేదేవ- ఓవరుణుఁడా, తే- నీయొక్క,వ్రతం- ఉపాసనారూపమగు వ్రతము,యత్-ఏదిగలదో దానిని, విశోయథా-వివేకము లేనివారివలె, ద్యవిద్యవి- ప్రతిదినమునను, మేము, ప్రమినీమసిహి- నశింపఁ జేసితిమి। వ్రతలోప నిమిత్తమగు మానేరమును క్షమింపు మనుట॥

హేవరుణ ఓవరుణుఁడా, యత్కించ= ఏనోకొంచెము, ఇదం= ఇట్టి, దైవ్యే= దేవతా బృందము నెడను, జనే= లోకుల యెడను అభిద్రోహం- అపరాధమును, అచిత్త్యా- అజ్ఞానముతో, మనుష్యాః— జ్ఞానములేని మేము, చరామసి- చేయు చుందుము॥ తవ, నీయొక్క, యత్, ఏధర్మమును, యుయోపిమ, నశింపఁ జేసితిమో॥ దేవ, ఓవరుణుఁడా, తస్మాత్, ఆ, ఏనసః, ద్రోహము వలన, నః, మమ్ములను, మారీరిషః, హింసింపకుము॥ ధర్మలోపము వలన వచ్చు పాపమును తొలగించి మమ్ముల రక్షింపుమని యర్థము॥ కించ, మఱియును, కితవాసోన, ధూర్తులవలె తమలాభమును మాత్రము చూచు

కరిగి యందెట్లో యున్నవాఁడు. రాజ్యార్థము మీపాదపద్మ ములనాశ్రయింప రాఁదలంచి యున్నవాఁడు. మే మాతని ప్రజలము. * మారాజునకు రాజ్య మిప్పింపుము. మాబాధలఁ దీర్పుము. మారాజు మమ్మెల్లఁ బుత్త్రులనుగాఁ బాలించువాఁడు. ధర్మాత్ముఁడు. ఆరాజుపాలనమున మారాజ్యము రాజన్వంతమనఁ బరఁగెడిది. కావున మేమెల్ల సుఖులమై యుంటిమి. అట్టిమమ్మును మారాజును గోలదైత్యుఁడు బాధించుచున్నవాఁడు. ఆకడగండ్లకుఁ దాళఁజాలకయే వచ్చితిమి. త్రిలోకకంటకుఁడగు కంసుని బొలియించిన సోదరులు కదా. తత్సఖుని గోలదానవుని బొలియించిన భూపీడన మించుకతగ్గును.కోలదైత్యుఁడు జీవించియుండుదనుకఁ గంసుఁడు చావనట్లే తలంపుము. భక్తరక్షణదీక్షుఁడవు గదా. భగవంతుఁడవయ్యు మానుషాకృతిం దాల్చితివి. అని గోడుగోడున నేడ్చుచుఁ బలికిరి.

ఆప్రజల దీనవాక్కులు నాలకించి భక్తవత్సలుఁడగు బలరాముఁడు వేఁటతమకముడిగి గంగాయమునా మహానదులనడుమనుండు కౌశాంబీనగరమున కరిగెను. కౌశారవిరాజు పాలించుటఁ గౌశారవీ నగరియనియుఁ గౌశాంబియనియు నాపురము ప్రఖ్యాతిం గాంచెను. బలరాముఁడు తనతోఁ బోరనేతెంచుట నాలకించి యాకోలదైత్యుఁడు భీకరాకృతుఁడై యాఁడుకఱచి పది యక్షౌహిణుల సైనికులంగూడి చండవిక్రమమున యుద్ధము చేయవచ్చెను. ఆబల మొకసముద్రమువలెఁ గానవచ్చెను. ఈ బలసముద్రమునందు వడివడిఁ బరుగువాఱు నశ్వములే తరంగ

---

* తత్సహాయం కురు విభో వయం యస్య ప్రజాస్సుఖాః, పుత్రవత్పాలితా స్తేన మహాసౌఖ్యసమన్వితాః=అని మూలము.

శో నమస్కుర్యాద్దిగీశాంశ్చ పృథక్పృథగితి, ఏవం కశ్యపేనాపి॥ దిగ్దేవతానమస్కార మంత్రో౽యం సంధ్యయో ర్భవేదితి॥ తత్ర మన్త్రా నాహ॥

మూ॥ ఓం నమః ప్రాచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమోనమో దక్షిణాయై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమోనమః ప్రతీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమోనమ ఉదీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమోనమ ఊర్ధ్వాయై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమోనమో౽ధరాయై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసన్త్యేతాభ్యశ్చ నమోనమో గంగాయమునయో ర్మధ్యే యేవసన్తి తేమేప్రసన్నాత్మాన శ్చిరంజీవితం

---

ప్రాతస్సంధ్య యందును, సాయం సంధ్యయందును ప్రాచి మొదలగు దిక్కులకును, ఇంద్రాదులకును వందనము చేయవలయును॥

అందు వినియోగించు మంత్రముల కర్థము॥

ప్రాచ్యై తూర్పు అను, దిశే దిశకొఱకు, నమః నమస్కారము, ఏతస్యాం ఈదిశయందు, యాః ఏ, దేవతాశ్చ దేవతలు నుందురో, ఏతాభ్యశ్చ వారల కొఱకును, నమః నమస్కారము॥ దక్షిణాయై దక్షిణపు, దిశే, దిశకొఱకు, నమః నమస్కారము॥ ఏతస్యాం ఈదిశయందు, యాః ఏ, దేవతాః దేవతలు, ప్రతివసంతి ఉందురో, ఏతాభ్యశ్చ వారల కొఱకును, నమః నమస్కారము॥ ప్రతీచ్యై పడమరపు, దిశే దిశకొఱకు, నమః నమస్కారము॥ ఏతస్యాం ఈదిక్కునందు, యాః ఏ, దేవతాశ్చ దేవతలు, ప్రతివసన్తి, ఉందురో, ఏతాభ్యశ్చ, వారల కొఱకును, నమః నమస్కారము॥ ఉదీచ్యై ఉత్తరపు, దిశే దిక్కుకొఱకు, నమః నమస్కారము॥ ఏతస్యాం ఈదిక్కునందు, యాః ఏ, దేవతాః, దేవతలు, ప్రతివసన్తి, ఉన్నారో, ఏతాభ్యశ్చ, వారి కొఱకును, నమః, నమస్కారము॥ ఊర్ధ్వాయై, మీదిదగు, దిశే, దిక్కుకొఱకు, నమః, నమస్కారము॥ ఏతస్యాం, ఈదిక్కునందు, యాః, ఏ, దేవతాః- దేవతలు- ప్రతివసన్తి- ఉన్నారో, ఏతాభ్యశ్చ, వీరికొఱకును- నమః నమస్కారము॥ అధరాయై క్రిందిదగు, దిశే, దిక్కు కొఱకు, నమః, నమస్కారము॥ ఏతస్యాం, ఈదిక్కునందు, యాః, ఏ, దేవతాశ్చ, దేవతలు, ప్రతివసన్తి ఉన్నారో, ఏతాభ్యశ్చ, వీరికొఱకును, నమః, నమస్కారము॥ గంగాయమునయోర్మధ్యే, గంగానది యొక్కయు, యమునానది యొక్కయు

స్రవించుచుండెను.నాల్గుదంతములు వానికుండుట నైరావతమా యనుభ్రాంతి కల్గుచుండును. ఘంటాద్వయటంకారనాదములఁ రులకుఁ బెనుభీతిని గల్గించుచుండును. దిగ్గజమునకన్న నది యున్నతమైనది. శబ్దించు కాలమేఘధ్వనివలె దానిఘీంకారము వినఁబడును. దానిచెవులకు రెండంకుశములు తగిలింపఁబడి యుండెను. అట్టి భయంకరమహాగజముపై నెక్కి కోలదైత్యుఁడు బలరామునిమార్కొని యేనుఁగును బైకిఁదోలెను.

కోలాసురుఁడు దానిని దనపై కురవడించుటయు నది మహోత్తరాకృతిందాల్చి యట్టె తన్నుఁ గాలమట్ట నరుదెంచుటయుఁ జూచి బలరాముఁడు కోపోద్రిక్తమానసుఁడై శతమఖుఁడు వజ్రాయుధముచేఁ బర్వతమును భేదించునట్లు తీవ్రతరముసలాయుధమున దానిం గొట్టెను. ఆవ్రేటునకే యాదంతావళము భగ్నమై దండప్రతాడిత మృద్ఘటమువలె శకలములై ధరఁబడియెను. దాని యవయవము లివ్విివ్వియని యెఱుంగ శక్యముగాకుండెను. రాక్షసుఁడు ధరఁబడి లేచెను. వానిముఖము వరాహముఖము వంటిది. కాననే కోలదానవుఁడనుపేరు వానికిఁ బ్రసిద్ధమయ్యెను. వాఁడు భీకరాకారముఁ దాల్చి రక్తాక్షుఁడయ్యెను. వాఁడు నిశితాగ్రాంకుశమును విసరి బలరామునిపై వైచెను. అది యెందఱనో శత్రువులశిరముల ఖండించినది. ఆయలవాటుననే బలరామునిం జంపనెంచి వాఁడు వైచెను గాని బలుని ముసలాయుధప్రహారమున నూఱుతునుకలై ధరపై రాలెను. దానిపాటుఁగాంచి కోలదైత్యుఁ డాగ్రహించి వేయిమంది మోయఁగల భారముగలిగి భయంకరాకృతిఁ గల్గు గద నవలీలఁ గరమునఁ గీలించి బలరాముని హృదయమును

అకార్షీత్, సఏవాకరోత్, నాహం కరోమీత్యర్థః॥ శ్రు॥ కామః కర్తా నాహం కర్తా ఇత్యాది శ్రుతేః. మన్యుః క్రోధాభిమానీ దేవః, తస్మై కామాయ, మన్యవేచ నమ ఇత్యర్థః॥ పంచ భూతేభ్యో నమో విదధాతి॥ పృథివీతి, యాపృథివీ, యా ఆపః, యత్తేజః, యోవాయుః, య ఆకాశః, ఆకాశాదితి పంచమీపాఠ శ్చాంధసః తేభ్యః పంచభూతేభ్యో నమోస్త్విత్యర్థః॥ అథ నమశ్శేషితయా, సర్వకర్మాధిపతిత్వేనచ, పరమేశ్వరస్య నమః కర్మచ తస్మై సమర్పయతి, ఓం నమో భగవత ఇతి॥ యద్యప్యత్ర కేచిద్వాసుదేవాయేతి సపూర్ణయన్తి, తథాపి తత్తద్భక్తానాముచితమేవ॥ వస్తుతస్తు, తత్తదభిధాన ఏవ తయో స్తరతమభావమావేదయతి॥ అథ, వసుదేవాపత్యవాచినో వాసుదేవపదస్య వసన్త్యస్మిన్సర్వంతీతి యౌగికార్థం కేచిత్కల్పయన్తి, సోపి తద్భక్తజనమాత్రవిశ్వాస్య ఏవేత్యలం బహునా॥

అథ సంధ్యారూపాం దేవతాం ప్రార్థయతి॥ యామితి, సర్వాణి భూతాని యాం సంధ్యాం నమస్యన్తి సాసంధ్యా మాఽభిరక్షత్విత్యర్థః॥ ఏవం సర్వభూతవంద్యత్వేనైవ లింగేన సంధ్యాదేవతాయాః పరమేశ్వరరూపత్వం సిధ్యతి॥ అథ సంధౌ భవా వేలావాభవతు సంధ్యా సా

---

కొఱకు నమః నమస్కారము। భగవతే షడ్గుణైశ్వర్య సంపన్నుండగు మహాదేవాయ పరమేశ్వరుని కొఱకు నమః నమస్కారము॥ ఇచ్చట వాసుదేవాయ అనికొందఱు చదువుదురుగాని అది యుక్తముగాదు॥ నమశ్శేషిత్వము పరమేశ్వరునదియని సిద్ధాంతము సేయఁబడియెగాన మహాదేవాయ అనుటయే యుక్తము॥ మహాదేవ వాసుదేవ అను నామములె యిరువుర యొక్క తారతమ్యమును దెలుపుచున్నవి॥ వసుదేవుని పుత్రుఁడను నర్థముగల వాసుదేవ పదమునకు జగములీ దేవునందున్నవని యౌగికార్థమును గల్పింతురు గాని యాయర్థము వాసుదేవ భక్తులకు మాత్రము విశ్వాసార్హము కానగును॥

చరాణి జంగమములు స్థావరాణి స్థావరములు నను సర్వభూతాని సకలభూతములు సదా ఎల్లపుడు, సాయం సాయంకాలమునందు, ప్రాతః ప్రాతః కాలమునందును, యాం ఏసంధ్యా దేవతను, నమస్యన్తి నమస్కరించుచున్నారో, సా ఆ సంధ్యా పరమేశ్వరుఁడు, మాం నన్ను, అభిరక్షతు రక్షించుగాక॥ సంధ్యా పదమున

యము. దృఢసారము. దానితేజస్సు శతయోజనములు వ్యాపిం చును. ప్రళయాగ్నియో యన నది ప్రజ్వరిల్లు. అట్టి యాము సలాయుధము దశదిశలఁ బ్రజ్వరిల్లఁ జేసెను. ఆకాశము నావ రించినమేఘములు దాని దర్శనమునే పటాపంచ లయ్యెను. రవి కిరణప్రసారమున మంచుతుంపురులఁ బోలె మేఘములు శకల ములుగా నశించుట చూచువారి కచ్చెరువు నింపెను. అంత బలరాముఁ డాయసురసేనల హలాయుధమునలాగి యొక్కచోఁ జేర్చెను. ఆమంటలు వానినెల్లఁ గాల్చెను. మాయయంత నశించెను. రెండుచేతుల నాదానవాధముని బట్టుకొని బలరా ముఁడు గిరగిరఁద్రిప్పి తూలలవమువలె వానిందలంచి భూపృష్ఠ మున మోఁదెను. ఆదానవుఁడు పడునప్పటిభారమున భూమం డలమెల్ల నల్లలనాడెను. ఆవ్రేటున నాయసురనేత్రము లూడి పడెను. పండ్లు చూర్ణము లయ్యెను. ప్రాణము లేక నీతనువున నుండనేలయని తమదారిన బోయెను. వానిమృతి వృత్రదాన వునిమృతివలెఁ గనఁబడియెను. అత్తఱి భూమ్యాకాశముల యందు జయజయనినాదము లుప్పతిల్లెను. దేవదుందుభులు మ్రోఁగెను. పుష్పవృష్టి బలరామునిపైఁ గురిసెను.

ఇట్లు కోలదానవుఁ బొలియించి తత్పరిజనులఁ దును మాడి యారాజ్యంబు నిష్కంటకంబు గావించి కౌశారవిభూ పాలుని బిలిపించి బలరాముఁ డాకౌశాంబీనగరమున నాతని నిలిపి రాజ్యం బెప్పటియట్ల యేలుచుండుమని హితముపదే శించి తనశరణు చొరవచ్చినప్రజల యథాపూర్వముగా నందు నునిచి తనకృత్యమెల్లఁ బూర్తికాఁగా నందుండి భాగీరథీస్నా నముసలుప నరిగెను. అత్తఱి నాబలరాముని గర్గాచార్యులు

రాణికత్వస్య సంధ్యాభాష్యాదిషు ప్రఖ్యాపితతయా, ఇదానీం తన్నైః పౌరాణికత్వ భంగభియా తాదృశీనామా సేవలంబ్యమానేపి రుహానా శ్రుతిత్వ మేషాం ప్రకటమేతి యుక్తం॥

దేవీ ప్రస్థాపనాన్తః స్యాత్సంధ్యాకర్మ మునీరితమితి వచనేన గాయత్రీ ప్రస్థాపన మంత్రమాహ॥

మూ॥ ఉత్తమే శిఖరే జాతే భూమ్యాం పర్వత మూర్ధని।
బ్రాహ్మణేభ్యోఽభ్యనుజ్ఞాతా గచ్ఛ దేవి యథా సుఖం॥

ఉత్తమ ఇతి॥ భూమ్యామవస్థితో యోమేరు నామా పర్వతః, తస్య శిరోభూతే, ఉత్తమే- శ్రేష్ఠే, శిఖరే= శృంగే, జాతే, విద్యమానే, ఉత్కృష్ట నివాస ఇత్యర్థః॥ బ్రాహ్మణేభ్య ఉపాసకేభ్యోద్విజేభ్యోఽభ్యనుజ్ఞాతా, తైరనుమోదితేత్యర్థః॥ హేదేవి, భగవతి, గచ్ఛ, అస్మాననుగృహీత్వా, యథా సుఖం యథా కామం, గచ్ఛేత్యర్థః॥

అథానుష్ఠాతా సావిత్ర్యనుగ్రహప్రకాశన పూర్వకం కృతంసంధ్యాకర్మ పరమేశ్వరా యార్పయతి॥

---

అది కనిపెట్టి యిప్పుడు గొందఱు ఈశ్లోకములను కొన్ని యుపనిషత్తులలో చేర్చినారు। అయినను వారిపూర్వులె ఇయ్యవి పురాణశ్లోకములని లోగడ చెప్పిరిగాన నిప్పటి వారెట్టి సాహసము చేసినను నవి నిజమైన శ్రుతులని లోకులు నమ్మజాలరుగాన వారి యుద్యమము విఫలమే యగును॥

సంధ్యా కర్మ దేవీప్రస్థాపనాన్తమని మునులు చెప్పిరిగాన ప్రస్థాపనమంత్రమును చెప్పుచున్నాడు॥ ఈమంత్రమునకు నర్థము॥

భూమ్యాం= భూమియందున్న= పర్వతమూర్ధని= మేరుపర్వతము యొక్క శిరస్సు అనదగిన, ఉత్తమే= శ్రేష్ఠమగు॥ శిఖరే= శిరమునందు, జాతే= ఉండిన, దేవి= దేవతా, బ్రాహ్మణేభ్యః= బ్రాహ్మణులవలన, అభ్యనుజ్ఞాతా= అనుజ్ఞ పొందినదానవై, గచ్ఛ= వెళ్లుము॥

అనుష్ఠానము చేయువాఁడు సావిత్రి యొక్క యనుగ్రహమును దెలుపుచు- సంధ్యాకర్మమును పరమేశ్వరున కర్పించుచున్నాఁడు॥

వరదా= కోరికల నిచ్చునదియగు॥ ప్రబోధయన్తీ= ధీప్రేరకములను పవనా=ప

కోలదానవుఁ డనుపేరు వానికింగల్గెను. మహాఖలుఁడుకూడ నయ్యెను. కోలముఖుఁడగుట కా మునిశాపమే కారణము. బలదేవప్రహారమున నాయాసురశరీరమును బాసి ముక్తిపదమున కేగెను.

బలదేవుఁ డాతీర్థమునుండి యుద్ధవాది సచివవర్యులం గూడి జహ్నుతీర్థమును దర్శింపఁబోయెను. గంగానది యాచోటనే జహ్నురాజర్షి యజ్ఞవాటమును ముంచెను. ఆ క్షేత్రమునఁ బ్రవహించుగంగకు జహ్నుతీర్థమనియు జాహ్నవి యనియు నామము ప్రసిద్ధమయ్యెను. ఆపుణ్యతమతీర్థమున స్నానముచేసి యందే కొలఁదిరాత్రులఁ గడపెను. దానిసమీపముననే పాండవుల కతిప్రియమగు నాహారస్థానము కలదు. అచ్చటికరిగి యొకరాత్రి నివసించెను. అందుండి యోజనదూరమున దేవగండూష మనుపేరుగల క్షేత్రమునకుంబోయి యందుఁ దపస్సొనరించుచున్న యొక్కమునిం గాంచెను. ఆతఁడు బలదేవునిగుఱించియే తపస్సొనరించుచుండెను. ఊర్ధ్వబాహువులొప్ప ముఖము పైకెత్తి యొంటికాలిపై నిలువంబడి ధ్యానస్తిమితలోచనుఁడై తనమూర్తినే ధ్యానించుచున్న తనభక్తుని జూడఁబోయి కుతూహలమున వానిం గాంచెను. వానిం జూచి నంతనే యప్పటిరూపమును మాని తన యనంతరూపమును ధరించెను. వానిమదిఁ దోఁచెను. అరూపమును జూడఁగనే యామునికి బాహ్యస్మృతి గల్గెను. కన్నులు విప్పి యాయనంతుని మూర్తివిశేషమును దర్శించి పరమసుందరమగు నారూపమున కచ్చెరువడి పాదములపైఁబడి వందన మాచరించెను. పరమభక్తి వినుతించెను. బలరాముఁ డాతనిశిరమునఁ దనహా-

గ్రహార్థం లీలాకల్పితానేకవిధ విగ్రహాయేత్యర్థః॥ సహస్ర పాదాక్షిశి రోరు బాహవే, అనన్తపాదాయ, అనంతలోచనాయ, అనన్తశిరసే ఇత్యాదినా సహస్ర శీర్షాపురుష ఇత్యాది శ్రుతి బోధితా యేత్యర్థః, సహస్రనామ్నే, అనన్త నిజాభిధానాయ, శాశ్వతే శాశ్వతాయ, సహస్రకోటి యుగధారిణే, మృత్యుంజయాయేత్యర్థః॥ ఏవం విధ మహామహిమ శాలినే, పురుషాయ రుద్రాయ, పురుషోవై రుద్ర ఇతి శ్రుతేః, నమో స్త్వితి సర్వమపి తన్నమస్కార రూపం తదారాధన మస్త్విత్యర్థః॥ స్తుతేత్యాది మంత్రా అన్యైర్న వ్యాఖ్యాతాః, అతః కైశ్చిన్న పఠ్యన్త ఇతి జ్ఞాయతే॥ అథ ద్యావాభూమి నమస్కారోతి॥

మూ॥ ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు పితర్మాతర్యది హోపబ్రువేవాంభూతం దేవానామవమే అవోభిర్విద్యామేషం వృజినంజీర దానం॥

ఇదమితి॥ హేపితః, హేద్యౌః, ద్యులోక, హేమాతః, పృథివి, శ్రు॥ ఇయం వై మాతా, అసౌ పితా ఇతి శ్రుతేః॥ వాం యువాం ప్రతి, ఇహ కర్మణి, యత్ వచనం, ఉపబ్రువే బ్రవీమి॥ హేద్యావాపృథివీ ద్యావాపృథివ్యౌ, ద్వివచనాభావ శ్ఛాందసః॥ ఇదంమదీయం వచనం, సత్యమస్తు॥ కింతద్వచన మిత్యాశంక్యాహ॥ భూతమితి, అవోభిః అస్మద్రక్షణై స్సహ, దేవానాం, సర్వేషా మమరాణాం, ఇదం భూ

---

హేపితః, తండ్రివగు, హేద్యౌః, ద్యులోకమా, మాతః, తల్లివగు- పృథివి, భూమీ, వాం మిమ్ములను గూర్చి- ఇహ, ఈకర్మమునందు॥ యత్ ఏవచనమును, ఉపబ్రువే,పలుకుచున్నానో- ఇదం, ఈవచనము, సత్యం, నిజమైనది, అస్తు, అగుగాక॥ ఆవచన మెద్దియనిన, అవోభిః మారక్షణములతోఁగూడ, దేవానాం సకల దేవతలను, సకల భూతములగుఅవమే, రక్షించునవి, భవతం అగుడు॥ వయం మేము, ఏషం ఈయన్న మును, వృజినం' తాపంహేతమగు. జీవదానం జీవప్రదానమును, విద్యాంచ, విద్యలను, ఉపలభేమ పొందుదుముగాకా॥

ఇక్కడ కొందఱు, ఆకాశాత్ అని మొదలుగా కొన్ని శ్లోకములను జపవుచున్నారు॥ అందు, శంకరం ప్రతిగచ్ఛతి, అనునాదమే యుక్తమైనది॥ శ్రుతిసూక్తముల మొదలగు వానియందు నమశ్శేషిత్వము పరమేశ్వరునిదేయని సిద్ధాంతము చేయబడి

తత్వసారము. ఉద్ధవునకు స్వాత్మసారమును దెలిపి యీకార్య మునకు సర్హుఁడనియె. ఉద్ధవునకు సాక్షాత్కార మొసంగెను. భేద మీయిరువురకు లేదని నమ్ముము. వ్రజవాసు లీతని శ్రీ కృష్ణుఁడనియే భావించి విశేషించి పూజించిరి. వసంతగ్రీష్మర్తు వులలో గోకులమున సంచరించి శ్రీహరియుపదేశముల వారికిం దెల్పి రాధకుఁగల మనస్సంతాపమును హరించి కృతార్థుఁడై యున్నవాఁడు. వ్రజవాసులంగూడి భూమండలంబెల్లఁ జరిం చెను. నందాదులకు గోపికలకు గోవులకు సంతాపహారుఁడనఁ బరఁగెను. మంత్రాధికార కుశలుఁడు. సగ్వపరికరపరియుతుఁడు. ఒకానొకకాలమునం దీయుద్ధవుఁడు భగవంతుని మదినిల్పి ధ్యానమొనరించుచుండఁగా ధర్మరక్షణార్థమై శ్రీకృష్ణమూర్తి తనతేజము నీతనిమదిఁ బ్రవేశపెట్టెను. ఆతేజస్సు పరమాద్భు తము. ముద్రాధికార మీతనికి సర్వదా కలదు. ఆ యంతర్ధా నమునందే యీతనికి భాగవతసంహిత యుపదేశించునధికార మాహరిచే నీఁబడినది. ముం దుద్ధవుఁడు బదరీవనసమీప ముననుండు సానుజుండగు ధర్మజునకు నాతత్వమును బోధింపఁ గలఁడు. ఆసంహితయే యర్జునునకుం గలుగఁబోవుసంతాపమును హరింపఁగల్గును. మధురానగరమున వజ్రనాభుఁడను యాద వుఁడు పుట్టఁగలఁడు. ఆవజ్రనాభుఁడు శ్రీకృష్ణపౌత్రునకుఁ బుత్త్రుఁడై జన్మించును. ఆసంతతి యాదవరాజ్ఞీకుటుంబమునకు సంబంధించినదియే యగునని నిశ్చయింపుము.

మఱియు నీయుద్ధవుని సంతాపహారుఁ డనునమ్మకమున శ్రీహరి భూమినుంచును. కౌరవకులమునఁ బరీక్షిత్తను కుమా రుఁడొకఁడు కల్గును. ఆతనికిఁ గుమారుఁ డతితేజస్వి జనమే

మహాదేవ విరూపాక్ష గంగాధర మృడావ్యయ।
ఇతీరయన్తి యేనిత్యం తేకృతార్థా నసంశయః॥

మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే।
అమృతేశాయ శర్వాయ మహాదేవాయ తేనమః॥

హరశంభో మహాదేవ విశ్వేశామరవల్లభ।
శివ శంకర సర్వాత్మ న్నీలకంఠ నమోస్తుతే॥

ఆకాశాదితి॥ ఇమే శ్లోకా స్స్పష్టార్థాః॥ ఇదానీం సంధ్యాకర్మసాద్గుణ్యార్థం సకలభువనవర్తి గోబ్రాహ్మణేభ్య శ్శుభం ప్రార్థయన్ ప్రవరాన్వితస్య నామకీర్తనపురస్సరం వృద్ధానభివాదయతే॥

---

యే- ఎవ్వారలు, మహాదేవ- మహాదేవ అనియు, విరూపాక్ష- విరూపాక్ష అనియు, గంగాధర గంగాధర అనియు, మృడ, మృడ అనియు, అవ్యయ- అవ్యయుఁడా, అనియు, నిత్యం- ఎల్లప్పుడు, ఈరయంతి- పలుకు చుందురో, తే- వారు, కృతార్థాః- కృత కృత్యులగుదురు॥ నసంశయః- ఇందు సంశయము లేదు॥

మృత్యుంజయాయ- మృత్యువును జయించిన వాఁడును, రుద్రాయ- సంసార దుఃఖమునుపోఁగొట్టు వాఁడును, నీలకంఠాయ- నల్లని మెడగల వాఁడును, అమృతేశాయ- మోక్షాధిపతియు, శర్వాయ- సర్వసంహారకారియు, మహాదేవాయ- దేవతలలో గొప్పవాఁడవునగు, తే- నీకొఱకు, నమః, నమస్కారము॥

హర- సకలపాతకములను హరించువాఁడా, శంభో- సుఖము నొసఁగువాఁడా, మహాదేవ- సకల దేవతలలో నధికుఁడా, విశ్వేశ-సకల- జగములకు, నీశ్వరుఁడా, అమరవల్లభ- దేవతాధిపతీ- శివ, మంగళప్రదుఁడా, శంకర- సుఖకరుఁడా, సర్వాత్మన్, సర్వాంతర్యామీ, నీలకంఠ- హాలాహలమును కంఠమునందిడుకొని జగములఁ బ్రోచిన వాఁడా, తే- నీకొఱకు, నమః- నమస్కారము, అస్తు- అగుగాక॥

డఁగా నందలిమానులు సంకర్షణుఁ బూజించిరి. ఆపూజాకాల మున దేవత లరుదెంచిరి. మహర్షు లాపూజనుజూడఁ బిలువ కయే యేతెంగివచ్చిరి. కోలాసురుని జంపి ఖరాసురుని బొలి యించి హలాయుధమును ధరించి ముసలాస్త్రధారియై సౌందర్య రూపమున లోకులకు దర్శనమిచ్చి తాలాంకుఁ డనునామమును దాల్చినయనంతునకు నమస్కారములు. వారి స్తుతివచనముల నాకర్ణించి వారింగని యభీష్టవరమడుగుఁడనిపలుక వారు హర్షాం బుధినోలలాడుచు నిట్లు ప్రార్థించిరి. బలదేవా! మే మేయేసమయ ములయందు నాపదలఁగుంది భవత్పాదముల స్మరింతుమో అపు డాసకలబాధలు తొలఁగి మేము సుఖంబుండున ట్లనుగ్రహిం పుము. అని వారు ప్రార్థింపఁగా నారాముఁ డో ద్విజదేవత లారా! ఏయేసమయములయందు నన్ను స్మరింతురో శరణాగతు లగు మిమ్మెల్లఁ గలిబాధలంటకుండఁ గాపాడుదును. ఇది సత్య ము. నావాక్కు సత్యవిరహితముగాదని నమ్ముఁడు. ఈచోటనే మీకు వరమిచ్చితిని.నన్ను మీ రీతావుననే పూజించితిరి. కావున నిది సంకర్షణస్థాన మనంబడు. కలియుగమున నిది సకలపాపధ్వం సకంబగు. ఇందు స్నానముచేసి దేవతల నారాధించి ద్విజవ ర్యుల కన్నదానముచేసి విష్ణుపూజనముచేయుదురో వారిజన్మమే సఫలము. నిష్కామకులు ముక్తి నొందుదురు. కాముకులు స్వేష్టఫలముల నొందుదురు. అని యాజ్ఞాపించి వారలనెల్ల నిలిపి సపరివారుండై స్వపురమున కరిగెను. కోలదానవుఁ బొలియించి విష్ణుపదీజలంబుల స్నానముచేసి శ్రీబలరాముఁడు మధురానగర మునఁ కరిగిన యీకథను బఠించినఁ బాపము లడంగును.

త్రం మహితుః పతిమితి॥ అభివాదన ప్రకార మాహ భగవా నాపస్తంబః॥ దక్షిణం బాహుం శ్రోత్రసమం ప్రసార్య బ్రాహ్మణోభివాదయీతోరస్సమం రాజన్యో మధ్యసమం వైశ్య ఇతి॥

ఇతి సావిత్రీ సంధ్యాప్రకరణం.

---

అభివాదన మెట్లు చేయవలయుననిన,

కుడిచేతిని, చెవివరకు సాచి బ్రాహ్మణుడును, ఱొమ్మువరకు సాచి క్షత్రియుడును, నడుము వరకు సాచి వైశ్యుండును అభివాదనము చేయవలయునని ఆపస్తంబుడు చెప్పెను॥

సావిత్రీ సంధ్యా ప్రకరణము

ముగిసెను.



వుని వెదకుకొనుచుఁ గౌశాంబీనగరవాసులగు ప్రజ లత్యా ర్తులై వచ్చుచు నెదురుపడిరి. వారిరాక బలదేవుఁ డెఱుంగును. అందులకే కదా పోవుచుండెను. వారియార్తి నాలకించి తనపయనము చాలించినట్లు నటించి వారింగూడి కౌశాంబీనగరమున కరిగెను. ఆప్రజలు తమరాజును గూర్చి పలుకునపుడు,

"పుత్రవ త్పాలితా _స్తేన మహాసౌఖ్యసమన్వితాః."

అని పలికిరి. అట్టి యార్తికాలమునఁగూడఁ దమప్రభువును దండ్రివలె భావించిరని వారిమాటలంబట్టియే కానఁబడియెడిని. రాజన నట్టివాఁడే కదా. రాజ్యమే రాజునకుం గుటుంబము. ప్రజలే సంతానము. కావుననే కౌశాంబీనగరాధిపతి నంతగా నాప్రజలు కొనియాడి యాతనికి రాజ్య మిప్పింపుమా యని భగవంతుని బ్రార్థించిరి. ఆకాలపు మానవులస్వభావ మట్టిది. అందఱు ప్రభువులు కాఁగోరునాచార మాకాలమున లేదని దీనిచే స్పష్టము కాక మానదు. న్యాయప్రవర్తకుఁడగు ప్రభువునకు లోఁబడి ప్రవర్తించు సదాచారమే పూర్వకాలమునఁ గలదని శతశః సహస్రశః పలుకవచ్చును గదా.

కంసుఁడు మృతినొందినను బ్రజలకష్టము లంతము నొందవయ్యెను. తదనుచరులు తద్బంధువులు తన్మిత్రులు క్షితినందందుఁ గలరు. వారిబాధలన్నిటిని వదలించినఁగాని ప్రజల యార్తి తొలఁగదు. అందుఁ గోలాసురుఁ డొకఁడని యెఱుంగఁదగు. శాపవశమున వంగరాజగు దృఢాశ్వుఁ డొకమహర్షి కురూపమును జూచి పరిహాసించెను. దాన నమ్ముని యాగ్రహమూని శపించెను. క్షమగల్గియుండుట మునులకు నైజమైయుండ నేల శపించెనన్న ప్రశ్నము రావచ్చును. కాని యా



## శైవ ప్రచారిణీ పక్ష పత్రిక

ఇది, ప్రతి పక్షమునఁ బ్రకటింపఁ బడును. ఇందు వి
చే వ్రాయఁబడు చరిత్రాంశములు - నీతి బోధకములగు కథ
గ్యదాయకములగు వైద్యవిధానములు - మతధర్మములు - వ
రీతులు - స్వదేశ విదేశ వృత్తాంతములు - వేయేల! సర్వ
బ్రకటింపఁ బడును.

పక్షపత్రిక చందా సం॥ రు 2—0—0

గ్రంథమాల చందాదారులకు సం॥ రు 0—8—0

## శైవ ప్రచారిణీ

ఇందు - అముద్రితములు - అనుపమానములు - అన
ములును నూరుపుటలకుఁ దక్కువ గాని నాలుగు శైవగ్రంథరత్నము
డు మాసముల కొక్కటిచొప్పునఁ బ్రకటింపఁబడు చుండును - గ్ర
ల చందాదారులకు నిందుఁ బ్రకటింపఁ బడిన గ్రంథములన్ని
గ్గింపు వెలకీయఁ బడును.

గ్రంథమాల చందా సం॥ రు 4—0—0

పక్ష పత్రికతో సహా సం॥ రు 4—8—0

వలయువారు,

శైవప్రచారిణీ - వరంగల్,

అనిర్వాయ వలెను.

ముందు రాబోవు గ్రంథరత్నములు.

1 ఆహ్నిక కాండము తృతీయభాగము.

ర్మముల నాచరించి తత్ఫలములనుగోరక వానిని బ్రహ్మార్పణము చేసిన జ్ఞానధనులే మహర్షు లనఁబడుదురు. వారివాక్కు ఫలించుతఱినిగాని వెలువడదు. అది వెడలినయెడల దాన నేదో యొక లోకోపకార ముండును. ఆవాక్కు భగవత్సంకల్పాను సారమే బయలువెడలును గాని వృథా కాదు. ప్రకృతవిషయమున నీపద్ధతి యన్వయించునా యన్న వినుఁడు. బలరామునిచేఁ జావఁదగిన ప్రాణు లెందఱో గలరు. బలరాముఁ డచటికి వచ్చుటకు హేతు వుండవలెను. సూత్రధారుఁడు లేకయున్న నాటకము సాగదు. ఒక్కఁడు పెద్దతనము పూనకున్న సంసార యాత్ర సాగదు. అట్లే వీరినందఱి నొకతట్టు చేర్పఁగలవాఁ డుండవలెను. అట్టివాఁడే యీ కోలదానవుఁడు. భగవదాగమనకుఁ బ్రజలయత్యార్తి కారణము. అందఱను మలమలమాడ్చువాఁ డుండినఁగాని శిష్టజనులందఱు ఘోషింపరు. అత్యుత్కటాధర్మములు సాగుచుండినఁగాని భగవంతుఁ డవతరించి వాని నడంపఁడు. కావున నమ్మునిని దోలుతఁ బురికొల్పి యాతని శపింపఁజేసినదియుఁ గర్మమే. కోలదైత్యుని బాపకార్యములు చేయఁ బ్రోత్సహించినదియుఁ గర్మమే. ప్రజలు బాధపడున ట్లొనర్చునదియుఁ గర్మమే. కర్మమున కడ్డములేదని యెఱుంగుటయే సౌజన్యము. కావునఁ గర్మసిద్ధాంతము బలవత్తరము. దాని నాపఁజాలువాఁ డా సర్వేశ్వరుఁడు. కాని యితరుఁడు లేఁడు.

"శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్. ౨.

ఇంక నుద్ధవునింగూర్చి నాలుగుమాటలు వ్రాయవలసి వచ్చినది. మాండూకముని బలరామునిరూపమును గల్పించుకొని, బలరాముఁడు భూమియం దవతరింపకముందే నియతి జపము చేయుచుండెను. ఇది యసంగతప్రసంగము కాదాయని మీ రూహింతురుగదా యని నే నెఱుంగుదును. వినుఁడు. భక్తుఁడు నిర్గుణుఁడు రూపనామరహితుఁ డగుభగవంతుని భజింపఁగోరి యొకరూపమును గల్పించుకొనును. వాస్తవముగా రూపము కల్పితమే. నాము మట్టిదే కల్పించుకొనకున్న నేమి బాధయని యాక్షేపింపరాదు. మనోవీథి నొకరూపము పొడ కట్టినఁగాని ధ్యానింప వీలుండదు జగదాకారముగా ధ్యానింప రాదా యన్న నాస్థితి శుకునివంటివారికింగాని కలుగదు. అట్టి వాఁడు తపస్సుచేయ నక్కఱలేదు సదా తద్భావభావితుఁ డగుచుండును అదియే కర్తవ్యము. అట్టిభావము సర్వజనసులభము కాదు. విగ్రహములఁ బూజించువారలకంటె మనోవీథి భగవద్రూపమును గల్పించుకొని ధ్యానించువాఁ డుత్తమోత్తముఁ డనఁబడును. సర్వదా లోహమయవిగ్రహములఁ జెంత నుంచుకొని గంధపుష్పాదుల నర్చించుచుండుట వృద్ధిమార్గము కాదు. మహర్షులుకూడ విగ్రహములఁ బూజించినట్లు పురాణములు ఘోషించునుగదా యని యడుగుదురేమో. పూజించుటయు సత్యమేయని మన మంగీకరింపవలయును. ఏలయనఁగా లోకసంగ్రహార్థమని తలంపుఁడు.

"శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే."

అన్నగీతోక్తిఁ బరికింపుఁడు. జనకాదులు లోకసంగ్రహార్థమై

శ్రీ

## విషయము.



సమాప్తము.



ఆభాగవతమును సభాముఖమునఁదెల్పినఁ బెక్కుమంది తరింతు రనియు బలరాముఁ డూహించెను. కావున ముం దుద్ధవుఁడు శ్రీకృష్ణప్రసాదపాత్రుఁడై యాభగవంతుఁడు స్వాంశమును దనయందుఁ బ్రవేశింపఁజేయుటవలనఁ దేజశ్శాలియై సభాముఖమున నీకు నుపదేశించుననియు వరమిచ్చెనని మన మెఱుంగవలయును. తనకుఁ బ్రసిద్ధిరావలయుననియు నితరులకు రాఁగూడదనియు నీచాత్ముల కుండుభావము భగవంతున కుండునా! తన భక్తులు లోకోద్ధారకులు కావలయుననియే శ్రీహరియాశయము. ఇంకొక్కమాట. ఇది యనవసరమని భావింపక శ్రద్ధమైఁ బఠింపుఁడు. పఠించునపుడే నాపైఁ గోపమూనకుఁడు. విషయమును దెలిసికొని మదియందుఁ దానిం దర్కింపుఁడు. నేఁ జూపినప్రమాణముల నాలోచింపుఁడు. అవి కల్పితములను శంక గల్గిన నాగ్రంథమును జూడుఁడు. దానిభావము నెఱుంగుఁడు. ఇన్నియుఁ బరిశీలించినపిదప నాభావము సమంజసము గాఁ దోఁచకున్న నపుడు భావమిది సమంచితముకాదని నిశ్చయించుకొనుఁడు. అంతవఱ కాతురంపడి నాపైఁ బడకుఁడు.

బలరాముఁడు మాండూకమునికి రాఁబోవుకాలమున నీయుద్ధవుఁడు కృష్ణోపదేశమునఁ బవిత్రాంతఃకరణుఁడై నీకు భాగవతసంహిత నుపదేశించునని వరమిచ్చెను గదా. ఆప్రకారమే యుద్ధవుఁడు ద్వారకలో దుర్నిమిత్తములు తోఁచినపుడు శ్రీకృష్ణుఁడు గోపాలురతో నీమహోత్పాతములు గన్పట్టుటఁ జూడఁగా యాదవకులము నశించునని తోఁచెడిని. అని పలుకునపు డుద్ధవుఁడు చెంతనుండి యాలకించుచు నేకాంతమున

ఏవం గణేశ్యాది శుభతీర్థా మహాపాత్త దురితక్షయ ద్వారా శ్రీమచ్ఛ
శివప్రీత్యర్థం ప్రాతశ్శైవీం సంధ్యా ముపాసే॥ ఓం గుం గురుభ్యో నమః
ఇతి ప్రణమ్య, హ్రాం నేత్రాభ్యాం నమ ఇత్యం గుష్ఠానామికాభ్యాం
నేత్రయోః దివ్యముద్రాం ప్రవిన్యస్య, నమోంతమూలేన జలంపరీక్ష్య
తేనైవ సంతాడ్య, వౌషడంత కవచేనాభ్యుక్ష్య, వౌషడంత హృదయే
నాంకుశముద్రయా బిందు స్థానాద్గంగా దీనామేక తమం తీర్థ మాకృ
ష్య, నమోంత హృదయే నోద్భవ ముద్రయా తీర్థం జలే నిక్షిప్య, మూ
లే నాభిమంత్ర్య, హుం ఫడం తాస్త్రేణ సంరక్ష్య, నమోంత కవచేనా
వకుంఠ్య, వౌషడంత శక్తి మంత్రేణ ధేను ముద్రయా మృతీ కుర్యాత్॥
ఏవం జల శుద్ధిం కృత్వా, తేన జలేన పంచ బ్రహ్మ షడంగ మంత్రై
ర్మార్జనం కుర్యాత్॥ అథాఘ మర్షణం యథా, ఆచమ్య జలం దక్షిణ
హస్తే గృహీత్వా, ఓం హాం అస్త్రాయనమ ఇత్యష్ట వారం మూలేన
శ వారంచ జపిత్వా, వామహస్తానామి కాం గుష్ఠాభ్యాం ఛోటి కయా

---

జలశుద్ధి.

హ్రాం నేత్రాభ్యాం నమః అని నేత్రముల యందు దివ్యముద్ర నునిచి- నమశ్శి
వాయ నమః అని జలమును జూచి- ఈ మంత్రముతో నె గొట్టి- కవచాయ వౌషట్ అని
అభ్యుక్షణము చేసి- హృదయాయ వౌషట్ అని అంకుశ ముద్రతో బిందు స్థానమునుం
డి గంగాదులలో నొక తీర్థము నాకర్షించి నట్లు భావించి- హృదయాయ నమః అని ఉ
ద్భవ ముద్రతో నాతీర్థమును జలము నందునిచి, మూలమంత్రముతో మంత్రించి, అస్త్రా
య హుంఫట్ అని రక్షించి- కవచాయనమః అని యవకుంఠనముచేసి- వౌషట్ అంత
మందుగల శక్తి మంత్రముతో ధేనుముద్ర బట్టి అమృతీ కరణము చేయవలయును॥ ఇట్లు జ
లశుద్ధి చేసి-

మార్జనము.

పంచ బ్రహ్మ మంత్రములను- ఓంహాం హృదయాయనమః మొదలగు షడంగ మం
త్రములను జదువుచు మార్జనము చేయవలయును॥

అఘమర్షణము॥

ఆచమనముచేసి- జలమును కుడిచేత గ్రహించి- ఓంహాం అస్త్రాయనమః అని యె

ఉద్ధవుఁడు శ్రీకృష్ణలీల లుపదేశించి యాత్రకుంబోవఁగా విదురుఁ డాయుపదేశమునఁ దృప్తిపడక యమునాతీరమునకుం బోయి మైత్రేయమునిం గాంచి ప్రశ్నించి వారినుండి యనేకవిషయ ముల నెఱింగెను. ఈవిషయము శ్రీభాగవతమున మూఁడవ స్కంధమున నాల్గవయధ్యాయాంతమున నున్నది.

"అన్యేషాం దుష్కరతరం పశూనాం విక్లబాత్మనాం,
ఆత్మానం చ కురుశ్రేష్ఠ కృష్ణేన మనసేక్షితం,
ధ్యాయన్ గతే భాగవతో రురోద ప్రేమవిహ్వలః,
కాళింద్యాః కతిభిస్సిద్ధ అహోభిః కౌరవర్షభః,
ప్రాపద్యతస్వస్సరితం యత్ర మిత్రాసుతో మునిః. 36

ఆవల మైత్రేయముని యనేకధర్మముల నుపదేశించి విదురుని సంశయములఁ బాపెను. మైత్రేయకథితమగువిషయము భక్తి జ్ఞానవైరాగ్యబోధకముగా నున్నది. ఆయుపదేశమున వీతసంశ యుఁడై విదురుఁడు భగవద్ధ్యానతత్పరుఁ డయ్యెను. ప్రకృతవి షయ మేమనఁగా,

మైత్రేయముని ద్వాపరాంతమున యమునాతీరమునఁ దప మొనరించుచుండెనని దీనింబట్టి స్పష్టమైనది కదా. ఆమైత్రే యుఁడు కలియుగము నైదువేలవత్సరములు దాఁటఁగా యుగ మహిమమున విజ్ఞానము క్షీణింపఁగాఁ దా నొకరియం దావే శించి జ్ఞానము నుపదేశించు నను ప్రతీతిని గొందఱు కల్పించిరి. కొందఱామైత్రేయుఁడే యవతరించునని పల్కిరి. ఆ యుప దేశము చేయువారే జగద్గురువులని మఱికొందఱు పల్కుచు న్నవారు. ఇది మూఢవిశ్వాసమా లేక యిందేమేని సత్యముగల దా యని యించుక విచారింతము. ఏదో యొక్కవిశ్వాసము

ప్త్వా, ఓం హాం శివాయ స్వాహా ఇత్యంజల్యా ఉదకం ప్రదానేన జప్యం నివేద్య, ఉత్థాయ పంచ బ్రహ్మ మంత్రై రుపస్థానం కుర్యాత్॥ తతో దిగ్దేవతా నమస్కృత్య, స్వగోత్ర ముచ్చార్యాభి వాద్యాచమ్య కృతం కర్మ పరమేశ్వరా యార్పయేత్॥

## —* అథ సకలీ కరణ విధిః. *—

కరన్యా సాంగన్యాసరూపం సకలీకరణం। తచ్చ సృష్టి స్థితి సంహార రూపేణ త్రివిధం। తత్ర గృహస్థానాం కుటుంబినీనాంచ స్థితిన్యాస రూపం। బ్రహ్మచారిణాం సృష్టి న్యాసరూపం। యతి వన స్థానాం విధ ర్మ్యాకాణాంచ సంహారన్యాస రూపం గ్రాహ్యం॥ తదుక్తం శివమహా పురాణే॥ న్యాసస్తు త్రివిధః ప్రోక్తః స్థిత్యుత్పత్తి లయ క్రమాత్ స్థితి న్యాసో గృహస్థానా ముత్పత్తి ర్బ్రహ్మ చారిణాం యతీనాం సంహృతి న్యాసో వనస్థానాం తథైవచ। సఏవ ధర్మ హీనాయాః కుటుం బిన్యాః

ను శివగాయత్రినినూటయెనిమిది మార్లు గాని, ఇరువది యెనిమిది మార్లు గాని, జపము చేసి, ఓంహాంశివాయ స్వాహా అని దోయిలితో నీరువిడుచుటచే జపము సర్పించి, లేచి, పంచబ్రహ్మమంత్రముల తో ఉపస్థానము చేయవలయును॥ తరువాత దిగ్దేవతలకు నమస్కారముచేసి స్వగోత్రమును చెప్పి యభి వాదనము చేసి ఆచమనము చేసి యీశ్వరార్పణము సేయ వలయును. ఇది శైవపడక్షరీ సంధ్య॥

### సకలీకరణము

కరన్యాసము, అంగన్యాసము చేరి సకలీకరణమని చెప్పఁబడును॥ అదియు, సృష్టి న్యాసము, స్థితిన్యాసము, సంహారన్యాసము, వని మూడు విధములగును॥ అందు గృహస్థులకు, ముత్తైదువులకును స్థితిన్యాసము గ్రాహ్యము॥ బ్రహ్మచారులకు సృష్టి న్యాసము॥ యతులకు, వనస్థులకు, పూర్వసువాసినులకు సంహారన్యాసము గ్రాహ్యము అనిశివపురాణంబున గలదు॥ అంగుష్ఠము మొదలు కొని కనిష్ఠికవరకు చేయఁబడునది స్థితిన్యాసంబును, కుడిచేతి యంగుష్ఠము మొదలుకొని యెడమ చేతి యంగుష్ఠము వరకు జేయు బడునది సృష్టిన్యాసంబును, ఎడమచేతియంగుష్టము మొదలు కొని కుడిజేతి యంగుష్ఠమువరకు జేయుబడునది సంహారన్యాసము సనియు శివమహాపురాణము నందె కలదు॥

వారు కారుగదా. మైత్రేయముని విదురునకుపదేశించుచు ననే కేతిహాసములం దెల్పుచు నందొకచో,

"తత్రాపి స్పర్శవేదిభ్యః ప్రవరా రసవేదినః,
తేభ్యో గంధవిదశ్శ్రేష్ఠా స్తతశ్శబ్దవిదో వరాః. 30
రూపభేదవిద స్తత్ర తతశ్చోభయతోదతః,
తేషాం బహుపదాశ్శ్రేష్ఠా శ్చతుష్పాదా స్తతో ద్విపాత్.
తతో వర్ణాశ్చ చత్వార స్తేషాం బ్రాహ్మణ ఉత్తమః,
బ్రాహ్మణే ష్వపి వేదజ్ఞో హ్యర్థజ్ఞో హ్యధిక స్తతః. 32
అర్థజ్ఞా త్సంశయచ్ఛేత్తా తతశ్శ్రేయాన్ స్వకర్మకృత్,
ముక్తసంగ స్తతో భూయా న్న దోగ్ధా ధర్మమాత్మనః. 33
తస్మాన్మయ్యర్పితాశేషక్రియార్థాత్మా నిరంతరః,
మయ్యర్పితాత్మనః పుంసో మయిసన్న్యస్తకర్మణః. 34
న పశ్యామి పరం భూత మకర్తు స్సమదర్శనాత్,
మనసైతాని భూతాని ప్రణమే ద్బహుమానయన్. 35
ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవానితి,
భక్తియోగశ్చ యోగశ్చ మయా మాన వ్యుదీరితః." 36

శ్రీభాగవతము. 3 స్కం. 29 అధ్యాయము.

ఇట్లు మైత్రేయుఁ డుపదేశించిన ట్లున్నది. జాతిమతము లుండ రాదనువారు మైత్రేయశిష్యులుగాని మైత్రేయాంశావేశితచిత్తులుగాని కారాదు కదా. ఎల్లరకు నొక్కరీతి జ్ఞానము నుపదేశించుట యనఁగాఁ గర్మసిద్ధాంతమేమియో వారెఱుంగరనుటయే కాని వేఱేమున్నది?

"ప్రకృతేర్గుణసమ్మూఢాః స్సజ్జంతే గుణకర్మసు,
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్."

కరసంపుటే కమలే హాం శివాసనాయ నమ ఇతి శివాసనం విన్యస్య, హాం హః శివమూర్తయే నమ ఇతి తేజోమయీం స్థిరవిద్యాం శివస్య సూక్ష్మమూర్తిం విన్యస్య, హాం హాం ఈశాన మూర్ధ్నాయ నమ ఇత్యంగుష్ఠతర్జనీభ్యాం విన్యస్య, తర్జన్యాది కనిష్ఠికాంత మంగుష్ఠాభ్యాం హేం తత్పురుష వక్త్రాయ నమ ఇత్యాదీం శ్చతురో మంత్రాన్విన్యస్య, హాంహాం విద్యాదేహాయ నమ ఇత్యంగుష్ఠ కరతలయో రష్టత్రింశత్కళామయ సదాశివాత్మకం స్థూల విద్యా దేహం విన్యస్య నేత్రేభ్యో నమ ఇతి నేత్రం కరతలయో ర్విన్యస్య హాం హూం నమ ఇత్యంగుష్ఠానామికాభ్యాం సదా శివ దేహ వ్యాపకం శివ మావాహయేత్॥ తతః కనిష్ఠికాదిషు హాం హృదయాయ నమ ఇత్యాది నేత్రమంత్రవ్యతిరిక్తాన్ పంచమంత్రాన్ క్రమేణ విన్యస్య, వామ దక్షిణ కరౌ తదితర కరాభ్యాం కవచాయ నమ ఇత్యవకుంఠ్య, కరద్వయం సంయోజ్య, వౌషడంతమూలేన పరమీకుర్యాత్॥ అవకుంఠన మభక్తేష్వప్రకాశార్థం విష్ణోర్నామ ప్రాప్త్యర్థంచ కవచేనాచ్ఛాదనం॥ న్యస్తానాం హృదయ శిరశ్శిఖా

---

ప్రేళ్ళచే, హేం తత్పురుష వక్త్రాయనమః, హుం అఘోరహృదయాయనమః హాం వామదేవ గుహ్యాయనమః, హాం సద్యోజాత మూర్తయేనమః, అను నాలుగు మంత్రములు న్యసించి, హాంహాం విద్యాదేహాయ నమః అను మంత్రమును చదువుచు, బొటన ప్రేళ్ళయందును, అరచేతులయందును, అష్టత్రింశత్కళామయమై సదాశివ రూపమగు స్థూలవిద్యా దేహమును న్యసించి, నేత్రేభ్యోనమః అను మంత్రముతో నేత్రమును అరచేతుల యందు న్యసించి, హాంహూం నమః అను మంత్రము చదువుచు నంగుష్ఠము అనామికయను రెండు ప్రేళ్ళచే సదాశివ దేహమును వ్యాపించియున్న శివుని నావాహనము సేయవలయును॥

తరువాత చిటికెన ప్రేలు మొదలుకొని, యన్నిప్రేళ్ళయందును హాం హృదయాయనమః, హీం శిరసేస్వాహా హూం శిఖాయై వషట్, హైం కవచాయహుం, హః అస్త్రాయ ఫట్ అనునైదు మంత్రములను క్రమముగా న్యసించి ఎడమ చేతిని కుడి చేతను కుడిచేతిని ఎడమ చేయి చేతను కవచాయనమః అను మంత్రముతో అవకుంఠనము సేసి, రెండు చేతులను జోడించి నమశ్శివాయ వౌషట్ అను మంత్రముతో పరమీకరణము సేయవలయు.

గీడుమూడుననియు నాయాశయము. కావున భక్తులగువారు మనమహర్షు లుపదేశించిన వివిధవిషయములను దమకనుకూల మని తోఁచినవానినిఁ గైకొని వానిని శక్త్యనురూపముగా నాచరించి భక్తిమార్గమును బరిశీలించి భగవంతుని శ్రీరాధా మాధవుని ధ్యానించి తన్నామమును వినుతించి కృతకృత్యులు గావలయును. తెలియనివా రాసక్తమతులైనవారి కుపదేశింప వలయును. ఇదియ యీకాలమునఁ గర్తవ్యమని నాయాశయ మును దెల్పుచు ననంతరకథావిశేషములఁ దెల్పఁబూనెదను.

## మ ధు రా పు ర మా హా త్మ్య ము.

* ఈకథల నారదముని తెలుపఁగా బహుళాశ్వభూజాని మునీంద్రా! భగవంతుఁడగు బలదేవుఁడు తీర్థయాత్రనుముగించి కోలాసురుం బొలియించి మధుర కేతెంచెనని వింటిని. ఆహా! ఆమధురానగర మెంతధన్యము! అట్టిభగవంతుఁ డం దుండెను గదా. అంతకంటె విశేషపుణ్య మేముండును? ఆ మధురానగర మాహాత్మ్యమును వినఁగోరెదను. ఆనగరరక్షకుఁ డెవఁడు? ఆ పురవృత్తాంతమునెల్ల సవిస్తరముగా వచింపుమా యని ప్రశ్నింప నారదముని యిట్లు బదులు చెప్పెను. రాజేంద్రా! మధురానగర మేమని వర్ణింపఁగలను? పూర్ణతముఁడై భగవంతుఁడై క్లేశనాశకుఁ డగు శ్రీహరియే మధురానాయకుఁడని నమ్ముము. మున్ను భగ వంతునిచే నావిగ్రహము కపిలముని కొసంగెను. ఆకపిలముని ప్రసన్నుడై శతమన్యువున కొసంగెను. రాక్షసేంద్రుఁడగు రావణాసురుఁ డాదేవతల జయించి యావిగ్రహమును బూజించి

---

*ఈకథ గర్గసంహిత మధురాఖండము ఇరువదేనవయధ్యాయమునుండి సంగ్రహీతమని యెఱుంగునది. ఇది బహుళాశ్వనారదసంవాదముగా నున్నది.

తత్రో హృదయ శిర శ్శిఖా శ్శివ స్థానేషు హృదయ శిర శ్శిఖా స్వంగుష్ఠ కనిష్ఠి కానామికా మధ్యమాభి ర్విన్యస్య, కర్ణ ప్రావరణ త్వేన స్తనమధ్యాంతం కవచం తర్జనీభ్యాం విన్యస్య, హస్త తలయో రస్త్ర మనామికాభ్యాం విన్యసేత్॥

సర్వేప్యేతే మంత్రానమోంతాః, అస్త్ర మంత్రస్తు ఫడంతః॥ హూం ఫడంతాస్త్ర మంత్రేణ తాళ త్రయ పురస్సరం దిగ్బంధనం కృత్వా కవచే నావేష్ట్య, వౌషడంత మూలేన మహా ముద్రాంచ ప్రదర్శయేత్॥ మస్తకాది పాదాంతం హస్తాభ్యాం సంస్పర్శనం మహా ముద్రా॥ తత శ్శివ సమాన రూపతా మాత్మన శ్చింతయేత్॥

ఇత్థం కృతాంగన్యాసో బద్ధ పట్ట శిరోవేష్టన మస్తక త్రాణకం కటకర గృహీతాస్త్రైః భీమణోభట ఇవ క్షుద్రాణా మప్ర ధృష్యో భవతీ త్యావశ్యక మిదం. ఇతి సకలీ కరణం॥

---

అనామికతో గుహ్యమునందు వామదేవ మంత్రమును, అంగుష్ఠముతో గూడిన కనిష్ఠికతో పాదముల యందు సద్యోజాత మంత్రమును, న్యసించి, మధ్యభాగము మొదలుకొని బ్రహ్మరంధ్రము వరకు హాం హౌం [illegible] మహాయ నమః అను మంత్రముతో విద్యాదేహమును న్యసించి, నేత్రత్రయాయ వౌషట్ అను నేత్ర మంత్రముచేత హృదయము, శిరస్సు శిఖ యనుమూడు స్థానముల యందును నడిమి మూడు వ్రేళ్ల చేతను విద్యాదేహమును న్యసించి, యందు, నంగుష్ఠానామికలచే హాంహాం శివాయనమః అనుమంత్రముతో పరమశివుని నావాహనము సేయవలయు॥ అనంతరము, హృదయము, శిరస్సు,శిఖ అను శివస్థానములు మూడిటి యందును హృదయ మంత్రమును శిరోమంత్రమును. శిఖా మంత్రమును, అంగుష్ఠము, కనిష్ఠిక, మధ్యమ అను మూడు వ్రేళ్ళచే న్యసించి, కర్ణములు మొదలుకొని స్తన మధ్యము వరకు కవచ మంత్రమును చూపుడు వ్రేళ్ళచే న్యసించి, అరచేతులయందు ననామికలతో నస్త్రమంత్రమును న్యసింప వలయును॥ అస్త్రమంత్రము మాత్రము, అస్త్రాయ ఫట్ యని ఫట్ కారము చివరగలది॥ కడమ మంత్రము లన్నియు హృదయాయనమః అని మొదలుగా నమః పదమే చివరగలవి, అస్త్రాయ హూంఫట్ అను మంత్రముతో ముమ్మారు తాళము చరిచి, దిగ్బంధనము సేసి. కవచముతో చుట్టి, నమశ్శివాయ వౌషట్ అను మంత్రముతో మహాముద్రను జూపవలయు॥ శిరము మొదలుకొని పాదముల వరకు

వంతుఁడగు శ్రీకృష్ణుని యంగసంభూతమే మధురాపుర మని నమ్ముము. కావుననే దానిదర్శించినంతనే మనుజుఁడు కృతకృత్యుం డగును.

పూర్వము మధురానగరమహిమము నెఱింగిన విరించి యందు నిరాహారుఁడై శతవర్షములు తపమొనరించెను. హరిమంత్రము జపించెను. స్వాయంభువుఁ డనుకొడుకును బడసెను. భూతేశ్వరుండగు నీశ్వరుఁడు మధురానగరమునకుఁ జెంతనున్న మధువనమున దివ్యవర్షశతములు తపంబొనరించి శ్రీకృష్ణప్రసాదపాత్రుఁడై వెలసెను. మధురానివాసమును గోరెనుగాన నద్దానిం బడసి భగవంతుని సేవించుచున్నవాఁడు. భూపాలా! నేను గూడ శ్రీకృష్ణప్రసాదమును బొంది మాధుర్యమండలమునఁ గొంతకాలము నివసించుచుఁ దిరుగుచుఁ దద్వార్తాహారుఁడనగు చారుండ నైతిని. దుర్గయు ననేకసంవత్సరములు నియతిఁబూని భగవద్దాస్యము నొంది మధురానగరమున నివసించెను. ఇంద్రాదు లామధువనమునఁ దపంబొనరించియే యిష్టసిద్ధులం బడసిరి. మధువనురాక్షసుఁడు తపంబుచేసి యందఱికంటె బలవంతుఁ డయ్యెను. మాధవమాసమున భగవంతునితోఁ బోరాడెను. సప్తర్షు లిందుఁ దపంబొనరించి తపస్సిద్ధి నందిరి. రావణాదు లీవనమునఁ దపంబొనరించి యత్యద్భుతపరాక్రమమును గడించిరి.

ఇఁక నీ పురమాహాత్మ్యమును వివరించెద. బహుళాశ్వరాజా! ఆలకింపుము. ఆదివరాహమూర్తిని ధరించిన శ్రీమహావిష్ణువు భూమి జలనిమగ్నయై క్రుంగ నిజదంష్ట్రాగ్రమున దానినెత్తి యేనుఁగు పద్మమును దుండాగ్రముననెత్తి పట్టుకొనులాగున ధరించి యీమాహాత్మ్యమును జెప్పెను. మధురా

నముక్తిం కథం సాధయే దితి చేదత్ర, న కేవల మస్మాభి రపరాద్ధం॥ సర్వైరపి తథాంగీ క్రియమాణత్వాత్, తద్యథా, తురీయాశ్రమే ప్రణవమేవ ప్రతిగృహ్య సావిత్రీ ముత్సృజద్భి స్స్వీకృత మముక్తిసాధనత్వం తన్మతస్థైః తథా ష్టాక్షర్యాదికం ప్రాధాన్యేన ప్రతిగృహ్ణద్భి శ్చాన్యైరితి యుక్తమేవ॥ నను, సావిత్ర్యా అపి పరమేశ్వర పరత్వసిద్ధ్యా పరమేశ్వర పరా సావిత్రీ కథం నముక్తిప్రదాత్రీ ఇతి చేదుచ్యతే॥ యద్యపి పరమేశ్వర ప్రతిపాదకా విద్యన్తే బహవో మంత్రాః తథాపి సావిత్ర్యా ఏవ ద్విజత్వసాధకతాంగీ క్రియతే॥ అత్ర చ, యథా, న పారమేశ్వర సంకల్పా దన్యోహేతు రుపలభ్యతే, తథా తస్యా దేవ శైవ్యాః పంచాక్షర్యా అపి ముక్తి సాధనతే త్యవివాదం। కించ, సూత సంహితాయాం ముఖ్యశబ్ద జపతో మునీశ్వరాస్సద్య ఏవ పరమం సుఖం యయురిత్యుక్త్యా శివనామ్నః పరమముఖ్యత్వే ప్రసిద్ధ్యా తన్నామ

---

ప్ర॥ సకలవేద సారమగు గాయత్రి మంత్రము ముక్తినొసంగ జాలదా?

ఉ॥ గాయత్రి ముక్తి నొసంగ నేరదని సర్వమతస్థులు నంగీకరించిరి గాన మాదె తప్పు కానేరదు. తురీయాశ్రమమునందు స్మార్తులు శిఖా సూత్రములతో గూడ గాయత్రిని వదలి పెట్టు చున్నారు॥ రామానుజులు మొదలగువారు ముక్తికై నారాయణాష్టాక్షరమును గ్రహించు చున్నారు॥ ఇట్లుండ గాయత్రి వలన ముక్తిలభింప నేరదనిదానికై యేము పంచాక్షరిని గ్రహించిన తప్పేమి?

ప్ర॥ గాయత్రి నిర్గుణ తత్త్వమును చెప్పదని యెంచి దీనిని స్మార్తులు తురీయాశ్రమమున విడువ వచ్చును॥ రామానుజమతులైననో గాయత్రి యెట్లును నారాయణ పరము కాజాలదని యెంచి దీనిని ముఖ్యము చేయక నారాయణాష్టాక్షరమును గ్రహింప వచ్చును. కాని మీరు గాయత్రి శివపరమేయని గట్టిగ సిద్ధాంతముచేసి యిదిగాదని ముక్తికై శైవ పంచాక్షరిని గ్రహించుట యుక్తమగునా?

ఉ॥ పరమేశ్వరుని బోధించు మంత్రములు వేనవేలు గలవు అయినను గాయత్రియే ద్విజత్వము నొసంగునుగాని కడమ మంత్రము లొసంగ వనుటకు పరమేశ్వరు నాజ్ఞకంటె కారణాంతరము లేదు॥ అట్లె ముక్తినొసంగుటకును పంచాక్షరి కంటె నింకొక మంత్రమా సాధకము కాదనుటకును ఈశ్వరాజ్ఞయే కారణమగును॥ ఇదిగాక, సూత సంహిత

నారదముని తెలుప బహుళాశ్వరాజు పరమాశ్చర్యపరిపూర్ణ మానసుం డయ్యెను.

" శ్లో. అరుణాధరామృత విశేషితస్మితం
వరుణాలయానుగతవర్ణవైభవమ్,
తరుణారవిందదళదీర్ఘలోచనం
కరుణామయం కమపి బాలమాశ్రయే. ౧౭
లావణ్యవీచీరచితాంగభూషాం
భూషాపదారోపితపుణ్యబర్హామ్,
కారుణ్యధారాళకటాక్షమాలాం
బాలాం భజే వల్లవవంశలక్ష్మీమ్." ౧౮

శ్రీకృష్ణకర్ణామృతము. 3 ఆశ్వాసము.

మహాశయులారా! ఇంతదనుక శ్రీకృష్ణబలరాముల బాల్యక్రీడలు వర్ణితములయ్యెను. వారియమానుషక్రీడ లున్న వున్నట్లు వచియింపఁ దరముగాదనుట మీ రెఱింగినవిషయమే. పురాణముల ననుసరించి యించుక వ్రాసితిని. ఇఁక భూభార హారణార్థమై శ్రీకృష్ణపరబ్రహ్మ మొనరించిన .మహాకృత్యముల వ్రాయవలయును. కంసాదులవధించుట భూభారహరణము కాదాయన్న నౌనవచ్చును గాని మహాకార్యములు పెక్కు లున్నవి. అన్నియవతారములకన్న నీయవతారమునఁ గలవిశేషము తాఁజేయుటయే గాక యితరులతోఁ గార్యములు చేయించుటయేయని యీవఱకే పెక్కుతావుల వ్రాసియుంటిని గదా. అట్టికార్యము లీవఱకు శ్రీకృష్ణుఁడు చేసినది లేదు. తాఁజేయుచు నితరులద్వారా చేయించుచుఁ దాను సాక్షీభూతుఁడుగా నుండి భూభారమును హరించువిషయములు

వదామసీతి శ్రూయతే॥ తథా, తముష్టుహి యస్స్విషు స్సుధన్వా ఇతి, స్తుహి శ్రుతం గర్త సదం యువాన మిత్యాదికం, తథా, సామసు రుద్ర సంహితాయా మనంతం శివ నామ భజన మహిమాభి వర్ణనం॥ తథా, అథర్వణే అథర్వ శిరశ్శిఖాదిషు. యోవై రుద్రస్సభగవానితి, సప క స్సఏకో రుద్ర స్సఈశాన స్సభగవాన్ సమహేశ్వర స్సమహాదేవ ఇత్యాదికమపరిమితం ద్రష్టవ్యం॥ నిత్యత్వం యథా, అథర్వణ సంహితాసు ఏకాదశే కాండే ప్రథమానువాకే పంచమ షష్ఠ సప్తమాఖ్యేషు త్రిషు ఖండేషు ఏకత్రింశ న్మంత్రాత్మా రుద్రసంహితా తత్ర సప్త దశోయం మంత్రః॥ సహస్రాక్షమతి పశ్యం పురస్తాత్, రుద్రమస్యన్తం బహుధా విపశ్చిదం మోపారరామ జిహ్వయేయ మానమితి వ్యతిరేకేణ శివ భజన విరామస్య అధర్మత్వం నిరూపయన్ ప్రకృతస్య నిత్యతాం నిరూపయామాస॥

---

రముతో-గృణీమసి= ఉచ్చరింతుము గాక॥ అనియు, దేవతలకు తండ్రియగు రుద్రుని యుద్దేశించి, మాటచెప్పఁ బడును॥ రుద్రుని నామము రుచిగలవాని లోనికల్ల ఎక్కువరుచి కలది॥ మావాక్యములు రుద్రుని కొఱకు వినియోగింపఁ బడుగాక, అని మొదలుగాఁ గలవు॥

ప్ర॥ యజుర్వేదమునందు శివనామ విధికలదా?

ఉ॥ యజుర్వేదము నూటయొక్క శాఖలయందును రుద్రాధ్యాయ ముండియున్నది॥ దానియందు॥ శివుఁడా, నీనామమును స్వచ్ఛముగాఁ జెప్పదుము గాక యని యున్నది॥ ఇట్లే- ఆశివునినే స్తోత్రము చేయుమని పెక్కుమార్లు కలదు॥

ప్ర॥ సామమున, అథర్వణ మునను గలదా?

ఉ॥ సామవేదమున రుద్రాధ్యాయము నందును- అథర్వణమున-అథర్వశిఖాదులయందును నధికముగా గలదు॥

ప్ర॥ శివనామ జపము నిత్యమని యెచట గలదు?

ఉ॥ అథర్వణ సంహితయందు రుద్రాధ్యాయముకలదు॥ అందు, రుద్రుని నామమును నాలుకతో నెప్పుడు నుచ్చరించుచు నుపరమింప కుండుము గాక॥ ఇట్లు రుద్రనామోచ్చారణము నొకప్పుడు మానినను ప్రత్యవాయము విధించెం గాన, శివనామము జపము ము నిత్యమని స్పష్టమైనది॥

కాశము లేదు. వారియింటిపిల్లలను రాజులు వివాహమాడు వాడుక కలదు. కుంతి యాదవవంశజనితయే కదా. కంసాదులకు యాదవులతో సంబంధము కలదనుట యంద ఱెఱుంగుదురు. అది లేకున్న శ్రీకృష్ణావతారప్రసక్తియే లేకపోవును. సామంతరాజులుగా నుండిరిగాని జాతిభ్రష్టులై వైదికసంస్కారములఁ గోలుపోయినవారు యాదవులు కారని యెఱుంగందగు. యాదవులకు గురువు గర్గమహాముని. ఆమునియే నందాదులకు నుపనయనాదులఁ జేయించువాఁడు. కావున నిఁక రామకృష్ణులకు నుపనయనము సాగినకథను జదువఁ బ్రయత్నింపుఁడు.

## శ్రీరామకృష్ణుల యుపనయన మహోత్సవము.

* రామకృష్ణులు మధురానగరమును జేరినపిదపఁ గొలఁదిదినములకు వసుదేవుఁడు తనయులకు నుపనయనసంస్కారము చేయ నాలోచించెను. అంతలోఁ గులగురువగు గర్గముని ఆవిషయమును దనదివ్యదృష్టి నెఱింగి చనుదెంచెను. అట్టిమహోత్సవమున గురువనుమర్యాదను బొందుటకన్నఁ బురుషార్థమేమున్నది? సర్వజ్ఞునకు గాయత్రి నుపదేశించుటకంటె మఱియొక్కయదృష్ట మేమియుండును? పౌరోహిత్యము పరమనీచమైనను వసిష్ఠాదు లంగీకరించిన దావంశమున భగవంతుఁ

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము తొంబదితొమ్మిదవయధ్యాయము నుండి గ్రహింపఁబడినది. ఇతరపురాణములయందు విశేషించి కానరాదు. శ్రీవిష్ణుపురాణమునఁ బంచమాంశమున నిరువదొకఁడవ యధ్యాయమున "విద్యార్థం జగ్మతుర్బాలౌ కృతోపనయనక్రమౌ" అనిమాత్రము కనుపట్టెడిని. హరివంశాదులయం దీవిషయము కానరాకున్నది. కృష్ణజన్మఖండమునందే విశేషించి కనఁబడియెడిని.

త్వాత్, విప్రతిషిద్ధ ధర్మాణాం సమవాయే భూయసాం స్యాత్సధర్మత్వమితి జైమిన్యుక్తేః, రుద్రస్య స్విష్టకృత్త్వస్యాపి సర్వ శ్రుతి సమ్మతస్య స్మృతి బలానుమిత శ్రుత్యపేక్షయా ప్రాబల్యస్యావశ్య మంగీకార్యత్వాచ్చ॥

నను, స్విష్టకృదగ్నిర్నామ నరుద్ర ఇత్యనేన కిం భవత స్సిద్ధం శివనామ మాహాత్మ్య మితి చేత్ ఉచ్యతే॥ రుద్రోఽగ్నిస్స్విష్టకృత్-ఇతి బహుషు స్థలేషు రుద్రస్య స్విష్టకృత్సంజ్ఞకత్వాభిధానాత్, తథా, యజుష్షుచ, దేవావై యజ్ఞాద్రుద్ర మంతరాయన్। స యజ్ఞమవిధ్యత్ం దేవా అభిసమగచ్ఛంత కల్పతాం న ఇద మితి తేఽబ్రువన్ స్విష్టం వై న ఇదంభవిష్యతియదిమంఆరాధయిష్యామఇతితత్స్విష్టకృత స్స్విష్టకృత్త్వం॥ ఇతి॥ స్విష్టకృతశ్చనామ రుద్రస్య నిర్లజ్జ ముద్ఘుష్య యజనం కంఠరవేణ విహితం॥ యథా, యజుషాం బ్రాహ్మణేషు శ్రూయతే ఉచ్చైస్స్విష్టకృత ముత్సృజతి యథా సృష్టం విత్త్వా ప్రాహాయ ష్ఠిత్తి తాదృగేవ తత్। ఇత్యనేన సంభావిత న్యూనాతిరేక సమీకరణేన సుష్టుయాగం సంపాద్యానుగృహ్ణాతి పరమేశ్వరోఽయ మలజ్జ భజన తు

---

ఉ॥ స్విష్టకృత్తగు నగ్ని రుద్రుఁడే యని శ్రుతియందె కలదు॥ ఇదిగాక, దేవతలు రుద్రుఁడు లేకుండ యజ్ఞమును చేసిరి– అతఁడు యజ్ఞమును వధించెను॥ అంత దేవతలు యజ్ఞమును బాగుచేయుమని రుద్రు నాశ్రయించిరి॥ ఈరుద్రు నారాధించునెడ యజ్ఞము బాగుపడునని యెంచిరి గాన స్విష్టకృత్తను పేరు రుద్రునకు వచ్చెనని యజుర్వేదమునందు కలదు॥ దీనింబట్టి స్విష్టకృత్తు రుద్రుఁడే అని తెలియుచున్నది॥ ఇచట, రుద్రపదమున కగ్నియనియె అర్థము చెప్పునెడ అగ్ని లేకుండ యజ్ఞము చేసిరని గదా యర్థమగును॥ అగ్నిలేకుండ యజ్ఞము సేయుట అసంభవము. గాన నట్లు చెప్పఁగూడదు॥ పోయినసొమ్ము దొరకిన నప్పు డెంత పెద్దగా నఱచునో అంత బిగ్గరగా స్విష్టకృత్తును పలుకవలయునని వేదమునందె కలదు॥ పరమేశ్వరుని నిరభిమానముగా స్తోత్రము చేయునెడ నద్దేవుఁడు సంభవించిన దోషములను దొలగించి యాగమును సంపూర్ణ ఫలము గావించునని వేదాభిప్రాయము॥ ఇట్లు స్విష్టకృత్తు రుద్రుఁడే యని యేర్పడియెగాన కర్మలోప పరిహార

వైశ్యులకుఁ బదునొకండు పండ్రెండువత్సరములు నుపనయన మునకు ముఖ్యకాలములని సారము. ముఖ్యకాలము చెప్పఁ బడినపుడు గౌణకాలము చెప్పఁబడుట సదాచారము. విశేష విధిలేక యే నియమము లుండవుకదా. కావున ముఖ్యకాలము పై నన్నిసంవత్సరములవఱకు నుపనయనమునకు గౌణకాలము చెప్పఁబడినది ఇదియు స్మృతిసమ్మతమే. దానిప్రకారము విప్రు లకుఁ బదాఱువత్సరములవఱకు నుపనయనకాలము కలద నియు, క్షత్రియుల కిరువదిరెండువత్సరముల వయస్సువనుక నుపనయనకాలము కలదనియు, వైశ్యులకు నిరువదినాల్గువత్స రముల వయస్సుపర్యంతము సావిత్రి నుపదేశించుకాలము కల దనియు స్పష్టమగును. ఇవి ముఖ్యగౌణకాలములు. ఇవియుఁ గాక బ్రాహ్మణుల కైదవవత్సరము, క్షత్రియుల కాఱవయబ్దము, వైశ్యులకెనిమిదవసంవత్సరము నుపనయనార్హము లగుననియు నీసంవత్సరములు కామ్యాబ్దములనియుః జెప్పఁబడినది. బ్రహ్మ వర్చస్సుకోరిన విప్రబాలునకు గర్భపంచమ సంవత్సరమునందును, బలమునుగోరిన క్షత్రియబాలునకు నాఱవసంవత్సరమునందును, విశేషించి కృష్యాదులనుజేయఁగోరు వైశ్యబాలునకు నెనిమిదవ సంవత్సరమునందు నుపనయనము చేయవలయునని స్మృతికర్తృ మతము. ఈ కామ్యాబ్దములు గర్భాదిగానని చెప్పఁబడినది. దానిం బట్టి జన్మాదిగా నాల్గవ యైదవ యేడవసంవత్సర వయస్సుకలిగిన పుడని యేర్పడును. అంతటి యల్పవయస్సునం దాయాకోరికలు పొడమునా యని శంకించుకొని తత్పిత కాయిష్టముకలిగినపు డనఁగా దనకొడుకు వేదవేదాంగపారంగతుఁడు కావలయునని కోరువిప్రుఁడు, తనకుమారుఁడు హస్త్యశ్వాదిరాజ్యబలాధి

శ్వరః। శివ ఇత్యుచ్యతే సద్భి శ్శివ తత్వార్థ కోవిదైరితి వాయు సంహి
తాయా ముక్తం॥ అత ఏవ, భాగవతేపి॥ యద్ద్వ్యక్షరం నామ గిరేరితం
నృణాం సకృత్ప్రసంగా దఘ మాశుహన్తి తత్। పవిత్ర కీర్తిం తమలం
ఘ్య శాసనం భవానహో ద్వేష్టి శివం శివేతర ఇతి, తత్రైవ॥ యస్యా
నవద్యం చరితం మనీషిణో గృణన్త్యవిద్యా పటలం బిభిత్సవః ఇత్యా
దినా-హ సన్తి యస్యాచరితం హి మనుర్భగా ఇత్యాదినా చ శివస్య మంగళకర
త్వం తద్వేషిణాం శివేతరత్వ దుష్టభగోత్పన్న త్వాదిక మపి ప్రతిపాదితమి
తి మాంగళ్యా పాదకత్వం సిద్ధమస్య॥

నను, రామ మంత్ర ఏవ తారక ఇతి జ్ఞాయతే తారకో నామ
తారయతీతి, తథాచ, కలిసంతరణోపనిష ద్వ్యామ్నాయతే। ద్వాప
రాన్తే నారదో బ్రహ్మాణం జగామ, కథం భగవన్ గాం పర్యటన్ క
లి సంసారం సంతరేయ మితి॥ సహోవాచ బ్రహ్మా, సాధు పృష్టోస్మి, స
ర్వ శ్రుతి రహస్యం గోప్యం తచ్ఛృణు, యేన కలి సంసారం తరిష్యసి భ
గవత ఆదిపురుషస్య నారాయణస్య నామోచ్చారణ మాత్రేణ నిర్ధూ
త కలి ర్భవతి॥ నారదః పునః పప్రచ్ఛ, నామకిమితి సహోవాచ హి

---

వచును రెండక్షరములను నొకసారి పలుకునెడ సర్వపాపములుతొలంగునని యు-పవి
త్రములు చరిత్రలు గలవాడును- అలంఘ్యములు శాసనములుగల వాడునునగు శివుని నమం
గళుండవు అగునీవు ద్వేషించుచున్నావని యు- మంగళ చరిత్రములుగల శివుని ద్వేషిం
చువారె యమంగళులనియు- దుర్భగు లనియు భాగవతమునందె కలదుగాన శివనాము
మాంగళ్యా పాదక మనుటకు సందియము లేదు.

ప్ర. రామ మంత్రమే తారకమని తెలియుచున్నది. ఎట్లనిన- కలి సంతరణోపని
షత్తునందు హరే రామ అని మొదలుగా నున్నది. కాన- రామనామమే తారకమని
యంగీకరింప రాదా?

ఉ. ఆయుపనిషత్తునందె- ఏతత్షోడశకం నామ్నాం కలికల్మష నాశనం హ
రే రామ అని మొదలగు పదునారు నామములను జపించునెడ కలికల్మషముల నశింపఁ

ఆపస్తంబసూత్రము—

"గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీత. ౨

గర్భైకాదశేషు రాజన్యం గర్భద్వాదశేషు వైశ్యమ్. ౩

వసంతో గ్రీష్మశ్శరదిత్యృతవో వర్ణానుపూర్వ్యేణ." ౪

"శ్రీసుదర్శనాచార్యవ్యాఖ్య. ఋతవో వసంతాదయః త్రయో బ్రాహ్మణాదివర్ణక్రమేణోపనయనస్య కాలాభవంతి, అయంచర్తు విధిస్సామాన్యవిధిప్రాప్తోదగయనస్య యథార్హం నియమాపవాదార్థః. పూర్వపక్షాదిస్తు భవత్యేవ. శిశిరే చ వా సర్వేషామ్. ఇతి భరద్వాజగృహ్యోక్త శిశిరప్రతిషేధార్థః." అని.

జ్యోతిశ్శాస్త్రమునందు—

"శ్లో. విప్రాదేర్గర్భతోఽబ్దేఽష్ట శివరవిమితే జన్మతో వా వ్రతంస్యా
దత్రానిష్టేపి జీవేఽనిమిషరవిమథా కార్యమబ్దస్యదార్ఢ్యాత్,
స్యాద్బా దూర్ధ్వం క్రమాత్స్యా ద్విగుణితశరదో నింద్యమ
[బ్దక్రమేణ
పంచాష్టాంకాబ్దతో వా ప్రపఠనరుచిత శ్శస్తమేషాం
[తదాహుః."

మహూర్తమార్తండము.

కాత్యాయన గృహ్యసూత్రము—

"ఆషోడశా ద్బ్రాహ్మణస్యానతీతః కాలో భవత్యాద్వావింశాద్రాజన్యస్యాచతుర్వింశాద్వైశ్యస్యాత ఊర్ధ్వం పతితసావిత్రీకా భవంతి. నైనానుపనయేయుర్నాధ్యాపయేయుర్న యాజయేయుర్న చైభిర్వ్యవహరేయుః. కాలాతిక్రమే నియతవత్త్రిపూరుషం పతితసావిత్రీకాణా మపత్యే సంస్కారోనాధ్యా

శివనామ విశేషణ త్వేనైవాస్య నిరుక్తతయా బృహజ్జాబాలే, శ్రీశైవ షడక్షరస్యైవ తారక సంజ్ఞకత్వామ్నానేనచ సంసార తారకత్వ మస్యైవేతి సిద్ధం॥

అత్ర కేచిత్, విశేషార్థ ప్రకాశికాయాం, నమ శ్శివాగ్ని బీజాయ హారాయ పరమాత్మనే। ఓమంత మంత్ర రూపాయ మూల పంచాక్షరాత్మనే ఇత్యుక్త్వా షడక్షరేణ ప్రణవాంతేనైవ భవి తవ్య॥ తథా, తత్రైవ, ఓంకార వదనా దేవీ వాయకార భుజద్వయా। శికార దేహ మధ్యాచ నమకార పదద్వయా॥ ఇతి వచనేనాపి తత్రైవ జ్ఞాయతే॥ ఏవ మేవ శివానుభవసూత్రేపి॥ మూలాధారే నకారాఖ్యా సంస్థితా పరమేశ్వరీ। స్వాధిష్ఠానే మకారాఖ్యా శాంభవీ పర్యవస్థితా। మణిపూరే మహాస్థానే శికారాఖ్యా మహేశ్వరీ। అనాహతే వకారాఖ్యా సదాశైవీ వ్యవస్థితా। విశుద్ధేతు యకారాఖ్యా సాక్షా ద్విశ్వేశ్వరీ స్థితా। ఆజ్ఞా చక్రే మహాదేవి తారాఖ్యా సముపస్థితా। అచారాఖ్యా సి

---

ని నిర్ణయింపఁ బడియెను. కాబట్టి తారకమను పేరు శివనామమునకేగాని రామనామమునకు లేదు.

ప్ర. విశేషార్థ ప్రకాశిక యందు. ఓమంత మంత్రరూపాయ అనుటచే పంచాక్షరికి ప్రణవము చివరను ఉండవలయునని తెలియు చున్నది. ఓంకార వదనా దేవి అనువచనమును బట్టియు ప్రణవము చివరనె యుండ వలయునని యేర్పడు చున్నది. ఇటులే శివానుభవ సూత్రమునందును, మూలాధార స్థానమున నకారముండునని మొదలు పెట్టి చివరకు ఆజ్ఞా చక్రమునందు ప్రణవముండునని చెప్పిన వచనములను బట్టియు ప్రణవము కొనకె యుండవలెనని యేర్పడు చున్నది. మఱియునందే- నకార మాచార లింగమని యారంభించి ప్రణవము మహాలింగ మనుట చేతను- ప్రణవము షష్ఠమని యారంభించి- నకారము ప్రథమమని చెప్పుటచేతను శ్రీపంచాక్షరీ మహా మంత్రమునకు చివరనే ప్రణవ ముండ వలయునని స్పష్టమగు చున్నది కాదా?

ఉ. సకలప్రమాణముల యందును పంచాక్షరికి ప్రణవము మొదటనే యుండునని చెప్పఁబడి యున్నది కాన దానిఁబట్టి మంత్రమునకు ప్రణవము చివర నుండ వలయు ననువాదము స్వప్రమాణ విరుద్ధ మగుటంజేసి యది గ్రాహ్యము కాదు.

నుపనయనము సాగుచున్నదనవచ్చును. వైశ్యులు ద్విజులైనను గొన్నిశాఖలయందుఁ దప్పఁ దక్కినచోట్ల పురాణోక్తముకాక పురోహితముఖోక్తముగా నుపనయనాదిసంస్కారములు సాగుచున్నవి. ఇదొక దుఃఖవార్త యనవచ్చును. ఆచర్చ యీకథకు సంబంధించినది కాదు. కాని యించుక సంబంధము కలదు. కానఁ గ్రిందవ్రాసెదను. దాని నవసరమనితోఁచినవారు చదువుకొనవచ్చును. ఇటనుండి శ్రీకృష్ణజన్మఖండము ననుసరించి కథ వ్రాయఁబడును.

వసుదేవుఁడు తనయులకు నుపనయనము జరపఁదగునను నూహాగలవాఁ డెపుడయ్యెనో అపుడే గర్గముని యరుదెంచెను. దండము ఛత్రము జటలు దాల్చి బ్రహ్మతేజము నలుదెసల

---

వైశ్యకమలాకరమునందు—

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా వర్ణాస్త్రయో ద్విజాః,
యుగేయుగే స్థితా స్సర్వే కలావాద్యంతయోస్థితిః.

మాత్స్యపురాణమునందు—

నాధీయంతే కలౌ వేదాన్న యజంతే ద్విజాతయః,
ఉత్సీదంతి తథా చైవ వైశ్యైస్సాకంతు క్షత్రియాః.

అత్రిస్మృతియందు—

నందాంతం క్షత్రియకులం వేదవైదికసంయుతం,
భవిష్యతి తతశ్శూద్రప్రాయం వైశ్యకులం తథా.

మాధవాచార్యకృత పరాశరస్మృతిభాష్యమునందు—

క్షత్రియవైశ్యజాత్యోస్స్వరూపత ఏవోచ్ఛిన్నత్వాత్.

గీ యంత్రలేఖన క్రమమేవ బోధయతి నతు మంత్రపాఠ క్రమమపి. న తేనాపి తాదృశార్థ ప్రతిపత్తిః॥ నచ, విలిఖితే యంత్రే అధస్తాత్ప్రభృతి వాచ్యమానాని మంత్రాక్షరాణి ప్రణవావసానానీతి స్పష్టం జ్ఞాయతే ఇతి వాచ్యం, తథా యంత్రే అధస్తాత్ప్రభృత్యేవ మంత్రాక్షరాణి పాఠ్యానీతి వచనాదర్శనేన తదనురోధేన ప్రణవాంతమంత్ర పాఠాంగీకారస్యాయుక్తత్వాత్ ॥

నన్వేవం మూలాధారే నకారాఖ్యా ఇత్యారభ్య ఆజ్ఞా చక్రే మహాదేవీ తారాఖ్యా సముపస్థితా ఇతి ఆచార్యాఖ్యం నకారస్స్యాదిత్యారభ్య, ఓంకారో మహదుచ్యత ఇతి, తథా, షష్ఠ బ్రహ్మ భవేత్తార ఇత్యారభ్య, నకారః ప్రథమం భవేత్, ఏవం షడక్షరాణ్యేవ బ్రహ్మాణి క్రమశో విదురితి వచనైశ్చ నకారాదీని ప్రణవావసానాని షడక్షరాణి క్రమశః పాఠ్యానీతి స్పష్టం జ్ఞాయత ఇతి చేత్ న, మూలాధారే నకారాఖ్యా ఇత్యాది వచనానాం షట్చక్రోపాసనా పరత్వేన తా

---

మాణాంతరమూలను విరోధింపదు॥ ఓంకార వదనాదేవీ అనువచన మైననో షడక్షరీ మంత్రము వ్రాయు విధమును దెల్పునేగాని మంత్రము నిట్లు పఠింప వలయునని దెలుపుటకై ప్రవర్తించినది కాదు॥

ప్రః యంత్రము వ్రాసినమీద దిగువనుండి మీదికి చదువునెడ ప్రణవము కొనకే వచ్చును కాదా?

ఉః యంత్రము వ్రాసిదాని దిగువనుండి మీదికే చదువ వలయునని యెచటను న్నది? మీదినుంచి యేల చదువరాదు? కాబట్టి ఇది యంత్రోద్ధార వచనముగాని మంత్రము యొక్క పాఠక్రమమును చెప్పు వచనము కానేరదు॥

ప్రః ఆట్లైన- మూలాధార స్థానమున నకార ముండునని యారంభించి- కొనకు ఆజ్ఞా చక్రమున ప్రణవ ముండు ననియు- నకారమాచార లింగమని యారంభించి చివరకు ప్రణవము మహాలింగ మనియు- ప్రణవము ఆఱవది యని యారంభించి నకారము ప్రథమ మనియు జెప్పిన వచనముల కెట్టులర్థము చెప్ప వలయు?

ఉః మూలాధారస్థానమున నకార ముండు నని మొదలగు వచనములు షట్చక్

చుచుఁ బతివ్రతయగు యశోదను వసుదేవునిం జూచి యిట్లు పలికెను. వసుదేవా! నామాట నాలకింపుము. బలరాముని శ్రీకృష్ణునిం బరికింపుము. ఉపనయనసంస్కారమునకుఁ దగినవయస్సు వీరి కొనఁగూడినది. ఈవిషయము నీ వింతకుముం దూహింపలేదా. అన విని వసుదేవుఁ డిట్లు బదులు చెప్పెను. యదుకులపూజ్యదైవతమవు. కావున మంచిముహూర్తమును బరికింపుము. ఉపనయనసంస్కారము చేయఁదగియున్నది. సదాచారముకదా. దానిం జేయఁదగువారు మీరుకాదా. నేను నావిషయమునే యోజించుచుండఁగా మీ రరుదెంచితిరి. అనుటయు గర్గముని పరమానందమంది యిట్లు పలికెను. బంధువుల

---

లనుబట్టియవి నశించినవని పూర్వపక్షులు వాదింతురు. నందాంతం క్షత్రియకులమ్మనునట్టి యత్రిస్మృతివాక్యమునుబట్టి నందుఁడు రాజ్యమేలినంతదనుక నా రెండుకులము గలవని సిద్ధాంతము. ఇదియే దీనిసారము. ఈయొక్కమాటతోఁ బైవాదము పూర్ణముగా నశింపదు. ఇంచుక వివరింపక తప్పదు. కొందఱు వాదించువాదముపై నొక ప్రశ్నము చేయవచ్చును. ఏమనఁగాఁ బరిశుద్ధక్షత్రియవైశ్యులు కలియుగముననే యుండరా? లేక కలియుగమునఁ గొంతకాలము గడవఁగాఁ దర్వాతనా యని. కలియుగమునఁ గొంతకాలమనఁగా నెంతకాలమనియుఁ బ్రశ్నమే. ఇందుఁ గలియుగమునందే పరిశుద్ధక్షత్రియవైశ్యులు లే రనరాదు. అట్టివారు కలరని యనేకగ్రంథములు ఘోషించుచున్నవి. ఈమాట కేమియాధారములని యడుగుదురేమో. విష్ణుపురాణమున నీవిధముగ నున్నది. దానింజూచిన మీసందియ మంతరించునని చెప్పెదను.

"అతఃపరం భవిష్యానహం భూపాలాన్ కీర్తయిష్యామి. యోఽయం సాంప్రతమవనీపతిః పరిక్షిత్, పరిక్షితః జనమేజయ శ్రుతసేనోగ్రసేన భీమసేనా శ్చత్వారః పుత్రా భవిష్యంతి. తస్యాపి శతానీకో భవిష్యతి. ౧.

సిద్ధ్యతి తస్మాత్ప్రణవాయాః పంచాక్షర్యాః షడక్షరీతి వ్యవహారో గౌణ ఏవ న ముఖ్యః తథాపి, షట్సూలో పాసన పరైః ప్రాగ్భిః తదనురోధాయ షడ్వర్ణత్వేనైవ గృహీతః తత్ర పంచాక్షరీ సముసత్తాకస్య ప్రణవస్య సర్వప్రకృతిభూత మహా లింగ వాచకత్వం తత్ధ్యాన భూతాజ్ఞా చక్రో పాస్యత్వంచ యుజ్యత ఇత్యాశయేనైవ షష్ఠ్యా ముక్తం నమంత్ర పాఠక్రమే షష్ఠత్వ మిత్ మతం తేషాం అన్యథా, సర్వ ప్రమాణ వ్యాకులీ భావాదితి, సర్వత్రాపి ప్రణవాదిత్వ మేవాస్యాః ప్రమితం తద్యథా, జాబాలే, ఓమితి హ్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్ తతశ్శివా యేత్యక్షర త్రయ మితి, తథా, శివపురాణే॥ ఇ హౌం నమశ్శివా యేతి మంత్రేణానేన సిద్ధయ ఇతి తథా, తత్రైవ, మంత్రం సుఖముఖోచ్చార్య మశేషార్థ ప్రసిద్ధయే। ప్రాహౌం నమ శ్శివా యేతి సర్వజ్ఞ స్సర్వ దేహినా మితి, ఏవం, ఏతావద్ధి శివజ్ఞాన మేతావత్పరమం పదం। యదోం నమ శ్శివాయేతి శివ వాక్యం షడక్షరమితి, కించ, తత్రైవ, కింతస్య బహుభి ర్మంత్రైః శాస్త్రైర్వా బహువిస్తరైః। యస్యాం

---

ఉ॥ పెద్దలు గ్రహించినది విరుద్ధముగాదు॥ ఏలనిన- మహాలింగము ప్రకృతి- దానియొక్క- వికృతులే కడమయైన లింగములు అయినను మహాలింగము నాయా లింగములలో నొకదానినిగా గ్రహించినట్లె ప్రణవమును నొక్క- వర్ణముగా గ్రహించిరి॥ ప్రణవంబును- ప్రణవ వాచ్యమగు మహాలింగంబును సత్తమమగు నాజ్ఞా చక్రంబున ధ్యానము చేయఁ దగినవను నూహతో పెద్దలు చెప్పిరిగాని మంత్రమునకు చిట్టచివరనే ప్రణవముండ వలయునను నుద్దేశముతోఁ గా వేరదు॥ ఇట్లు లంగీకరింప కుండినయెడ సర్వప్రమాణంబులును విరోధించును॥

ఎట్లనిన- జాబాలమునందు- ప్రణవమును ముందు చెప్పి- తరువాత నమః అనియు, అనంతరము శివాయ అనియు నుచ్చరింప వలయునని యున్నది॥ శివపురాణము నందును, ఓంనమశ్శివాయ అనుమంత్రముచే సకల సిద్ధులు కలుగునని యీ మొదలగు పెక్కు- చోట్ల మంత్రమునకు మొదటనే ప్రణవముండునని చెప్పఁబడి యున్నది॥ అట్లు- సూతసంహిత యందును॥ మొదట ప్రణవము- రెండవది నకారము అని మొదలుగా ప్రణవము మంత్రాది యందె యుండునని నిర్ణయింపఁ బడియెను॥

అంతట శ్రీకృష్ణమూర్తి తనయాత్మను దేవతలను మహర్షులను స్మరించెను. సిద్ధపుంగవులం దలంచెను. భక్తవత్సలుఁడు కావున భక్తులనెల్ల మనసున స్మరించి రావలయునని సంకల్పించెను. భగవంతుఁ డిట్లు లెల్లరను స్మరించినంతనే వారెల్లఁ దన్మహూర్తశుభదినమునకుఁ దమంతన తమరే యరుదెంచిరి. తోలు దొలుత మునీంద్రు లామోదమానసులై వచ్చిరి. వారిపిదప

---

తతోఽయోయోనిః, తస్మాత్ క్షేమకః. ౧.అత్రాయం శ్లోకః. బ్రహ్మక్షత్రస్య యోయోని ర్వంశో దేవర్షిసత్కృతః, క్షేమకం ప్రాప్య రాజానం సంస్థాం ప్రాప్స్యతి వై కలౌ. ఇతి ఏవమేవ కలౌ బృహద్బలాదారభ్య సుమిత్రాంతమిక్ష్వాకువంశీయాః. శ్లో. ఇక్ష్వాకూణామయం వంశ స్సుమిత్రాంతం భవిష్యతి, యతస్తం ప్రాప్య రాజానం సంస్థాం ప్రాప్స్యతి వై కలౌ. ఇతి. ఏవం మాగధాః. బృహద్రథాంతా ద్వాత్రింశన్నృపాశ్చ. అధీతవేదో జనమేజయః సర్పయాగం కృత్వా అశ్వమేధకరణాయ ప్రవృత్తః వ్యాసేన నివారిత ఇతి. కథా హరివంశే భవిష్యత్పర్వణి సమ్యగ్వర్తతే. తతః యోయం రిపుంజయో నామ బార్హద్రథః తస్య సుక్రీతో నామామాత్యో భవిష్యతి, సచైనం స్వామినం హత్వా స్వపుత్రం ప్రద్యోతనామానమభిషేక్ష్యతి, తస్యాపి. బిలకో నామ పుత్రో భవిష్యతి, తతో విశాఖయూపః, తత్పుత్రో జనకః, తస్య చ నందివర్ధనః, తదనంతరం శిశునాగః, తతః కనకవర్ణో భవితా, తస్య పుత్రః క్షేమధర్మా, తస్యాపి క్షత్రౌజాః తత్పుత్రో విధిసారః, తతశ్చాజాతశత్రుః, తస్యాప్యర్భకః, అర్భకాచ్చోదయనః, తస్మాన్నందివర్ధనః, తస్మాన్మహానందీ, మహానందనశ్చ శూద్రాగర్భోద్భవో మహాపద్మనందో, నందః పరశురామ ఇవాఖిలక్షత్రాంతకారీ భవిష్యంతి, తతః ప్రభృతి శూద్రా భూపాలా భవిష్యంతి. స చైకచ్ఛత్రామనుల్లంఘితశాసనో మహాపద్మః పృథివీం భోక్ష్యత ఇతి. మాత్స్యపురాణేఽపి. మహానందిసుతశ్చాపి శూద్రాయాం కలికాంశజః,

ఏవేతి స్పష్టమేవ। లోకేప్యా బాలముక్తోపదేశే ప్రణవాద్యా ఏవ పంచాక్షర్యా ఉపదేశ్య మానత్వేన తత్పక్షస్య లోకశాస్త్ర విరుద్ధత్వ మక్షత మేవ॥ అత్ర కేచిత్ – విశేషార్థ ప్రకాశికానుభవ సూత్రయోః పంచాక్షర్యాః ప్రణవాంతత్వ ప్రతీతేః ప్రతిపాదనాత్ మాయిదేవాచార్యస్య మతే పంచాక్షర్యాః ప్రణవాంతత్వమితి వదంతి తదసంగతం॥ సర్వప్రమాణ విరుద్ధం మాయిదేవాచార్యస్య మత మిత్యంగీకారాపేక్షయా తదీయానాం కేషాంచిద్వచసాం సర్వ ప్రమాణానుకూలార్థ పరత్వ వర్ణన స్యౌచిత్యాత్ – మాయిదేవాచార్యేణైవ అనుభవసూత్రే॥ ఏవం షడక్షరాణ్యేవ బ్రహ్మణి క్రమశో విదురితి వచనానంతర మేవ॥ ఓంకారః పరిపూర్ణత్వా త్త్వచి సర్వత్ర వర్తతే నకారో రుధిరే స్యాతి మకారో మాంస సంచయే శికారో మేదసి స్యాతి వకారో౽స్థిషు తిష్ఠతి। యకార స్యాతి మజ్జాయాం శుక్లే స్యాతి షడాత్మక ఇతి॥ తథా- తదనంతరాధికరణే। ఓమితి జగదఖిలం స్యాన్నమ ఇతి నమవేదమ

---

ని ఓంకారపూర్వ మంత్రః అను శ్లోకమున కనంతర మున్న శ్లోకములకును విరుద్ధమే॥

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ ఈమంత్రమునకు ప్రణవము మొదట నుండును అని తరువాత శ్లోకముననే చెప్పఁబడి యున్నది॥ ఆపరిచ్ఛేదము యొక్క- చివరనుగూడ- ప్రణవ సహితమాదో॥ అద్ది యందు ప్రణవముతోఁగూడ యున్నది అనియు కలదు॥ దీనింబట్టి ఓంకారముకంటె మంత్రము ముందు నుండు ననుటది విపరీతార్థమని తేలినది॥ ఇదిగాక- లోకమున- పసితనమున నక్షరాభ్యాసమున గూడ ప్రణవాదిగానె యీమంత్రము ఉపదేశింపఁబడు చున్నను ప్రణవము మంత్రాంత్రమునందె యుండు ననువాదము సర్వలోక శాస్త్ర విరుద్ధమని తెల్లమైనది॥

ప్ర॥ విశేషార్థ ప్రకాశిక- అనుభవ సూత్రము ఈ రెంటి యందు పంచాక్షరి ప్రణవాంతమని తెలియుచున్నదిగాన మాయిదేవా చార్యుని మతమునందు పంచాక్షరికి చివనే ప్రణవమనియేల అంగీకరింప రాదు?

ఉ॥ మాయి దేవాచార్యుని మతము సర్వశాస్త్ర విరుద్ధమని యంగీకరించుట కంటె విశేషార్థ పకాశి కాదుల లోని వచనములకు ప్రమాణాంతరను కూలమగు వర్థము-

ఘాతలు, యోగులు, శ్రీకృష్ణు నామహోత్సరమున దర్శింప నరుగుదెంచిరి. తల్లి పార్శ్వమునఁ గలబంధువు లాదృతి నేతెంచిరి. తండ్రి వంకవారెల్లఁ దమపనియే యన్న సంతోషమున వచ్చితి. బంధువులకు బంధువులుగూడఁ బిలిచినదియే చాలునని యచ్చటికిఁ జేరిరి. భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు కర్ణుఁడు లోనగువారు వచ్చిరి. ధృతరాష్ట్రుఁడు పుత్రులంగూడి వచ్చెను. భర్తృవిహీనయగు కుంతీదేవి పుత్త్రులంగూడి హర్ష శోకసమాకులస్వాంతయై యరుగుదెంచెను. నానాదేశరాజులు రాజపుత్త్రులు వేడుకలార వచ్చిరి. అత్రియు, వసిష్ఠ చ్యవన భరద్వాజులు, యాజ్ఞ

---

"శ్లో. తే తు పారిక్షితే కాలే మఘాస్వాస న్మహర్షయః,
తదా ప్రవృత్తశ్చ కలిర్ద్వాదశాబ్ద శతాబ్దకః."

అని విష్ణుపురాణమునందుఁ గనఁబడియెడిని. దీనింబట్టి కలియుగారంభ మెప్పుడని నిర్ధారణము చేయవచ్చును. ఏకాలమున సప్తర్షులు మఘానక్షత్రమున నుండిరో అపుడు కలియుగారంభము. పరీక్షిత్తు రాజ్యకాలము నదియే. కలియుగప్రమాణము దేవమానము ననుసరించి పండ్రెండువందలసంవత్సరములు దేవమానమనఁగా,

"శ్లో. ఐందవ స్తిథిభిస్తద్వ త్సంక్రాంత్యా సౌర ఉచ్యతే,
మాసైర్ద్వాదశభిర్వర్షం దివ్యం తదహ ఉచ్యతే"
తత్షష్టి షడ్గుణా దివ్యం వర్షమాసుర మేవ చ."

అని సూర్యసిద్ధాంతమున మొదటియధ్యాయమున నున్నది. మనుష్యమానమున మూఁడువందల యఱువదివర్షములైన దేవమానమున నొక్కవర్షమగును. కావున దేవమానము ననుసరించిన కలియుగప్రమాణమగు పండ్రెండువందలను మున్నూటయఱువదిచే గుణించిన ౪౩౨౦౦౦ నాలుగులక్షలు ముప్పదిరెండు వేలసంవత్సరములు మనుష్యమానమున నగును. మఱియును, విష్ణుపురాణ

శ్రుతౌ। తత్ర పంచాక్షర స్తత్ర శివ ఇత్యక్షర ద్వయమితి॥ విముక్తిసాధకత్వం యథా, సూతసంహితాయాం॥ షడక్షరం ప్రవక్ష్యామి సమాసేన సుశోభనం। యేన సంసార విచ్ఛిత్తి ర్బ్రహ్మేంద్రాది విభూతయ ఇతి॥ ఆజ్ఞా సిద్ధత్వం యథా, శివ పురాణే॥ ఆజ్ఞా సిద్ధ మసందిగ్ధ వాక్య మేతచ్ఛివాత్మకం। మంత్రం సుఖ ముఖోచ్చార్య మశేషార్థ ప్రదాయకం। శ్రుణోమ్యం నమ శ్శివాయేతి మూల మంత్రంహి శైవక మితి॥

అథమంత్రార్థ నిర్ణయః

ఓం ఇతి బ్రహ్మ వాచకః, ఓమితి బ్రహ్మేత్యాది శ్రుతేః॥ హర స్సర్వస్య కారణా ద్విభుత్వాద్విష్ణు రుచ్యతే, స్సర్వజ్ఞ స్సర్వవిజ్ఞానా దవనాదోమితి స్మృతిఇతి కూర్మవచనాచ్చ, అవ తేష్టి లోపశ్చేతి సూత్రే

---

ప్ర॥ ఈమంత్రము సమస్త పాతకములఁ బోఁగొట్టు ననుట యెట్లు?

ఉ॥ శివతత్త్వ సుధానిధి యందు॥ శివనామ మెన్నిపాపములఁ బోఁగొట్టునో అన్ని పాపములు చేయువాఁడు కలియుగమున నే యుండఁడు అని కలదు॥ కలియుగమున నే లేకున్న నింకే యుగమందు నుండును? ఇదిగాక- చండాలుఁడైనను శివ అనిపలుకు వెడ వానితోఁగలసి కూర్చుండ వచ్చును. భుజింప వచ్చును అనియు శ్రుతియే చెప్పుచున్నది॥ దీనింబట్టి శివనామము సకలపాప హరమని స్పష్టముగు చున్నది॥

ప్ర॥ ఈమంత్రము వేదసారమనుట యెట్లు?

ఉ॥ విద్యలలో నెల్ల శ్రుతియు-శ్రుతులలో నెల్ల రుద్రాధ్యాయంబును- నందు పంచాక్షరయు- అందు శివయను రెండక్షరములును సత్కృష్టములనుటచే నీమంత్రము వేద సారమని తెలియుచున్నది॥

ప్ర॥ ఈ మంత్రము ముక్తి సాధనమనుట యెట్లు

ఉ॥ సూత సంహిత యందు॥ ఏ మంత్రముచే సంసార బంధము తొలంగునో అట్టి షడక్షరీమహా మంత్రమును చెప్పుచున్నా ననుటచే ముక్తి హేతువని తెలియు చున్నది॥

ప్ర॥ ఇది ఆజ్ఞాసిద్ధమని యెఱుగలరు?

ఉ॥ శివపురాణమునందు॥ ఈమంత్రము ఆజ్ఞాసిద్ధమని కలదు॥

మంత్రార్థ నిర్ణయము

ఓం అనఁగా బ్రహ్మము॥ ఓమితి బ్రహ్మ అను శ్రుతి వలన నిట్లు తెలియు చున్నది॥

లును, బురుజిత్తును, భృగు మరీచి మధుజిత్కశ్యపమునులు, దేవమాతయగు నదితియు, దైత్యమాతయగు దితియు నరుదెంచిరి. వారివెంట సుమంతు సుభానువులు. నేక కాత్యాయన మార్కండేయులును, లోమశ, కపిల, పాణిని, పారియాత్ర, పారిభద్ర, పుంగవ, సంవర్తోతథ్యనరులును, నేనును, విశ్వామిత్ర, శతానంద, జాబాలి, తైతిల, సాందీపనియు వచ్చిరి. సాందీపని బ్రహ్మాంశసంభూతుఁడు యోగివర్యుఁడు నగునని యెఱుం

---

సమాధాన మేమనఁగా, "శ్లో. షష్ఠాంశ స్సంధ్యయో స్స్వకః" అను సూర్య సిద్ధాంతవాక్యమునుబట్టి ఆరంభాంత్యకాల సంధి ప్రమాణముయొంగ ప్రమాణమున నాఱవభాగమని తెలియఁదగును. నాల్గులక్షలు ముప్పదిరెండువేలలో నాఱవభాగము డెబ్బదిరెండువేలు. దీనిని మూఁడులక్షలు నఱువదివేలతోఁ గలిపినఁ గలియుంగప్రమాణము నాల్గులక్షలు ముప్పదిరెండువేలని స్పష్టమగును.

మఱియుం విష్ణుపురాణమునందు. "శ్లో. యావ త్పరీక్షితోజన్మ యావన్నందాభిషేచనం, ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచాశ దుత్తరమ్." అని యుండుటవలన పదివందల యేఁబదివత్సరములు పరీక్షిన్నందభూపతుల యంతరకాలమని స్పష్టమయ్యెడిని. భాగవతమునందు. "శ్లో. ఆరభ్య భవతో జన్మ యావన్నందాభిషేచనమ్, ఏకమేవ సహస్రంతు శతం పంచ దశోత్తరమ్." అని యుండెడు. దీనింబట్టి వేయినూటపదునైదువత్సరములని స్పష్టపడుచున్నది. మత్స్యపురాణమునందు. "శ్లో. మహాపద్మాభిషేకాత్తు యావజ్జన్మ పరిక్షితః, ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచ శతోత్తరమ్." అని యున్నది. దీనింబట్టి పరికింపఁగా, పరిక్షిన్నందరాజుల కంతరకాలము పదునైదువందలసంవత్సరములని కనుపట్టుచున్నది. ఈ మూఁడుగ్రంథములనుబట్టి పదివందల యేఁబది వత్సరములు, పదునొకండువందల పదునైదువర్షములు, పదునైదువందల సంవత్సరములు, అని కనఁబడుచున్నది.

స్య యః పర స్సమహేశ్వర ఇతి సర్వవేద సారస్య ప్రణవస్య పరమే శ్వర ఏవ వాచ్య ఇతి శ్రుత్యైవ నిర్ణీయతే॥ అత ఏవ, యః పున రేతం త్రిమాత్రే ణోమిత్యేతే నైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత ఇత్యాథర్వణోపనిషది దహరాది కరణ భావలింగో పాసనా పరబ్రహ్మ వాచకేన త్రిమాత్రేణ ప్రణవేన తదనుసంధాన పూర్వకం కర్తవ్యేతి విహితా॥ తస్మా దాదౌ ప్రణవ గ్రహణేన సకల వేద వేదాన్త ప్రతిపాద్యాయే త్యర్థో లభ్యతే- శివాయేతి, శివశబ్దశ్చ సమేధయతి యస్మిన్త్స్వం సర్వార్థానా ముపక్రమం। శివ మిచ్ఛన్మనుష్యాణాం తస్మా ద్దేవ శ్శివ స్స్మృత ఇతి మహాభారతే శివశబ్దస్య మనుష్యాది హితైషిత్వే తత్ప్రీ తీప్సితపురుషార్థోప యోగి సకల వ్యాపార సమేధయితృత్వం బోధయతి॥ అస్మిన్వచనే మనుష్య గ్రహణం- హ్యుద్యపేక్షయాతు మనుష్యాధికా రత్వాదితి సూత్ర ఇవ దేవాదీనా ముప్యుప లక్షణం॥ యత్తో మహాభా రత ఏవ॥ సమారభవంతి మే సర్వే దానవా శ్చామరాశ్చయే। శివోస్మి

---

కాబట్టి ఓం అనగా సకలవేదాంత ప్రతిపాద్యుఁడను అని యర్థము.

శివాయ = శివశబ్దమున కర్థమేమనిన దేవ మనుష్యాదుల యొక్క హితమునుగోరువాఁడును మనుష్యాదుల పురుషార్థములకు నుపయోగించు సకలవ్యాపారముల నొడఁగూర్చు వాఁడును నని యర్థము॥ ఇందు మనుష్య శబ్దము దేవాదులకు నుపలక్షణ మనియే గ్రహింప వలయును॥ ఏలనిన దేవతలు రాక్షసులును నాకు సమానులే॥ సర్వ భూతములకు శుభమును గోరుదును. గానినాకు శివుఁడని పేరుగలదని పరమేశ్వరుఁడు చెప్పె నని మహాభారతమునందే యున్నది గాన నచ్చట మనుష్య పదము దేవాదులకు నుప లక్షణమని తెలియుచున్నది॥

వశ కాంతౌ అను ధాతువు మీద ఇచ్ఛాయుక్తుఁడు అను నర్థమునందు వర్ణ వ్యత్యయమువచ్చి శివశబ్ద మేర్పడియెను॥ హిసి ధాతువుమీద హింసించు అనునర్థము నందు సింహ అనియు వశ కాంతౌ అను ధాతువుమీదశివయనియు పశ్యతి అనునర్థమునందు కశ్యప అనియు వర్ణ వ్యత్యయముచే నేర్పడియెనని వైయాకరణు లంగీకరించి యున్నారు.

దానింబట్టి శివుఁడనగా ఇచ్ఛాయుక్తుఁడు నని యర్థము కాగా ఇచ్ఛ దేనివిషయమై అనియాకాంక్ష కలుగగా దేవాసుర మనుష్యాదుల యొక్క శుభమువిషయమైయు

యమున హంసవాహనారూఢుండై సస్మితముఖపంకజుండై పర మేష్ఠియు, రత్నవిమానారూఢుండై పార్వతింగూడి పరమేశ్వ రుండును, నందీశ్వరుండును, మహాకాళుండును, వీరభద్ర సుభ ద్రక మణిభద్ర పారిభద్ర కార్తికేయగణేశ్వరులును విజయం

అనునదియుం బరస్పరవిరోధము గలిగినదగును. ఆవిరోధము మాన్ప శక్యము గాకయుండును. ఏలయనఁగా,

"శ్లో. సప్తర్షీణాం తు యౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితౌ దివి,
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమం నిశి.
తేన సప్తర్షయో యుక్తా స్తిష్ఠం త్యబ్దశతం నృణాం,
తేతు పారిక్షితే కాలే మఘాస్వాసన్ ద్విజోత్తమ."

అను విష్ణుపురాణవచనము ననుసరించి సప్తర్షులమండల మొకనక్షత్రమున నూఱువత్సరము లుండును. ఆవత్సరములు దేవమానముచేతనని యొఱుంగఁ దగు. మనుష్యమానముచేతనే యని యంగీకరించినయెడలఁ గలియుగప్రమాణ మున బరిక్షిజ్జన్మము, రాజ్యారంభకాలము నెన్నిపర్యాయములో రావలసి యుండును. ఇపుడు కలియుగమున నయిదువేలకు మించినసంవత్సరములు గతించినవని యందఱు అంగీకరింతురు. మనుష్యమానమున నని యంగీకరింతు రేని సప్తర్షిమండల మార్ద్రానక్షత్రమున నుండవలయును. కాని యిపు డామండలము మఘానక్షత్రమునందే యున్నది. కావున నాసంఖ్య మనుష్య మానమునఁగాదనుట సిద్ధాంతము.

మత్స్యపురాణమునందు—

"సప్తర్షయస్తు వర్తంతే యత్ర నక్షత్రమండలే,
సప్తర్షయస్తు తిష్ఠంతి పర్యాయేణ శతంశతం.
సప్తర్షీణాం తు పర్యాయే తత్సప్తశతం దివ్యసంఖ్యయా."

అని కనపట్టువచనమునకు మహావిరోధము సంభవించును.

స్మాత్ నిత్యనిర్ధూత నిఖిల దోషత్వం. సకల మాంగల్య గుణాకరత్వాక్ష రత్వంచ శివత్వమితి సిద్ధం॥ ఏతేన ఏత దుభయ ధర్మ వైశిష్ట్యం బ్రహ్మణో లక్షణ మిత్యంగీకుర్వతా మపి పరేషాం మతే ఏత దుభయ ధర్మ కత్వ రూప ప్రవృత్తి నిమిత్తస్య విష్ణు నారాయణాదిశబ్దేషు నిరూపయితు మశక్యత్వేన తాదృశ శబ్దవాచ్యానామే తాదృశ బ్రహ్మ లక్షణ ప్రతిపాదక బ్రహ్మమీమాంసా ప్రతిపాద్యత్వస్య సంభావితత్వ సంప్రతి పత్త్యా, బ్రహ్మమీమాంసావివరణ ప్రయాసః పరేషాం విఫల ఇతి సిద్ధం॥

అపిచ- యదా తమ స్తన్న దివా నరాత్రి ర్న సన్నచాస చ్ఛివ ఏవ కేవలః తదక్షరం తత్సవితుర్వరేణ్యం ప్రజ్ఞాచ తస్మాత్ప్రసృతా పురాణీతి శ్రుత్యా, తమో మాత్రావ శిష్ట కాల విశేషావస్థాయి త్వాక్షర శబ్ద వాచ్యత్వ సవితృ వరేణ్యత్వ బహుభవన సంకల్ప రూప జగత్కారణత్వాది రూపోపేత శ్శివ శబ్దేన నిగద్యతే, అన్యచ్చ, శివ ఏకో ధ్యేయ శ్శివంకర స్సర్వ మన్యత్పరిత్యజ్యే త్యథర్వశిఖా వచనేన సర్వోపా

---

యుండుటయు సకల మాంగల్య గుణములు గలిగియుండుటయు శివశబ్దార్థమని యేర్పడియెను॥

ఈ రెండును బ్రహ్మలక్షణములని బ్రహ్మమీమాంస యందు నిర్ధారణ చేయబడియున్నది॥ దానింబట్టి ఈ రెండు లక్షణములు శివశబ్ద వాచ్యమగు తత్త్వము నందు గలవని నిరూపించి శివశబ్దవాచ్యమే పరంబ్రహ్మ యనియు దానింబట్టి బ్రహ్మమీమాంస శివ పరమే యగుగాని దేవతాంతరపర మెన్నటికి గాదనియు శ్రీనీలకంఠ భగవత్పాదులవారు నిర్ణయించియుండిరి॥ అదిచూచి రామానుజుల వారును మధ్వాచార్యుల వారును లోగడ చెప్పిన రెండులక్షణములు శ్రీ నారాయణ మూర్తియందును గలవుగాన బ్రహ్మ మీమాంస నారాయణ పరమని భాష్యములు వ్రాసి యుండిరి. ఇందిది గ్రహింప దగినది॥ ఏమనిన నిర్దోషత్వము సకల మాంగల్య గుణవత్త్వము తమతమ దేవులయందే గలవని యెందరు వ్రాసినను నిజముగా నెద్దేవునియం దున్నది ఎద్దేవునియందు లేనిది మనముచూచి గ్రహింప జాలము॥ శ్రీనీలకంఠాచార్యులవారు శివశబ్దమునందే యీరెండు లక్షణములను దెలుపు సత్త్వముగలదని చూపియుండిరి గదా? వారితో వంతుకు బ్రహ్మమీమాంస నారాయణ పరమని భాష్యము చేసినవారు నిట్టిలక్షణముల దెలుపు సత్త్వము నారాయణశబ్దము నందుగ

వసుదేవునిం గాంచి వారెల్ల నానందాంబుధి నోలలాడిరి. అంతట వసుదేవుఁడు భక్తిభావమున నంజలి బంధించి యిట్లు పలికెను. పరమాత్మయనియు, పరబ్రహ్మమనియుఁ, బరమేశ్వరుఁడనియుఁ, బరాత్పరుఁడనియు, విధాతయనియు, జగత్పరిపాలకుఁడనియు, వేదజనకుఁడనియు, స్రష్టయనియు, సృష్టిహేతువనియు, సనాతనుఁడనియు, సురలకుఁ దదధిపతులకు మునీంద్రులకు సిద్ధేంద్రులకు గురువులకును గురుఁడనియుఁ, బొగడఁ

---

"శతం పంచదశోత్తరమ్."

అనుపాఠము నంగీకరించినయెడలఁ బూర్వాషాఢ నతిక్రమించి యుత్తరాషాఢను బొందును.

"పంచశతోత్తరమ్."

అనుపాఠమును గ్రహించినపక్షమునఁ గలియుగమే దాఁటిపోవును. కావున రెండవ మూఁడవపాఠములు వ్రాఁతపొరపాటువలనఁ గలిగినవనిచెప్పక తప్పినది కావు. గణితముగాన నిందుఁ బొరపాటులు తప్పక కనఁబడును. వారు చెప్పినప్రకారము లెక్కచేసితిమి కాని కలియుగకాలము సప్తర్షిమండల సంచారము కల్పించిన కాదు కదా. కావున రెండవ మూఁడవపాఠములు ప్రమాదము లనక యెవ్వరికిని దప్పదు. ఈవిషయమును దెలుపుటచేఁ దేలిన ఫలిత మేమనఁగా పరిక్షిన్నందరాజాంతరకాలము మనుష్యమానమున మూఁడు లక్షలు డెబ్బదియెనిమిదివేల సంవత్సరములు. కావున నాకాలమున నవఁగాఁ గలియుగమున మూఁడులక్షలు డెబ్బదియెనిమిదివేల వత్సరములుకాఁగా క్షత్రియ వైశ్యజాతులు శూద్రప్రాయులగుదు రనవచ్చును. కాని యిపుడన రాదని పురాణార్థములను జక్కఁగ నెఱింగినపెద్ద లంగీకరింపక మానరు.

ఇప్పుడు కలియుగమున నైదువేలు ఇరువదియెనిమిది (౫౦౨౮) సంవత్సరములు గతించినవి. ఇఁకమీఁదట మూఁడులక్షలు డెబ్బదిరెండువేలు

క్తి రిత్యామ్నాత మేవేతి సిద్ధ మేవ ముక్తి సాధనత్వ మస్య మహా
మంత్రస్య॥

కించ, అకారోకార మకార బిందు నాదా ఇతి సూక్ష్మ ప్రణ
వే విద్యన్తే పంచావయవాః, తద్వాచ్యార్థశ్చ స్థూల ప్రణవ రూప పం
చాక్షర్యవయవై ర్నకారాదిభి ర్నగద్యతే॥ తదుక్తం పంచాక్షర జాబా
లే॥ శివా దీచ్ఛా జ్ఞాన క్రియా పంచ కలా తదుత్తీర్ణా పరా కలాతత్సం
వళితం సాదాఖ్య పంచక సంపుటితం పరా సాదాఖ్యోత్తీర్ణం అకా
రోకార మకార బిందునాద పంచక వాచ్యార్థ స్థూల ప్రణవ రూప
నకారాది పంచాక్షర రూప షడధ్వ మయ విగ్రహ స్థూల సూక్ష్మాత్మక
రూప వ్యష్టి సమష్ట్యాత్మక షడక్షర స్వరూప పంచాక్షర ఓంనమశ్శి
వాయేతి సాక్షాచ్ఛిచ్ఛక్త్యా వినా భూతం మహాలింగం బిందు నాదా
త్మకం నాద వాచ్యం వాచకా భిన్నం అకారో నకార శ్చేశాన ము
ఖా దుకారో మకారశ్చ తత్పురుషాత్ మకారశ్శికార శ్చాఘోరాత్

---

నీవ్యకుడవని తెలుపును నమస్కారము పరానుగ్రహము సాధించునని లోకము వల్లనే తె
లియుచున్నది. కావున నమస్కారము వలన పరమేశ్వరుని యనుగ్రహము కలుగుననుట ని
శ్చయము॥ పరమేశ్వరు ననుగ్రహముననే గాని పరమ పురుషార్థము లభింపదని శ్రుతి చెప్పు
చున్నదిగాన నీమంత్రము ముక్తి ప్రదమనుట నిశ్చయము॥ కావుననే పరమేశ్వరుని నమఃప
దములో నుపాసింపవలయునని చెప్పి యిట్లు లుపాసించినవానికి సకల కామములు స్వాధీన
మగునని శ్రుతియే నిర్ధారణ చేసినది॥ సోశ్నుతే అను శ్రుతియును సకల కామావాప్తి యే
బ్రహ్మోపాసనా ఫలమని నిర్ణయించినది॥ కావున నీమంత్రము ముక్తి ప్రదమని స్పష్టము
గుచున్నది॥

ఇదిగాక, అకారము, ఉకారము, మకారము, బిందు-నాదము నని ప్రణవమున నై
దు భాగములు గలవు॥ వీనియర్థము నే నకారము మొదలుగా పంచాక్షరిలోని యైదువర్ణ
ములు బోధించు చున్నవి॥

ఈ యర్థము పంచాక్షర జాబాలమునందు గలదు॥ ఎట్లనిన, ప్రణవము స్థూలము,
సూక్ష్మమునని రెండు విధములు. అందు ఓమ్ అనునది సూక్ష్మ ప్రణవము, నమశ్శివాయ

టములు నశించును. కల్యాణములు లభించును. అని గణనాయకుం గాంచి మహానుభావా! సర్వదేవతలకంటె ముందు పూజగొను నధికారము గలిగి దేవతాగ్రణి యనంబరంగుచు, నొకకలశమునందు మంత్రములచే నావాహనముచేసిన యంతనే సర్వశుభములం గల్పించుచు, గణేశుండను విఖ్యాతిం గాంచి షడ్గుణైశ్వర్యములు వెలయ సర్వవిఘ్నములం బోం

అని కనుపట్టెడిని. భారతము కలియుంగమునకుగా వ్రాయంబడక కృతయుంగమున కని యెవ్వ రనరు కదా. వైశ్యుం డొకండు యజ్ఞముచేసినట్లు స్వకర్మనిరతుండైనట్లు పైవచనమున నున్నదికదా. కలియుంగమున వైశ్యులకు వేదాధికారము లేదన్నవాదము దుర్వాదమని స్పష్టమైనది కదా. సందాంతమే వారికి వేదాధికారము గలిగియుండునన్న వాదమునను సరించి కలియుంగమున మూండు లక్షలకుం బైంగా నెన్నియోవత్సరములు గడచినం గాని యావాదము చెల్లదని ముందే వ్రాసితిని గదా.

ఆపస్తంబధర్మసూత్రమునందు—

"స్వకర్మ బ్రాహ్మణస్యాధ్యయనమధ్యాపనం యజ్ఞో యాజనందానం ప్రతిగ్రహణం దాయాద్యగిశిలోంఛ అన్యదా్వ పరిగృహీతమేతాన్యేవ. క్షత్రియస్య అధ్యాపనయాజనప్రతిగ్రహణాని పరిహాప్యదండయుద్ధాదికాని క్షత్రియవద్వైశ్యస్య దండయుద్ధవర్జ్యం కృషిగోరక్షణవాణిజ్యాదికమితి."

అనియున్నది. వైదికకర్మములు క్షత్రియవైశ్యులకుం దుల్యములని యాపస్తంబుల తాత్పర్యమని తెలిసెనుగదా.

పరాశరస్మృతియందు—

"శ్లో. వైశ్యం వా క్షత్రియం వాపి నిర్దోషం యోఽభిశాతయేత్,
సోఽపి కృచ్ఛ్రద్వయం కుర్యాద్గోవింశద్దక్షిణాం దదత్."

అని కనంబడియెడిని. ఇట దోషమనంగా విధివిహితకర్మత్యాగమని యర్థము.

షడక్షరే। న తేన సదృశ స్తస్మాన్మంత్రో౽స్తి పరః క్వచిత్ । సప్త కోటి మహామంత్రై రుపమంత్రై రనేకధా। మంత్ర ష్షడక్షరో భిన్న స్సూత్రం వృత్త్యాత్మనా యథా॥ శివ జ్ఞానాని యావంతి విద్యాస్థానాని యాని చ। షడక్షరస్య సూత్రస్య తాని భాష్యం సమాసతః॥ కింతస్య బహుభిర్మంత్రై శ్శాస్త్రైర్వా బహు విస్తరైః యస్యాం నమ శ్శివాయేతి మంత్రోయం హృది సంస్థిత ఇతి॥

కించ నమః పదేన పరమేశ్వరస్య సర్వోత్కృష్టత్వం ప్రతిపాద్యతే॥ అతఏవోక్తం బ్రహ్మ దృష్ట్యధికరణే శ్రీనీలకంఠ భగవత్పాదైః॥ ఇదమేవచ పరిమాణత్వం యదుత్కృష్టం వస్తు తదేవ సర్వే నమంతి। అతః పరం బ్రహ్మ సర్వోత్కృష్టతయైవ సర్వనమస్కార విషయావగమ్యతే॥ ఋతగ్ం సత్య మితి మంత్రే ఉక్త విశేషణ విశిష్టం యత్పరం బ్రహ్మ విశ్వరూపాయ తస్మా ఏవ నమః సర్వోపి నమస్కారో నాన్యస్మై క్వచిదపీతి॥ కించాస్య పరబ్రహ్మణ ఉత్కృష్టతయైవ నమస్కార విషయత్వం

---

స్పుచున్నదో వాచ్యవాచక భావంబు నాదిగనే ప్రవర్తించుచున్నది॥ అనియున్నది॥ శైవవాయు సంహితయందును॥ షడంగములతో గూడిన వేదములు శాస్త్రంబులును షడక్షరము నందె యున్నవి॥ దీనితో తుల్యమగు మంత్రమింకొకటి లేదు। సప్తకోటి మహామంత్రములు, నుపమంత్రములు నివియన్నియును నీషడక్షరము నందె గలవు॥ షడక్షరమంత్రము సూత్రము దానికి సకలమగు శివాగమంబులు వేదశాస్త్రంబులును భాష్యంబులునగు కావున నీమంత్రము హృదయమున నున్నవారికి నితరములగు మంత్రములతోను నితర శాస్త్రములతోను ప్రయోజనములేదు.

ఇదిగాక నమః పదముచేత పరమేశ్వరుడు సర్వోత్కృష్టుడని తెలియుచున్నది॥ దాననె, బ్రహ్మదృష్ట్యధికరణము నందు నీలకంఠభగవత్పాదులవారు ఇట్లుచెప్పియుండిరి॥ ఎల్లరు గొప్పవానికే వందనముచేయుట సంప్రదాయ సిద్ధమైయున్నది॥ పరంబ్రహ్మ సర్వోత్కృష్టుడు గాననే యెల్లరకును వందనీయుడని తెలియుచున్నది॥ ఋతగ్ం సత్యా అను మంత్రము నందుఁ జెప్పఁబడిన విశేషణములుగల యేపరబ్రహ్మము కలదో విశ్వరూపముగల యా పరబ్రహ్మమునె సకలమును నమస్కారము చేయును గాని యింకొకనిఁ జేయనేరదు.

వాంఛితముల నొసంగు. శరత్కాలమున భక్తిచే నిన్నారాధించినఁ బ్రసన్నురాల వగుదువు. అట్టిపరదేవివగు నీవు నామందిరమునకు సర్వదేవతలం గూడి భక్తవత్సల యనుపేరు సార్థకము గాఁగ విజయంచేసితివి. ధన్యుఁడను. కృతకృత్యుఁడను. నాజీవనము సఫలము. నాగృహము పావనము. అని యిట్లు వేలువేలుఁబొగడి సకలమునీంద్రులను విప్రప్రవరులను సత్కరించి విడుదులంజూపి యందు నివసింపఁ జేసెను. అందఱు వసుదేవుఁడు వేర్వేఱఁ జేసినపూజల కానందించిరి.

---

"శ్లో. నందాంతం క్షత్రియకులం వేదవైదికసంయుతం,
భవిష్యతి తతశ్శూద్రప్రాయం వైశ్యకులం తథా."

అను వైశ్యకమలాకరవాక్యముచేత నందరాజు రాజ్యము పాలించినంతదనుక క్షత్రియవైశ్యులకు వేదాధికారముగలదని స్పష్టము కాక మానదు.

పరాశరస్మృతియందు—

"శ్లో. షట్కర్మాభిరతో నిత్యం దేవతాతిథి పూజకః,
హుతశేషం తు భుంజానో బ్రాహ్మణో నావసీదతి." 39

అనువచనము కలదు. దాని వ్యాఖ్యానమునందు వేదభాష్యకర్తయగు శ్రీమాధవాచార్యులు విశేషించి స్మృతు లుదహరించిరి కాని యం దెచ్చటను వైశ్యులకు వేదాధికారము కలదని సిద్ధాంతము చేయలేదు. కావున వేదాధికారము వైశ్యులకు లేదని కొందఱు విద్వద్వ్రతంసుల మనుకొనువారు పల్కుదురు. ఇంతకంటె మహాసాహసము వేఱొకటి కానరాదు. ఇట్లు వాదించువారు కొంతకాలము గాయత్రి నారాధించినఁగాని యీపాపము పోదని నాయూహ. ఏలయనఁగా. వేదాధికారము లేదనునిషేధ మేస్మృతియందైనఁ గనఁబడినపుడు వారికిని గలదని ప్రతిపాదింపవలయును. ఎందును నిషేధింపఁబడని విషయమును మరలఁజెప్పుట తెలివితక్కువచేతఁ గాక మఱేమిటి? పరా

శ్వర్యాదినా హి లోకే ధకం నమంతి తత స్సర్వ నమస్కార విషయత్వ యా సర్వోత్కృష్ట ముమా సహితం విరూపాక్ష మీశ్వర శబ్దైక వి షయ భూతం పరం బ్రహ్మేతి॥

పరంచ॥ శివానుభవ సూత్రే॥ ఓమితి జగదఖిలం న్యాస్యమ ఇతి నమమేదమపి శివాయేతి। మంత్రం సమర్పకోయం షడక్షరో మంత్ర నాయకో జయతి॥ నమ మేదం జగత్సర్వం శివాయేతి శివార్పణః। అభి ధత్తే ద్విమాత్రత్వా న్మంత్రో లుప్త మకారకః। తస్మా దర్పణ సద్భా వ జ్ఞాన మేవ సదాభ్యసేదితి॥ శ్రీషడక్షరస్య సర్వపదార్థ సమర్పణ ప రత్వ మావేదితం॥

ఇదంచ॥ శివానుభవ సూత్రే ఏవ॥ అంగం నమః పద మస్తా శి వ ఏవ లింగం సంబంధ ఏష చుదయేతి పదం తదుక్తం। లింగాంగ సం గ మపదత్రయ బోధనార్థం మంత్రోయ మేవ మభి ధాస్యతి మంత్ర రాజః॥ ఇతి లింగాంగ సంయోగ పరతయా వ్యాఖ్యాతః॥

---

గాన, ఉమాసహితుఁడు, విరూపాక్షుఁడు ఈశ్వరశబ్దైకవాచ్యుఁడు నగు పరబ్రహ్మము సర్వోత్కృష్టమైనదని స్పష్టమైనది॥ అనిసిద్ధాంతము చేసియున్నారు గాన ఈ మంత్ర మందగు నమః అనుపదముచే పరమేశ్వరుఁడు సర్వోత్కృష్టుఁడని విశదమైనది.

మఱియును, శివానుభవసూత్రమునందు ఓం అనగా నిజగమంతయును శివా య= శివుని కొఱకే యగుగాని, నమః, నమమ= నాకొఱకు గాదు అని యర్థము॥ ఈ విధముగ సర్వమును నీశ్వరార్పణముచేయు భావమనే జ్ఞానమునే యభ్యసింప వ లయునని యున్నది॥ కాఁబట్టి, యీ మంత్రరాజము సర్వపదార్థసమర్పణరూపమైన శ్వంపత్తిభావ సిద్ధజ్ఞానమును వ్యక్తీకరించుచున్నది॥

ఇదిగాక శివానుభవసూత్రమునందే, నమః పదము జీవుని, శివపదము పరమే శ్వరుని, అయ అనగా నిరువురయొక్క సాయుజ్యరూప సంబంధమును దెలుపునని యి ట్టిమంత్రము శివ జీవ సాయుజ్య రూపనిత్యసంబంధమును బ్రకటించు చున్నదని యు [illegible]యును.

[illegible] శివానుభవసూత్రమునందే॥ నమః అనుపదము, జీవుని, శివపదము పరమా త్మను, అయ అనునది యిరువరయొక్క నైక్యమును దెలియ చేయునని యున్నది కాదా?

శక్యముకాదు. ఆమనోహరశుభకర్మము నడుపఁ బెక్కుమంది మహర్షులను వసుదేవుఁడు నియమింప వరించెను. గర్గముని బ్రహ్మత్వమున నుండెను. వారినెల్లఁ దొలుదొలుత విధిమంతముగా వసుఁదేవుఁడు చందన సుమనోమాలికారత్నాలంకారాదుల నర్చించి సంతుష్టమతులనుగా నొనరించి యుచితాసనములఁ గూరుచుండఁ జేసెను. వారినడుమ రత్నసింహాసనమున గణపతిని గూరుచుండఁ జేసెను. శుభకర్మమునకు ముందు గణపతిని బూజించుట సదాచారము కాన నాకార్యమునకై యాగణాధి

---

ఆపస్తంభ ధర్మసూత్రమునందు—

"సూ. అశూద్రాణా మదుష్టానా ముపాయనం వేదాధ్యయన మగ్న్యాధేయం ఫలవంతి చ కర్మాణి." అనియున్నది. దీనికిభాష్యము.

"శూద్రవర్జితానాం త్రయాణాం వర్ణానాం అదుష్టకర్మణా ముపనయనాదయోధర్మాః." అని,

దీనింబట్టి కొందఱు "అదుష్టకర్మణామ్" అని భాష్యమునం దున్నదిగాన నిప్పటివైశ్యులకుఁ బితృపితామహ ప్రపితామహులవఱకు నుపనయనసంస్కారము లేదుగావున వ్రాత్యత్వమలవడెననియు, దానిచే వేదోక్తకర్మార్హత పోయినదనియుఁ బలుకుదురు. ఆవాదమున కనురూపముగా మనుస్మృతి మూఁడవయధ్యాయమునందున్న,

"కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేన చ,
కులాన్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ." ౬౩

అనుశ్లోకము నుదాహరింతురు. ఇంతకంటె నవిచారమూలమగు వాదములేదు. ఇంచుక యాలోచింతము. శ్రుతిస్మృతినిషిద్ధకర్మము లాచరించువారు దుష్టకర్ము లనఁబడుదురు. కువివాహములనఁగా తమతమ గృహ్యసూత్రము ననుసరించిచేయని వివాహములు. క్రియాలోపములనఁగా గర్భాధానాద్యష్టచత్వా

ః పశ్చాత్ కశ్చన స్యాప్తిప్రాప్తిర్ముక్తిః। శివత్వ ప్రాప్తిరాత్మనః పశుత్వ నివృత్తి మాత్రేణ న సంభవః। పశుత్వ నివృత్తిశ్చ నిరంతర ధ్యాన భావనాం వినా అత్ర నిరంతరం శివోఽహ మితి భావనా ప్రవాహేణ శిథిలిత పాశతయా అపగత పశుభావ ఉపాసకః శివ ఏవ భవతి। నిరస్త సమస్త దోష కళంక నిరతిశయ మాంగళ్య స్వరూపం హి శివత్వం। పరం బ్రహ్మ చ తాదృగేవ। తత్ ధ్యానయా ఉపాసక శ్శివ ఏవ భవతి। అతఏవ తదర్థస్య ముముక్షుర్ధ్యేయత్వం నిషిధ్యతే। శివ ఏకో ధ్యేయ శ్శివంకర స్సర్వ మన్యత్పరిత్యజ్యేత్యాదిషు శ్రుతిషు। నివృత్త బ్రాహ్మణాది దేహాభిమానాది మయ పశు భావస్య నిరతిశయ స్వరూపానంద సాక్షి స్వప్రకాశ శివ రూప పరమాత్మ భావాపత్తిర్ముక్తిరితి సర్వ శ్రుతి తాత్పర్యాత్ బ్రహ్మభావే నోపాసన ముపాసకస్య ముక్తి కర మన్యథా కథం సంసారా న్నివృత్తి రితి॥

అతఏవ ఆవృత్త్యధి కరణే శ్రీశంకరాచార్యైః విద్యోపాస్త్యోశ్చ

---

హిం పపలయోః॥

ప్ర॥ శ్రుతి అభిన్నముగా నుపాసన చేయుచునుట కేమి కారణము?

ఉ॥ అట్లు చేసిన గాని ముక్తి లభింపదని శ్రుత్యాశయము॥

ప్ర॥ ముక్తి యనగా నేమి?

ఉ॥ నిరతిశయ పరమానంద రూపంబును దుఃఖస్పర్శ రహితంబును శివత్వము కలుగుటయే ముక్తి యగును॥

ప్ర॥ ఇట్టి శివత్వప్రాప్తి యెట్లుగలుగును?

ఉ॥ పశుత్వము తొలంగినఁగాని కలుగ నేరదు॥

ప్ర॥ పశుత్వము ఎట్లు తొలంగును?

ఉ॥ అది ఎల్లప్పుడు శివ భావము భావించుచున్నం గాని తొలంగదు॥ కాఁబట్టి ఎల్లపుడు నేను శివుఁడనే యను తెంపులేని భావనచే పాశము విడిపోవును గాన దానం జేసి పశుత్వము నివర్తింపఁగా నుపాసకుఁడు శివుఁడే యగును॥ దోష సంసర్గము లేక నిరతిశయ మాంగళ్య గుణములు కలిగి యుండుటే శివత్వ మగును॥ పరబ్రహ్మము నట్టిదియే యగును॥ కావున శివభావనచే నుపాసకుఁడు శివుఁడే యగును, శివత్వమే ముక్తి శివ భావ

యమూల్యమయి తనరారు నంబర మొసంగెను. పరిమళచంద నము మైనిండ నలఁదెను. సుమనస్సంతతులచేఁ బూజించెను. రత్నమాలికాలంకృతమగు భర్త్రాంగుళీయక మర్పించెను. విధియుక్తమగు పూజలచే నాహేరంబుని గణాధిపతిని దృప్తి పఱచెను. సర్వదేవాధిపా! పార్వతీపుత్రా! యని వినుతించెను. సర్వవిఘ్నములు శాంతినొందఁ జేయుమాయని ప్రార్థించెను. ఇట్లు తొలుదొలుత గణపతిపూజ సాంగముగా నెఱవేర్చెను.

---

అపుడందఱకు జాతిలేదు. క్షత్రియ వైశ్యులకు మాత్రమే యీదోషమనుట తెలివితక్కువ కాదా. కలికాలమున విధివిహితకాలమునఁ గాకున్న నెప్పుడేని పైసంస్కారములు నామమాత్రము చేయఁబడుచున్నవి కదాయని సంతోషింపవలసియుండఁగా నవి లోపములని చూపి వైశ్యకులమే లేదనుటకన్న సాహసకార్యము వే ఱేదియుండును? ఇట్టిసాహసము చేయఁబూనుట పరిహాసాస్పదమనుటకంటె వే ఱేమియుం ననఁజాల కున్నవాఁడను. ఇపు డాంగ్లభాషాతత్పరులు కొందఱు వేదపాఠము చేయనంతమాత్రమునఁ దత్పుత్రులు జాతిహీనులనవచ్చునా. ఆంగ్లభాషాతత్పరులుకాని వైదికబ్రహ్మణులలోఁ బెక్కుమంది వేదము చదువనివారుండుట ప్రత్యక్షము గదా. వారిపుత్రులు బ్రాహ్మణులు కా రనఁదగునా! వేదమంతయుం రాకున్నను యథాశక్తిఁ బఠించినను జాలునని తృప్తినొందవలయునే కాని "కువివాహైః" అను మనుస్మృతి ననుసరించి క్రియాలోపవేదానధ్యయనాదులచే జాతిభ్రష్టులనిపలుకుట యవివేకమూలమని నా భావము. స్మృత్యుక్తకర్మాచరణదారిద్ర్య మన్నిజాతులకుఁ గలదని యంగీకరించుట బుద్ధిమంతుల లక్షణముకాని యొక్కవైశ్యజాతియందే దాని నారోపించుట న్యాయమునకుఁ గడుదూరము.

సావిత్రీపతితులు వ్రాత్యులుకారా యని కొందఱందురు. ఆమాట సత్యము.

రత్నైః ప్రథిత సూక్తిమాలాయాం॥ అద్వైత మాగమ శిరోభి రుపాసనా యా ముక్తం తదేవ పరమార్థతయా నవాచ్య మితి॥ అథ సూతసంహితాదిషు జీవ బ్రహ్మైక్యస్య పారమార్థికత్వ కథన ముపాసనాదా ర్ఢ్యాయై వేతి యత్కించి దేతత్॥

ఏతదధికృత్యోక్తం క్రియాసారే॥ నకారం పీతవర్ణంస్యా ద్బ్రహ్మ స్త్రాంచాధి దైవతం। సావిత్రీ శక్తిరిత్యుక్తా చాధారం పృథివీ తథా। అనుష్టుప్ఛందసా యుక్తం వాసిష్ఠార్షం తథైవచ। స్థానం పశ్చిమవక్త్రం సద్యోజాతీయ బ్రహ్మకం। ఆయుధం వజ్రమేవోక్తం కలా నివృత్తి రేవచ। గుణాం కఠిన మేవోక్తం చతురశ్ర క్రమేణతు। జ్వాలవ దగ్ని ప్రకాశంతు కరణం మన ఏవచ। ప్రాణ వాయు సమాయుక్త మింద్రియాణాంచ గంధకం। ఇత్యేవం షోడశానాంతు నకారాక్షర ముచ్యతే। మకారం జలరూపంచ దైవం విష్ణుస్తథైవచ, లక్ష్మీశ్శక్తి రితి ప్రోక్తా ఆ

---

మును బట్టి భాగరూప పశువిశేష పరముగా నర్థము గ్రహించినట్లే ఉపాసనా ద్యాప జ్ఞానపరముగా నర్థము చేయుట న్యాయ్యముగాని, జ్ఞానవిశేష వాచకమగు నుపాసి పదమును నిరర్థకముచేసి కేవల జ్ఞానసామాన్య పరముగానె యర్థము గ్రహించి యీ యభేదము పారమార్థికమని చెప్పసాహసించుట శాస్త్రవిరుద్ధము.

కావుననే శ్రీసుదర్శనా చార్యుల వారు ఉపనిషత్తుల యందు నుపాసన కొఱకై యభేదము చెప్పఁబడినది అదియే పారమార్థికమని యెంతమాత్రము చెప్పఁగూడదు అని నిరూపించిరి. సూత సంహితాదుల యందు ఆభేదము పారమార్థికమే యనికలదు॥ అయి ననూ అట్లు చెప్పుట ఉపాసన యందగు నభేద భావనను దృఢ పరచుటకే యని గ్రహింప వలయును॥

శ్రీపంచాక్షర మంత్రమును గూర్చి క్రియాసారమున నిట్లు చెప్పఁబడి యున్నది నకారమునకు వర్ణము పసుపు అధిదైవతము బ్రహ్మస్త్రము శక్తి సావిత్రి ఆధారము భూమి అనుష్టుప్ ఛందస్సు వసిష్ఠుడు ఋషి స్థానము పశ్చిమము ముఖము సద్యోజాతము ఆయుధము వజ్రము కల నివృత్తి గుణము కఠినము చతురశ్ర కారంబును అగ్నిప్రకాశముకరణము మనస్సు వాయువు ప్రాణము ఇంద్రియము ఘ్రాణము పీపదునారు నంగములు గా గలవు మకారమునకు జలము రూపంబును విష్ణువు దైవంబును లక్ష్మీశక్తియు ఆధారమును

తలఁచే బుస్తకమును బెంచవలయునను భావమునఁ గాదని యెఱుంగవలయును.

ఇందుఁ జేసినచర్చచేఁ బ్రకృతకథ కేమి లాభమో యించుక కథారంభముననే వ్రాసితిని. భగవంతున కీయవతారమున నెన్నియేండ్లు మనుష్యమానమునఁ గడచెనని యెఱుంగవచ్చును. కాని యుపనయనకాలము రెండువిధములుగా నున్నందున నేకాలము ననుసరించి వసుదేవుఁ డీకార్యము నడపెనో

---

ముక్తం తేన సహాస్య గురులాఘవ మనుసంధాయ జాతిశక్త్యాద్యపేక్షో వికల్పో మంతవ్యః." అని కుల్లూకభట్టు.

ఆర్యులార! చూచితిరా. మహాత్ము లెట్టికరుణాళువులో. వ్రాత్యులకుఁ బ్రాజాపత్యత్రయము ప్రాయశ్చిత్తముగాఁ జేయించి యుపనయనము చేయవలయునని చెప్పిరి. ఇంతటి స్వల్పప్రాయశ్చిత్తము నిర్దేశించిన మహాత్ముల భావమేమి? ప్రాయశ్చిత్త మతిభారమైన మానుదురనియు. దాన జాతికే వినాశము సంభవించుననియు నట్లు కాఁగూడదనియు, వ్రాత్యులుకానివారుండుట యరుదనియు నల్పశ్రమసాధ్యమగు ప్రాయశ్చిత్తము చేయించి యుపనయనము చేయించినఁ జాలుననియు దీనిచే వేదోక్తకర్మములు ప్రపంచమున నిలుచుననియు నూహించియే గదా యిట్లు చెప్పిరి. అని మనము గ్రహింపందగును. ఎంతటివేదాభిమానము! ఎంతటిభూతదయ! ఎంతటికరుణ! వర్ణింపసాధ్యమా. మన కెట్లున్నది? ఏమైన దోషము కనఁబడిన నాక్షేపింతమా యని, మనముచేయు దోషములను బయలుపఱుపరాదనియు నై యున్నది. ఇట్టి మనము ధర్మము చెప్పఁబూనుట కనర్హులము గాక మఱేమి?

ప్రాజాపత్య మనుప్రాయశ్చిత్త మెట్టిదనఁగా.

యథంబిందురూపస్తు శాంతి స్తథైవచ। గుణాలోకేన సంయుక్తం స్పర్శజ్ఞానేంద్రియం భవేత్। ఇత్యేవం షోడశానాంతు వాకారాక్షరముచ్యతే। యకారం వ్యోమరూపంతు దైవంచైవ సదాశివః। ఉన్మనీ శక్తి రేవోక్తా ఆధారం వ్యోమ చోచ్యతే। జగతీ ఛందసాయుక్తం భారద్వాజో ఋషి స్తథా। స్థాన మూర్ధ్వ ముఖం విద్యాద్బ్రహ్మా చేశాన మేవచ। అయథానాంతు శూలం స్యాచ్ఛాంత్యతీతా కలాపిచ। గుణానాం చైవ శూన్యంస్యాత్ ప్రకాశం చంద్రకామణేః। కరణం ప్రకృతీ రూపం సమానో వాయు రేవచ। శబ్దో జ్ఞానేంద్రియాణాంచ ఇత్యేతే షోడశ క్రమాత్। యకారాక్షర మిత్యుక్తం నభూతం నభవిష్యతి। ఏక మేవ ప్రధానంతు పంచాక్షర మితి స్మృతం। కామ్యసిద్ధి ప్రయోగే ప్రత్యక్షరం పంచధా భవేత్। తతః ప్రస్తారకం ప్రోక్తం వింశత్యేక శతం భవేత్। సప్త కోటి మహామంత్రా రూపవక్త్రై రనేకధా। పంచాక్షరే ప్రలీయన్తే పున స్తస్మా ద్వినిర్గతాః॥ ఇత్యాది॥ అత్ర యద్యపి ప్రణవస్య మంత్రాది మసర్గత్వ మనుక్తం। తథాపి- తస్య పంచార్ణ సమష్టి రూపత్వేన సర్వ వర్ణానామగ్ర్యం భావ్యం॥

(శ్రీ)శివమహాపురాణే॥ అస్యాః పరమ విద్యాయాః స్వరూపమ

---

యము- జగతి ఛందస్సు, భరద్వాజుడు ఋషి, స్థానమూర్ధ్వము, ఈశానముఖము, అయుధము శూలము, శాంత్యతీతకల, గుణము శూన్యము, చంద్రకాంతిమణి ప్రకాశము, కరణము ప్రకృతి, సమానము వాయువు, శ్రవణ మింద్రియము, ఈ పదునారు యకారమునకంగములగును॥ ఈపంచాక్షర మహామంత్రము యొక్కటియే ప్రధానమైనది, అయినను, కామ్యప్రయోగముల విషయమున ననేక విధములై నూటయిరువది యొక్క భేదము కలిగి యున్నది. సప్తకోటిమహామంత్రములును పంచాక్షరి మహామంత్రము నందే అణగియుండి దానినుండె వెడలుచుండును అని మొదలుగానున్నది. ఇందు మంత్రములకు మొదట ప్రణవముండు నని చెప్పలేదు. అయినను, ఆప్రణవము పంచాక్షర మహామంత్రము యొక్క సమష్టిరూపముగాన సర్వవర్ణములకు మొదటనుండునని గ్రహింపవలయును.

ఈమంత్రము నుద్దేశించి శివమహాపురాణము నందిట్లు చెప్పఁబడియున్నది. ఇప్పుడీ

వసుదేవుఁడా శ్రీకృష్ణమూర్తికి నుపనయనము చేయఁబూనుట సహజముగనే యున్నది. ఏశాపమును భగవంతుని బాధింపఁ జాలదు. సోక్తివ్యాఘాతము కాఁగూడదని తా సర్వేశ్వరుఁ డయ్యు నొకప్పుడు లోకాచారము ననుసరించును. దాన సంగి యని యాపరమాత్మను బలుకరాదు. శ్రీహరియే,

"శ్లో. జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేవ సోఽర్జున."

అని భగవద్గీతలయం దుపదేశించెను. భగవదవతార కారణ మేమని యెఱుంగుటయే తరణోపాయమని దీనిసారము. భగ

---

దశావరావా పరిషద్యం ధర్మం పరికల్పయేత్,
త్ర్యవరా వాపి వృత్తస్థా తం ధర్మం న విచాలయేత్." ౧౧౦

"వ్యా. యది బహవస్సంతోఽపహితా న భవంతి తదా దశావరాత్ర్యవరాశ్చేతి వక్ష్యమాణలక్షణాయస్యాస్సా పరిషత్ తదభావే త్రయోఽవరా యస్యాస్సా వా సదాచారా యం ధర్మం నిశ్చినుయాత్తంధర్మత్వేన స్వీకుర్యాన్నవి సంవదేత్." అని.

"శ్లో. త్రైవిద్యో హైతుకస్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః,
త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యాద్దశావరా." ౧౧౧
ఋగ్వేదవిద్యజుర్విచ్చ సామవేదవిదేవ చ,
త్ర్యవరా పరిషద్జ్ఞేయా ధర్మసంశయనిర్ణయే." ౧౧౨

అని సమాధానము చెప్పవచ్చును. ఇట్లు మహాత్ములు సకాలమున నుపనయనాదులు లేనివారికిఁ గరుణాళువులై సులభముగాఁ బ్రాయశ్చిత్తమువిధించి యీప్రాయశ్చిత్త మీపాపమునకుఁ జాలునని చెప్పనధికారము పరిషత్తునకు (సభకు) నిర్ణయించి యీసభయందుఁ గూరుచుండఁ దగినవారియోగ్యత యిట్టులుండవలయునని నిశ్చయించి యున్నారు. కావున నాయాపాపమునకుఁ దగినప్రాయశ్చిత్తము చేసికొనుట న్యాయసమ్మతమని నాభావము. మఱియొక ప్రశ్నము.

రాః భారద్వాజశ్చ వర్ణానాం క్రమశో ఋషయస్స్మృతాః। గాయ
త్ర్యనుష్టుప్త్రిష్టుప్ఛందాంసి బృహతీ విరాట్। ఇంద్రో రుద్రో హరి
ర్బ్రహ్మా స్కంద స్తేషాంచ దేవతాః। మమ పంచ ముఖాన్యాహుః స్థా
నం తేషాం వరాననే। పూర్వాది చోర్ధ్వ పర్యన్తం నకారాది యథా
క్రమం। ఉదాత్తః ప్రథమో వర్ణ శ్చతుర్థశ్చ ద్వితీయకః। పంచమస్స్వ
రిత శ్చైవ మధ్యమో నిహత స్స్మృతః। కలావిద్యా శివస్యైవం సూత్రం
పంచాక్షరం తథా। నామాన్యస్య విజానీయా త్తస్యైవం మే హృదయం మ
తం। నకార శ్శిర ఉచ్యేత మకార స్తు శిఖోచ్యతే। శికారః కవచం తద్వ
ద్వాకారో నేత్ర ముచ్యతే। యకారోఽస్త్రం నమస్స్వాహా వషట్స్వా
హ్వౌషడిత్యపిఫడిత్యపిచ వర్ణానాం మంత్రాంగత్వం యథా తథా। ఇతి॥

ఏతత్ప్రస్తావ ఉక్తం శివ తత్త్వ సుధానిధౌ। తత్రాదౌ జప య
జ్ఞశ్చ ప్రశస్త స్సర్వ దేహినాం। జపేన యోగ సిద్ధిస్స్యా ద్యోగా జ్జ్ఞా
నం చ సిద్ధ్యతి। జ్ఞానేన మోక్ష మాప్నోతి తస్మాజ్జప్యో మహా మనుః। శి

---

నీమైదుగురు నైదువర్ణంబులకు ఋషులగుదురు॥ గాయత్రి అనుష్టుప్ త్రిష్టుప్ బృహతి వి
రాట్ నీయైదును క్రమముగా నైదువర్ణములకు ఛందస్సులగును ఇంద్రుడు రుద్రుడు హ
రి బ్రహ్మ స్కందుడు నీయైదుగురు దేవతలగుదురు॥ సద్యోజాతాదులగు నాముఖములై
యయిదు వర్ణములకు ముఖములగును॥ తూర్పుదెస మొదలుకొని యూర్ధ్వ దిశ వరకు నై
దుదెసలును నకారాదులకు క్రమముగా స్థానములగును॥ మొదటిది రెండవది నాల్గవదియు,
నగువర్ణములు దాత్తంబులును మూడవది యనుదాత్తంబును అయిదవది స్వరితంబు నగు
ను. నివృత్తి మొదలగు నైదుకళలును నైదక్షరంబులు కగును. వీనినెఱుంగుటయె హృదయ
మగును హృదయాది న్యాసము నందు నకారము శిరంబును మ కారము శిఖయును శికార
ము కవచంబును వా కారము నేత్రంబును యకారము అస్త్రంబును నగును॥ నమః స్వాహా
వషట్ వౌషట్ ఫట్ నీనిని మంత్రాంగములుగాఁ జెప్పుకొనవలయు॥ ఈమంత్రము
యొక్క ప్రస్తావమున శివతత్త్వ సుధానిధియందు ఇట్లు చెప్పఁబడియెను॥ సకల యజ్ఞముల
లో జపయజ్ఞ ముత్తమమైనది జపముచే యోగసిద్ధి కలుగును॥ యోగముచే జ్ఞానము సిద్ధిం
చును. జ్ఞానముచే ముక్తి లభించును॥ కావున శివ పంచాక్షరీ మహామంత్రము జపింప
వలయును॥

మించినకార్య మాకాలమునఁ జేయువారు లేరనుట సత్యము. గురువునందు ముహూర్తమునం దనఁగా గ్రహములయందుఁ బెద్దలయందు దృఢవిశ్వాస ముండెను. ఈకాలమున నవి లేక పోవుటయె గాక మీఁదు మిక్కిలి వాని నాక్షేపించుటయుఁ గూడఁ గలదు. ఆకార్యఫలము లట్టివే. ఆకాలమున విత్తము ననుసరించియే ప్రయత్నము. ఇపుడు ప్రయత్నముననుసరించి ద్రవ్యమును సేకరింతురు. ఈరెండింటి కెంతభేదము గలదో

---

యుండలేదు. శిష్యవంచనచేసినదోషము గురువులదే యనుట కావంతయు శంకలేదు. దానికిఁ బ్రాయశ్చిత్తమెవరికో నేఁ జెప్పనక్కఱలేదు. కావున వైశ్యులకు వేదోక్తకర్మములు సాగుటలేదని దానిచే వీరు 'జాతిగౌరవము బోఁగొట్టుకొనిరని మరల నది రమ్మన్నరాదని ఘోషించుట యవివేకమూలము గాని యితరముగాదు. వారిప్పు డాగురువంచన నెఱింగి గాయత్రి నుపదేశించుకొనఁబూనఁగా మీకు వేదాధికారము లేదు. కావున వేదస్థ గాయత్రీమంత్ర ముపదేశింపరాదు. "అచ్యుతాయనమః అనంతాయనమః అచ్యుతానంతాయనమః" అనునదియే మీకు గాత్రియని నెప్పుటకన్న మహత్తరపాప కార్యము వేఱొకటి కానరాదు. అట్టికార్యము నిఁకనైనఁ జేయకుందురు గాతమని వారక వేఁడుచున్నాఁడను. మఱికొందఱు వైశ్యులకు నుపనయనము మాత్రము చేయఁబడుచున్నది గాని అది పురాణశ్లోకములచేఁ జేయఁబడుచున్నదనియు గోత్రములు ఆర్షములు గావనియు, ఎల్లిసెట్టి మల్లిసెట్టిగోత్రములు చెప్పఁబడుచున్నవనియుఁ కన్యకాపురాణము వారికి స్మృతిగా నున్నదనియుఁ గావున వైదికసంస్కారములు లేవనియుఁ జెప్పుదురు. వారికి నా చెప్పుసమాధాన మేమనఁగా.

కన్యకాపురాణమును మీరు ప్రమాణముగా నంగీకరించినపక్షమున దానియందు వేదోక్తసంస్కారములు చెప్పఁబడినవి. ఇప్పటి లౌకికగోత్రము

స్వాహా ప్రణవం బీజ ఉచ్యతే। శక్తిర్ద్వితీయ వర్ణశ్చ న్యాసస్త్వేవం షడక్షరైః। ధ్యాత్వా సంపూజ్య మానసి బాహ్యేవా పరమేశ్వరం। ప్రథమం ప్రణవం విద్యాద్ద్వితీయంతు నకారకం। మకారంతత్పరం విద్యాచ్ఛికారంతు తతః పరం। వాకారం పంచమం విద్యాద్యకారం షష్ఠమేవచ। ఇత్థం షడక్షరం విద్యా జ్జాబాలోపనిషద్గత మిత్యాది॥

స్త్ర్యధికృత మంత్ర నిర్ణయః.

అత్ర॥ స్త్రీభిశ్శూద్రైశ్చ వక్తవ్యం నమోన్తం ప్రణవం వినేత్యాది ప్రమాణ ప్రాబల్యేన స్త్రీ ప్రభృతిభి శ్శివాయ నమ ఇత్యేవ భవతి జప్యం॥ నచ- ప్రణవ వైకల్యేన మంత్రస్య సంపూర్ణ ఫలదాయకత్వం నసిధ్యేదితి వాచ్యం॥ శివతత్త్వసుధానిధౌ॥ ఏష పంచాక్షరో మంత్రః కేవలో ముక్తిదాయకః। అస్యైకాక్షర మాహాత్మ్యం వక్తుం నాలం చతుర్ముఖః। ఇత్యత్ర అంగాదిహీనస్య- ప్రణవ రహితస్యచ మోక్షదాయకత్వ ముక్తమితి కేవల పదేన బోధితత్వాత్॥ నను- ఓంకార వద

---

త్రియునకు వామదేవుఁడు ఋషి, గాయత్రి ఛందస్సు- శివుఁడు దేవత- నకారము బీజము- మకారముశక్తి - అజువర్ణములతో కరాంగ న్యాసముచేసి కొనవలయును॥ పరమేశ్వరుని హృదయమందు గాని- బాహ్యమున గాని పూజించి జపముచేయ వలయును॥ అనియున్నది॥

స్త్రీలు శూద్రులును ప్రణవమును వదలి పెట్టి- శివాయనమః అని జపము చేయవలయు నని పూర్వోక్త వచనములచే తెలియుచున్నది॥

ప్ర॥ పంచాక్షరిని ప్రణవము వదలి పెట్టి జపించు నెడ సంపూర్ణఫలమెట్లు కలుగును?

ఉ॥ మంత్రాంగములు లేకున్నను- ప్రణవము లేకున్నను పంచాక్షరి మాత్రమే ముక్తి నిచ్చునని శివతత్త్వసుధానిధి యందుఁ గలదు గాన- సంపూర్ణ ఫలము లభింప నాటంకముండదు॥

ప్ర॥ పంచాక్షరి యంత్రమునకు ప్రణవము ముఖమనియు- వాయ కారములు చేతులనియు- శికారము దేహమధ్యమనియు- నమ కారములు పాదము లనియు నున్నది. స్త్రీలు మున్నగువారు ప్రణవము వదలిపెట్టిన- పంచాక్షరి యంత్రమును లిఖించుటెట్లు?

ఉ॥ చంద్రజ్ఞానోత్తరమునందు॥ శికారము ముఖంబును- వాయ కారంబులు చేతులు-

డెను. వార్తాపత్రికాపఠనాసక్తి యిపుడు పెచ్చుపెరిగినది. కావున నప్పటికిప్పటికిని హస్తిమశకన్యాయ మీవిషయములఁ గలదనుట నిక్కము. ఆముష్మికఫలప్రధాన మాకాలమునఁ

---

ఇట్టిపనిలేని మంగలిసామెత కనుకూలముగా మాటలాడిన నేలాటిఫలము గలుగదు.

ఏపాపమున కేప్రాయశ్చిత్తము చెప్పఁబడినదో దానినాచరింప నసమర్థులైనపుడు ప్రాయశ్చిత్తము తగ్గింపవలయునని స్పష్టమగును.'శ్రుతి. సంవత్సరమేతద్వ్రతం చ రేత్, ద్వావామాసౌ, నియమస్సమాసేన. అని. అంగిరసుఁడు. ''శ్లో. వచః పూర్వ ముదాహృత్య యథోక్తం ధర్మవక్తృభిః, పశ్చాత్కార్యానుసారేణ శక్త్యా కుర్యు రనుగ్రహం, నహి తేషా మతిక్రమ్య వచనాని మహాత్మనామ్. ప్రజ్ఞానే నైవ విద్వద్భి శ్శక్యమన్య త్ప్రభాషితమ్.'' అని చెప్పెను.

వీనిం బట్టిచూడఁగాఁ దాఁజేసినది పాపమని యెఱింగి యనుతాపమును బొంది తనశక్తికనురూపముగా నించుక ప్రాయశ్చిత్తము చేసినఁ జాలునని సిద్ధాంతమగుచున్నది. శాస్త్రపద్ధతియందు శ్రద్ధగలిగియుండుటయే ప్రధానమని దీనిసారము.

''శ్లో. శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే యస్తే ఉల్లంఘ్య వర్తతే,
ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్వేష్య స్సమే పద్భ్యతమోమతః.
''శ్లో. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవినిర్ణయే,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి.
యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్.''

గీతాశాస్త్రము.

అని చూపట్టెడిని. వేఱొకగ్రంథమునందు,

న- విపరీత ఫల ప్రదత్వ శంకాస్పదత్వాచ్చ॥

అత్రేద మవధేయం॥ ప్రణవ పంచాక్షర్యోః స్థూల సూక్ష్మ ప్రణవ పంచాక్షరీస జ్ఞకత్వం సమానార్థకత్వేన సమసత్తాకత్వం- తన్మూలకం తుల్య ఫలత్వంచ సవిస్తరం సప్రమాణంచ నిరూపిత మేవ పురస్తాత్॥ స్త్రీ శూద్రాణాంతు ప్రణవేఽనధికారః ప్రమిత ఏవ॥ ఏవంచ- కేవల పంచాక్షరీ జపేనైవ సర్వేష్ట సిద్ధౌ స్వానధికృత ప్రణవ పరిగ్రహే నిషిద్ధ ధర్మ పరిగ్రహ మూలక విపరీత ఫలావాప్తే ర్నఫలాన్తర సంప్రాప్తిం మన్యామహే॥

యత్తు- పంచాక్షర్యాం ప్రణవ స్యానంత ర్భావేన- తదంగేచ మనోష్షడక్షర సంజ్ఞకత్వేనచ పంచాక్షర్యాః ప్రణవ సంబంధ రాహిత్య ప్రత్యభిజ్ఞానేన వైదికత్వం దుర్నిరూప మితి॥ తదవివేక నిదానమేవ॥ విద్యాసు శ్రుతి రుత్కృష్టా రుద్రైకాదశినీ శ్రుతౌ తత్ర పంచాక్షర స్తత్ర శివ ఇత్యక్షర ద్వయ మిత్యాది నా శైవ పంచాక్షరస్య సర్వ శ్రుతి హా

---

ఇదిగాక, ప్రణవము సూక్ష్మ పంచాక్షరమనియు, పంచాక్షరము స్థూలపంచాక్షరమనియు, ప్రణవము సూక్ష్మ ప్రణవమనియు, పంచాక్షరము స్థూల ప్రణవ మనియును ఈరెండును సమములగుటంజేసి సమానఫల ప్రదము లే యనుట ప్రమాణసిద్ధమై యున్నది, ఇట్లే, స్త్రీశూద్రులకు ప్రణవమున నధికారములేదనుటయు ప్రమాణసిద్ధమే, ఇట్లుండ, కేవల పంచాక్షర జపము వలననె సంపూర్ణఫలము చేకూరుచుండగా తమకు నధికారములేని ప్రణవమును జపించునెడ నిషిద్ధధర్మాచరణ మూలమగు విపరీత ఫలము కన్న వేరగు లాభము గలుగదని యెఱుంగునది,

ప్ర॥ పంచాక్షరి అనగా, అయిదు అక్షరములు గలది అని అర్థము. ఇందు ప్రణవముచేరెనా లేదు. అదిచేరిన నాఱక్షరములగును గదా? దీనింబట్టి పంచాక్షరికి ప్రణవముతో సంబంధము లేద న్ధ్రువపడినది. ఇంక నిది వైదిక మెట్లగును?

ఉ॥ ఋగ్యజుస్సామ వేదములకు త్రయియనిపేరు. మధ్యనున్నది యజుర్వేదము॥ ఇందు నేడు అష్టకములు నడుమ నాలవ యష్టకమున మధ్యమున్న రుద్రాధ్యాయమున నందును మధ్యభాగమునందు, నమశ్శివాయ, అను శ్రీపంచాక్షర మహామంత్ర

బంపెను. శ్రీకృష్ణపరమాత్మ తన యంతరంగమున నొక్క మాఱు దేవతలు మహర్షులు దిక్పాలకులు రావలయునని సంకల్పించెను. ఆసంకల్పము సామాన్యమా. సర్వలోకముల కొక్క క్షణమున నెఱిఁగింపఁ జాలునది. ఆ మహనీయునికళ లేని ప్రాణికోటి లేదుగదా. ఎవరెవరు రావలయునని సంకల్పించెనో వారిమనస్సులు శ్రీకృష్ణసందర్శనాతురము లయ్యెను. వసుదేవునింటికిఁ బిలువకయే వచ్చిరి. ఆత్మేశ్వరుని దర్శింప నరుదెంచిరి. బ్రహ్మయుఁ బార్వతియుఁ బరశంకరుండును వచ్చిరి. వసుదేవుఁడు వారి గారవించెను. జ్ఞానధనులగు మహర్షు లేతెంచిరి. వారికి నుచితరీతి సపర్యల నాచరించి వసుదేవుఁడు ధన్యుఁడయ్యెను. వేలువేలుగా బ్రహ్మ మొదలగువారిని వినుతించెను. ప్రతిష్ఠో

---

పురాణాదుల భావమని యెఱుంగఁదగు. నిర్ణయించుటకు నాకేమి యోగ్యత గలదు ? ఇంక సారాంశమును వినుఁడు.

క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకెట్లో యట్లు వేదోక్తకర్మాచరణమున నధికారము కలదు. క్షత్రియులం కేదోయొకరూపమున నుపనయనసంస్కారము వేదోక్తముగా సాగుచున్నదనవచ్చును. వైశ్యులకుఁ గొన్నితావుల నట్లు సాగుటలేదు. వా రిపుడు విధిప్రకారము సంస్కారము చేసికొనఁబూనఁగాఁ గొందఱు పండితబ్రువులు మీకు వేదాధికారమే లేదనుచున్నారు. పురాణోక్తమే యనుచున్నారు. చిరకాలముక్రిందట నది వదలిపోయినదనియు మరల నది రా వీలులేదనియు వాదించుచున్నారు. ప్రాయశ్చిత్తముచెప్పుటన్న నదెందును లేదనుచున్నారు. కావున నీవాదము న్యాయసమ్మతము కాదని నా భావము. ఒక్కవిషయము నాలోచింపుఁడు. పురాణోక్తముగాఁ దంత్రము సాగుచున్నదా వేదోక్తముగా సాగుచున్నదా. అనునదియే యిటఁ బ్రధానము. ఉపనయనము పురాణోక్తమనిచెప్ప వీలున్నదా యనునది రెండ

అన్యచ్చ- ప్రణవోచ్చారణా నధికృతానా ముపదేశే సప్తాక్షరత్వం న కేనాప్యు పాయేన భవతి సాధ్యం॥ పంచాక్షర్యాస్తు- ప్రణవ వైకల్యేపి నపంచాక్షరత్వ వ్యాహతిరిత్యనేన శైవపంచాక్షరీం నిరాచికీర్షూణాం ప్రోపాస్య నారాయణాష్టాక్షరీ విషయ ఏవా వైదికత్వాదిదోషో స్సముపలబ్ధా ఇత్యహో విషమాలంకార విషయ తేత్యలం॥

అథ॥ విమలాగమే నిగదితో మంత్ర న్యాసః విధి ర్యథా॥ తారం ధాంతం బాంతం బీజం లిఖిత్వా వాంతంగమ్యం వామ నేత్రేణయుక్తం। లాన్తం దీర్ఘం మాంత బీజాంత మాత్ర షడ్వర్ణాఖ్యం సర్వసిద్ధిప్రదంచ॥ వామదేవ ఋషిః ప్రోక్తః పంక్తి శ్ఛంద ఉదాహృతం। దేవతా పంచవక్త్రాఖ్య స్సదాశివ ఉదాహృతః॥ ఓంబీజం నమశ్శక్తి శ్శివాయేతిచ కీలకం। అథన్యాసం ప్రవక్ష్యామి మంత్ర సిద్ధికరం పరం। తర్జనీ మధ్య మానామి కాంగుష్టయో ర్న్యసేత్॥ పురుషాఘోరసద్యాఖ్యే ర్వామేశాన ముఖైః క్రమాత్। కరశుద్ధిం చమూలేన ప్రాణాయామ మథ శృణు॥ అథాంగుష్ఠాది విన్యాసం వక్ష్యే శృణు యథా క్రమాత్। తారద్వయం తథా చోక్త్వా సర్వజ్ఞేతి పదం వదేత్। శక్తి ధామ్నేతి హ్రాం జ్ఞేయ ఏత దంగుష్ఠయో ర్న్యసః। తారం ధాంతం బిందు యుక్త మథతృప్తి పదం వదేత్। శక్తి ధామ్నేతి హ్రీం చోక్త్వా తర్జనీ న్యాసమాచరేత్। తారం భాంతం బిందు యుతము నాది బోధపదం వదేత్। శక్తి ధా మ్నేతి హ్రూం చోక్త్వా మధ్యమాభ్యాం చవిన్యసేత్।

---

ఇది గాక- గాయత్రి మొదలగు వైదిక మంత్రముల యందు ప్రణవము లెక్కలో చేరదని నిరూపించి యుంటిమి. దానింబట్టి- ప్రణవమును వదలి లెక్క పెట్టిన యెడ నారాయణ మంత్రమునకు నక్షరము లేడే యగును గాన దానికి నష్టాక్షర సంజ్ఞ భగ్నమైనది. మఱియు- ప్రణవమున నధికారము లేని వారు దానిని వదలి యామంత్రమును గ్రహించినప్పుడు కేవలము సప్తాక్షరియె యగు గదా? అప్పుడు నష్టాక్షరియని సాధింప శక్యమగునా? కాదు. పంచాక్షరి కైనను ప్రణవమున్నను లెక్కలో చేరదు గానను దాని యందు నధికారము లేని వారు దానిని వదలినను పంచాక్షరి సంజ్ఞకు నేవిధ మునను చలనము లేదని స్థిరపడినది

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః."

అన్నమాట గీతలయందు భగవంతుఁడు తెలిపెను. దుర్గను వినుతించినపుడు నీవే సర్వకర్త్రివని వసుదేవుఁడు నుతించెను. సత్యముగా నామెయే సర్వప్రపంచనిర్మాత్రి. మూలప్రకృతి యాదుర్గయే కదా. దుర్గతినాశని యాజననియే. ఈతత్త్వ మెఱుంగలేక భగవంతునియం దీకర్తృత్వము నారోపింతురు.

---

రంగీకరింపక తప్పదు. ఒక్కవిధియందే మూఁడుజాతులు కూర్పఁబడినవి. సూత్రము తెగిపోఁగా రత్నము లొక్కసారియే పడిపోవునుగాని యొక్కటి నిలిచి తక్కినవి పడిపోవు కదా? కావున వేదోక్తకర్మాచరణవిధి యందఱకు సమానముగా నుండవలయును.

చిరకాలముక్రింద నశించిన కర్మాధికార మిపుడెట్లు వచ్చునన్న దొక ప్రశ్నముగా భావింపరాదు. ఒకపు డట్లే భావించినను సమాధానముచెప్పుట సులభమే కాని కష్టము కాదు. విప్రజాతియం దీకాలమున సంధ్యరానివారు లేరనరాదుకదా. వారిపుత్రులకును రాదనుట సంశయాస్పదమగువాక్యము కాదు. వారి కేమిప్రాయశ్చిత్తమో వీరికి నదేప్రాయశ్చిత్తమన్నదే దీనికి సమాధానము. ఇపు డాలోచింపఁదగినవిషయ మిది. సకాలమున నుపనయనాదిసంస్కారములు సాగకయున్నను గౌణకాలమునందైన సాగుచున్నవి. మంత్రసంస్కారము జరగుచున్నది. విద్యావ్యాసంగాదులచేత సంధ్యావందనము చేయకున్నను, చేయుచున్నారమని భావించినను జాలును. కొందఱు చేయుచునే యున్నారు. కొందఱు సకాలముననే చేయుచున్నారు. వేదపఠనము చేయుచున్నారు. పంచయజ్ఞముల సక్రమముగా నాచరించుచున్నారు. జ్యోతిష్టోమాదియజ్ఞములు చేయఁబడుచున్నవి. అవి చేయకున్నను బాపము లేదు.

శూ ఖడ్గౌ వజ్రాగ్నీతిచ దక్షిణే। నాగం పాశాంకుశౌ చైవ ఘంటాం వహ్నించ వామకే। శ్వేత వర్ణం శ్వేత వస్త్రం శ్వేత పుష్పం సులోచనం। శ్వేతాభరణ సంయుక్తం శ్వేత పద్మాసన స్థితం॥ బిభ్రద్దోర్భిః కుఠారం మృగ మభయ వరౌ సుప్రసన్నో మహేశః స్సర్వాలంకార దీప్త స్సరసిజ నిలయో వ్యాఘ్ర చర్మాంత వాసాః। ధ్యేయో ముక్తాపరాగామృత రస కలితాద్రి ప్రభః పంచ వక్త్ర స్త్ర్యక్షః కోటీర కోటీ ఘటిత తుహిన రోచి ష్కలోత్తుంగ మౌళిః॥ ఇతి॥

## విమలాగమోక్త షడక్షరీన్యాసవిధిః.

ఓం అస్య శ్రీ షడక్షరీ మహామంత్రస్య వామదేవ ఋషిః। పంక్తిశ్ఛందః। సదాశివో దేవతా। ఓం బీజం। నమ శ్శక్తిః। శివాయేతి కీలకం॥

ఓం ఓం సర్వజ్ఞ శక్తి ధామ్నే హాం అంగుష్ఠాభ్యాం నమః।
ఓం నం తృప్తి శక్తి ధామ్నే హ్రీం తర్జనీభ్యాం నమః।
ఓం మం అనాది బోధ శక్తి ధామ్నే హ్రూం మధ్యమాభ్యాం నమః।
ఓం శిం స్వతంత్ర శక్తి ధామ్నే హ్రైం అనామికాభ్యాం నమః।
ఓం వాం అలుప్త శక్తి ధామ్నే హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః।
ఓం యం అనంత శక్తి ధామ్నే హ్రః కరతల కరపృష్ఠాభ్యాం నమః।

ఓం ఓం మూర్ధాత్మనే నమః। ఓం నం కంఠాత్మనే నమః। ఓం శిం హృదయాత్మనే నమః। ఓం వాం గుహ్యాత్మనే నమః। ఓం యం పాదాత్మనే నమః॥

ఓం ఓం సర్వజ్ఞ శక్తి ధామ్నే హ్రాం హృదయాయ నమః। ఇత్యేవం హృదయాది న్యాసం దిగ్బంధంచ కృత్వా॥ ఓం నం తత్పురుష వక్త్రాయ నమః పూర్వే॥ ఓం మం అఘోర వక్త్రాయ నమః దక్షిణే। ఓం శిం సద్యోజాత వక్త్రాయ నమః పశ్చిమే। ఓం వాం వామ దేవ వక్త్రాయ నమః ఉత్తరే। ఓం యం ఈశాన వక్త్రాయ నమః శిరసి। ఇతి వక్త్ర న్యాసం శ్రీకంఠాదిమాతృకాన్యాసం చ కృత్వా ధ్యానం కుర్యాత్॥ తదుక్త మేవ పంచ మూర్ధ ముఖ మిత్యాదినా॥

యిచ్ఛాశక్తియే. కాని వే ఱెవ్వరు కలరు. మనయిచ్ఛయే కార్యము నొనరించును. మనయిచ్ఛకు మనకు నెట్లు భేదములేదో యట్లే భగవదిచ్ఛకు భగవంతునకు భేదములేదు. సకలరూపములా ప్రకృతికల్పితములే. కావుననే మహాత్ముఁడగు నీశ్వరకృష్ణుఁడు సాంఖ్యదర్శనమునందు,

"శ్లో. సావయవం పరతంత్రం వ్యక్తం విపరీత మవ్యక్తమ్." ౧౦.

అని సిద్ధాంతీకరించెను. దీనికి మహానుభావుఁడగు గౌడపాదస్వామి భాష్యము వ్రాయుచు "కథా సావయవమ్. అవయవా

---

ణము చేయుటయే మంచిదని నే నూహించుచున్నాఁడను. వారిమాటలు, ఆటలుసాగుకాలము తగ్గినది. బ్రహ్మయజ్ఞాదు లిపుడు పౌండరీకమువంటి వగుచున్నవి. సంధ్యావందనముమాత్ర మాచరించిన సకలక్రతువులు చేసినట్లే యని యూహించుకాలము వచ్చినది. ఇట్టితఱి నాయజ్ఞముల జోలియేల? ఈకాలమున వేదోక్తకర్మాచరణమనఁగా సంధ్యానుష్ఠాన పంచయజ్ఞాచరణమే చాలును. మనపూర్వు లీవిషయముల నాలోచించియే కలియుగమున నెన్ని విషయములో తగ్గించి కర్మముల నిర్ణయించిరి.

"శ్లో. వేదవ్యాస స్స ఇహ దశ యో వేద వేదాక్షరాణి
శ్లోకం త్వేకం పరిపఠతి యస్స స్వయం జీవ ఏవ,
ఆపస్తంబ స్సకిల కలయే త్వస్య గౌపాసనాగ్నిం
కష్టం శిష్ట క్షితికృతి కలా కార్శ్య మృచ్ఛంతి విద్యాః."

అని వేంకటాధ్వరిగారు చెప్పిరి. నాలుగువందల వత్సరముల క్రిందటఁ గర్మాచరణాదు లిట్లుండఁగా నిప్పటిమాట విచారింప నవసరము లేదు. వేదోక్తకర్మకలాపము లిట్లు నశించుచుండఁ గావలయునని విధియుక్తముగాఁ బల్కువారి నాక్షేపించుటకంటె నభిమానము వే ఱేమున్నది? కావున శ్రుతిస్మృతివిహిత

శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షభాగే వహన్తం।
నాగం పాశంచ ఘంటాం ప్రళయహుతవహం చాంకుశం వామభాగే
నానా లంకార యుక్తం స్ఫటిక మణినిభం పార్వతీశం నమామి॥
ధ్యాయేన్నిత్యం మహేశం రజతగిరినిభం చారు చంద్రావతంసం
రత్నాకల్పోజ్జ్వలాంగం పరశు మృగవరా భీతి హస్తం ప్రసన్నం।
పద్మాసీనం సమంతాత్ స్తుత మమరగణైర్వ్యాఘ్ర కృత్తిం వసానం
విశ్వాద్యం విశ్వవంద్యం సకల భయహరం పంచ వక్త్రం త్రినేత్రం॥
ఇతి ధ్యాత్వా- లమిత్యాది పంచ పూజాం కృత్వా గురుం స్తువీత॥
యోగురు స్సశివ స్సాక్షా ద్యశ్శివ స్సగురు స్స్మృతః।
భుక్తి ముక్తి ప్రదాతాచ తస్మై శ్రీగురవే నమః॥
ధ్యాన మూలం గురో ర్మూర్తిః పూజా మూలం గురోః పదం।
మంత్ర మూలం గురోర్వాక్యం ముక్తి మూలం గురోః కృపా॥
అవాచ్యాత్మ స్వరూపాయ శివ భావ ప్రదాయినే।
నమస్సద్గురు నాథాయ షట్స్థల బ్రహ్మ మూర్తయే॥
ఆనంద మానంద కరం ప్రసన్నం
ధ్యాన స్వరూపం నిజ బోధ యుక్తం।
యోగీంద్ర మీడ్యం భవ రోగ వైద్యం
శ్రీసద్గురుం నిత్య మహం స్మరామి॥
గురు చరణం భవహరణం
శరణ హృదా భరణ మాత్మ సుఖకరణం॥
మరణ భయా దుత్తరణం
తరుణారుణ కిరణ వరణ మహ మీడే॥
మంత్రః॥ ఓంనమశ్శివాయ॥

జపానంతరం లమిత్యాదినా పంచపూజాం కుర్యాత్॥ తథాచ-
ధర్మ శిరసి॥ శివ ఏకో ధ్యేయ శ్శివంకర స్సర్వ మన్య త్పరిత్యజ్య ఇతి విధానేన శివం ధ్యాయీత॥ తదుక్తం॥ జపాచ్ఛ్రాంతః పునర్ధ్యాయే ద్ధ్యానా చ్ఛ్రాంతః పున ర్జపేత్॥ జపధ్యానాభి యుక్తస్య క్షిప్రం యో

ర్థము కాదు. ఈ భావమెఱుంగక పండితబ్రువులు దుర్మతాభి మానమూని దేవతల దూషించి పాపమును సంపాదింతురు. ఇంతియకాని సాధించుపురుషార్థము వేఱొకఁడు కానరాదు. అట్టి దుష్ప్రియత్నమును మాని భగవత్తత్వము సర్వత్ర నిండి యున్నదనియు నదిలేనితావు లేదనియు నమ్మి దేనిని దూషించి నను భగవంతుని దూషించిన ట్లగునన్నజ్ఞానము గలిగి తనయిష్ట దైవము తనకెట్లో యితరుల యిష్టదైవము వారికి నట్లే యన్న విశ్వాసము కలిగి ప్రవర్తించిన నిహపరసుఖముల నొందఁజాలు ననుట సర్వసమ్మతసిద్ధాంతము. ఇందుల కావంతయు శంకాతంక ములు లేవు.

ఇప్పట్టున మఱొక్కమాట చెప్పక తప్పదు. అదేది? అనఁగా నింతమందిదేవతలు తమరూపములతో మధురానగర మునకు వచ్చి యందఱకు దర్శనమిచ్చిరా? అనునదియే యా మాటయనఁగా. ఇది కలుగవలసినసంశయము కాదు గాని యీకాలమునఁ గలుగక తప్పదని నా భావము. ఏలయనఁగా. దేవతలు మనుష్యులకుఁగల యన్యోన్యసంబంధము ప్రస్తుతకా లమునఁ బ్రత్యక్షము గాక పురాణస్థమైనది. దేవతలనఁగా నెంతయెత్తుందురో వారికిని గరపాదము లెట్లుండునో యన్న

ఱకుఁ బ్రసాదింపవలసి యుండునుగాన నట్టి తెంపఱితనము నుపయోగింపకుం దురు గాక. ఆర్యులార! వచింపఁదగినంతఁ దెలిపితిని. "అతి సర్వత్ర వర్జ యేత్" అని యున్నదిగదా. దానిని మన్నింపక తప్పదు కాన నింతట నీచర్చ ముగించుచు యాదవులకు రాజ్యముపోయినను రాజులతోటి సంబంధాదులు గలవనియుఁ గావున శ్రుత్యుక్త సంస్కారములు కలవనియు మఱొకపర్యా యము తెలుపుచు నింతతో నీవాదమునుండి విరమించుచున్నాఁడను.

ష్టాక్షర సమాయుక్త మష్టపత్రాంతర స్థితం। యత్తత్తత్స్వరూపం ప్రోక్తం వాయు మండల సంయుతం। ఉపధాగ్ని సమాయుక్తం మంత్ర శక్తి నియామకం। పంచాశత్స్వర వర్ణాఢ్యం అధర్వ శ్రుతిరూపకం। కోటికోటి గణాధ్యక్షం బ్రహ్మాండాఖండ విగ్రహం। వర్ణం రక్తం కామదం చ సర్వాధి వ్యాధి భేషజం। సృష్టిస్థితి లయాదీనాం కారణం సర్వ శక్తి ధృక్। అవస్థా త్రితయాతీతం తురీయం బ్రహ్మ సంజ్ఞకం। బ్రహ్మ విష్ణ్వాది భిస్సేవ్యం సర్వేషాం జనకం పరం। ఈశానం పరమం విద్యాత్ ప్రేరకం బుద్ధి సాక్షిణం। ఆకాశాత్మక మవ్యక్త మోంకార స్వర భూషితం। సర్వ వేదమయం శాంతం శాంత్యతీతం స్వరాద్బహిః। అకారాది స్వరాధ్యక్ష మాకాశ మయ విగ్రహం। పంచ కృత్య నియంతారం పంచ బ్రహ్మాత్మకం బృహత్। పంచ బ్రహ్మోప సంహారం కృత్వా స్వాత్మని సంస్థితం। స్వశక్తి వైభవాత్సర్వాన్ సంహృత్య స్వాత్మని స్థితం। ఇత్యాగమా పంచ-బ్రహ్మ విద్యావిహితా॥

యాజ్ఞవల్క్యః॥ జప యజ్ఞోపి కర్తవ్య స్సర్వ వేద ప్రణీతకైః। పవిత్రై ర్వివిధై శ్చాన్యై ర్గుహ్యోపనిషద స్తథా। అధ్యాత్మ విద్యా వివిధా జప్యా స్తజ్జప సిద్ధయే। అన్యైశ్చ వివిధై ర్మంత్రై ర్దేవతాస్తవనాదిభిః। శుక్రియారణ్యక జపో గాయత్ర్యాశ్చ విశేషతః। సర్వ పాప హరాహ్యేతే రుద్రైకాదశినీ తథా। ఇతి॥ శౌనకః॥ అపన శ్శోశు చదతి జప న్ముచ్యేత వాం హసః। తమష్టుహీతి మంత్రంచ ఏకాదశ దినే దినే।

---

మఱియు సకల వేదముల యందుఁ జెప్పఁబడినవియు, పవిత్రములును నగు మంత్రములతో జపయజ్ఞము చేయవలయును॥ జపము సిద్ధించుటకై గుహ్యసూత్రములను ఉపనిషత్తులను అధ్యాత్మ విద్యలను జపింప వలయును॥ ఇతరములగు మంత్ర జపంబులును దేవతాస్తోత్రాదులును చేయవలయును॥ శుక్రియమనే ఆరణ్యకమును, గాయత్రిని విశేషించి జపింపవలయు॥ శ్రీరుద్రము సర్వపాపములను బోఁగొట్టును గాన ముఖ్యముగాఁ జపింప వలయునని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను॥ అపనశ్శోశుచత్ అను మంత్రమును జపించునెడ సకలపాతకములు తొలంగును॥ తమష్టుహి అను మంత్రమును నిత్యము పదునొకండు మార్లు జపించునెడ శ్రీరుద్రమును జపము సేయుటంగల్గు ఫలంబు గలుగును॥ అని శౌనకుండు వచించెను॥

యిల్లుచేరఁగూడదని యుండెను. కడపనుండియే గురువులకును దెలుపక వెడలితిని. కామలాపురమునుండి రామదాసను నొక బైరాగి తోడయ్యెను. గోదావరీనది పుట్టుచోటునకుఁ జాల దినములకుఁ బోఁ గలిగితిమి. అందొక్క నెలదినము లుంటిమి. త్ర్యంబక క్షేత్రమని దానిపేరు. ఆ క్షేత్రమునకుఁ బడమర దెస నొకపర్వతము కలదు. దానియందే గౌతమి పుట్టినది. ఆగిరికిఁ బ్రదక్షిణముచేసి వచ్చినచో దేవాలయమున ధర్మకర్త లొక రూపాయ యిత్తురు. బీదతనము దానికి నన్నుఁ బాల్పడఁ జేసెను. బయలువెడలితిని. రామదాసు ప్రియమిత్రుఁడౌట మందలించితిని. నవ్వి క్షణము నిలువుమని యెచ్చటికో పోయి యొకమూలికను దెచ్చి సవ్యహస్తమునకుం గట్టెను. ప్రొద్దు పోయినదే యంటిని. కొలఁదిగడియ లుండిపోయినను వేళకు రాఁగలుగుదు వనెను. ఆఱుక్రోశములదూరము దాని చుట్టు కొలతయఁట (పండ్రెండుమైళ్లు) జాముప్రొద్దు గడచెను. నా తోడ రామదాసు పయనము సాగించెను. మాటలాడుచుఁ బోయితిమి. అది కార్తికమాసము. పదునొకండుగంటలకు ముందే వచ్చిచేరితిమి. ఇంచుమించుగా రెండుగంటలకాలమునఁ బాషాణకంటకములచే నిండియుండుతావులం దిరిగితిమి. నా కొక్కశ్రమయుఁ దోఁపదయ్యెను. దేవాలయమునకు వచ్చి నపిదపఁ గొలఁదినిమేషములకుఁ బదునొకండుగంటలు కొట్టఁ బడియెను. మాప్రయాణము గంటన్నఱకాల ముండును. కుశస్థలియనుచోట స్నానముచేయుచుండ నామూలికను దీసికొనెను. నాకప్పుడు స్మృతి బాగుగఁ గల్గెను. ఆలోచించి యింత వేగముగా వచ్చితిమిగదా యంటిని. నవ్వి యతఁ డిదిమూలికా

స రుద్ర స్సంజాయతే ధ్రువం। చమకం నమకం చైవ జపంతం పురుషం సదా। ప్రవిశేత్స మహాదేవో గృహం గృహపతి ర్యథా॥ ఇతి॥ కైవల్యసూక్తే॥ యశ్శతరుద్రీయ మధీతే సోఽగ్నిపూతో భవతి। సురాపానాత్పూతో భవతి। బ్రహ్మహత్యాత్పూతో భవతి। కృత్యాకృత్యాత్పూతో భవతి। తస్మా దవిముక్త మాశ్రితో భవతి। అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్। అనేన జ్ఞాన మాప్నోతి సంసారార్ణవ తారక మితి॥ జాబాల శ్రుతౌ చ॥ అథ హైనం బ్రహ్మచారిణ ఊచుః। కింజప్యే నామృతత్వం బ్రూహీతి। సహోవాచ యాజ్ఞవల్క్య శ్శతరుద్రీయే ణేత్యేతాని హవా అమృతస్య నామధేయాన్యేతై ర్హవా అమృతో భవతీతి॥ మనురపి। సకృజ్జప్త్వాస్యవామీయం శివసంకల్ప మేవచ। హావిష్పాంతీయమభ్యస్య నతమం హాస్యృశే త్యేన రీతి॥ తస్మా చ్ఛ్రీరుద్ర శివసంకల్పాదయో జప్యాః॥

## జపయజ్ఞ ప్రశంసా.

వసిష్ఠః॥ యే పాక యజ్ఞా శ్చత్వారో విధి యజ్ఞ సమన్వితాః। సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీం॥ పాకయజ్ఞా దేవ య

---

కములు చేసినవాఁడైనను భస్మదిగ్ధాంగుఁడును, భస్మశయ్యయందు పండుకొనువాడును నై శ్రీరుద్రమును జపించు చుండునెడ సర్వపాతక విముక్తుండగును॥ మమతనువదలి రుద్రము నెల్లపుడు జపించు చుండునెడ ఆ దేహముననె రుద్రుండగును॥ గృహాధిపతి తనయింటి యందుఁ బ్రవేశించునట్లు నమకమును చమకమును జపించు వాని యందు పరమేశ్వరుఁడు ప్రవేశించును॥ అనిశాతాతపుఁడు చెప్పెను॥

శతరుద్రీయముం జపించువాఁడు అగ్నిచేతనుబలె పవిత్రుండగును॥ సురాపానము మొదలగు పాతకముల నుండి పవిత్రుండగును. కావున నెల్లపుడు జపించు చుండవలయునని కైవల్యమునం గలదు॥ శతరుద్రీయము చేతనె ముక్తి కలుగునని జాబాలోపనిషత్తునందు గలదు॥ శివసంకల్పము మొదలగు వాటిని జపించు వానిని పాతక మంటు నేరదని మనువు బోధించెను॥ కావున- శ్రీరుద్రము- శివసంకల్పము మొదలగు నవియు జపించు చుండవలయును॥

సము నాశించువారిసంఖ్య విశేషించి యుండెను. కాఁబట్టి దేవతలు రాకపోకలు చేయుచుండిరి. అవన్నియు మార్పు నొందిన యీకాలమున నప్పటిమాటలు విశ్వాసపాత్రములు కావు. కాని కొంతకాలమున కవన్నియు సత్యములని విశ్వసించుకాలము రాకమానదన్నవిశ్వాసము నన్నింకను వదలక యున్నది. దాని కించుకసూచనలు పొడకట్టుచున్నవి. లోకాంతరవాసులతో మాట్లాడఁజాలు యంత్రములు కనిపెట్టఁబడుచున్నవి. ఎన్నియోపద్ధతుల లోకాంతరగమనము చేయఁ బ్రయత్నించువారు తలసూపుచున్నవారు. ఈలాటిప్రయత్నము లెన్నియున్నను నంబరమునఁ దిరుగుభూతములతో మాటలాడ శక్యమగునేమో కాని నిర్మలతపోధనులకు గమ్యములగు స్వర్గాదులనుండు దేవతలతో మాటలాడుట శక్యమే కాదని నా యూహయై యున్నది. దానికి యోగాభ్యాసమంత్రోపాసనాదులు సముచితమార్గములు. ఆమార్గముల నాశ్రయించువా రింకను బహుళతరముగాఁ గనఁబడకున్నవారు. కొంతకాలమునకుఁ గనఁబడుదురని యాశించుచున్నాఁడను. అట్టిసత్కాలము భరతఖండమునకు సత్వరము వచ్చుఁగాక. భగవంతునియపారకరుణ ప్రజలయందు వ్యాపించి భక్తిజ్ఞానవైరాగ్యములు పెంపొందఁజేయును గాక. ఎల్లరు శ్రీకృష్ణపాదారవిందభజనానందసాగరమున మునిఁగి తేలుదురు గాక. ఇంతట నీవిషయమును వదలి మీఁదికథను వ్రాయఁ బూనెదను. అనుజ్ఞ నిండు. సర్వప్రపంచనాయకునకు వేదాంతాగమ్యమహిమునకు నుపనయనసంస్కార మొకమహర్షి చేయును. ఏమి యుపదేశించునో ఈబాలుఁ డేమిగ్రహించునో యెవ్వరికిం దెలి

తరిత్యేక ఉభయతః పరిషేచనం ప్రాక్పరస్తాదితి. సఏవ॥ యత్ర క్వచనాగ్ని ముపసమాధాస్యం స్యాత్తత్ర ప్రాచీ రుదీచీశ్చ తిస్రస్తిస్రో రేఖా లిఖిత్వాగ్ని ముపసమిధ్య ఉత్సిచ్యైత దుదక ముత్తరేణ పూర్వేణ వాన్య ముపదధ్యాదితి॥ ప్రాచీః పూర్వ ముదక్సంస్థా దక్షిణారంభ మాలిఖేత్। అథోదీచీః పురక్సంస్థాః పశ్చిమారంభ మాలిఖేత్। అథాగ్నిం ప్రతిష్ఠాప్య జ్వలయే దగ్ని మింధనైః। ఉత్సిచ్యా నోక్షణో చ్ఛిష్టం పూర్వ త్రోత్తరతోపివా। పాత్రస్థ మన్య దుదకం పూర్వవత్తత్ర నిక్షిపేదితి॥ బోధాయనః॥ యస్మిన్నగ్నా వుపనయతి తస్మిన్ బ్రహ్మచర్యం తస్మిన్ వ్రతచర్యా తస్మిన్ సమావర్తనం తస్మిన్ పాణిగ్రహణం తస్మిన్నాహ్యాణి కర్మాణి క్రియన్తే। తస్మిన్ కామ్యాని తస్మిన్ ప్రజా సంస్కార ఇత్యేకే॥ స ఏష ఉపనయన ప్రభృతి వ్యాహృతిభి స్సమిద్భి ర్హూయతే ఆసమావర్తనాత్। సమావర్తన ప్రభృతి ఆజ్యేన వ్యాహృతిభిరేవహూయతే ఆపాణిగ్రహణాత్। పాణిగ్రహణ ప్రభృతి వ్యాహృతిభి ర్వ్రీహ్యాతాభి ర్యవై ర్వా హస్తేనైతే ఆహుతీ జుహోతీతి॥ శాంభవీయ గృ

---

## హోమ విధి

సాయం కాలమునను- ప్రాతః కాలమునను బియ్యముగాని- యవలు కాని చేతితో హోమము చేయవలయును॥ స్థాలీపాకమునందుంబోలె దేవత యుండును. ప్రాతః కాలమున సూర్యునాహుతియు- సాయంకాలమున నగ్ని యాహుతియు ముందుచేయ వలయు, ననిమొదలు గాను ఆపస్తంబుడు చెప్పియుండెను ఏయగ్ని యందు నుపనయనము చేసి కొనియెనో ఆయగ్ని యందే బ్రహ్మచర్యమును వ్రతచర్యను, సమావర్తనమును, పాణిగ్రహణమును గృహ్యసూత్రోక్త కర్మములను, కామ్యములను, ప్రజా సంస్కారమును చేయవలయును॥ ఉపనయనము మొదలుకొని సమావర్తనము వఱకు, నాయగ్ని యందు సమిధలచే హోమము చేయవలయును॥ సమావర్తనము మొదలుకొని పాణిగ్రహణము వరకు నాజ్యమును వ్యాహృతులచే హోమము చేయవలయును॥ పాణిగ్రహణము మొదలుకొని వ్యాహృతులతో బియ్యమునుగాని, యవలనుగాని హోమము చేయవలయునని బోధాయనుఁడు చెప్పెను॥

పాణిగ్రహణము నందు స్థాలీ పాకాంతమునఁ గాని, వేరొకప్పుడు గాని గృహ్యాగ్నిని సంస్కారముచే నౌపాసనాగ్నిగా జేసి కొని దానియందు నిత్యోపాసనాదులఁజేసి కొనవ

ములకు లత్తుకను బూసెను. కుంకుమపంకమార్ద్ర శ్వేతచామర మునుబూని తానే విసరెను. దేవకీదేవింగూడి యాపార్వతిని మునిపత్నులెల్ల నర్చించిరి. పతిపుత్రసంయుతలగు సతివలందఱు క్రమముగా నాజగదంబికను బూజించిరి. రాజకన్యలు, దేవకన్యలు, నాగకన్యకలు, మునికన్నియలు, బంధుకన్యలు దేవకిచే వరుసగా మర్యాదల నలరింపఁబడిరి.

అంతట నానావిధశుభవాద్యములు మ్రోసెను. బ్రాహ్మణులకు మిష్టాన్నదానము చేయఁబడెను. మధురానగరమున భైరవియను దేవతగలదు. నగరరక్షణార్థ మా యంబికను నిల్పియుండిరి. ఆనగరదేవతను దేవకి భక్తిమెయి నారాధించెను. షోడశోపచారముల మంత్రయుతముగా నాపూజ చూడఁదగియుండెను. గళచండికయుఁ బూజింపఁబడెను. గృహమున మంత్రపూతముగా స్వస్త్యయనకర్మము సాగెను. విప్రప్రవరులు వేదపాఠ మొనరించిరి. వసుదేవాదులా వేదనాదశ్రవణమున నానందపరవశులైరి. ఆకాశగంగానదినుండి బంగరుకలశముల బావనజలములఁ దెప్పించి బలదేవుని శ్రీకృష్ణునిఁ గూరుచుండఁబెట్టి స్నానము చేయించిరి. పుత్రవాత్సల్యమున దేవకియే స్నానకృత్యమున నుండెను. ఆమెయే తనయులనిద్దఱ దివ్యవస్త్రములచేతను జందనచర్చలచేతను జక్క నలంకరించెను. రత్నేంద్రసారవినిర్మితమనోహరభూషణములఁ గైసేసెను.

అత్తఱి శ్రీకృష్ణుఁడు బలదేవుఁడు తల్లిచేతులార నునిచిన యలంకారములచేఁ జూచువారికి ముద్దులుమూటగట్టునట్లు విలసిల్లిరి. తల్లింగూడి వా రిర్వురు మునీంద్రసంభరితసభాభవనమునకు గర్గుని యానతిమెయి నరుదెంచిరి. దేవతలా

భాగ ఇష్ట ఇతి॥ తథా॥ చన్ద్రజ్ఞానోత్తరే॥ వైతానికం చ విధినా శైవం సంపాదయేన్మతిః। నిత్య మౌపాసనం కర్మ శ్రౌతం తత్రైవ చేష్యతే। వైశ్వదేవాది గార్హ్యాణి గృహ్యే శైవే సమాచరేదితి॥ హోతృతారతమ్యం దర్శయతి ఛాన్దోగ్య శ్రుతిః॥ అన్యైశ్శృత హుతాద్ధోమాదేకశిష్య హుతో వరం। శిష్యైశ్శృత హుతాద్ధోమాదేకపుత్ర హుతో వరం। పుత్త్రైశ్శృత హుతాద్ధోమాదేకో హ్యాత్మ హుతో వరమితి॥ ప్రవాసమేష్యాయ మాహ వ్యాసః॥ నిక్షిప్యాగ్నిం స్వదారేషు పరికల్ప్య ఋత్విజం తథా। ప్రవసేత్కార్యవాన్విప్రో వృథైవ న చిరం వసేదితి॥ అగ్నిరపరిత్యాగమాహ గార్గ్యః॥ కృత దారో న వై తిష్ఠేత్ క్షణమప్యగ్నినా వినా। తిష్ఠేత చేద్ద్విజో వ్రాత్యస్తథా చ పతితో భవేదితి॥ బృహస్పతిః॥ సూతకే మృతకే చైవ హావయేన్న తు హాపయేదితి॥ కాత్యాయనః॥ యావత్కాల మహోమీ స్యాత్తావద్ద్రవ్య మశేషతః। తద్దానం చైవ విప్రేభ్యో యథా హోమ స్తథైవ తత్॥ యావత్యబ్దాన్యతీతాని నిరగ్నేర్విప్ర జన్మనః। తావన్తి కృచ్ఛ్రాణి చరేత్ హోమాభావే దద్యా

---

చే చేయించుమనెడ నూఱురెట్లు ఫలము గలుగును॥ శిష్యులు నూర్గురు చేసిన దానికంటె నొక్క పుత్రుండు చేసినది శ్రేష్ఠము॥ నూర్గురు పుత్రులు చేసిన దానికంటె తానొక్కండు చేసికొనినది శ్రేష్ఠము॥ అని ఛాందోగ్యము నందు కలదు॥ గ్రామాంతరము పోవునప్పుడు అగ్ని సంరక్షణము భార్యకు నప్పగించి, హోమము చేయ ఋత్విజుని నియమించి, పరగ్రామమునకు జని శీఘ్రముగా రావలయునని వ్యాసుడు చెప్పెను॥

వివాహము చేసికొనినవాఁడు అగ్నిలేకుండనుండఁ గూడదు అట్లుండెనేని వ్రాత్యుండగును॥ సూతకాదుల యందైన నితరులచే హోమము చేయించుకొనవలయును గాని యూరకుండఁ గూడదు॥ అని బృహస్పతి చెప్పెను॥ సంకటాదులచే హోమము నిల్చిపోవునెడ నిల్చిపోయిన కాలమున కెంత హోమ ద్రవ్యము సరిపట్టునో అంత ద్రవ్యము విప్రులకు దానము సేయవలయును॥ ఎన్నియేండ్లు అగ్ని నిలిచిపోయెనో అన్ని కృచ్ఛ్రముల నాచరించి హోమద్రవ్యము దానము చేయవలయును॥ ఒకనెల హోమము నిలిచిపోవునెడ నైదు పళ్లు బియ్యము దానము చేయవలయును॥ హోమ మాగిపోయిన యొక సంవత్సరమునకు ఆఱుపళ్లు ధాన్యము, మూఁడుపళ్లు నేతిని దానము చేయవలయును॥

డములయం దెందు వెదకినను బరమాణువునకన్న సూక్ష్మవస్తువు గానరాదు. శ్రీమహావిష్ణువునకంటె స్థూలము లేదు. తత్తుల్య వస్తువు లేదు. మహావిష్ణువునకంటెఁ బరుఁడవు నీవే.నీకంటెఁ బరుఁడు లేనేలేఁడు. ఇదిసత్యము. స్థూలవస్తువులకంటె స్థూలవస్తువవు. సూక్ష్మవస్తువులకంటె సూక్ష్మవస్తువవు. మహావిష్ణుశబ్దవాచ్యుఁడవు.సర్వాధారస్వరూపుఁడవు; జలరూపుఁడవు. అన్నియు నీవే. జలమునకు నీవే యాధారభూతుఁడవు. స్థావరరూపముల యందు గోలోకము నీవే. సర్వాధారుఁడవుకాన నే వాయురూపుఁడ వనంబరఁగుదువు. శ్వాసనిశ్వాసరూపము గాంతువు. కాననే నిన్ను మహావాయువందువు. భక్తానుగ్రహార్థ మిపు డీరూపమును ధరించితివి. నిత్యుఁడవు.సహస్రవదనముల నొసంగితివి. ఇన్నింటిచే వినుతింప నిచ్ఛ గలదు. కాని యట్టిజ్ఞానము నాకు లేదు. క్షమింపుము శ్రీకృష్ణా యనియె.

దేవతలందఱు చేతులు జోడించి భక్తిభావముల ననంతుఁడే నిన్ను నుతింపఁజాలననియె. నీవే యనంతుఁడవు. విధాతయు జ్ఞానరూపుఁడగు శంకరుఁడు వినుతింపఁజాలరు. ఇది నిక్కము. సరస్వతి వినుతింపఁ జాలదనుట సత్యము. ఇఁక మేమేయని వినుతిచేయంగలవారమని పలికి నమస్కరించిరి. మునీంద్రులు భక్తిరసపరిపూర్ణమానసులై మహాత్మా! వేదములకు నిన్ను నుతించుసామర్థ్యము లేదు. ఇఁక నట్టి నిన్నునెఱుంగనైన మాకు శక్తి గలదా. మేము వేదవేత్తలము. కాన వేదాశక్యప్రభావుని నేమని పొగడుదుము. అని పలికి నమ్రకంధరులైరి. నారదా! ఈస్తుతి పరమపావనము. పూజాకాలమున నవ

ఉదయాత్పూర్వస్మిన్సమయే॥ సమయాధ్యుషితే= తస్యలక్షణ మాహ వ్యాసః॥ తథా ప్రభాత సమయే నష్టే నక్షత్రమండలే। రవి ర్యావ న్న దృశ్యేత సమయాధ్యుషిత స్స్మృత ఇతి॥ ఆశ్వలాయనస్తు అను కల్పాంతర మాహ॥ ఆసంగవాంతం ప్రాత రితి॥ అథ యది గృహ్యాగ్నే సాయం ప్రాతర్హోమయోః దర్శ పూర్ణ మాసయో ర్ద్రవ్యం హోతారం నాధిగచ్ఛే త్కథం కుర్యా దిత్యాశంక్యాహ॥ ఆసాయ మాహుతేః ప్రాతరాహుతి ర్నాత్యేతి॥ ఆప్రాత రాహుతే స్సాయ మాహుతి రమావాస్యాయాః పౌర్ణ మాసీ నాత్యేత్యా పౌర్ణ మాస్యా అమావాస్యేతి॥ బోధాయనోపి॥ ఆసాయం కర్మణః ప్రాత రాప్రాత స్సాయకర్మణః। ఆహుతి ర్నాతి పద్యేత పార్వణం పార్వణాంతర మితి॥ ఆపన్నస్యా హితాగ్నేః పక్ష హోమ మాహ మరీచిః॥ శరీరాప ద్భవేద్యత్ర భయాద్వా ర్త్యా ప్రజాయతే। అథాన్యాస్వపి చాపత్సుపక్ష హోమో విధీయత ఇతి॥ పక్ష హోమేన తత్పక్ష మధ్య ఆపన్నివృత్తౌ తదా ప్రభృతి పునర్హోమః కర్తవ్యః॥ పక్ష హోమానథో కృత్వా గత్వా తస్మా న్నివర్తితః। హోమం పునః ప్రకుర్యాత్తు నచాసౌ దోష భాగ్భవే దితి॥

## అథ హోమద్రవ్యాణి.

హోమ యోగ్యా సమిధః చంద్రజ్ఞానోత్తరే కథితాః॥ పాలాశ ఖాది రాశ్వత్థ శమ్యుదుంబర జాస మిత్। అపామార్గార్క దూర్వా

---

ప్రాతరగ్న్యుపాసనము సంగవ కాలము వచ్చులోపలఁ జేయనగునని యాశ్వలాయనుఁడు చెప్పెను॥ హోమద్రవ్యము లభింపనిచోఁ ప్రాతర్హోమము సాయంకాలము లోపలను– సాయంకాలహోమము ప్రాతఃకాలము లోపలను– అమావాస్యా హోమము పూర్ణిమ లోపలను– పూర్ణిమ హోమము అమావాస్య లోపలను చేయవలె నని యాశ్వలాయనుఁడు చెప్పెను॥ ఆపద సంభవించిన యెడ పక్షమున కొకమాఱు హోమము చేయవలెను. ఇట్లు పక్షమున కొకమాఱు చేయు వానికి నడుమ నాపత్తు తొలఁగి పోయినచో నది మొదలుకొని ప్రతిదినము సేయవలయును॥ అని మరీచి చెప్పెను॥

రెను. చెంపలయందుఁ గస్తూరీచందనతిలకము వెలుఁగుచుం డెను. ఆమూర్తిని గనుఁగొనఁగా మేఘమాలికాసమావృత పూర్ణచంద్రబింబము ముందుఁదోఁచిన ట్లుండెను. ద్విభుజముల విరాజిల్లుచు శ్యామలవర్ణము వెలయ రాధాకాంతుఁడై జగ న్మోహనాకారుఁడై చిఱునవ్వు ముఖమునఁ దేజరిల్ల భక్తానుగ్ర హతత్పరత్వము కనుదమ్ములయందు స్పష్టమగుచుండ రత్నేంద్ర సారనిర్మిత మంజుమంజీరములు పాదపద్మముల మెఱయుచుండఁ దండ్రియుత్సంగమున శిశుత్వమున గన్నీరుఁ గార్చుచున్న రూప ము ప్రత్యక్షమయ్యెను. ఆబాలగోపాలవిగ్రహమును గాంచి యెల్లరు నాశ్చర్యాదిష్టమానసు లైరి. బలరాముఁడు నట్లే యుండెను.

సుముహూర్త మాసన్నమయ్యెనని గర్గముని తెలిపెను. ఆలగ్నము శుభగ్రహసంవీక్షితము. లగ్నాధిపతి యస్తమింపక బలయుతుఁడై యర్థస్థానమం దుండెను. పాపగ్రహములు లగ్నమును జూడక తృతీయషష్ఠలాభస్థానముల నుండిరి. అంత గర్గముని సభాస్తారులగు మహర్షి దేవతల యనుమతి నంది స్వస్తి వాచనకర్మమును జరపెను. వసుదేవుఁ డందఱకు భక్తినమ్రా త్మకంధరుఁడై వందనమొనరించి గర్గముని మంత్రములు చెప్పు చుండ స్వస్తివాచనకర్మక్రియలఁ దా నడపెను. స్వస్తివాచన క్రియానంతరము గర్గమునీంద్రునకు సువర్ణటంకశతక మర్పిం చెను. దేవతలు మహర్షులా గర్గముని యదృష్టవిశేషమును బొగడి యెంతటిపుణ్యాత్ముఁడవైతివి మునీంద్రా! యని నమస్క రించిరి. వసుదేవుఁ డంత గణనాయకభాస్కరహుతవహ మహా దేవుల నర్ఘ్యావిధిం బూజించెను. వా రాశీర్వదించి యిడినయక్ష

శాఖే బాంధవ క్షయం। ద్విశాఖా నేత్ర రోగంచ కీటజుష్టార్థ నాశనం। ద్వేష్యం ప్రకురుతే దీర్ఘాప్రాణఘ్నా విత్వచా స్మృతా ఇతి॥ హవిర్లక్షణ ముక్తం కాత్యాయనేన॥ హవిస్త్రివిధం జ్ఞేయం కృతం చైవ కృతాకృతం। అకృతంచ క్రమాదేషాం లక్షణం సమ్య గుచ్యతే। కృతమోదన సక్త్వాది తండులాది కృతాకృతం। వ్రీహ్యాది చాకృతం ప్రోక్తమితి హవ్యం త్రిధా బుధై రితి॥ యేషాం కేషాం చిదన్యేషాం హవిషామప్యసంభవే। సర్వత్రాజ్య ముపాదేయం భరద్వాజ మునేర్మతాత్॥

హోమ ప్రకారః.

స్మృతి రత్నే॥ అంగుళ్యగ్రై ర్న హోతవ్యం సకృత్వాంగుళిభేదనం। అంగుళ్యుత్తర పార్శ్వేతు హోతవ్య మితి హి స్మృతిః ఇతి॥ విష్ణుః॥ అప్రబుద్ధేపి ధూమేవా జుహుయాద్యో హుతాశనే। యజమానో భవే దంధః సోముత్రేతి హి నశ్రుతం। యోఽనర్చిషి జుహోత్యగ్నౌ వ్యంగారిణిచ మానవః। మందాగ్ని రామయావీచ దరిద్రశ్చ ప్రజాయ

---

మిగుల సన్నమైనది బంధు నాశము నొందగూర్చును॥ రెండు కొమ్మలు గలది నేత్రరోగము బుట్టించును॥ క్రిమి దోషము గలది ద్రవ్య నాశనును చేయును. మిగుల పొడవు గలది ద్వేషము గలిగించును॥ చర్మములేనిది ప్రాణముల హరించును॥ అని వ్యాసుడు చెప్పెను॥ కృతము, అకృతము, కృతాకృతమువని హవిస్సు మూడు విధములు. ఇందు, అన్నము, పిండి మొదలైనవి కృతమనియు- ధాన్యము మొదలైనవి అకృతమనియు, తండులములు మొదలైనవి కృతాకృతము లనియు కాత్యాయనుడు చెప్పెను॥ కడమ హవిర్ద్రవ్యములు దొరకనిచో నన్నిటికిని బదులుగా నేయి యుపయోగింప నగునని భరద్వాజుడు తెలిపెను॥

హోమము చేయనగు విధము.

వ్రేళ్లకొనలచే గాని వ్రేళ్లనెడయెడముగా నుంచి గాని హోమము చేయగూడదు॥ వ్రేళ్లకు నుత్తరపు వైపునుండి హోమము చేయవలయు॥ అగ్ని మండక ముందు పొగయందు హోమము చేయునెడ యజమానుడు ఈలోకమునను పరలోకమునను గూడ నంధుండగును॥ జ్వాల గాని, నిప్పుకణుపులు గాని లేనియగ్నియందు హోమము చేయువాడు అగ్ని మాంద్యముచే నజీర్ణరోగము గలవాడును, దరిద్రుడును నగును॥ ఎక్కువ యింధనములతో బాగుగ మండు చున్నదియు, పొగలేనిదియు, నగు నగ్నియందు హోమము చేయ

శ్యము పఠింపఁదగినది. ఇహాపరసుఖములు గలవు. అంతమున గోలోకనివాసపుణ్యము లభించును.

ఆర్యులారా! ఈవిషయమునుగూర్చి వ్రాయఁదగినభాగములు లేవు. ఉన్నను అవి చర్వితచర్వణము వంటివి. బ్రహ్మ శంకరుని స్తుతించినభావమే యీస్తుతియందును గలదు. కాన దీనియందలి సత్యమేమనఁగా నేమూర్తియందును భావ మొక విధముగానుండిన ముక్తికాములకు ముక్తి లభించునని దీని సారము. ఏమూర్తినిధ్యానించిన నామూర్తి భక్తానుగ్రహార్థము భగవంతుఁడు ధరించినమూర్తియే కావున నెల్లర కఖిలపురుషార్థముల నిచ్చును. ఈరహస్య మెఱింగినచో మతవైషమ్యములు దేవతాంతరదూషణములు నశించుననుట నిక్కము. కావున మానవులు భక్తిభావమును గుదుర్చుకొనుటకుముం దీవైషమ్యమును మానవలయును. అది మానకున్న భగవంతునికృపకు దూర మగుచుందుము. కాఁబట్టి యట్టిపనికిఁ బూనరాదనుట దీనినుండి గ్రహింపఁదగు నీతి. ఇఁకఁ దర్వాతికథను జిత్తగింపుఁడు.

## రామకృష్ణులకు నుపనయనసంస్కారము చేయుట.

* ఇట్లు దేవతలు వినుతించి నిమీలితనయనులై భగవత్పాదపద్మముల ధ్యానించి కన్నులు విప్పగనే ప్రాంగణమునఁ బీతాంబరమును ధరించిన శ్రీకృష్ణమూర్తి కనఁబడెను. తొలకరి మెఱుపుఁదీగెఁగూడిన జలధరమువలెఁ బ్రకాశించు చుండెను. మాలతీమాల్యము ప్రకాశించు భగవంతుని వక్షస్థలము మలరా

* ఈ భాగము శ్రీకృష్ణజన్మఖండము నూటయొకఁడవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగఁదగు.

ఆగ్నేయీ శాంతి కర్మసు। ఐశానీ చోగ్ర కార్యేషు ఏత ద్ధోమస్య ల
క్షణ మితి॥ అథ, నిత్య కర్మ నిర్వర్త నార్థం శివాగ్ని సంపాదన వి
ధాన ముక్తం శాంభవీయ గృహ్య పరిశిష్టే॥

## శివాగ్ని సంపాదనవిధిః.

అథ నిత్య కర్మ నిర్వర్త నార్థం లఘు ప్రకారేణ శివాగ్నిం సం
పాదయిష్య ఇతి సంకల్ప్య అధికారీ సంపన్నోప కరణో లబ్ధ గణాను
జ్ఞోగ్ని ర్యామ్య నిరృతి వాయవ్యేభ్యో న్యతరస్యాం దిశి కల్పితం కుం
డం స్థండిలంవా సమాసాద్య కుండే స్థండిలేవా మధ్యే౽స్త్రేణ పూర్వా
గ్ర రేఖా త్రయం కుశైస్సంపాద్య ఉత్తరాగ్రాంచ రేఖాం సంపాద
యేత్॥ ఉత్తరాస్య శ్చోద్వ్యపర్యయేణ సంపాద్య, కవచే నాభ్యుంక్ష్య-
సర్వసంస్కార సంపత్తిం విభావ్య, తత్ర॥ శ్యామా మృతు మతీం
ధ్యాయేత్సద్యాసోమాల్య భూషణాం। ప్రసన్న వదనాం పద్మపత్రా
భ నయన త్రయాం॥ ఇతి ధ్యాత్వా- ఓం హ్రీం వాగీశ్వర్యై నమఇ
తి తద్వద్వాగీశ్వరం ధ్యాత్వా- ఓం హాం వాగీశ్వ రాయనమ ఇతి సం
పూజ్య, అర్ఘ్యం దత్వా, పశ్చాదరణ్యాది సంభవం శుద్ధ వేశ్మసంభవం
వాగ్నిం శుద్ధపాత్రే సమానీయ, క్రవ్యాదాంశం పరిత్యజ్య, నిరీక్షణాది
చతు స్సంస్కారై స్సంస్కృత్య, ఓం హాం రాం వహ్ని మూర్తయే
నమ ఇతి వహ్ని మంత్రేణ ప్రదీప కలికోపమ మాగ్నేయ బీజ ముద్భ
వ ముద్రియా నివేశ్య, తత్సంహితయా సంపూజ్య, పారమేశ్వర వీర్య
మితి సంభావ్య, వాగీశ్వరేణ వాగీశ్వరీ గర్భనాడ్యాం నిక్షిప్య మాణం
విభావ్య, నూతే నాత్మ సంముఖం నిక్షిప్య సమూహ్య, దేవ్యై వాసః
పరిధాయ, శౌచాచమనార్థం తోయ బిందుం హృదా దత్వా, సద్యో

---

తి కర్మములయందు, ఆగ్నేయ దేశ నున్న జిహ్వయందును, ఉగ్ర కార్యముల యందు ఈ
శానదిశ నున్న జిహ్వయందును హోమము చేయవలయునని యుత్తర లలితము నందు గ
లదు॥ నిత్యకర్మ నెరవేర్చుకొనుటకై శివాగ్ని సంపాదనవిధి శాంభవీయ గృహ్య పరిశిష్ట
ము నందుఁ జెప్పఁబడియున్నది॥

గొన్నింటిని కులగురువగు గర్గముని కొసంగిరి. గురువగు సాందీపనిమునికిఁ గొన్నింటి నిచ్చిరి. వేదోక్తక్రియాకలాపము పూర్తి కాఁగా వసుదేవుఁ డానందమున గర్గమహామునికి సర్వదక్షిణ నొసంగెను. దేవతలకు సర్వభోజనమిడి తృప్తులం గావించెను. బ్రాహ్మణులు తృప్తులైరి. ఆమహోత్సవమునకు వచ్చినవారెల్ల రా బాలకులకు శుభాశిషముల నొసంగిరి. వసుదేవుఁ డందఱ యథాయోగ్యముగాఁ బూజించెను. మర్యాదల నలరించెను. ఉత్సవము పూర్తి కాఁగా నందఱు తమతమగృహములకుఁ జనిరి.

నందుఁ డీరీతి యశోదంగూడి యాశుభకార్యము నిర్వహించి బలకృష్ణులను దొడలపై నిడుకొని ముఖముల ముద్దాడి గట్టిగా రోదనము చేసెను. పతివ్రతయగు యశోదయు నేడ్చెను. శ్రీకృష్ణుఁడు వారినిర్వుర నుచితరీతి నూఱడించి ముందు దెలిపిన విషయముల స్మృతికిందెచ్చుచు నిట్టులనియె. జననీజనకులారా! సానందచిత్తముల వ్రజమున కరుగుఁడు. మీరే నాకుఁ దలిదండ్రులు. వేఱుభావము నాకు లేదు. నేనిపు డన్నంగూడి యవంతీ పురమున కరిగెదను. సాందీపనియొద్ద విద్యాభ్యాస మొనరించెద. ఆమీఁద వచ్చి మిమ్ము దర్శింతును. కాలము కొంతగడిచినఁగాని రాజాలను. కాలమే ప్రాణులకు సంయోగవియోగములఁ గల్పించును. సర్వము కాలకృతమేగాని యితరుల కందు స్వాతంత్ర్య మేమాత్రము లేదు. కన్నులు మూసి తెఱచునంతలో నెన్ని యోకార్యములు సాగుచుండును. సుఖదుఃఖాదిద్వంద్వము లొకదానివెంట నింకొక్కటిగా వచ్చుచునే యుండును. మీకు ముందే యోగిజనసుదుర్లభమగు తత్వమును దెలిపితిని. ఆ

కుబేరాయ నమః — ఓం హాం ఈశానాయ నమః - ఈశాన్యాం ఓం హాం బ్రహ్మణే నమః — నైరృత్యాం, ఓం హాం విష్ణవే నమః - మధ్యే నీల లోహితాయ నమ ఇత్యభ్యర్చ్య, స్వాహాంతం బలి మర్ఘ్యంచ దత్వా, పూర్వోక్త రుద్రాదీ న్విసృజేత్। ఏవం శివాగ్ని స్సంభవతి॥

అథౌపాసన హోమః.

కర్తా ప్రాణానాయమ్య, సాయం ప్రాత రౌపాసన హోమం తం త్రహోష్య ఇతి సంకల్ప్య- పంచ వక్త్ర యుతం రక్తం సప్త జిహ్వా విరాజితం॥ దశ హస్తం త్రిణేత్రంచ సర్వాభరణ భూషితం। రక్త వస్త్ర పరీధానం పంకజోపరి సంస్థితం। బద్ధ పద్మాసనాసీనం దశాయుధ సమన్వితం। కనకా బహురూపా చాతిరక్తాతు తతః పరం। సుప్రభా చైవ కృష్ణాచ రక్తాచాన్యా హిరణ్మయీ। ఊర్ధ్వ వక్త్రే స్థితా స్తిస్ర శ్శేషాః ప్రాగాది దిక్ స్థితాః॥ ఇతి శివాగ్నిం ధ్యాత్వా, గాయత్ర్యాఽద్భి స్సంప్రోక్ష్య- ఓం జాతవేదసే నమః — ఓం సప్త జిహ్వాయ నమః - ఓం హవ్యవాహనాయనమః, ఓం అశ్వోదర జాయనమః - ఓం వైశ్వానరాయనమః - ఓం కౌమార తేజసే నమః - ఓం విశ్వ ముఖాయ నమః, ఓం దేవ ముఖాయ నమః ఇతి మూర్త్యష్టకం సంపూజ్య, అదితేఽనుమన్యస్వ, అనుమతేనుమన్యస్వ, సరస్వతేఽనుమన్యస్వ, దేవసవితః ప్రసువ, ఇతి పరిషిచ్య, సాయం ప్రాత రత ఊర్ధ్వం హస్తేన తే ఆహుతీ తండులై ర్యవైర్వా జుహుయాత్॥ తండులాన ద్వేధా విభజ్య అగ్నయే స్వాహా అగ్నయ ఇదం నమమ॥ మధ్యేగ్నౌ జుహోతి॥ అగ్నయే స్విష్ట కృతే స్వాహా॥ అగ్నయే స్విష్ట కృత ఇదం॥ నమమ॥ అగ్నే రుత్తరపూర్వే జుహోతి॥ ఈశాన్యాంజుహుయాత్॥ కాలాతిక్రమణ ప్రాయశ్చిత్తార్థం వ్యాహృతి సమిద్ధోమం కరిష్య ఇతి సంకల్ప్య॥ భూస్స్వాహా అగ్నయ ఇదం నమమ। భువ స్స్వాహా వాయవ ఇదం నమమ॥ సువ స్స్వాహా సూర్యాయేదం నమమ॥ భూర్భువస్సువ స్స్వాహా ప్రజాపతయ ఇదంనమమ॥ ఆహుతి సంసర్గ ప్రాయశ్చిత్తార్థం వనస్పతి సమిద్ధోమం కరిష్యే॥ య

తాఁ బ్రయాణమగునపుడు నందున కొసంగెను. నందుఁడు పర మానందమున గ్రహించెను. వారివెంట వచ్చినభూసురులకు దేవకీదేవి లోనగు నతఃపురపురంధ్రీమణులు విశేషద్రవ్యము నొసంగి గారవించిరి.

## రామకృష్ణులు విద్యాభ్యాసము చేయుట.

శ్రీరామకృష్ణులు సాందీపనిమునికడ విద్య నభ్యసింపనరు గుతఱి వసుదేవోద్ధవాక్రూరులు సాగనంపఁ బోయిరి. కాళిందీ తీరముదనుకఁ బోయి వారి వదలి రాఁజాలక విలపించిరి. శ్రీకృ ష్ణుఁడు తెలిపిన హితవాక్యముల నాలకించి విధిలేక వారెల్లమ రలి యాకుమారులఁ దలంచుచు మరల నెప్పుడు చూతుమా యని యువ్విళ్లూరుచు నిండ్లకుఁ జనుదెంచిరి. భర్తృహీనయగు కుంతియు వసుదేవుఁడొసఁగిన రత్నములఁగైకొని పుత్త్రులంగూడి యింటికేగెను. ఉపనయనమహోత్సవమున కరుదెంచినమహర్షు లకుఁ బండితేంద్రులకు ఋత్విజులకు వసుదేవుఁడు యథార్హ ముగ సత్కారపూర్వకముగా దుకూలాంబరాభరణరాజి నొ సంగి సంతోషింపఁ జేసెను. ఆయింట వేదపాఠము బహుతర ముగాఁ జేయఁబడియె. హరినామసంకీర్తనము మహానందమునఁ జేయఁబడియెను. ఆగృహవరము సకలకల్యాణనిలయమై యుం డెను. బంధువులకు జ్ఞాతిబృందమునకు మర్యాదల ననుసరించి వస్త్రాదుల నిచ్చి వసుదేవుఁడు వారివారిగృహములకుఁ బోవ ననుజ్ఞనొసంగ నాగౌరవముల కలరుచు వారు పోయిరి. శ్రీహ రియు బలరాముఁడును సాందీపనికడఁ జేరిరి.

ఆర్యమహాశయులారా! ఈవిషయమున వ్రాయఁదగిన రహస్యములు లేవు.

రాత్రీః। సాన స్సమంత మనుపరీహి భద్రియా భర్తా రస్తే సుఖలే మా రిషామ॥ అజిన ముత్తరయా॥ మిత్రస్య చక్షుర్ధరుణం బలీయ స్తేజో యశస్వి స్థవిరగ్ం సమిద్ధ। అనాహనస్యం వసనం జరిష్ణు పరీదం వా జ్యజినం సందధే౾హం॥ దండ ముత్తరేణాదత్తే॥ సుశ్రవ స్సుశ్రవ సం మా కురు యథాత్వగ్ం సుశ్రవ స్సుశ్రవా అస్యేవ మహగ్ం సుశ్రవ స్సుశ్రవా భూయాసం యథా త్వగ్ం సుశ్రవో దేవానాం నిధిగోపో౾స్యేవ మహం బ్రాహ్మణానాం బ్రహ్మణో గోపో భూయాసం॥ ఆచమ్య, ప్రాణానాయమ్య, దేశ కాలౌ సంకీర్త్య, సాయం ప్రాత రగ్ని కార్యం కరిష్యే ఇతి సంకల్ప్య, పరిత్వాగ్నే పరిమృజా మ్యాయుషా చ ధనేన చ। సుప్రజాః ప్రజయా భూయాసగ్ం సువీరో వీరై స్సువర్చా వర్చసా సుపోషః పోషై స్సుగృహో గృహై స్సుపతిః పత్యా సుమేధా మేధయా సుబ్రహ్మా బ్రహ్మ చారిభిః॥ ఇతి పరిమృజ్య, అలం కృత్య, తస్మిన్నుత్తరై స్సమిధ ఆదధ్యాత్॥ అగ్నయే సమిధ మితి ద్వాదశ సమిధ ఆదధాతి॥

౧॥ ఓం అగ్నయే సమిధ మాహార్షం బృహతే జాతవేదసే యథా త్వమగ్నే సమిధా సమిధ్యస ఏవం మామాయుషా వర్చసా సన్యా మేధయా ప్రజయా పశుభి ర్బ్రహ్మ వర్చసేనా న్నాద్యేన సమేధయ స్వాహా॥ అగ్నయ ఇదం॥

౨॥ ఏధో౾స్యేధిషీమహి స్వాహా॥ అగ్నయ ఇదం॥

౩॥ సమిదసి సమేధిషీ మహిస్వాహా॥ అగ్నయ ఇదం॥

౪॥ తేజో౾సి తేజోమయి ధేహి స్వాహా॥ అగ్నయ ఇదం॥

౫॥ అపో అద్యాన్వచారిషగ్ం రసేన సమసృక్ష్మహి। పయస్వాగ్ం అగ్న ఆగమం తం మాసగ్ం సృజ వర్చసా స్వాహా॥ అగ్నయ ఇదం॥

౬॥ సం మాగ్నే వర్చసా సగ్ంసృజ ప్రజయా చ ధనేన చ స్వాహా॥ అగ్నయ ఇదం॥

౭॥ విద్యున్మే అస్య దేవా ఇంద్రో విద్యా త్సహర్షిభి స్స్వాహా॥ ఇంద్రాయేదం॥

ననుసరింపఁజేయుపొంటెఁ గర్మముల నాచరింతును. నేనే కర్మములఁ జేయకయున్న నీలోకులు భ్రష్టులగుదురు. కావున సంకరముగ లోకమునుజేయుటకు నేనపుడు కర్తనగుదును. దాని కంగీకరించినయెడల జనులనెల్లఁ బాడుచేసినవాఁడ నగుదునుగదా. కావున నాత్మజ్ఞానముగలవాఁడు కర్మములయందాసక్తిగల పామరులబుద్ధిని జలింపఁజేయఁగూడదు. తనకుఁ గర్మఫలాపేక్ష లేకున్నను గర్మములను దాఁజేయుచు వారిచేత నన్నికర్మములను జేయించుచుండవలయును. యోగ్యుఁ డేయే కర్మముల నాచరించునో పామరు లాయాకర్మములనే చేయుదురు. అతఁ డేదిప్రమాణమని నియమించునో దాని ననుసరింతురని పైగీతావాక్యముల సారతరార్థము.

ఇట్లు భగవంతునిభావము కావున గురుశుశ్రూషచేయుట పరమధర్మమనియు దానిచే లభించినవిద్య ఫలదాయిని యగుననియు నామార్గము ననుసరింపకయున్న నావిద్య సత్ఫలముల నీఁజాలదనియు లోకులకుఁ దెలుపుటకొఱకే శ్రీకృష్ణుఁడు సాందీపనికడఁ జదువనరిగెను. విద్యాప్రదాత విద్యనభ్యసింపఁ బోవుట యపహాస్యలక్ష్యము కదా. కావున భగవంతుఁడు తానుగూడఁ బ్రాచీనాచారములఁ బాటించిన వానిని లక్ష్యములుగాఁ గైకొని యంద అనుసరింతురనియు నదియే తాఁ జేయవలసినపనియనియు భావించి చేయఁబూనెను.

"శ్లో. గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా,
అథవా విద్యయా విద్యా చతుర్థా నోపలభ్యతే."

అన్నసూక్తి వినఁబడియెడుఁగదా. గురుశుశ్రూషచే లభించునది యొకటి. విశేషించి ధనవ్యయముచేసి సంపాదించినదొకటి. తన

ధానా హృత్యా అగ్ని కార్యం సాయం ప్రాతః కుర్యాత్ ॥ ఇత్యగ్ని కార్యం॥

నను శ్రౌత స్మార్త కృత్యే ష్వగ్నిః రుద్ర రూపత్వేన గృహీతః॥ రుద్రోవా ఏషయదగ్నిః త్వమగ్నే రుద్ర ఇత్యాది శ్రుతి ప్రామాణ్యాత్ ॥ శివాగమేషుతు వాగీశీగర్భసంభూతత్వేనో గృహీతః తేన రుద్రసూను రిత్యేవ గమ్యతే॥ ఏవం అగ్నే స్సాక్షాద్రుద్రత్వ ప్రతి పాదక శ్రుతి విరుద్ధార్థ బంధురత్వే నాగమానా మప్రామాణ్యమితి నిగమాగమ ప్రామాణ్యే తత్కర్తృభి ర్నిరూపితం ఏవం వాగీశ వీర్య సంజాతస్య శివాగ్నే రుపాసనం నకథం శ్రుతి విప్రతి షిద్ధం భవే దితి చేదుచ్యతే॥ శ్రుతిషు సాక్షా ద్రుద్రత్వ ప్రతి పాదనే ప్యగ్నే శ్శివాగ మేషు పరమేశ్వర వీర్యత్వ ప్రతిపాదన మవిరుద్ధం పరమేశ్వరస్య కృశాను రేతస్త్వస్య శ్రుతి స్మృతి ప్రసిద్ధ త్వాత్ ॥ శ్రుతిషు సాక్షా ద్రుద్రత్వ ప్రతి పాదనంతు ఆత్మావై పుత్రో నామాసీతిశ్రుతి ప్రామాణ్యాత్ రుద్ర పు

---

అగ్ని కార్యమును సాయంకాలమునను, ప్రాతఃకాలమునను చెప్పిన విధమున నాచరించు చుండవలయును.

ప్ర॥ శ్రౌతస్మార్త కృత్యములయందు అగ్ని రుద్రరూపుఁడుగాఁ జెప్పఁబడియెను శివాగమములయందైననో వాగీశ గర్భసంభూతుఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు గాన రుద్రపుత్రుఁడని తెలియుచున్నది " అగ్నిసాక్షాత్తు రుద్రుఁడేయని చెప్పఁబట్టి శ్రుత్యర్థమునకు విరుద్ధముగా శివాగమములయందుఁ గలదుగాన శివాగమములు ప్రమాణములు గావని నిగమాగమ ప్రామాణ్యమను గ్రంథమునందుఁ గలదు. దీనింబట్టి వాగీశ గర్భసంభూతుఁడగు శివాగ్ని నుపాసించుట శ్రుతివిరుద్ధము గాదా?

ఉ॥ ఇందేమియు శ్రుతివిరోధము లేదు. అగ్నిసాక్షాత్తు రుద్రుఁడేయని వేదములయందున్నను ఈశ్వరుఁడు కృశాను రేతస్కుఁడనుటయు శ్రుతిస్మృతి ప్రసిద్ధమే. కావున నగ్ని పరమేశ్వరుని వీర్యమని యాగమములయందుఁ జెప్పినయంశము వేదవిరుద్ధమైనది కాదు

ప్ర॥ అట్లైనచో అగ్ని సాక్షాత్తు రుద్రుఁడనునది యెట్లుపొసఁగును?

ఉ॥ అగ్ని పరమేశ్వరుని వీర్యమగుటయే నిజమైనను ఆత్మావై పుత్రోనామాసీ ది శ్రుతినిబట్టి రుద్రపుత్రుఁడు రుద్రుఁడనుట బాగుగనే పొసఁగును.

కొందఱకు మంత్రముద్వేషింప మతి భ్రమమొదవును. ఏల? అను ప్రశ్నము యుక్తము. మంత్రమనఁగా ధ్యానించినఁ దరింపఁ జేయునది కదా. అట్టి మంత్రమును జపించిన దానఁ గీడు గలిగెనేని మంత్రశబ్దార్థము తప్పుగదాయని ప్రశ్నమునకర్థము. సమాధాన మేమనఁగా, ఉపాసకుఁడు మంత్రజపము చేయునపుడు దురుద్దేశము గలవాఁడైనచో నాతనియూహ ఫలించునంతటి యదృష్టము వానికిలేకుండిన నామంత్రాధిదేవత యతనికి మనోవిభేదము చేయును. ఏలయనఁగా ఆతఁ డట్టిఫలముల నొందఁదగినసత్కర్మములఁ బ్రాగ్జన్మమునఁ జేయలేదు. కావున నవి లభించినఁ బొందఁదగఁడు. మంత్రసిద్ధియైన నవి యలవడక తప్పవు. కావున మంత్రము సిద్ధిగాకుండుమార్గము నే తదధిదేవత వెదకును. కావున గురుభక్తియను సాధనమున్న దేవతానుగ్రహము గలుగును. అనఁగా జ్ఞానముగలిగి ఫలమును గోరక జపము చేయును. పై రెండువిషయములకుఁ గుంభకర్ణుఁడు విభీషణుఁడు నుదాహరణభూతులు. ఇద్దఱు తపస్సు నిష్ఠమై నొనరించిరి. ఫలమునుగోరిన కుంభకర్ణుఁడు దుష్ఫలములఁ బొందెను. ఫలములనుగోరని విభీషణుఁడు సత్ఫలముల నితరులకు సాధారణముగా లభింపనివానిం బొందెను. ఏల? అని యాలోచింపుఁడు. చక్కఁగా బోధపడును.

మంత్రమెట్లో వేదాదివిద్యలు నట్టివే. గురుభక్తి ప్రధానమని యదిలేకున్న నావిద్య సంపూర్ణఫలము నీఁజాలదని దీనిసారము. ఈవిషయమే మనుస్మృతియందు,

"శ్లో. విద్యా బ్రాహ్మణమేత్యాహ శేవధిష్టేఽస్మి రక్షమాం,
అసూయకాయ మాంమాదా స్తథాస్యాంవీర్యవ త్తమా."

త్ర్యక్షర్యభి శ్శబ్దైస్త్వైవ బ్రహ్మత్వే నాభిమతత్వేన బ్రహ్మపరాణా మపి మంత్రాణాం శబ్ద పరతయా వివరణస్య అదూషితత్వాత్॥ ఏవంచా పి పంచ వక్త్రత్వ దశభుజత్వాది లక్షిత పారమేశ్వర రూపైక ధ్యాప కైః ప్రాగ్భిరుపేక్షిత ఇతి జ్ఞాయతే॥ పరేతు సప్త జిహ్వాత్వ మివని త్య ధ్యేయసు పారమేశ్వర విలక్షణ రూపలక్షిత మప్యగ్ని ధ్యానే నేదం రూపం విరుద్ధ మిత్యాహుః॥

అథాభివాదనం

హోమానంతర మభివాదనం కార్యం, బ్రాహ్మణ సముదాయే ప్రథమం కస్యాభి వాదన మితి చేత్తదుక్తం మనునా॥ లౌకికం వైదికం వాపి తథాధ్యాత్మిక మేవవా। ఆదదీత యతో జ్ఞానం తం పూర్వ మభివాదయేత్। అభివాదాత్పరం విప్రో జ్యాయాంస మభివాదయన్। అసౌనామాహమస్మీతి స్వం నామ పరికీర్తయేత్। భో శబ్దం కీర్తయే దంతే స్వస్య నామ్నో భివాదయే దితి॥ అభివాద శబ్ద ముచ్చార్య పశ్చాదేతన్నామాహంభో ఇతి శబ్ద ముచ్చారయే దిత్యర్థః

ప్ర॥ చత్వారి శృంగా అనుమంత్రము నిజముగ శివపరమే యగునేని పూర్వులు వాగ్ని ధ్యానమున దీనినేల గ్రహింపరైరి?

ఉ॥ ఈమంత్రము నిజముగ శివపరమేయైనను అయిదుముఖములు పదిచేతులుగల పరమేశ్వర రూపమునే ధ్యానముచేయు వారుగాన పూర్వులీమంత్రమును వదలి యుండవచ్చును. ఇందు మఱికొందఱు యాశయమేమన అయిదు ముఖములుగల రూపమునందు సప్తజిహ్వలు లేవు. అయినను వారు సప్తజిహ్వలుగల రూపమును ధ్యానముచేయ నంగీకరించిరి. గాన ఇతర లక్షణములు గలదియగు చత్వారి శృంగాఅను మంత్రప్రతిపాద్యరూపమును బాగు ధ్యానము చేయనగునని యెంచుచున్నారు.

అభివాదనము.

హోమము చేసిన తరువాత నభివాదనము చేయవలయును, బ్రాహ్మణ సాముదాయమునందు మొదట నెవ్వరికి నభివాదనము చేయవలయుననిన లౌకికము గాని, వైదికముగాని, ఆధ్యాత్మికముగాని యగుజ్ఞానమును తానెవ్వనివలన గ్రహించి యుండెనో, వానికి మొదట నభివాదనము చేయవలయునని మనువుచెప్పెను. అభివాదనము చేయు నప్పుడు తన పేరుచెప్పి పేరుపైన భో అను శబ్దము చేర్పవలయును. అభివాదనము చేయు నప్పుడు

కొనుచుండిరి. దాన వారికది యించుక లభించినను బూర్ణఫలము
గలుగుచుండెను. అది లేనికతన నీకాలపువిద్య యంతటివిజ్ఞానము
నొసంగఁజాలకున్నది. కావుననే శాపానుగ్రహసమర్థులు కాకు
న్నవారు. ఆశీర్వాదములు ఫలింపకున్నవి. శాపములు నిష్ఫ
లము లగుచున్నవి. ఇన్నింటికిని గారణము విద్య చక్కనిపద్ధ
తిచే నభ్యసింపకపోవుటయే కాని వేఱొక్కటి కాదు. ఈవిష
యమే శ్రీకృష్ణపరబ్రహ్మ మొకమహర్షికడ విద్య నభ్యసింపఁ
బోవుచు నాహేతువుచే లోకులకు వెల్లడిచేసెను. ఈనీతియే
యీకథనుండి గ్రహింపఁదగును. గురుభక్తి ప్రధానమని దాని
సాయమునఁ లభించినవిద్య సద్విద్యయగునని యీ కథాసార
ములు. ఇంకఁ దరువాతిభగవచ్చరిత్రము నాలకింపుఁడు.

### బలదేవకృష్ణులు సాందీపనికడ విద్య నభ్యసించుట.

* బలరాముని గూడి శ్రీకృష్ణమూర్తి వసుదేవాదుల
వెనుకకుఁ బంపి పాదగతినే యాశ్రయించి సాందీపనిముని
యాశ్రమమునకుం బోయెను. గురువునకు నమస్కరించి యా
వెనుకఁ బతివ్రతాశిరోమణియగు నాగురుపత్నికి నభివాదన
మాచరించెను. వారిచ్చిన శుభాశిషములఁ బడసెను. తాఁ
గొనిపోయిన రత్నాదివస్తువుల సమర్పించెను. వారిం గాంచి
యిట్లు పలికెను. మహాత్మా! మీవలన విద్య గ్రహింప వచ్చి
తిమి. మేము కోరినవిద్య నుపదేశింపుఁడు. సుముహూర్త
మెప్పుడో నిర్ణయించి విద్య నుపదేశింప నారంభింపుఁడు. మీ
కేది యుచితమని తోఁచిన నావిద్య నారంభింపుఁడు. ఇదియ

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము నూటరెండవ యధ్యాయమునుండి
గ్రహింపఁబడినదని గ్రహింపవలయును.

య సవ్య దక్షిణాభ్యాం పాణిభ్యాం స్పృష్టవ్యః॥ గురవే శరణాగతిః క
ర్తవ్యా తల్లక్షణ ముక్తంమకుటోత్తరే॥ దక్షహస్తేన సంగృహ్య నిశ్చలం
లింగ పీఠికాం। పాదాంగుష్ఠౌ గురో స్సవ్య హస్తేన పరిగృహ్యచ। సం
స్పృశ్యయ న్నేత్రయో స్త్రిస్సగురుం శరణం ప్రజేదితి॥

అభివాద వర్జ్యానాహ పస్తంబః॥ నసోపాన ద్వేష్టిత శిరా వ
హిత పాణి ర్వాభివాద యీతేతి॥ శంఖోపి॥ నోదకుంభ హస్తోఽభివా
దయే న్న భైక్షంచ రన్నపుష్ప హస్తో నాశుచి ర్నజప న్నదేవ పిత్ర్య కా
ర్యం కుర్వ న్నశయాన ఇతి॥ ఉపాధ్యాయా ద్దశాచార్యః ఆచార్యా
ణాం శతం పితా। సహస్రంతు పితు ర్మాతా గౌరవేణాతిరిచ్యత ఇత్యా
హ మనుః॥ ఆచార్యోపి పిత్రు మాత్రా ద్వ్యపేక్షయా గరియానేవ। తదా
హ సఏవ। ఉత్పాదక బ్రహ్మదాత్రో ర్గరీయా న్బ్రహ్మదః పితా। బ్రహ్మ
జన్మహి విప్రస్య ప్రేత్య చేహచ శాశ్వత మితి॥ యస్తు బాలోపి వృద్ధ
మధ్యాప యతి సోపి తస్య గరీయా నితి సఏవాహ॥ బాలోపి విప్రో వృ
ద్ధస్య పితా భవతి మంత్రదః అధ్యాప యామాస పిత్రూన్ శిశు రాంగి
రసః కవిః॥ ఇతి॥ ఆచార్య ప్రాచార్య సన్నిధానే ప్రాచార్య ముప సం

---

తో బట్టుకొని, ముమ్మారు కనులకద్దుకొనుచు గురుని శరణు జొచ్చ వలయునని మకు
టోత్తరమున నున్నది.

పాదరక్షలు తొడిగికొని గాని తలపాగ జుట్టుకొని గాని చేతిలో బరువు నిడికొ
ని గాని యభివాదనము జేయఁగూడదు. నీటికడవ చేతి నుండుడగను, భైక్షమునకు దిరుగు
చుండను, పూవులుచేతి నుండుండగను అశుచి యయ్యును, జపమాలచే [illegible], దేవపిత్ర్య
కార్యముల నాచరించుచును, పండుకొనియు నభివాదనము చేయఁగూడదు.. ఉపాధ్యా
యునికంటె నాచార్యుండు పదిమడుంగు లెక్కువ. ఆచార్యునికంటె తండ్రి నూఱుమడుం
గు లెక్కువ తండ్రికంటె తల్లి వేయిమడుంగు లెక్కువ యని మనువు చెప్పెను. అయినను
తలిదండ్రులకంటె నాచార్యుండే యెక్కువ ఆయన వె తండ్రికంటె జ్ఞాన ప్రదుఁడైన
యెక్కువ యని చెప్పచున్నాఁడు. బాలుఁడైనను వృద్ధునకు విద్యగఱపిన యెడ [illegible]
మనువు చెప్పియుండెను [illegible], [illegible], చేరి [illegible] గురు
[illegible] వందనము చే [illegible] నభి వాదన

కందర్పలీలాభుని, గమనీయదర్శనుని, నమూల్యరత్ననిర్మాణభూషణవిభూషితుని వరదుని వరదానదక్షుని నాల్గువేదములకు సకలకారణములకుఁ గారణభూతుని ధ్యానించువాఁడను. నాయందలి యనుగ్రహమునఁ బాత్రార్థమై నాయీకుటీరమున కేతెంచిన మాయేశ్వరుని నిన్ను నేవిద్య క్రొత్తదని పఠింపఁ జేయుదును. పరిపూర్ణుఁడవు. సనాతనుఁడవు. సర్వేశ్వరా! నాయొద్ద నే మభ్యసింపఁగోరిన నాహృదయముననున్న నీవే నీకు విద్య చెప్పువాఁడవు. ఇంతకంటె నాకేమియుఁ దెలియదని కరాంజలింబట్టి యూరక యాశ్యామసుందరమూర్తిని ధ్యానించుచుండెను.

అంత సాందీపనిమునిపత్ని పూతచరిత్ర భగవంతుని దర్శించుచు మహాత్మా! ఇపుడు నాజన్మము పవిత్రమైనది. జీవనము సఫలము. పాతివ్రత్యము సఫలము. తపోవనము ధన్యము. ఏ నీకు నన్నమిడు భాగ్యముగలిగెనో అట్టి యీ నాదక్షిణహస్తము సఫలము. కావున నీయాశ్రమము తీర్థభూతము. ఏలయనఁ దీర్ఘపాదపాదాంకితము. నీపాదపద్మరజస్సంస్పర్శమున నీయాశ్రమస్థలులు పావనములు. మాదంపతులకు నీపాదపంకజారాధనమే యలంకారము. ఎంతదనుక మనుష్యుఁడు నీపాద సేవచేయఁడో యంతదనుక దుఃఖశోకరోగాదిబాధ లుండును. ఆవల నవి నామమాత్రశేషములై యుండఁగలవు. త్రిమూర్తులు నీయంశములు. కృపాకరా! మాపై ననుకంప యుంచుము. మాయామోహముల నశింపఁజేయుము. అని పలికి బాష్పపూర్ణ నేత్రయై శ్రీహరిచెంత నిలుచుండి తల్లియగు దేవకివలె నాతని బ్రీతిచేఁ గాంచెను.

త్ర ప్రసిద్ధ్యర్థం స్వైః కర్మభి రగర్హితైః। అక్లేశేన శరీరస్య కుర్వీత ధన సంచయ మితి॥ అగర్హితాని చాధ్యాపనాదీన్యస్యాం క్షత్రియాం దేస్తు శస్త్రాస్త్ర భృత్త్వం క్షత్రస్య వణిక్పశు కృషిర్విశ ఇతి॥ వణిక్= వాణిజ్యం, పశుః= పశుపాలనం॥ ఉపాయాంతరాణ్యాహ మనుః॥ సప్త విత్తాగమా ధర్మ్యా దాయో లాభః క్రయో జయః। ప్రయోగః కర్మయోగశ్చ సత్ప్రతిగ్రహ ఏవ చేతి॥ దాయోన్వయాగతం ధనం, లాభో నిధిదర్శనం, దాయ లాభ క్రియాశ్చతుర్ణాం వర్ణానాం, జయః క్షత్రియస్యైవ॥ ప్రయోగో వృద్ధ్యర్థం ధన ప్రదానం, కర్మయోగః కృషిః వాణిజ్యం ప్రయోగ కర్మయోగౌ వైశ్యస్యైవ, సత్ప్రతిగ్రహో విప్రస్యైవ॥ అత్రోక్తం మనునా॥ ఋతామృతాభ్యాం జీవేత మృతేన ప్రమృతేన వా సత్యానృతాభ్యామపి వా న శ్వవృత్త్యా కదాచన॥ ఋత ముంఛ శిలం జ్ఞేయ మమృతం స్యాదయాచితం। మృతంతు యాచితం ప్రోక్తం ప్రమృతం కర్షణం స్మృత మితి॥ సత్యానృతంతు వాణిజ్యం తేన చైవాపి జీవ్యతే। సేవా శ్వవృత్తి ర్వ్యాఖ్యాతా తస్మాత్తాం

నాయాసముగా ధనము నార్జింప వలయు, అధ్యాపనము మున్నగునవి నింద్యములు గావ చెప్పఁబడెను. క్షత్రియుఁడు శస్త్రాస్త్రముల ధరించియు, వైశ్యుఁడు కృషి వాణిజ్యము నవలంబించియు ధనము నార్జింప వలయు, మఱియు, మనువు ఉపాయాంతరములఁ జెప్పి యుండెను, పూర్వార్జిత ధనము నిదర్శనము క్రయము జయము. వడ్డీవ్యాపారము సత్ప్రతిగ్రహము నని యీయేడును న్యాయ్యములైన వస్తువులు॥ ఇందు భాగలబ్ధము నిధి యను నవి నాలుగు వర్ణములకు గలవు. జయము క్షత్రియునకు మాత్రమే॥ వడ్డీ వ్యాపారము కృషి ఇత్యాది వైశ్యునకు మాత్రమె సత్ప్రతిగ్రహము బ్రాహ్మణునకు మాత్రము నుపయోగించును.

ఋతము అమృతము ననువానిచే జీవింపవలయు. మృతము ప్రమృతము ననువానిచేనైన జీవింపనగును. సత్యానృతము చేనైన జీవింపవచ్చుగాని, శ్వవృత్తిచేత నెప్పుడును జీవింపఁగూడదు॥ ఇందు, ఉంఛశిలములు ఋతమనియు, అయాచితము అమృతమనియు, యాచితము మృతమనియు, కృషి ప్రమృతమనియు, వాణిజ్యము సత్యానృతమనియు, సేవ శ్వవృత్తి యనియు జెప్పఁబడెను. పైరునుండి రాలి పడిపోయిన గింజల నే

దక్షిణను బుత్త్రున కొసంగి భగవత్కారుణాలభ్యమగు దివ్యవిమానము నెక్కి గోలోకమునకు భార్యం గూడిపోయెను. ఈచరిత్రము పరమాద్భుతము. సంసారభయనాశనము. దీనిం బఠించువారికి శ్రీకృష్ణదాస్యము లభించును.

భక్తవరులారా! ఈవిషయమునుగూర్చి వ్రాయఁదగిన విశేషములు ముందే వ్రాసియుంటిని. కాన నిట మరల వ్రాయఁబూనను. ఇంతదనుక భగవంతుని బాల్యచరిత్రము ముగిసినట్లు భావింపనగును. ఇఁక శ్రీకృష్ణమూర్తి రాజవేషమును ధరించి దుష్టసంహారము చేయఁబూనును. విద్యాభ్యాసము పూర్తి కాఁగా బాల్యము పూర్తియయ్యెనని గ్రహింపవలయును. "పరిత్రాణాయ సాధూనామ్." అనుభాగమును దాఁటి "వినాశాయ చ దుష్కృతామ్" అన్న భాగమును నెఱవేర్ప భగవంతుఁడు పూనినచరిత్ర మింక వ్రాయఁదగును. అవతారఫలమన నదియే కదా. కావున నిఁక నాక్రమము నాలకింపుఁడు.

శ్రీకృష్ణమూర్తి బలరాముంగూడి సాందీపనియొద్ద విద్య నభ్యసించి గురుదక్షిణ నిచ్చెనని ముందే చెప్పియుంటిని గదా. మృతుఁడగు గురుపుత్త్రుని దెచ్చియిచ్చి యనర్ఘ్యరత్నములు గూడ గురువున కొసంగెననియు వానినెల్లఁ దనకుమారున కొసంగి భార్యంగూడి గోలోకమున కేగెననియు ముందే వ్రాయఁబడినది. మృతగురుపుత్త్రుని దెచ్చుపద్ధతి పురాణాంతరమున నున్నది. ఆవిషయమును వ్రాయవలయును. ఆకథయందే యనంతునిమహత్త్వము తేటపడుటయే గాక భక్తుల కామహాత్ముని యపారశక్తి బోధపడును. దాన వారికి భక్తిభావము మఱింత దృఢమగును. అంతియగాక భగవత్కథల నమ్మనివారి కించుక

పైఠీన సిరపి॥ స్వశాఖాధ్యయనం యత్ర బ్రహ్మ యజ్ఞస్స ఉచ్యతే। బ్రహ్మయజ్ఞ పరో విప్రో బ్రహ్మలోకే మహీయత ఇతి॥ ఆశ్వమేధికేపి॥ వేద మాదౌ సమారభ్య తథోపర్యుపరి క్రమాత్॥ యదధీతే న్వహం శక్త్యా తత్స్వాధ్యాయం ప్రచక్షతే। ఋచం వాథ యజుర్వాపి సామగాథా మథాపి వా। ఇతిహాస పురాణాని యథా శక్తి నహాపయేదితి॥

గ్రహణాధ్యయన వద్బ్రహ్మ యజ్ఞాధ్యయన స్యాప్యనధ్యాయ దినేషు నిషేధ ప్రాప్తా వుక్తం మనునా॥ వేదోప కరణే చైవ స్వాధ్యాయే చైవ నైత్యకే। నానురోధో స్త్యనధ్యాయే హోమ మంత్రేషు చైవహి॥ ఇతి॥ అత్ర దేశ మోరశుచిత్వే బ్రహ్మ యజ్ఞో వర్జనీయః। తథాచ శ్రుతిః॥ తస్యవా ఏతస్య యజ్ఞస్య ద్వావనధ్యాయౌ యదాత్మా శుచి ర్యద్దేశ ఇతి॥ బ్రహ్మ యజ్ఞం ప్రశంసతి శ్రుతిః॥ ఉత్తమం నాకం రోహత్యుత్తమ స్సమానానాం భవతి యావంతం హ వా ఇమాం విత్తస్య పూర్ణాం దదత్స్వర్గం లోకం జయతి భూయాంసం చాక్షయ్యం చాప పునర్మృత్యుం జయతి బ్రహ్మణ స్సాయుజ్యం గచ్ఛతీతి॥ యాజ్ఞవల్క్యోపి। యంయం క్రతు మధీయీత తస్య తస్యాప్నుయా త్ఫల మితి॥ విత్తపూర్ణ పృథివీ దానస్య ఫల మశ్నుత ఇతి॥

బ్రహ్మయజ్ఞానుష్ఠానం

ఆచమ్య ప్రాణానాయమ్య దేశకాలౌ సంకీర్త్య శ్రీమాన...

---

యు వలయు॥ స్వశాఖను జపుపుటె బ్రహ్మ యజ్ఞ మగును॥ బ్రహ్మయజ్ఞము చేయువాడు బ్రహ్మలోకమున వసించును॥

వేదము నేర్చికొనునప్పుడు వలెనె బ్రహ్మ యజ్ఞమున వేదము చదువునప్పుడును అనధ్యాయముల యందు నిషేధము ప్రాప్తింపగా బ్రహ్మయజ్ఞము నందును, హోమమంత్రముల యందును అనధ్యాయ నిషేధము లేదని మనువు తెలిపెను॥ తనకు, తానుండు ప్రదేశమునకును, నశౌచిత్వము వచ్చినచో బ్రహ్మయజ్ఞము చేయకూడదు॥ యథావిధిగా బ్రహ్మయజ్ఞము చేయువాడు సాటివారిలో నెక్కుడై అపమృత్యువును జయించి స్వర్గ సుఖము గాంచు ననియు, ధనపూర్ణమగు భూమండలమును దానము చేయగా గలుగు పుణ్యము నొందు ననియు ప్రశంసింపబడి యున్నది॥

పనిమునితనయుని హరించినవాఁడను నేనుగానని విన్నవించెను. అంత నూరకుండక పంచజనుఁడను దైత్యుఁ డొక్కఁడు శంఖ రూపుఁడై యాబాలకుం గొనిపోయెను. రాక్షసాంతకులారా! ఆదనుజుఁడు నాజలముల నున్నవాఁడు. తరువాతఁ దమయానతి యెట్లో యెఱుంగ వేఁడువాఁడ ననియె.

సాగరోక్తుల నాలకించి శ్రీహరి బలరాము నందే నిలిపి తానొక్కఁడ యాసాగరజలంబులం బ్రవేశించి పంచజనుంబట్టు కొని వాఁడు పోరఁబూనఁగా క్షణమాత్రమున వానిని సంహ రించి వానియొమ్ముకఁ బుట్టినశంఖమును గ్రహించెను. ఆశంఖము పూరించినంతన దానవబలము నశించును. దేవతలకు బలము వృద్ధియగును. అధర్మము వృద్ధిగాంచక నశించు. వానిచెంగట నాగురుపుత్త్రుఁడు లేకుండెను. ఆవిషయమెఱింగి శ్రీహరి యా పాంచజన్యమును బూరించి యమపురంబున కరిగెను. యమనగ రమునకు హరిపోవుచుండ బలరాముఁడును వెంటఁబోయెను. యముఁ డజ్ఞానమూని వారితత్త్వ మెఱుంగక మృతశిశువును మరలఁ గొనిపోవవచ్చితిరా అని వెక్కసములాడి వారల మార్కొనియె. బలరాముఁ డశ్రమంబున నాతని నోడించెను. ధర్మరాజంతట విగతాహంకారుఁడై గురుపుత్త్రు నొసంగి వారిని సత్కరించి పంపెను. ఆగురుపుత్త్రుఁడు యమనగరమున యాతనల ననుభవించుచుండెను. ఆబాలకుఁడు శ్రీహరిదర్శనమున విగత పాపుఁ డయ్యెను. వానింగొని శ్రీరామకృష్ణు లరుదెంచి గురు వునకు సమర్పించిరి. సాందీపని యానందమునకు హద్దులేకుం డెను. అంతట గురునసుమతినొంది మధురానగరమున కరుదెం

దయాత్। ఓం సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ॥ పరో రజసి సావదోం॥

ఇషేత్వోర్జేత్వా వాయవస్థో పాయవస్థ దేవోవ స్సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వ మఘ్నియా దేవభాగ మూర్జస్వతీః పయస్వతీః ప్రజావతీ రనమీవా అయక్ష్మా మావస్తేన ఈశత మాఘశగ్ంసో రుద్రస్య హేతిః పరివో వృణక్తు ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీర్యజమానస్య పశూన్పాహి॥

బ్రహ్మ సంధత్తం తన్మే జిన్వతం। క్షత్రగ్ం సంధత్తం తన్మే జిన్వతం ఇషగ్ం సంధత్తం తాం మే జిన్వతం। ఊర్జగ్ం సంధత్తం తాం మే జిన్వతం, రయిగ్ం సంధత్తం తాం మే జిన్వతం। పుష్టిగ్ం సంధత్తం తాం మే జిన్వతం। ప్రజాగ్ం సంధత్తం తాం మే జిన్వతం। పశూన్ సంధత్తం తాన్మే జిన్వతం। స్తుతోసి జనధాః। దేవా స్త్వాశుక్రపాః। ప్రణయంతు సువీరాః ప్రజాః ప్రజనయ న్పరీహి॥

నమో బ్రహ్మణే ధారణం మే అస్త్వనిరాకరణం ధారయితా భూయాసం। కర్ణయో శ్రుతం మాచ్యోఢ్వం మమాముష్య ఓం॥

ఋతం తప స్సత్యం తప శ్శ్రుతం తప శ్శాంతం తపోద మస్తపశ్శమ స్తపోదానం తపో యజ్ఞం తపో భూర్భువస్సువ ర్బ్రహ్మైత దుపాస్యైతత్తపః॥ యథా వృక్షస్య సం పుష్పితస్య దూరా ద్గంధో వాత్యేవం పుణ్యస్య కర్మణో దూరాద్గంధో వాతి యథాసిధా రాం కర్తే వహితా మవక్రామే యద్యువే యువేహవా విహ్వయిష్యామి కర్తం పతిష్యామీత్యేవ మమృతా దాత్మానం జుగుప్సేత్॥

సహనా వవతు సహనౌ భునక్తు। సహ వీర్యం కరవావహై। తేజస్వినా వధీత మస్తు మావిద్విషావహై। ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

అహం వృక్షస్య రేరివా। కీర్తిః పృష్ఠం గిరేరివ, ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వమృత మస్మి। ద్రవిణగ్ం సవర్చసం। సుమేధా అమృతోక్షి

యుండును. అది నశించునది కాదు. పుణ్యపాపానుభవమునకే యది యేర్పడినది. భగవదాజ్ఞ యట్టిది. ఆయాజ్ఞ యేకార్యము నెట్లు చేసినను జేయును. అది సాధింపరాని కార్యము లోకముల నేదియునుండదు. మనకున్న జ్ఞానము భగవచ్ఛక్తిని నిర్ణయింపఁ జాలదు. చాలుననుట పాపవిశేషఫలము. అల్పబుద్ధిచే నత్యధిక జ్ఞానగమ్యవిషయము నూహించి నిశ్చయించుట ఆకార్యమునఁ బ్రయత్నించుట యించుక తెలివిచాలమి ననవలసివచ్చినందులకు విచారించుచున్నాఁడను. పాపానుభవమును మార్పనగునా? అనునది రెండవ ప్రశ్నము. పాప మనుభవించుకాలమున దానిని మాన్పఁ బ్రయత్నించువాఁ డెవ్వఁడుండును? తనకుఁ దానే గతికదా. కావున ముందు చేసికొనియున్న పుణ్యమే దానిని దగ్గింపవలయును. అది లేనిచో దానిని మాన్పఁజూచువాఁ డెవ్వఁడు నుండఁడు. భగవంతున కట్టియధికారము కలదు. సర్వ శక్తు లాయనవశమం దుండును గదా. ఇపుడు కర్మసిద్ధాంత మీవిషయమున నెట్లన్వయింపనగునో యరయుదము.

సాందీపని తొలిజన్మమునఁ బుత్త్రదుఃఖము నించుక యనుభవింపవలసినట్టి పాప మొనర్చెను. ఆయనపత్నియు నట్టిపాపమే చేసియుండును. ఆ రెండుపాపములు సమములు గాన వారికి దాంపత్య మొనఁగూడెను. సత్కుటుంబమునఁ బుట్టఁగల్గినంత మాత్రము పుణ్యముచేసికొన్న జీవుఁడొకఁ డాయింటఁ బుట్టును. వానిద్వారా మృతినొందఁదగు హేతువుగలవాఁ డొకఁ డుండును. దానిచెంత కీదంపతులిశిశువును గారణాంతరముచేఁ దీసికొనిపోవుదురు. వాఁడు శిశువును జంపును అదియొక మహా సాహసకార్యమని వాఁ డూహించి తృప్తినొందియుండును గాని

అథాతో దర్శ పూర్ణ మాసౌ వ్యాఖ్యాస్యామః॥ అథ కర్మాణ్యాచారాద్యాని గృహ్యన్తే॥ అథాతో ధర్మజిజ్ఞాసా॥ అథాతో బ్రహ్మజిజ్ఞాసా॥

త్రిపాదార్థం చతుష్పాదం మహాతంత్రం జగత్పతిః॥
ప్రోక్తవా న్మనువత్పుత్రో ధర్మమోక్షైక సాధనం॥
అథా తస్యామ యాచారి కాన్తర్మా న్వ్యాఖ్యా స్యామః॥

ఓం భూర్భువస్సువ స్సత్యంతప శ్రద్ధాయాం జుహోమి॥ నమో బ్రహ్మణ ఇత్యేతాం త్రిరుక్త్వా ప్రణవం జపేత్॥

ఓం నమో బ్రహ్మణే నమో అస్త్వగ్నయే నమః పృథివ్యై నమ ఓషధీభ్యః। నమో వాచే నమో వాచస్పతయే నమో విష్ణవే బృహతే కరోమి॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥ ఓమ్ ఓమ్ ఓమ్

కరశుద్ధిః

వృష్టిరసి వృశ్చమే పాప్మాన మృతా త్సత్య ముపాగాం॥

అథతర్పణ విధిః.

వసిష్టః॥ ఋక్సామాథర్వ వేదోక్తాన్ జప్యా న్మంత్రా న్యజూంషిచ। జపిత్వైవం తతః కుర్యా ద్దేవర్షి పితృ తర్పణ మిత్॥ ఏకైక మంజలిం దేవా ద్వౌద్వౌతు సనకాదయః। అర్హంతి పితర స్త్రీం స్త్రీన్ స్త్రియ శ్చైకైక మంజలిమితిచ। చంద్ర జ్ఞానోత్తరే॥ దేవా నృషీ న్పితౄం శ్చైవ తర్పయే దకుశోదకైరితి॥ యోగ యాజ్ఞవల్క్యోపి॥ బ్రహ్మాణం తర్పయే త్పూర్వం విష్ణుం రుద్రం ప్రజా పతిం। వేదాం శ్ఛందాం సి దేవాంశ్చ ఋషీం శ్చైవ తపోధనాన్। ఆచార్యాం శ్చైవ గంధర్వా నా

---

తర్పణ విధి.

నాలుగు వేదములలోని మంత్రములను జపించి, దేవర్షి పితృ తర్పణములు చేయవలయు నని వసిష్ఠుండు చెప్పెను॥ దేవతలకు నొకొక్క దోయిలియు, మునులకు రెండేసిదోయిళ్లను, పితరులకు మూడేసి దోయిళ్లను విడువ వలయును। దేవర్షి పితృ తర్పణ ముల న

వించి బ్రదుకఁదగువారు నందే చేరుదురు. ఇతరులకష్టమును జూచి దుఃఖమునుమాత్ర మనుభవింపఁదగువారు నా నౌకయందే కూరుచుందురు. నౌక బయలువెడలి కొంతదూరము పోవును. ఏచోట నీనౌకలోనున్నవారెంద తేయేజంతువుల నోటఁబడఁదగినవారో ఆజంతువు లేచోటనుండునో ఆచోటు చేరఁగనే నౌక మునుంగు. జలజంతువులు కొందఱ గ్రసించు. కొందఱు జలపాతమున దుఃఖించి ప్రాణభీతిననుభవించి పుణ్యశేషమున నెట్లో బ్రదుకుదురు. కొందఱా నౌకావయవములం బట్టుకొని జలముల స్పృశింపకయే జీవింతురు. వా రాకష్టమును జూచి దుఃఖింతురు. వారిపాప మంతమాత్రమే ఫలము నీఁజాలును. అం దేకష్టము ననుభవింపఁదగనివాఁడు వారితోఁ గూడి యానౌకలోఁ గూరుచుండి కారణాంతరమున నవి పయనముచేయకముందే దిగిపోవును. ఇందఱికర్మ మొక్కరీతిగా నుండునని యీ యుదాహరణముచే మనము నమ్మవలయును. సంఘాతమరణమన నిదియే కదా. ఇం దొక్కమాటయైనఁ గల్పితముకలదా యని యోజింపుఁడు. ఇట్లే కర్మసిద్ధాంతము గ్రంథపఠనమునఁగాక యనుభవముచేఁ దెలియుచున్నను గొంద ఱీవిషయమునుగూర్చి యోజింపరు. ప్రతిమనుజుఁడు దినదినము నాలోచింపఁదగినవిషయ మిదియే. దీని నాలోచించి తత్త్వ మెఱుంగకయున్న నుత్తరకాలమున మేలుపొందు నవకాశమే యుండదు.

ప్రకృతవిషయమున కీసిద్ధాంతము నమన్వయించునాయని యాలోచింతము. ఇందు విచిత్రకార్య మొక్కటియే యున్నది. మరల నరకమునుండి సాందీపనియింట మనుజశరీర

య యోజలం। సంవత్సర కృతం పాపం తత్క్షణా దేవ నశ్యతి॥ వైయా
ఘ్ర పాదగోత్రాయ సాంకృతి ప్రవరాయచ॥ గంగా పుత్రాయ భీష్మా
య ప్రదాస్యా మ్యక్షతోదకం, అపుత్రాయ దదా మ్యేత జ్జలం భీ
ష్మాయ వర్మణ ఇతి॥ భీష్మస్య క్షత్రియ పితృత్వేన తత్తర్పణ మబ్రా.
హ్మణ విషయ మిత్యన్యే॥ మన్వాది తర్పణ ముక్తం॥ మన్వాద్యాసుయు
గాద్యాసు ప్రదత్త స్సలిలాంజలిః। సహస్ర వార్షికీ తృప్తిం పితౄణా
మావహే త్పరామితి॥ బృహస్పతిః। ఆషాఢ మవధిం కృత్వా పంచము
పక్ష మాశ్రితాః। కాంక్షంతి పితరః క్లిష్టా అన్న మప్యన్వహం జలం।
తస్మా త్తత్రైవ దాతవ్యం దత్త మన్యత్ర నిష్ఫలం। అమాష్ట కాసు సం
క్రాంతౌ పాతాది గ్రహణేషుచ। స్నాత్వోదకాం జలిం దత్వా తత శ్శ్రా
ద్ధం సమాపయేత్॥ యస్తర్పయే త్పితౄన్ స్నాతః శ్రాద్ధం కృత్వా ప
రేఽహని। పితర స్తస్య తృప్యన్తి నచేత్కుప్యంతు వైభృశం॥ ఏకో వా
బహవోవాపి పుత్రాః పిత్రో ర్యథా విధి। కృత్వాబ్దికంతు తైః కార్యం
పరేఽహని తిలోదక మితి॥ తిలానాం నిషిద్ధత్వే నాక్షతైః స్తర్పణం కా
ర్యం తదుక్తం చంద్ర జ్ఞానోత్తరే। నతు ప్రాణో తిలా యోజ్యాః కుర్యా దే

।బ్రాహ్మణేతరవిషయమని కొందఱి యాశయము॥ మన్వాదుల యందును, యుగాదుల యం
దును, తర్పణము చేయునెడ పితరులకు వేయిసంవత్సరములు తృప్తి కలుగును॥ ఆషాఢ శు
ద్ధ పూర్ణిమ మొదలుకొని యైదు పక్షముల వరకు పితరు లన్నోదకముల నపేక్షించు చుం
దురుగాన నప్పుడు తర్పణము విడువక చేయుచుండ వలయును॥ అమావాస్య అష్టకలు,సం
క్రాంతి, గ్రహణము, వీని యందు తర్పణము, పైతృకమును జరుపు చుండ వలయు॥ పైతృ
కము పెట్టిన మరునాడు తప్పక తిల తర్పణము చేయుచుండ వలయునని బృహస్పతి
చెప్పెను॥

తిలలు కూడవని నిషేధము గలప్పుగాన అక్షతలతోన తర్పణము చేయ వలయునని
చంద్రజ్ఞానోత్తరమున గలదు॥ దేవతలకు, ఋషులకును తర్పణముచేసి, దివ్యులు నదివ్యులు
నను పితరులకు పితృతీర్థముతో తర్పణము చేయవలయు॥

ఇంద్రు, మహేశ్వరుడు సదాశివుడు శివుడును దివ్య పితరులనియు, తండ్రి మున్న
గు వారు అదివ్య పితరులనియు తెలియనది॥ పూర్వ శ్లోకము నందు యముడు నన్నంతు

సకలపురుషార్థములు లభించునని నమ్మవలయును. ఇఁకఁ దర్వాతి కథ నాలకింపుఁడు. ఇపుఁ డీరీతి భగవంతుని ధ్యానింపుఁడు.

శ్లో. కదావా కాళిందీకువలయదళశ్యామలతరాః
కటాక్షా లక్ష్యంతే కిమపి కరుణావీచినిచితాః,
కదావా కందర్పప్రతిభటజటాచంద్రశిశిరాః
కిమప్యంతస్తోషం దదతి మురళీకేళినినదాః. ౧ ఆ. ౨౬.

## పాండవుల వృత్తాంతము.

ఆర్యులారా! భూభారహరణచణమగు రూపమును భగవంతుఁ డిఁకఁ దాల్చును. కావున దానికనుగుణమగు ప్రవృత్తి సాగింప యత్నించును. అన్నిపనులు సాగుచుండఁగాఁ దాను సాక్షిమాత్రుఁడుగా నుండును. ఆవిషయమే తేటపడఁగలదు. ఆకథల నాలకింపుఁడు. నాల్గవప్రకరణమునందుఁ బాండవజననమును వ్రాసియుంటిని. అందుఁ బాండవుల కథలను వ్రాయక భగవంతునియవతారమునకుఁ దోడ్పడునంతభాగమును వ్రాసితిని. పాండవులు ద్రౌపదిని వివాహమాడుట యను భాగము వఱకు వ్రాసి నిలిపితిని. ఇఁక శ్రీకృష్ణావతారము పాండవుల ద్వారా ఫలమును గనవలయును. భగవంతుఁడు కారణము దుష్టమృతి కార్యము. పాండవులు సాధనభూతులు. ఈరీతిగా సాగుచున్న దిగదా యీ యవతారకథ. కావున దానిని శ్రద్ధమైఁ బఠింపుఁడు.

పాండవులు ద్రౌపదిని బెండ్లియాడి పాంచాలబలము సహాయభూతమై యుండఁగా శౌర్యవంతులను ప్రఖ్యాతి గాంచిరి. విదురుననుమతంబున ధృతరాష్ట్రుఁడు రాజ్యముచేయుచుండెను. పాండురాజు మృతినొందినపిదప భీష్మునిసాయము

తయాకర్తృలోపాసనోదక తయాచ అస్మదుపకారకత్వే నావశ్యక త్వాత్ అస్మత్పూర్వ పురుష దృష్ట్యా సుఖ కారకత్వే హ్యగ్నిష్వాత్తా దీనాం పితృలోక వాసినాం పితౄణాం విద్యమానత్వేన తదుపకారక త్వే నావశ్యకత్వాచ్చ॥

నను సవ్యేనదేవ కార్యాణి వామేన పితృతర్పణ మితి పితృతర్పణ మప సవ్యం గతయా నిషేధితం॥ అపసవ్యంచ, అపసవ్యం తిలాన్దర్భా నగ్నౌ కరణ మేవచ। వికిరం పిండదానంచ శైవే షట్పరి వర్జయే దితి చంద్రజ్ఞానోత్తరా దిషు నిషిద్ధం॥ ఏవంచ అపసవ్య వర్జం క్రియ మాణేపి పితృతర్పణే అవిధినా కృత మకృత మితి న్యాయేన నిష్ప్రయోజనత్వ మేవ స్యాదితి చేన్నైవం॥ గుణలోపేచ ముఖ్యస్యేతి న్యాయేన అంగలోపేపి ప్రధానస్యాత్యాజ్యతయా తేనైవ న్యాయేన తాదృశస్యావిధి కృత్యత్వాసిద్ధ్యా సప్రయోజనత్వాత్ యతః॥ కించ శాంభవ వ్రతిన ఉద్దిశ్య శివ సాయుజ్య యోగేన దేవత్వం యే సమాగతాః। తేషాం పితౄణాం కర్మాణి శైవానవ్యోప వీతినా। సర్వాణి చైవ కుర్వీత శివ వ్రతి సమాశ్ర

---

ఉ॥ తమకు నిజముగా నుపయోగము లేదు గాని, తర్పణమును ముక్తులైన మన పెద్ద లపేక్షింపరనుట నిజమే॥ మనము చేయు నారాధనము నీశ్వరుండపేక్షించుచున్నాడా? మనము చేయు పూజవలన దేవునకేమి యుపయోగము కలదు? ఏమియులేదు అయినను, కృతజ్ఞతా సూచకముగాను, మనదోషము నివర్తింప మనయుపయోగ మునకై చేసి తీరవలయు॥ కాబట్టి కర్మలోపంబును ప్రత్యవాయం బగును॥ ఇదిగాక, మనపితరులను నుపయోగింప కున్నను, పితృలోకమున నున్న యగ్నిష్వాత్తాదులకు నీతర్పణ ముపయోగించును. కావున తర్పణ మావశ్యకమే॥

ప్ర॥ పితృతర్పణము అపసవ్యముతో చేయవలయునని విధింపబడి యున్నది. శైవము నందు అప సవ్యము నిషేధింపబడియున్న॥ అప సవ్యము లేక పితృతర్పణము చేసినను అవిధి నా కృతముగాన చేయుని దానితో నసమాన మగును॥ కాబట్టి పితృతర్పణము చేసిన లాభ మేమి?

ఉ॥ అంగము లోపించినను ప్రధానమును విడువగూడదని పూర్వ మీమాంస యందు గలదు. ఆన్యాయమును బట్టి అంగలోపమున్నను ప్రధాన కర్మము సఫలమే యగు

కాలముల ననుసరించి లోకమున ధర్మమును గాపాడుచుండును. ఇప్పటికాలమున నన్నిమార్గముల నవలంబించినఁగాని ధర్మము నిలువదని భగవంతునకుఁ దోఁచెను. కావునఁ దా నవతరించెను. ధర్మ నతరింపఁ జేసెను. యుద్ధముచేయఁగల వారినెల్ల నావిర్భవింపఁ జేసెను. అందు విదురుఁడు ధర్మునంశమున జగతిపైఁ బుట్టెను. ఆపుట్టుక మనకు ముఖ్యము. కావున దానిని నాల్గు మాటలుగ వ్రాసెదను.

## విదురుని యుత్పత్తి.

"న హి కారణం వినా కార్యస్యోత్పత్తిః" అన్నన్యాయము నిరంకుశము. దానికి మార్పు కలుగదు. ధర్మదేవత భూతలమున నవతరింపఁ గారణమొకటి యుండవలయుఁ గదా. కావున నాకారణము నెఱుంగవలయు. మాండవ్యనామక ముని కలఁడు. ఆముని దేశాటనముచేసి సకలతీర్థరాజములను సేవించి మహాత్ములగోష్ఠి జరపి కొంతకాలమునకు నొకనగరమునకు సమీపమున సాంద్రారణ్యమున నదీతీరమున నాశ్రమము కల్పించుకొని యందుఁ దపముచేయుచుండెను. ఆనిష్ఠ యద్వితీయము. కొంతకాల మీరీతి సాగెను. పూర్వజన్మకృత పుణ్యపాపకర్మము లనుభవమునకురాక తొలఁగునవి కావు. ఎట్టివారికైనను గర్మసిద్ధాంత మొక్కవిధమే గాని సామాన్య విశేషవిధు లిందులేవు.

"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్."

అన్ననియమమునకు మార్పులేదు. ఒకపుణ్యకర్మముచేత నొక పాపకర్మము నశించును గదాయన్న నది సత్యమేయనవలయును. ఎట్లనఁగాఁ దెలియకచేసిన యల్పపాపకర్మములు జ్ఞానమునఁ

హోమయో రివ వేదశివాగమ సిద్ధయో స్సవ్యాప సవ్యాంగక పైతృకయో రపి వ్యవస్థిత వికల్పస్య న్యాయ్యత్వాత్॥

అథ వేద విరుద్ధస్య శివాగమ విధే రగ్రాహ్యత్వా భ్యుపగమేపి వేద విరుద్ధత్వ నిర్ణయ ఏవహి తస్య తద్భావ్య మభ్యుపగమనీయం॥ ప్రకృతే నవేద విరోధ గంధోపి॥ తథాహి శ్రుతిషు సర్వానుద్దిశ్య విహితం పైతృ కాంగక మపసవ్యం శైవాగమేషు తు శాంభవానుద్దిశ్య విహితం తదప వాదతయా సవ్యమితి సామాన్య విశేష విధ్యో రాపాతతో విరోధ ప్రతీతా వపి శాస్త్ర సమన్వయవిదా మవిరోధస్య స్పష్టత్వాత్॥ అపిచ, నిర్వాణోప నిషది॥ పితృ కర్మ చానుత్తిష్ఠే దుప వీతే వేత్యుప వీతాంగ కస్యాః పితృ కర్మణః స్మృతి విహిత తయా శ్రుతివిరోధస్యానా శంక నీయత్వాచ్చ॥ నను, బ్రహ్మ సూత్రస్య దేవ పిత్రాది కర్మా

---

ప్ర॥ ఆగమము నందు సవ్యముతో పితృ తర్పణము చేయవలయునని చెప్పినదే గ్రహించు టెట్లు, స్మృతి కల్పముల యందు అప సవ్యముతో చేయ వలయు నని చెప్పఁబడినది యేమగును?

ఉ॥ ఆవిధి శైవ దీక్ష నొందని వారల యెడ సార్థక మగును. కాన, బాధింపదు.

ప్ర॥ పితృ కర్మముల యందు నపసవ్యము విని యోగింప వలయునని వేదము నందే కలదు. దానికి విరుద్ధముగు శివాగమ విధి వేద విరుద్ధ మైనది గాన నది యెట్లు గ్రాహ్యమగును?

ఉ॥ శివాగమములు వేదములతో సమానములని విద్యాస్థాన నిర్ణయము నందు నిర్ణయింపఁ బడియెను గాన, ప్రొద్దుపొడవక ముందు హోమము చేయ వలయు నని యొక్కచోటను, ప్రొద్దు పొడిచిన తరువాత హోమము చేయువలయునని వేరొక్కచోటను, ఇట్లు వేదమునందె పరస్పర విరుద్ధముగానున్న విధులకుబోలె పూర్వాచారమునుబట్టి వ్యవస్థిత వికల్పము న్యాయ్య మగుగాని యొక్క విధి నంగీకరించి వేరొక విధిని విడుచుట న్యాయ్యము గాదు.

అట్లుగాక, వేద విరుద్ధమైన శివాగమ విధి గ్రాహ్యము కాదని యంగీకరించిన శివాగమ విధి వేదవిరుద్ధమని నిర్ణయ మైనప్పుడే గదా గ్రాహ్యము గాక పోవును ప్ర

గలుగు. దానిచే నాతఁడు భగవత్కరుణాపాత్రుఁ డగు. దానఁ దరించును. ఇదియే యత్యల్పపుణ్యకర్మమున కత్యుత్కటఫలము చెప్పుటకుం గలకారణము. పరమకారుణికులగు మహాత్ములు పామరులకుఁ దరణోపాయము నీరూపమున నుపదేశించిరి. ఈ పద్ధతినెఱుంగక యొక్క "రామ"నామమున కింతఫలమా. ఇన్ని బ్రహ్మహత్యలొక్కసారి "మహాదేవా"యన్న నశించునాయని కొందఱు ఆక్షేపింతురు. అది మిగులఁ బొరపాటు. వారలించుక శ్రద్ధగలిగి యీసిద్ధాంతము నాలోచించిన జన్మమధ్యమమున మరల నిట్లాక్షేపింపరు. ప్రస్తుత కథవంకకు మరలుదము.

ఆ మాండవ్యమహాముని తపస్సు చేయుచు భగవంతు నాతపమున నారాధించుచుండఁగాఁ దొలిజన్మమునఁ జేసినపాప కర్మఫల మనుభవించుకాల మరుదెంచెను. ఆనగరమున రాజు నింటఁ జోరులు ప్రవేశించి ద్రవ్య మపహరించిరి. వారిని రక్షక భటులు పట్టుకొనఁ బ్రయత్నించిరి. కాని దస్యువులు పాఱఁ జొచ్చిరి. భటులు తోడన తవిలిరి. వా రడవులఁ జొచ్చిరి. రక్షకులు తమరు నడవులంజొచ్చి యెట్లో వారిని బట్టుకొనిరి. ఏక్షణమున భటులు దొంగలఁ బట్టుకొనిరో ఆక్షణమున మాండవ్యముని దుష్కర్మఫలము ననుభవించుకాలము వచ్చెను. కావున నొకచెట్టుక్రిందఁ దపముచేయు మాండవ్యుని భటులు దొంగయని భావించిరి. ఆమునిదుష్కర్మము వారినట్లు భ్రాంతులుగా నొనరించెనని గ్రహింపవలయు. మాఱువేషమునూని యీతఁడు తప్పించుకొనఁ జూచుచున్నాఁడని వా రూహించి దొంగలతోఁగూడ నాతనిం దీసికొనిపోయి ద్రవ్యమును దొంగల రాజున కప్పగించిరి. రాజు వారినెల్ల వధింప నాజ్ఞాపించి

నిషిద్ధ తయా తన్నిషేధస్య సామాన్యాపేక్షత్వ మభ్యుపగమ్య ప్రాచీనావీతం నేచ్ఛంతి. యథాచారం వ్యవస్థా॥

దేవాదితర్పణం.

ఆచమ్య ప్రాణానాయమ్య, ఏవంగుణ విశిష్టే శుభేఽభ్యుదయ ముహూర్తే, శ్రీమాన్, ... గోత్రః ... శర్మాహం మమ ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం బ్రహ్మ యజ్ఞాంగ దేవర్షి పితౄనుద్దిశ్య, దేవర్షి పితృ ప్రీత్యర్థం దేవర్షి పితృతర్పణం కరిష్యే॥

దేవతర్పణం॥

బ్రహ్మ తీర్థేన కుర్యాత్॥ పరశివం తర్పయామి॥ పరశివ పత్నీం స్తర్పయామి॥ పరశివ పుత్రాగ్ స్తర్పయామి॥ పరశివ పార్షదాగ్ స్తర్పయామి॥ ఇష్టలింగం తర్పయామి॥ ప్రాణలింగం తర్పయామి॥ భావలింగం తర్పయామి॥ సద్యోజాతం తర్పయామి॥ వామదేవం తర్పయామి॥ అఘోరం తర్పయామి॥ తత్పురుషం తర్పయామి॥ ఈశానం తర్పయామి॥ బ్రహ్మాదయో యే దేవాస్తాన్ దేవాగ్ స్తర్పయామి॥ సర్వాన్ దేవాగ్ స్తర్పయామి॥ సర్వాన్ దేవగణాగ్ స్తర్పయామి॥ సర్వా దేవ పత్నీ స్తర్పయామి॥ సర్వాన్ దేవ పుత్రాగ్ స్తర్పయామి॥ సర్వాన్ దేవ పౌత్రాగ్ స్తర్పయామి॥ భూర్దేవాగ్ స్తర్పయామి॥ భువర్దేవాగ్ స్తర్పయామి॥ సువర్దేవాగ్ స్తర్పయామి॥ భూర్భువస్సువర్దేవాగ్ స్తర్పయామి॥ అథ నివీతీ భూత్వా ఋషీన్ తీర్థేన ద్వ

---

సందును విధింపఁబడియున్నది. అయినను, మఱికొందఱు, శివాగమముల యందు అపసవ్యము నిషేధింపఁబడి యుండుటచే నా నిషేధము సామాన్యాపేక్షముగనే యంగీకరించి సర్వసాధారణముగానె ప్రకరణముల యందు అపసవ్యము మాత్రమే విధింపఁబడియుండుటచే పూర్వాచారమును బట్టి వ్యవస్థ నంగీకరింపవలయు॥

దేవాదితర్పణము.

గ్రంథోక్త విధిగా నాచరించునది॥

మును గల్పించినది. ఇపుడాఫలము ననుభవించుకాలము ముగి సినది. నిన్ను మరలఁ బ్రోత్సహించి నాకీబాధను నీవలననే తప్పించినది. దీనికి నేనును నీవును వగవఁ బనియుండదు. కర్మము బ్రహ్మస్వరూపము. దాని నారాధింపవలయునే గాని నిందింపరాదు. వలయునని చేసినపాపము లూరకపోవునా? అని జ్ఞానముపదేశించి యారాజు నాశీర్వదించి తనయిచ్చంబోయి తపమొనరించి కొంతకాలమునకు యమలోకమునకుం బోయెను.

ఏకాలమున ధర్మదేవత భూలోకమునఁ బుట్టఁజనునని భగవంతుఁ డూహించెనో ఆక్షణమున మాండవ్యముని యముని దర్శింపఁజనియెను. యముఁ డమ్మునిం బూజించెను. ఆగమనకారణ మడిగెను. మునియు ధర్మరాజా! నే నిట్టి దుష్ఫల మనుభవింప నేమిపాపముచేసితినో నీవలన నెఱుంగవచ్చితిని. దయమెయిఁ దెలుపుమా యని ప్రశ్నించెను. యముఁడు మునీంద్రా! నీ వెఱుంగని విషయము లుండునా? న న్నడిగితివి కావునఁ జెప్పెద వినుము. నీవు తొలిబామున బాల్యమునందు నాడుకొనుచు నాయాటలయం దొక యాటగాఁ దూనికలను నల్పజంతువులం బట్టుకొని వాని తోఁకలకు ముండ్లు గ్రుచ్చి యవి బాధపడుచున్నను లెక్కింపక యాడుకొని నీయుత్సాహము ముగియగనే వానిని వదలితివి. ఆపాపఫలము ననుభవింపక తప్పునా? దానికి ఫలముగా నీవును గొంతకాలము గొఱ్ఱతవేయఁబడితివి. ఇది నీతొలిబామునఁ గలవృత్తాంతము. అని బోధించెను. ముని కాగ్రహముదయించెను. ఏలన నతనితపస్సునశించి తద్ద్వారా లోకమున నొకనియమము కలుగవలయునని యీశ్వరుని యూహ. అది

## అనగ్నిక వైశ్వదేవం

సాయణీయే॥ సాగ్నికః పితృయజ్ఞాంతే బలిః కృత్స్నం సమాచరేత్। అనగ్నిర్హుతశేషాత్తు బలిం కాకబలిం హరే దితి॥ సంగ్రహే॥ హుత్వా వ్యాహృతిభిశ్చాన్నం హుత్వా శాకలకాదిభిః। భూతేభ్యశ్చ బలిం దద్యాదన్న మగ్నావత్యనగ్నిమాన్। అనగ్నికస్తు యో విప్రో అన్నం వ్యాహృతి పూర్వకం। హుత్వా శాకల మంత్రైశ్చ శిష్టం కాకబలిం హరేత్। అన్నం వ్యాహృతిభిర్హుత్వా హుత్వా మంత్రైశ్చ శాకలైః ప్రజాపతేర్హవిర్హుత్వా పూజయే దతిథిం వ్రత ఇతి॥

నను వైశ్వదేవం శైవే నసంగచ్ఛతే। తథాహి॥ ఈశ్వర నివేదనాత్పురస్తాత్క్రియమాణే వైశ్వదేవ శేషస్య తన్నివేదనానర్హత్వేన నివేదనానంతరం క్రియమాణేచ నివేదిత శేషస్య వైశ్వదేవానర్హత్వే నచ ఉభయథాచ దోషా దితి చేన్న॥ వైశ్వదేవార్థ మోదన ముద్ధృత్య పురస్తాన్నివేదనం నిర్వర్త్య వైశ్వదేవార్థం పృథగుద్ధృతేనౌదనేన వైశ్వదేవే క్రియమాణే బాధకాభావాత్॥ ఆజ్య సంస్కారేణాన్య శేషత్వ దోషాప్రసక్తేః॥

తథా వైద్యనాథ దీక్షితీయే॥ వైశ్వదేవస్య పూజానంతర భా

---

అనగ్నిక వైశ్వదేవము.

నిత్యాగ్ని కలవాఁడు పితృయజ్ఞాంతమునందు భూత బలిని చేయవలయును॥ అగ్ని లేనివాఁడు వైశ్వదేవ శేషముతో భూత బలిని కాకబలిని చేయవలయును॥

ప్ర॥ వైశ్వదేవము శైవము నందు కూడదు॥ ఏలన, ఈశ్వర నివేదన మైన తరువాత నివేదిత శేషము వైశ్వదేవమునకు కూడదు॥ ముందు చేయునెడ వైశ్వదేవ శేషము ఈశ్వర నివేదనమునకు కూడదు॥ కావున, శైవము నందు వైశ్వదేవ మెట్లు కూడును?

ఉ॥ వైశ్వదేవమునకై ముందుగా నన్నము వేరుగా దీసి యునిచి, తొలుత నీశ్వర నివేదనమునే చేసి తొలుత వైశ్వదేవమునకై దీసిన యన్నముతో వైశ్వదేవము చేయునెడ నిందు బాధయేమియు లేదు॥ ఆజ్యసంస్కారము చేసి నందున నన్య శేషత్వ దోషంబును సంక్రమింపదు॥ కావుననె, వైద్యనాథ దీక్షితీయమునను పూజచేసిన తరువాతనె వైశ్వదేవము చేయవలయునని చెప్పి, హోమము చేయగ మిగిలిన యన్నముతో నైవేద్య

లేదు. నియమ మక్కఱలేదు. శ్రద్ధయొకటియున్నఁ జాలును. దానినైన నాచరింపనిచో మనకు భగవంతుఁడొసఁగిన మనుష్య జన్మమును వ్యర్థముచేసినవార మగుదుము. కావున శ్రద్ధాళువుల మై భగవన్నామసంకీర్తనమున దినమునఁ గొలఁదిగడియలనైనఁ బుచ్చుట సముచితము. ఇఁకఁ బ్రకృతకథకు మరలుదము.

పాండవులు లక్కయింట మడియక బ్రదికి పాంచాలదేశమున కేఁగి యొకటి లక్ష్యంబగు మత్స్యయంత్రమును సాధించి యోర్వక మార్కొనిన యరాతుల నోడించి ద్రౌపదిని వివాహమాడిరని ధృతరాష్ట్రునకు విదురుఁ డెఱిఁగించెను. ఆమాటల కెంతయుఁ జింతించి వారియభ్యుదయమును గోరి పాండురాజు తనయందునిచిన ప్రీతివిశ్వాసములను దలంచి మహాదరమున సోదరపుత్త్రుల నైదుగురను రావించి సన్మానించి యుచితరీతి నుండనియమించి తనపుత్త్రులంబోలె వారి నాదరించుచుండెను. వారును గతమునకు వగవక హస్తినాపురమున సుఖముగాఁ గాలముఁ గడపుచుండిరి. విదురుఁడు కర్ణ శకుని దుర్యోధన దుశ్శాసనుల దుర్మంత్రఫలములు పాండురాజతనయులకుఁ దగులకయుండఁ గంటికిఱెప్పవలెఁ గాపాడుచుండెను. భీష్మాది కురువృద్ధులు ధర్మపక్షపాతము గలవారు. కావున దుర్యోధనాదులపై నీసుపూనక పాండుతనయులయం దాదృతి గలిగి యుండిరి. సదా తోడునీడవలె శ్రీకృష్ణచిత్తము తదేకాయత్తమైయుండుట నెల్లరు వారి నాదరించుచుండిరి. దుర్యోధనాదులు తమ ప్రయత్నములన్నియు విఫలములగుటకుం జింతిల్లుచు నెవ్వరికిం దెలుప వలనుపడదు గాన మదిఁగుందుచుఁ జేయుఘన

నచ ఈశ్వర నివేదనార్థం వైశ్వదేవ ప్రయుక్తాన్నశుద్ధే రనావశ్యకత్వే స్వభక్ష్య పహారార్థం తస్యా ఆవశ్యకత్వేన పృథక్పాకేన వైశ్వదేవే క్రియమాణే కర్మలోప పరిహారే స్వభక్ష్య పహారోప యుక్తాన్నశుద్ధి ర్నస్యాదితి వాచ్యం వైశ్వదేవస్య పురుషార్థత్వస్యైవాభ్యుపేతత్వాత్। తథాహి॥ పరాశర మాధవీయే॥ యద్యపి సాయంప్రాతస్సిద్ధస్య హవిష్యస్య జుహుయాదితి వచనా ద్వైశ్వదేవ స్యాన్నసంస్కారతా ప్రతీయతే తథాపి పురుషార్థత్వమేవాభ్యుపేయం। తానేతానహరహః కుర్వీతేతి వాక్యశేషే తదవగమాత్ ॥

నచోభయార్థత్వం శంకనీయం పరస్పర విరోధాత్। అన్నసంస్కారత్వే హ్యన్నస్య ప్రాధాన్యా ద్వైశ్వదేవస్య గుణతా పురుషార్థత్వేతు తద్విపర్యయః॥ తథాచ సత్యేకస్యైవ యుగపత్ప్రాధాన్యం గుణత్వంచ విరుధ్యేయాతాం, తస్మాన్నాస్యాన్న సంస్కారత్వమాభూత్పురుషార్థత్వ మితిచేన్న॥ మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం

---

ఉ॥ నివేదనమునకై వైశ్వదేవముచేఁ గలుగు నన్నశుద్ధి యపేక్షింపఁ బడదు॥ ఏకపాకమున వైశ్వదేవము చేయువారైనను వైశ్వదేవము కన్న ముందుగానె నివేదనము చేయుచున్నారు వైశ్వదేవమునకై వేరుగా నన్నము దీసినంతనె ముందుగాఁ జేయు నివేదనమున నుపయోగించు నన్నము శుద్ధియగునా? కాదు॥ కావున, నివేదనమునకై వైశ్వదేవ ప్రయుక్తమగు నన్నశుద్ధి యనవసరము॥

ప్ర॥ ఈశ్వర నివేదనమునకై వైశ్వదేవ ప్రయుక్తమగునన్నశుద్ధి యనావశ్యకమైనను భోజనమునకై యది యావశ్యకమే యయి యున్నది పృథక్పాకముతో వైశ్వదేవము చేయునెడ కర్మలోపము పరిహరింపఁ బడినను నివేదితాన్నమె భుజింపవలయును గాన భోజనమునకై యుపయోగించు నన్నమునకు శుద్ధి యెట్లు పొసఁగును?

ఉ॥ వైశ్వదేవము అన్నసంస్కారార్థమా? లేక పురుషార్థమా? అని యాలోచింప పురుషార్థమే గాని అన్నసంస్కారార్థము కానేరదని మాధవాచార్యులవారు పరాశర మాధవీయము నందు నిర్ణయించి యున్నారు॥ ఇది అన్నసంస్కారార్థమే యగునెడ తాను భుజించు పాకమునకు వైశ్వదేవ ప్రయుక్తాన్న శుద్ధి యావశ్యకమే యయి యుండును॥ అట్లుగాక, పురుషార్థమె అయినందున పృథక్పాకముతో వైశ్వదేవము చేసినను చాలును

## శ్రీకృష్ణమూర్తి యక్రూరుని హస్తిపురికిఁ బంపుట.

* మధురానగరమునకు బలరామ శ్రీకృష్ణులు వచ్చిన కొలఁదిదినముల కొకనాఁడు అక్రూరునింటి కతనినొకపనికి నియమింపఁ బూనిపోయిరి. భగవదాగమనమున నక్రూరుఁడు కరము హర్షించెను. అంతకంటెఁ గోరఁదగిన మంగళ మేదియుండును? సకలకల్యాణము లాభగవంతుని యాగమనమునఁ గలుగఁగల వన్న నమ్మక మాతనికిం గలదు. కావుననే యుద్ధవ బలరాములం గూడి వచ్చుచున్న శ్రీకృష్ణమూర్తిని జూచినంతన యాతనిమది పరవశ మయ్యెను. ఆనందరసము మది నిముడఁజాలక పొంగి పొరలాడెను. పైకుబ్బి వెలికిఁబోవఁ బ్రయత్నించెను అక్రూరుఁడు పరమభక్తుఁడు. సాధుపుంగవుఁడు. కరుణారసభరితాంతఃకరణుఁడు. ఆకస్మికముగా నవ్యాజప్రేమమున వారరుదెంచుట తనపూర్వజన్మార్జిత సుకృతఫలమని యతఁడు భావించి యెదురేగెను. మహానుభావులారా! దయచేయుఁడు. నా జన్మము ధన్యమయ్యెను. కృతకృత్యుఁడ నైతిని. కరుణించినదే పదికోట్లు. దయచేయుఁడీ యని ప్రార్థించెను. వారు నక్రూరునింటికిం జనిరి. యథార్హాసనములఁ గూరుచుండుఁడని యతఁడు వినయమున వేఁడెను. [1]ఆయక్రూరునకు వారు మువ్వురు నమ

* ఈచరిత్రము శ్రీభాగవతము దశమస్కంధము నలువదెనిమిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగునది.

[1] ననామ రామం కృష్ణం చ సతై రభ్యభివాదితః, పూజయామాస విధివత్కృతాసనపరిగ్రహాన్ = అని మూలము. చకారముచే నుద్ధవునకు నమస్కరించెనని గ్రహింపవలయు. తై రభ్యభివాదితః = అనుచో తైః = అను బహువచనము వ్యర్థమగును.

ఏక పాకేన వైశ్వదేవే క్రియమాణేపి వ్యంజనానాం తత్రానుప్రయుక్తానాం సమానాహిక జలాది సంబంధేన వైశ్వదేవ ప్రయుక్త శుద్ధ్యభ్యుపగమ స్యావశ్యకత్వేన తేనైవ సంబంధేన పృథక్పాకస్యాపి నివేదనాభ్యవహారాద్యుపయుక్త సర్వవిధ పాకశుద్ధేస్సంభావితత్వాత్॥

పిత్రారాధనేషు పృథక్పాకే నైవాస్య నిర్వర్తనీయత్వేన ఏతాదృశసంబంధే నైవ సర్వపాక శుద్ధ్యభ్యుపగమ స్యావర్జనీయత్వాచ్చ॥

నను చంద్రికాయాం॥ యదా శ్రాద్ధం పితృభ్యస్తు దాతుమిచ్ఛతి మానవః। వైశ్వదేవం తతః కుర్యాన్నివృత్తే శ్రాద్ధకర్మణి। ప్రతివాసరికో హోమశ్శ్రాద్ధాదౌ క్రియతే యది। దేవా హవ్యం న గృహ్ణంతి కవ్యంచ పితరస్తథా। ఇతి వచనేన పృథక్పాకేనాపి శ్రాద్ధకర్మణః పురస్తాద్వైశ్వదేవాచరణస్య నిషిద్ధత్వేన శ్రాద్ధసమాప్త్యనంతరం శ్రాద్ధమధ్యేపి వికిరదాన బలిహరణానంతర మగ్నౌకరణానంతరం వా వైశ్వదేవానుష్ఠానం బలిహరణంచ కర్తవ్యమితి వైద్యనాథదీక్షితీయే

---

దు॥ వేరుపాకముతో వైశ్వదేవము చేసినను అట్టిసంబంధముతో భిన్నపాకములకును శుద్ధిసంభవించుచునె యున్నది ఇదిగాక పైత్ర్యకర్మల యందు॥ పృథక్పాకముతో వైశ్వదేవము చేయక తప్పదు॥ అట్లయిన నిట్టి సంబంధముతోనె సర్వపాక శుద్ధి యంగీకరింపక తీరదు॥

ప్ర॥ శ్రాద్ధము పెట్టిన తరువాతనె వైశ్వదేవము చేయవలయు॥ అట్లుగాక, శ్రాద్ధమునకు ముందె వైశ్వదేవము చేయునెడ దేవతలు హవ్యమును పితరులు కవ్యమును గ్రహింపరు అనుటచే పృథక్పాకముచె నైనను శ్రాద్ధమునకంటె ముందు వైశ్వదేవము చేయఁగూడదు గనక, శ్రాద్ధసమాప్తి యయిన తరువాతనో? శ్రాద్ధము నడుమ వికిరము చేసిన తరువాతనో? అగ్నౌకరణము చేసిన తరువాతనో వైశ్వదేవమును భూతబలిని చేయవలయునని వైద్యనాథదీక్షితీయమున చెప్పఁబడియున్నది యెట్లు పొసఁగును?

ఉ॥ శ్రాద్ధశేషముతో వైశ్వదేవము చేయునెడ నా శ్రాద్ధము రాక్షసులకే చెందును గాని పితరులకు చెందనేరదని హైరీనసీయము, పితరుల కొఱకును, వైశ్వదేవము కొఱకు

డవు గావు. నీవు కేవల జ్ఞానాత్ముఁడవు. అట్టినిన్ను బంధకార ణంబైన యవిద్య చేరరాదు. దేహాద్యుపాధియోగము మిథ్యా పదార్థము. కావున జన్మము, అది మూలముగాఁ గలభేదము పరమాత్ముఁడవగు నీకు లేవు. అట్లగుటంజేసి బంధమో క్షములు పారమార్థికములు గావనుట నిశ్చితము. ఆ బంధ మోక్షములు పరమాత్మవగు నీకును గలుగుననువాదము నీ తత్త్వమెఱుఁగని యజ్ఞానమునకు గుఱుతుగాని వేఱుగాదు. దుర్వృత్తులగు పాషండులు సనాతనమై శాశ్వతమునగు వేద మార్గమునకు దాని నవలంబించు సాధువులకుఁ గీడునేయ నెప్పుడు ప్రయత్నింతురో అప్పుడు లోకహితము చేయఁబూని నీవు సత్వగుణము నాశ్రయించి యవతరింతువు. * ఇది నీవు మున్ను చెప్పినమాటయే గాని నాకల్పించినది కాదు.

రాక్షసు లనేకులు మిషచే భూమియందుఁబుట్టి సాధు వుల బాధింపఁగా వారిం బొలియించి యీ మహత్తరభూభార మును దీర్ప నిర్మలకీర్తి వెలయుచుండ యదువంశమున నీతరు ణమున వసుదేవునింట నవతరించితివి. వామనావతారమునందుఁ బాదప్రక్షాళనోదకంబుల మూఁడులోకములఁ బావనములుగా నొనరించితివి. జగద్గురుండవు. దేవపితృభూత నరదేవమూర్తివి. అట్టి పరమపురుషుఁడవగు నీవు కరుణారసము పెంపున మాయిం టికి వేంచేసితివి. ఈశ్వరా! మా యీగృహములు పావనము లయ్యెను. భాగ్యవంతము లయ్యెను. సదా నిన్నేనమ్మి భక్తులు

---

* త్వద్యోదితోఽయం జగతో హితాయ యదా యదా వేదపథః పురాణః, బాధ్యేత పాషండపథైరసద్భిస్తదా భవాన్ సత్వగుణం బిభర్తి= అని మూలము.

ప్రదక్షిణ మగ్నిం పరిసమూహ్యాలంకృత్య అదితేను మన్యస్వ అనుమ తేఽనుమన్యస్వ సరస్వతేను మన్యస్వ దేవ సవితః ప్రసువ॥ ఇతి పూర్వ పరిషేచనం కృత్వా హవిష్య ప్రథమభాగా దాదాయ ఔపాసనే పచనేవా మగ్నిరాద్యైః ప్రతిమంత్రగ్ హస్తేన జుహుయాత్ ॥ అగ్నయే స్వాహా॥ అగ్నయ ఇదం॥ విశ్వేభ్యో దేవేభ్య స్స్వాహా విశ్వేభ్యో దేవేభ్య ఇదం॥ ధ్రువాయ భూమాయ స్వాహా। ధ్రువాయ భూమాయేదం॥ ధ్రువ క్షితయే స్వాహా ధ్రువ క్షితయ ఇదం॥ అచ్యుత క్షితయే స్వాహా అచ్యుత క్షితయ ఇదం॥ అగ్నయే స్విష్టకృతే స్వాహా। అగ్నయే స్విష్టకృత ఇదం॥ అదితేఽన్వమగ్గ్స్థాః॥ అనుమతేఽన్వమగ్గ్స్థాః। సరస్వతేఽన్వమగ్గ్స్థాః। దేవ సవితః ప్రాసావీః॥ ఇత్యుత్తర పరిషేచనం కృత్వా అవశిష్టం కించిదాదాయ ఉదీచీ నమస్కాభస్మాహ్వా। తూష్ణీం। స్వాహా। ప్రజాపతయ ఇదం॥ ఇతి హుత్వా॥ అథ హవిష్య ప్రథమ భాగం అవశిష్టేన సంయోజ్య బలీన్ హరేత్ ॥ స్తసూన సగం స్పృష్టేన కార్యాః॥

బలీనాం తస్య తస్య దేశే సగ్గ్స్కారో హస్తేన పరిమృజ్యా వోక్ష్య న్యస్య పశ్చాత్పరిషేచనం॥ తూష్ణీం సమంతం పరిషేచనం కుర్యాత్॥ ఏవం బలీనాం దేశే దేశే సమవేతానాగ్ సకృ త్సకృదంతే పరిషేచనం॥ హస్తేన పరిమృజ్యా వోక్ష్య ధర్మాయ స్వాహా। ధర్మాయేదం॥ హస్తేన పరిమృజ్యా వోక్ష్య అధర్మాయ స్వాహా అధర్మాయేదం॥ ఇత్యుదగప వర్గం నిధాయ। అంతే ద్వయో స్సకృత్పరిషిచ్య పరిమృజ్యా వోక్ష్య అద్భ్య స్స్వాహా। అద్భ్య ఇదం॥ పరిషిచ్య పరిమృజ్యా వోక్ష్య ఓషధి వనస్పతిభ్య స్స్వాహా! ఓషధి వనస్పతిభ్య ఇదం। పరిమృజ్యా వోక్ష్య రక్షో దేవజనేభ్య స్స్వాహా। రక్షో దేవజనేభ్య ఇదం॥ ద్వయోః పరిషిచ్య పరిమృజ్యా వోక్ష్య గృహేభ్య స్స్వాహా। గృహేభ్య ఇదం। పరిమృజ్యా వోక్ష్యావసానేభ్య స్స్వాహా।అవసానేభ్య ఇదం। పరిమృజ్యా వోక్ష్య అవసాన పతిభ్య స్స్వాహా। అవసాన పతిభ్య ఇదం పరిమృజ్యా వోక్ష్య సర్వభూతేభ్య స్స్వాహా। సర్వభూతేభ్య ఇదం॥ ప

లెట్లు స్వార్థపరులు కారో యట్లు స్వార్థమును గోరువారు కారు. * జలమయములగు తీర్థములు, మృణ్మయములు శిలామయములు నగువిగ్రహములతో నమర్పఁబడినదేవతలు తమ్మా శ్రయించినవారిని బవిత్రులనుగాఁ జేయఁ బూనరనరాదు. తీర్థములు మృచ్ఛిలావిగ్రహములుగల దేవతలు చిరకాలమునకుఁ బవిత్రులనుగాఁ జేయుదురు. సాధువులు దర్శనమాత్రంబుననే భక్తులగు వారిని బరిశుద్ధాంతఃకరణులనుగాఁ జేయుదురని యెఱుంగుము. నీవో సాధువులలో నగ్రగణ్యుఁడవు. కావునఁ బరోపకారమునకే పాటుపడువాఁడవు. అట్లగుటం జేసి మాకు శ్రేయము నొడఁగూర్పుపనియందుఁ బ్రవర్తింపఁ గలవాఁడవు, సుహృదయుఁడవు.

ఇపుడు హస్తిపురమునకుఁ బోవవలయు. మాకుఁ బాండుతనయులు బంధువులని యెఱుఁగుదువు కదా. వారికుశలం బెఱిఁగి రమ్ము. ఆ పాండురాజతనయులు తండ్రి తమ చిన్నవయస్సునందే చావఁగా బలుబాములంబడి పెద్దతండ్రియగు ధృతరాష్ట్రుఁడు రావింపఁ దల్లియగు కుంతీదేవితోడ హస్తినగరమునకు వచ్చియున్నవారనియు, ధృతరాష్ట్రుఁ డంధుఁడౌటఁ గుత్సితులగు తనకొడుకుల యనుమతంబునఁ బ్రవర్తించువాఁడు గావున వారిని జక్కఁగా నాదరింపక యున్నవాఁడనియు నొక

---

* నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః, తే పునన్త్యురుకాలేన దర్శనాదేవ సాధవః=అని మూలము. అమ్మయాని తీర్థాని మృణ్మయాశ్శిలామయాశ్చ దేవా నపునంతీతి న. అపి తు పునంత్యేవ. తథాపి సాధూనాం తేషాం చ మహదంతరమిత్యాహ. దర్శనాదేవ తే పునంతీతి. అని వ్యాఖ్య.

విద్యుదసి విద్యమే పాప్మా నమృతా త్సత్య ముపైమి॥ అప ఉ
పస్పృశ్య॥ అగ్నే ర్దక్షిణతో భూమౌ సంమృజ్య॥ అవోక్ష్య॥ ద్వితీయ
భాగా దాదాయ॥

పితృభ్య స్స్వధాస్తు, పితృభ్య ఇదం॥ పరిషిచ్య॥ వృష్టి రసి వృ
శ్చమే పాప్మా నమృతా త్సత్య ముపాగాం॥ అప ఉపస్పృశ్య॥

భూత యజ్ఞః

అప ఉపస్పృశ్య ఆచమ్య॥ ప్రాణానాయమ్య, దేశకాలౌ సంకీ
ర్త్య, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం భూత యజ్ఞేన యక్ష్యే, ఇతి సంకల్ప్య
విద్యుదసి విద్యమే పాప్మా నమృతా త్సత్యముపైమి॥ అప ఉప స్పృశ్య॥
అగ్నే రుత్తరతో భూమౌ సమ్మృజ్య॥ అవోక్ష్య, ద్వితీయ భాగా దా
దాయ॥ భూతేభ్యో నమః, భూతేభ్య ఇదం॥ ప్రదక్షిణం పరిషిచ్య, వృ
ష్టి రసి వృశ్చమే పాప్మా నమృతా త్సత్య ముపాగాం॥ అప ఉపస్పృశ్య॥

మనుష్య యజ్ఞః

ఆచమ్య, ప్రాణానాయమ్య, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం మనుష్యయ
జ్ఞేన యక్ష్యే॥ ఇతి సంకల్ప్య, నివీతి భూత్వా॥ విద్యు దసి విద్యమే పా
ప్మా నమృతాత్సత్య ముపైమి॥ అప ఉపస్పృశ్య॥ అదితేఽను మన్యస్వ,
అనుమతేఽను మన్యస్వ, సరస్వతేఽను మన్యస్వ॥ దేవ సవితః ప్రసువ॥
ద్వితీయ భాగా దాదాయ॥

మనుష్యేభ్యో హంతా॥ మనుష్యేభ్య ఇదం॥ అదితేన్వ మగ్గ్
స్థాః, అనుమతేఽ న్వమగ్గ్ స్థాః సరస్వతేఽ న్వమగ్గ్ స్థాః॥ దేవ సవితః ప్రా
సావీః॥ ఇత్యుత్తర పరిషేచనం కృత్వా, వృష్టి రసి వృశ్చమే పాప్మాన
మృతా త్సత్య ముపాగాం॥ అప ఉపస్పృశ్య॥

బ్రహ్మ యజ్ఞః.

ఉపవీతీ, ఆచమ్య, ప్రాణానాయమ్య, శ్రీపరమేశ్వర ప్రీత్య
ర్థం బ్రహ్మయజ్ఞేన యక్ష్యే॥ ఇతి సంకల్ప్య॥ విద్యుదసి విద్య మే పాప్మా
నమృతా త్సత్య ముపైమి॥ అపఉపస్పృశ్య॥ ప్రజాపతిబలేర్దక్షిణతః పరి
మృజ్య అవోక్ష్య॥ ద్వితీయభాగా దాదాయ॥ ప్రజాపతయే స్వాహేత్యు

వులు దర్శనమాత్రమునఁ దమ్మాశ్రయించువారిని బవిత్రుల నుగాఁ జేయుదురు. అను నీ వాక్యామృతమును బరిశీలింపుఁడు. దేవతావిగ్రహములఁ బూజించుటకంటెఁ దీర్థస్నానము చేయుట కంటె సాధువుల సేవించుటయే ముఖ్యమనికదా దీనిసారము. అట్లైనఁ దీర్థములసేవించుట, దేవాలయములఁ గట్టించి యందు విగ్రహములఁ బ్రతిష్ఠించుట, మృత్తికచే శివలింగమును జేసి పూజించుట వ్యర్థమనియుఁ దోఁపవచ్చును. సాధువు లేయూరి కైనఁ బోవుచుండ మన మేపనికైనను బోవుచుండి యొక్క మాఱు దర్శించినంతనే పవిత్రుల మగుదుము. ఏకష్టములేక యింతపుణ్యము లభించును. ఇంతసులభమగు నుపాయము దొరకఁగా నింక శ్రమంపడనేల? అని యూహించుట పొరపాటు. ఏలయనఁగా సాధుదర్శనమునమాత్రము పవిత్రుఁడు కాఁజాలఁడు. తీర్థస్నానము శీఘ్రఫలప్రదము కాకపోదు. మృచ్ఛిలావిగ్రహములఁ బూజించుటయు వ్యర్థము కాదు. ఈశ్లోకము సాధుదర్శనము తప్పక చేయఁదగినదను నియమమును బోధించునది యని మనము గ్రహింపవలయును. దీనిసార మేమనఁగా, గంగాస్నానము చేయఁబూని ద్వారదేశమునకుఁ బోయి యందు మునిఁగి భక్తితో నాగంగను భగవత్స్వరూపముగా భావించిన సకలపాపములు తొలఁగును. మృచ్ఛిలావిగ్రహముల సర్వవ్యాపకుఁడగు భగవంతుఁ డీరూపమున వెలసెనని భావించి పూజించినఁ బవిత్రుఁడగును. సర్వదేవతాస్వరూపుఁడు. సర్వాంతర్యామియు నగు పరమేశ్వరుఁడని యేవిగ్రహమును భావించి పూజించినను బాపములు తొలఁగును. మహాభక్తుఁడు సకలతీర్థయాత్రలుచేసి సకలదేవతలఁ బూజించినవాఁడు కావున నాతనిం

స్వస్తి

శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలం ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహి మే హవ్యవాహన। యస్య స్మృత్యా చ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు। న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే మహేశ్వరం। మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వర। యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తు తే॥ ఇతి పార్థివ సంహార ముద్రయా మూలమంత్రేణ చ శివాగ్నిం ప్రాణలింగే నివేశ్య గోత్ర నామోచ్చారణ పురస్సర మభివాదనం కుర్యాత్॥

వైశ్వదేవస్య నిత్యత్వం

అన్నాభావే ప్రవాసే చ తండులా నోషధీస్తు వా। పయో వా దధి ఘృతం వాపి కందమూల ఫలాదివా। యోజయే ద్దేవయజ్ఞార్థం జలం వాప్యస్తు వా జలే। మంత్రావృత్త్యాథవా కుర్యా ద్వైశ్వదేవం యథా విధి॥

నిత్యారాధనం.

తదుక్తం కాత్యాయనేన॥ అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణం। హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞో ఽతిథిపూజనం॥ శ్రాద్ధం వా పితృయజ్ఞ స్స్యాత్పిత్ర్యో బలి రథాపి వేతి॥ శ్రాద్ధం చాత్ర నిత్య పిత్రారాధనం॥ తదుక్తం ఏకంతు భోజయే ద్విప్రం పితౄ నుద్దిశ్య

---

వైశ్వదేవమునకు నిత్యత్వము.

పాకము చేయనప్పుడు గాని, ప్రవాసము నందు గాని, బియ్యమునో ఓషధులనో పాలు, పెరుగు, నెయ్యి యను వానిని కందమూల ఫలములనో జలమునో విని యోగించి గాని మంత్రావృత్తిచే గాని వైశ్వదేవమును నిత్యము చేయవలయును॥

నిత్యారాధనవిధి.

ఈయెడ కాత్యాయనుడు॥ వేదము చెప్పుట బ్రహ్మయజ్ఞము. పితృతర్పణము చేయుట పితృయజ్ఞము. హోమము చేయుట దేవయజ్ఞము. భూతబలి నిచ్చుట భూతయజ్ఞము. అతిథి పూజచేయుట మనుష్యయజ్ఞము, శ్రాద్ధమైనను పితృయజ్ఞమే యగును అని

ముగ భావించుటయే ప్రధానమని కాదా. జ్ఞానముగలిగి నదిని భగవత్స్వరూపముగా ధ్యానించిన నచ్చటికింబోయి స్నానము చేసిన పుణ్యము కలుగును. కావున భక్తి పూర్ణభావనయే ప్రధానముకాని భక్తిహీనముగాఁ బూజించుట నిష్ఫలమని యెఱుంగవలయునని యీ భగవదుక్తినుండి గ్రహింపఁదగిన నీతి. ఇఁక దీనిమీఁది యవ్వలివిషయమును వ్రాసెదను.

## శ్రీకృష్ణునను మతంబున నక్రూరుఁడు కరిపురి కరుగుట.

* అక్రూరుఁ డంతట శ్రీకృష్ణునాజ్ఞ శిరసావహించి కౌరవేంద్రుల కునికిపట్టయి వారియశస్సుచేఁ బ్రకాశించుచు భూతలంబునఁ దనకునీడగు పురవరం బెదియునుఁ గలదేయను గర్వమున విఱ్ఱవీఁగున ట్లుల్లసిల్లుచు ననన్యసామాన్య భాగ్యంబునఁ దేజరిల్లుచున్న హస్తిపురంబునకుం బోయెను. అందుఁ దొలు దొలుత ధృతరాష్ట్రుమందిరంబున కరిగి యవ్వల భీష్ముని గేహము నకుం బోయి పిదప విదురసదనంబునకుం జని తరువాతఁ గుంతీ దేవి సద్మమున కరిగి మఱియు బాహ్లీక సోమదత్తుల నిశాంత ములకును, ద్రోణ ద్రౌణి కృపాచార్యుల యాలయములకును, కర్ణ దుర్యోధనుల సౌధంబులకును, పాండవుల నివాసంబు లకును, దక్కుంగల సువ్రాజ్ఞనుల ధిష్ణ్యంబులకును, మఱియును బ్రియబంధువుల వేశ్మములకును బోయి వారల యాదృతిం బడసి యుచితరీతుల వారితో సంభాషించి కుశలప్రశ్నాదుల వారిమదుల నుల్లసిల్లంజేసి యుండెను.

---

* ఈకథ శ్రీభాగవతము నలువదితొమ్మిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

## అతిథి పూజనం

ఆతిథ్యస్య మనుష్యయజ్ఞత్వం కాత్యాయనేనోక్తం। అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణం। హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమితి॥ శ్రుతిరపి॥ యద్బ్రాహ్మణేభ్యోఽన్నం దదాతి తన్మనుష్యయజ్ఞస్సంతిష్ఠత ఇతి॥ అతిథిస్వరూపముక్తం పరాశరేణ॥ ఇష్టో వా యది వా ద్వేష్యో మూర్ఖః పండిత ఏవ వా। సంప్రాప్తో వైశ్వదేవాంతే సోఽతిథిస్స్వర్గసంక్రమః। దూరాధ్వోపగతం శ్రాంతం వైశ్వదేవ ఉపస్థితం। అతిథిం తం విజానీయాన్నాతిథిః పూర్వమాగత ఇత్యాదినా॥

అతిథి పూజనం సమాప్తం॥

---

## అతిథి పూజా విధి.

అతిథి పూజయే మనుష్యయజ్ఞమని కాత్యాయనుఁడు చెప్పెను॥ బ్రాహ్మణులకు అన్నమిడుటయే మనుష్యయజ్ఞమని శ్రుతియుఁ జెప్పుచున్నది॥ అతిథి స్వరూపమును పరాశరుఁ డిట్లు తెలిపెను॥ హితుఁడు గాని, విరోధి గాని, పండితుఁడు గాని మూర్ఖుఁడు గాని వైశ్వదేవాంత కాలమునకు వచ్చినవాఁడు అతిథి యగును॥ దూరము నుండి నడచి శ్రాంతుఁగా వచ్చినవాఁడే యతిథి యగుగాని యంతకుఁ బూర్వము వచ్చినవాఁడు కాఁడని మొదలుగఁ జెప్పియుండెను॥

అతిథిపూజావిధిముగిసెను.



కములవలె హితశత్రువుల నడుమ నుండఁజాలక సకలదుఃఖ ములననుభవించు నన్నును దండ్రి లేని యీ నాకొమరులను శ్రీకృష్ణుఁడు తనమృదువాక్కుల నెన్నడైనఁ గుశలముగ నున్న వారా యని పలుకునా? అని పలుకుచు నంతలోఁ దనకుఁ దోఁచిన భక్తిభావంబున హరింగూర్చి శ్రీకృష్ణా! శ్రీహరీ! మహాయోగీ! విశ్వాత్మా! విశ్వభావనా! కృపాకరా! ఈశిశువులతోఁ గష్టపరంపరలకుఁ జిక్కి వానినెల్లో యనుభవించుచు నిన్నే యాశ్రయించిన నన్నుం గాపాడుము. ఈసంసారము మృత్యుభూతము. దీనిబాధలకు వెఱచువారికి నీవే శరణ్యుఁడవు. ఈశ్వరుఁడవు. నీ పాదారవిందములు ముక్తిప్రదములు. అట్టి నీపాద పద్మములకంటె వేఱొక్క శరణము నాకుఁ జూపట్టదు. ధర్మాత్ముఁడవు. అప్రమేయుఁడవు. పరమాత్ముఁడవు. అణిమాద్యష్టైశ్వర్య యుక్తుఁడవు. జ్ఞానాత్మకుఁడవు. అట్టి నిన్ను దిక్కని నమ్మియున్న దానను. వేఱొకరిని నమ్మినదానం గాను. నీవే రక్షకుఁడవని నమస్కరించుదానను. అని తనబంధువులను విశేషించి సకల బ్రహ్మాండనాయకుఁడగు శ్రీకృష్ణుని దలంచుకొని పృథాదేవి పలవించెను.

విదురుఁ డందున్నవాఁడు కావున నాతఁడు నక్రూరుఁడు తత్సమదుఃఖమునుగని యామెసుఖమును గోరువారు కావున నమ్మా! నీకుమారులు దేవతాంశసంజనితులు కాని సామాన్యులు కారని వారిజన్మప్రకారంబు స్మృతికివచ్చున ట్లొనర్చి కుంతీదేవి నించుక యూఱడిల్ల నాశ్వాసించిరి. వారిహితాలాపముల కించుక సంతసిల్లి తనమదిం గల దుఃఖమును నించుక తగ్గించుకొని తనకొడుకులు శ్రీకృష్ణానుగ్రహపా

అంబికేయా! నిక్కంబారయుము. * లోకమునఁ బ్రాణి తానొక్కండే జన్మించు. ఒక్కండే మృతినొందును. ఒక్కఁడే సుకృతమునో దుష్కృతమునో యొనరించును. ఒక్కఁడే ఆ సుకృత దుష్కృతములఫలము ననుభవించును. అంతియకాని యీవిషయములయం దెవ్వరుగాని తోడు రాఁజాలరు. ఒక్క మనుష్యుఁ డెన్నియో యధర్మము లొనరించి ధనమార్జించిన దానిని బెక్కుమంది పుత్త్రులని భార్యయని బంధువులని యి ట్లనేకనామములం బూని యనుభవింతురు. చేఁపలకుఁ బ్రాణా ధారభూతములగు జలముల నెన్నియోమత్స్యము లామడువుం జేరి యనుభవించుట కానఁబడును గదా. † అధర్మమున కింత యైన జంకక పలుభంగుల శ్రమమునకులోనై ద్రవ్యము సంపా దించి దానిచేత నజ్ఞానవశంబున భ్రాంతినొంది పుత్త్రులని భార్య యని యింకనెన్నియో సంబంధములఁ గల్పించుకొని తాను బోషించినచో నాపుత్త్రులు భార్యయు నర్థములు ప్రాణములు ప్రాప్తభోగుఁడగు నా యజ్ఞానమండితుఁ డగుపురుషునిఁ బా యును. ద్రవ్యము సంపాదించునిమిత్తము తాను బెక్కు పాపము లొనరించి యా యన్యాయార్జితవిత్తంబుచేఁ బుత్త్రా

---

* ఏకః ప్రసూయతే జంతు రేక ఏవ ప్రలీయతే, ఏకోఽనుభుంక్తే సుకృత మేక ఏవచ దుష్కృతమ్, అధర్మోపచితం విత్తం హరంత్యన్యేఽల్ప మేధసః, సంభోజనీయాపదిష్టైర్జలానీవ జలౌకసః = అని మూలము. జలౌక సో మత్స్యస్య జీవనభూతాని జలాని యథా తత్పుత్రా హరంతి తద్వదితి భావః = అని శ్రీధరాచార్యులు.

† పుష్ణాతి యా నధర్మేణ స్వబుద్ధ్యా తమపండితం, తే కృతార్థం ప్రహిణ్వంతి ప్రాణారాయ స్సుతాదయః = అని మూలము.

వంతుఁ డవతరించినవాఁడు. ఆపరమేశ్వరుని నియమమును దాఁట నేపురుషునకు శక్యము గాఁగలదు? తదనుకూలముగాఁ గార్యములెల్ల సాగుచుండును. మార్పఁబూనినవి మార్పనొందవని యెఱుంగుదును. భగవద్విధాన మిట్టిదని విమర్శింప శక్యము కాదు. అట్టిమార్గముచే నాత్మ మాయాయోగమున నీ జగమును బుట్టించి యందుఁ దాను జొరంబడి కర్మఫలముల వేఱువేఱుగా విభాగించి మనసుచే నూహింపనైన శక్యము గాని విహారమున నీసంసారచక్రమును ద్రిప్పుచు నానందించుచుండు పరమేశ్వరునకు నమస్కరింతును. ఇందు నాప్రయత్నమేమియు లేదని యెఱుంగుము. భగవదిచ్ఛానుసారము కార్యము సాగుచుండును. దీని కన్యథాత్వము గల్పింప శక్యము కాదు.

అనిపలుకు నాంబికేయుని యభిప్రాయ మెఱింగి యక్రూరుం డాతనిచేఁ బ్రయాణముచేయ ననుమతింబడసి మిత్రజనుల వీడుకోలుపడసి బంధువులయనుమతిచేఁ దరలి పాండవులకు జరగినవార్తల శ్రీహరికిం దెల్పువాఁడనని తెలియఁజెప్పి కుంతి నూఱడించి మధురాపురంబునకుఁ జనుదెంచెను. రామకృష్ణులా యక్రూరుని రాకం గోరుచుండిరి. కాన నాతఁడు రాఁగాఁ గుశలప్రశ్నపూర్వకముగా నచ్చటివృత్తాంత మేమని యడిగిరి. అక్రూరుఁడు వారితోఁ బాండవులవిషయమున ధృతరాష్ట్రుఁ డెట్లు ప్రవర్తించునదియుఁ, దా నతనితోఁ బల్కినపద్ధతియు, దానివిని యతఁ డొసంగినయుత్తరము, నితరులవలనఁ దా విన్న వృత్తాంతమును, గుంతీదేవి యాశయమును వదలకుండ విన్న

త్పూత్పత్త్వమును వ్యక్తీకరించెను.

"వేదోఖిలో ధర్మమూల" మ్మని మనువు తనస్మృతిని సంద
ఠి యఖిపాగ్రాయమును మనుస్మృతియందు స్పష్టముగా నుడివెను. కావు
న నట్టి ధర్మాచరణమునకు గడంగుట ప్రతిజనునికి నవసరము.

ధర్మశాస్త్రములు.

వేదములు, ఉపనిషత్తులు, ఆగమములు, ఆగమశిఖలు స్మృతులు ధర్మవిషయములను ముఖ్యముగ బోధించుచున్నవి. ఇవియన్నియును సంస్కృత భాషయందే యున్నవి. వర్ణాశ్రమ ధర్మముల నాచరించుటకు గాని, దెలుసుకొనుటకు గాని, కలివశమున మానవుల కుత్సాహము జనింపకున్నది.

ఎవరేని యొకరు ధర్మములఁ దెలిసికొనవలెనని తలంచున్నను నట్టిగ్రంథములు సంస్కృత వాఙ్మయమున నుండుటచే వారితలంపులు వ్యర్థములగుచున్నవి. అట్టివారలకును దీర్చుటకై యీధర్మ సంగ్రహమను నిబంధన గ్రంథము వ్రాయఁబడినది.

ఇది ధర్మ సంగ్రహమైనను, ఆవసరములగు ధర్మము లన్నియు నిందు విపులముగ జర్చింపఁబడక యుండలేదు. ధర్మ జిజ్ఞాసువులకు నీధర్మ సంగ్రహ మత్యుపకారముగ నుండక పోదు. ఆంధ్ర సారస్వతమున ధర్మము లన్నియు దేటతెల్లముగ నిందు బొందుపరచుటచే, నీగ్రంధము సర్వజన శ్లాఘాపాత్రమని నాతలంపు.

ధర్మసంగ్రహము

ఈధర్మ సంగ్రహమున—వర్ణాశ్రమ ధర్మకాండము, ఆహ్నికకాండము— ప్రాయశ్చిత్త కాండము— ధ్యానయోగ కాండము— అంత్యేష్టి కాండము—ఆశౌచ కాండము— యనియారు కాండములు గలవు. ఈషట్కాండలలో నీయాహ్నిక కాండమే గొప్పది.

ఇందు, ఉషఃకాలమున నిద్రనుండి లేచినది మొదలుకొని రాత్రిశయనించు వరకు జేయవలసిన కృత్యములను, లేనిచో

వాదమునుండి మనమేమి నేర్చుకొనఁ దగుననునదియే యిటఁ బ్రశ్నము. దాని నాలకింపుఁడు.

లోకమున నెందఱో తమకుఁ గీడుమూడఁ జేయుకార్యములను జేయుదురు. సజ్జనులు వారికి హిత ముపదేశింతురు. కాని యామాటలు వారికి హితములుగాఁ దోఁపకుండుటయే గాక చెడుగులుగాఁగూడఁ దోఁచును. అట్లుతోఁచుట వారి దుష్కర్మపరిణామమే గాని వేఱుగాదు. మనలోఁ గొంద ఱట్టి వారిని దూషింతురు. ఈ దూషించువారు తమరు జ్ఞానులనియే తలంచుకొనువారు కాని వారిదుష్కర్మము పలుభంగుల వారిని ద్రిప్పుచున్నదని తలంపరు. కావున వీరు నజ్ఞానులే యనవచ్చును. కర్మము ప్రాణులం ద్రిప్పుచుండును. దానికడ్డము లేదు. భగవదుద్దేశము కర్మరూపముగనే యుండునని తలంపవలయును. ఈ విషయము తెలిసికొన్నవారు పరుల దూషింపరు. కొందఱు తమయుపదేశమును వినలేదని కోపపడుటయుఁ గలదు. వారు మఱింతమూర్ఖులు. వారికిఁ బురుషుఁడు కర్తకాఁడన్నమాటయే తెలియదు. తమకు సర్వము తెలియుననియే భావింతురు. కావుననే వారితరుల ద్వేషింతురని మనము నమ్మవలయును. ద్వేషించుటకంటెఁ బ్రేమించుట మంచిది. దానఁ గర్మసిద్ధాంత మెఱింగినవారమని యోగు లెఱుంగుదురు. పరులపై ద్వేషమూనుట యనఁగా దుష్కర్మము తమరుకూడ నాచరించియున్నవారనియే భావము. కావున నతినీచమనందగు పరదూషణము చేయఁబూనుట కర్మోపహతుఁ డగునరుఁడు తనకుఁ గాఁగలకీడు నెఱుంగక మూఢుఁడై కార్యమును సాగించుచుండఁగా నావిధ మెఱింగిన

డవ జామున చంద్ర గ్రహణము కలిగినచో మొదటి యామము న
దే భుజింప వచ్చును.

ఉపాసనను జెప్పెను, శివోహం భావనతో శివుని నుపాసింప
లెను. జీవునికి శివునకు శరీరి శరీర భావము గలదు. సుకృతదుష్కృ
ములు శివునికే యర్పింప వలయు. కర్మఫల దాతయు, కర్మఫల భోక్త
యు, నగు వాడు శివుడే. ఆశివుడే నేననుటచే శివుని శరీరము యర్థము
ఎవని శరీర రక్షణము వానికి ముఖ్యమైనటుల శివునికిగూడ త
శరీర రక్షణము కర్తవ్యమై యుండును. ఆశివుడే నేననుటయే యాత్మ
వేదనము.

ఇంకను నీవిధముగ ననేక విశేషాంశము లిందు బొందు పరచ
డినవి. ఇట్టి యుత్తమ గ్రంథమును నేర్చి కూర్చిన గ్రంథకర్త చారిత
మును సంగ్రహము గానైనను గుర్తెరుంగుట మతాభి మానులకవ
శ్యము.

చరిత్రము.

ఈ ధర్మసంగ్రహమును రచించినట్టి శ్రీ॥ లోకారాధ్యులగు
దిగొండ నాగలింగ శాస్త్రిగారు. వీరు స్వధర్మ నిరతులు. సుప్రసిద్ధ
డిత చక్రవర్తులు. నిరంతర శివానంద రసాస్వాద పరతంత్రులు గ్ర
రచనా కోవిదాగ్రేసరులు. వీరిలేఖిని జంకుగొంకు లేనిది. వీరిబుద్ధి
తరవాలము వోలె నతి తీక్ష్ణమైనది.

వీరియాహారలన నన్య సాధారణములు. వీరిభావము లతిగం
ములు. వీరికటాక్షములు దయా రసపూరితములు. వీరి భాషణము
సర్వజన హృదయా నంద కరములు. వాగ్వాదము నందే గాక ప్రతి
వాదము నందు గూడ నత్యంత సమర్థులు.

జనన కాలము.

శ్రీమ స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహన శకవర్షము
లకు శాలివాహన శకము 1876 సం॥ కు సరియైనధాతనామసం॥రప

ముల నొందుచున్నవారని శ్రీహరి యెఱింగెను గాని వారి కప్పుడే తాను సాయపడ నుంకింపఁడయ్యెను. శ్రీకృష్ణావతార మునఁ గలవిశేష మిదియే కదా. తాఁ గొన్ని కార్యములను జేయుచుఁ గొందఱచేఁ గొన్ని కార్యములఁ జేయించుచుఁ దాను సాయపడుచు నన్ని కార్యములను దానేచేయుచు నన్ని కార్యముల నొరులుచేయుచుండఁ దానేమియుఁ దెలిసికొనఁ బూన నట్లు నటించుచు నుండును. వీనిచే భగవంతుని సర్వజ్ఞత్వ సర్వ కారణత్వ సర్వసాక్షిత్వ సర్వేశ్వరత్వములు ప్రకటింపఁ బడును. ప్రకృతము శ్రీకృష్ణుఁడు తన యవతారఫలమును జూపనెంచె నని మన మెఱుంగవలయును.

ఇంతదనుక శ్రీహరి తనబాల్యలీలల ననేక కార్యములు సాధించెను. అవియే భగవన్మహిమమును వేనోళ్లఁ గొనియాడఁ జాలియుండును. కాని వానిచే భూభారహరణకార్యము కొన సాగలేదు. మధురాప్రయాణమున లోకభారకార్యము కంసవధ మునఁ గొంత సాగెననవచ్చును. కాని భూభారమును హరింపఁ బూనిన భగవంతుని కార్యమును గొనసాగింప నెందఱో రక్క సులు భూమిని బుట్టియున్నవారు. వారికిఁ బ్రతిపక్షులుగా దేవ తలును భూమిఁ బుట్టిరి. వీ రిరువురకు నొక్కచో సమావేశము కావలయును అది సమకూడినఁగాని తనపని పూర్తినొందదని భగవంతుఁ డెఱుఁగును. అందు దేవతాంశసంభూతులకు విజ యము దానవాంశసంభూతులకు నపజయము కలిగింప దైవ మెంచెను. కాని తనచేఁ దెగవలసినభూతములు కొన్ని గలవు. వానిని దాఁ బొలియించి పిదప నితరులద్వారా కొంత కార్యము సాగింప నూహించిన శ్రీహరి తొలుదొలుతఁ దాఁ జేయఁదగిన

...యయ్య వారు. వీరు శివారాధన తత్పరు లేగాక లఘోర మంత్రోపా
సకులు

వీరి పితామహుడు నాగలింగావధానిగారు వేదములందు మిక్కి
లి ప్రజ్ఞులు. పితామహి నామము వీరలక్షమ్మ. కౌండిన్య గోత్రుఁడై
ములుగు ముక్తి లింగారాధ్యులు వీరికి మేనమామ. వీరి మాతామహుల
వీరభద్రారాధ్యులు. మాతామహి సుందరమ్మగారు. వీరి జ్యేష్ఠభ్రాత, నా
మల్లయ్య అయ్యవారు. వీరాగమశాస్త్రము సంగ్రహించి పాండిత్యము
నార్జించిరి. పలుప్రదేశములందు శివప్రతిష్ఠ — దేవీప్రతిష్ఠ మొదలగు స
చేయించిరి. కనిష్ఠభ్రాత రామలింగ శాస్త్రిగారు. వీరుభయభాషా ప
డితులు. సరసమగు కవితాశక్తి వీరికి గలదు.

### గురువులు.

వీరికక్షరాభ్యాస కర్తయగు నాదిగురువు పమిడి ముక్కల వా
స్తవ్యులైన మల్లంపల్లి వీరేశలింగారాధ్యులవారు వీరే దీక్షాగురువులై
విలసిల్లిరి.

అక్కినప్రెగడ శేషమంత్రి గారు వీరికి వ్రాయను చదువను నేర్పి
నవారు. ముదిగొండ నందయారాధ్యులవారు కావ్యారంభ గురువులు
ఇవటూరి లింగయ్య శాస్త్రులవారును ముదిగొండ చంద్రమౌళి శాస్త్రు
లుగారును, కావ్య గురువులు. శ్రీకాళహస్తి నగరవాస్తవ్యులైన బ్రహ్మ
శ్రీ శ్రీనివాస శాస్త్రుల్లవారు వీరికి వ్యాకరణాధ్యాపకులు.

శ్రీపంచనదక్షేత్రప్రాంత సదుత్కావేరీ గ్రామవాస్తవ్యులున
శ్రీచిదంబర నగరప్రచారిత బ్రహ్మవిద్యాదిపత్రికాధిపతులునునగు శ
రసమయ పంచానన పాంచజన్య శ్రీ శ్రీ శ్రీనివాస దీక్షితులవారు వే
దాన్తాది శాస్త్ర గురువులు.

### శాస్త్రపరీక్ష.

దుర్ముఖి సం॥ శరన్నవరాత్ర మహోత్సవ సమయమున శ్రీరా
మనాథనగర సంస్థానము నందు వీరు వ్యాకరణ శాస్త్రమునం బరీక్షి

నందది నిరతిశయప్రకాశమునఁ గనుపట్టును. ఇదియే భేదము. కావున దురాత్ముల కాసమయమునఁ బెనుభీతియుఁ బరిశుద్ధాత్ముల కా తరుణమునఁ బరమానందము కలిగెను. ఆకారణమున రాక్షసాంశజనితులగు రాజులెల్లఁ గృష్ణు నేసమయమున వధింతుమా యను తహతహపాటు గలవారలై యుద్ధప్రయత్నములు చేయసాగిరి. ఆవిషయమే యీక్రింద వ్రాయఁబడును.

జరాసంధుఁడు ద్వాపరాంతమున నున్న శూరులలో గొప్పవాఁడు. అతని మార్కొనఁ దగురాజు లేఁడను ప్రసిద్ధి కలదు. సకలవిధముల నా జరాసంధుఁడు రాజలోకమున మర్యాదను బెంపొందుచుండువాఁడు. ఆతనికిఁ బలువురు బంధువులు కలరు. మిత్రులును గలరు. ఏసమయమున నేమాట యతని నోటనుండి వెడలునో ఆకార్యముచేయ సిద్ధముగనుండువారెందఱో గలరు. ఆతనిసేన యపారమని యంద ఱెఱుంగుదురు. ఏక్షణమున యుద్ధమన్నను సిద్ధముగనే యాసేన యుండును. సేనాధిపతు లపారబలదర్పులు. వారిలో నొక్కఁడే సర్వలోకముల జయింపఁజాలునన్న విఖ్యాతి లోకమున వ్యాపించియుండెను. కావున జరాసంధునిమాట విన్నంతనే రాజులు గడగడ వడఁకుచుందురు. ఎందఱో యతనికిఁ గప్పముకట్టి పాదాక్రాంతులగువా రుండిరి. బంధువులమనుపేరఁ గొంద ఱాతని నాశ్రయించి మర్యాదలఁ గాపాడుకొనుచుండిరి. కాఁబట్టి యేవిషయమున నాలోచించినను జరాసంధునిమాటకు బదులు లేకుండెను. ఆతఁడు పట్టినదే పట్టు. అన్నమాట సార్థకముగా నుండెను.

భ్యుల వలనను వీరికే సన్మానము గ్రహింపఁ బడియెను.

### ఉద్యోగము.

గుంటూరు మండలము లోని తెనాలి నగరమున నున్న స సంస్కృత కలాశాల యందు, పింగళ సంవత్సరము మొదలుకొని షష్టి కండు సంవత్సరములు సాహిత్యోపాధ్యాయ పదవి వీరిచే వహింప బడియెను.

### అధ్యాపనము.

దీనికి ముందు పరీధావి సం॥ మొదలుకొని తాడికొండ గ్రామమున న బ్ర, శ్రీ, తాడేపల్లి రఘువ నారాయణ శాస్త్రి మొదలగు ప వీరివద్ద వ్యాకరణ శాస్త్రము నభ్యసించి కృతార్థులైరి,

### పత్రికలు.

శార్వరి సం॥ శ్రావణ మాసము మొదలుకొని చెన్నపురియం దు శ్రౌత శైవ ప్రకాశిక యనుమాస పత్రిక యారంభించి నాలుగు సంవత్సరములు వీరిచే ప్రచారము గావింపఁ బడియెను.

మన్మథ సం॥ ఆశ్వయుజ శుద్ధవిజయ దశమి మొదలుకొని వీరి శైవరహస్య బోధిని యను ద్విమాస పత్రిక యారంభించి ప్రచురింప బడును. ప్రభవ సం॥ శ్రావణ మాసము మొదలుకొని శ్రీదేవిడీ స స్థానాధి పతులైన ఘజ్జ తాసార్, రాజాకందకూరు బాలసూర్య ప్రస దరావు బహద్దరు వారి సాహాయ్యము వలన మాసపత్రికగా మార్చ డి శైవ మత ప్రాశస్త్యము పెక్కువిధముల ప్రకటింప బడుచున్నది.

### వీరు రచించిన గ్రంథములు.

1 రవారుద్రాక్ష మాహాత్మ్య చండ మార్తాండము సంస్కృతన ఇవ్యాది, తిరువళిక్కల్లూరు శ్రీ రామ సుబ్రహ్మణ్య శాస్త్రి రి శిష్యులు రచించిన భస్మరుద్రాక్ష ధారణ దూషణ రూపమైన చ ద్రికయను గ్రంథమునకు ఖండన గ్రంథము ఇది. గ్రంథాక్షరమున ముద్రి తమై ద్రావిడ దేశమున ప్రచారము నొంది యున్నది.

సముద్రజలేతరస్థలముల నదిపొడచూపు నాచారములేదు. కావున నిది క్రోధాగ్నియై యుండనోపునని తత్త్వజ్ఞు లూహించిరి. త్రికాలజ్ఞులుమాత్రము జరాసంధుని యాగామి పరిణామము నెఱింగినవారు గావున దానికి భీతిచెందరైరి. తక్కినవారెల్ల నఱచేతులఁ బ్రాణము లుంచుకొని భగవంతా! యకాండప్రళయమును గల్పించితివా యని వేఁడసాగిరి. ఆ జరాసంధుని ముఖదీప్తులు సభాభవనమునఁ బర్వఁగానొక్కఁడే నట నిల్వలేకుండిరి. చెంతనుండ నవకాశ మెవ్వరికిని గలుగకుండెను. ఆసమయమును వర్ణింప మర్త్యలోకమునఁ గాళిదాసు ప్రభృతులు వలంతులా కారా యనుశంక పొడమక మానదు.

ఆసమయమునఁ గంసునిభార్య లిరువురు మధురానగరమును వీడి తండ్రిని జూడఁబోయి విలపించుచుఁ బాదములపైఁ బడిరి. అత్తఱి నాతనిమది చింతాశోకక్రోధభరముల నాక్రాంతంబై యెట్లుండునో వివరింప నలువకే శక్యముగాని యితరులకుం గాదనవచ్చును. అందును దన యిర్వురుకొమరితలు కనఁబడుచున్నవారు. వారిమోములు వైధవ్యదూషితములు. నిర్భరవయస్సు దేహముల వ్యాపించియున్నది కాని యనుభవించు నదృష్టము దూరముగాఁ బోయినది.

"కన్యాపితృత్వం దుఃఖాయ."

అను జనకమహారాజవాక్య మొకటియుండఁగా మీఁదు మిక్కిలి యల్లుఁ డన్యాయముగాఁ జంపఁబడెననియు దాన వైధవ్య మలవడెననియు నింకఁ దనపుత్త్రికల కథోగతియే కాని సుఖోర్ధ్వగతి లేదనియు నాజరాసంధునిమది నాటెను. ఆతరుణమున నాతనికి మన్నుమిన్ను తెలిసినది కాదు. ప్రపంచమే యతని

ఇందు నాయీ కాండములు గలవు. అవి యెవియన

1. వర్ణాశ్రమ ధర్మ కాండము.

ఇది తాడి కొండ గ్రామ వాస్తవ్యులగు బ్ర॥ శ్రీ॥ మూదిగొండ నాగమల్లికార్జునయ్య వారిచే ముద్రింపఁబడుచున్నది.

2 ఆహ్నిక కాండము.

ఇది వరంగల్ నగర వాస్తవ్యులైన బ్రహ్మశ్రీ కొడిమేల రాజలింగారాధ్యుల వారిచే ముద్రితము.

3. ప్రాయశ్చిత్త కాండము. ఇమ్మడి రేపల్లె తాలూకా పెదపులివఱ్ఱు గ్రామ వాసులైన బ్ర॥ శ్రీ॥ కాళహస్తి లింగమయ్య వారిచే ముద్రితమగుచున్నది.

4. ధ్యానయోగ కాండము.

అముద్రితము.

5. అంత్యేష్టి కాండము.

6. అశౌచ కాండము.

ఈరెండును నిజాం రాష్ట్రమున సిద్దిపేట గ్రామ వాస్తవ్యులైన ధర్మాగ్రేసరులచే ముద్రితములు.

9. ఆర్యధర్మ ప్రత్యక్ష ఫలబోధిని. ఆంధ్రము.

ఇందు, స్నాన సంధ్యాది సకల ధర్మములకును వైద్య శాస్త్రమునుబట్టి ఆరోగ్యరూపమగు ప్రత్యక్ష ఫలము గలదని ఋజువు చేయబడి యున్నది. ముద్రితము.

దండనాయకులు తమతమసేనలవెంట నడువసాగిరి. * షడంగ ములతో నొప్పు నాసేన మహాసాగరమును మించియుండెను. సామాన్యు లా సేనాసాగరమును గాంచి ప్రళయ మాసన్న మాయెననియు యాదవులు పుడమి నామరహితులగుదురనియు నెంచిరి. కొందఱు నేల యీనినదని భావించిరి. కతిపయదిన ముల కాబలములు మధురానగరమును జేరఁగలిగెను. పుర మును ముట్టడించు నాచార మాకాలమున నుండెను. పురనిరో ధమునఁ బ్రజలు శ్రమంపడుదురనియు వారియనురాగము నకుఁ బ్రభువుఁ పాత్రుఁడు కాకుండ నుండఁజాలఁడనియు విధిలేక యుద్ధమునకు నగరము వెడలివచ్చుననియు యుద్ధదక్షుల భావము. ఆకాలమున కది యలవాటుగా నుండెను. ఆ యా చారము ననుసరించి యా మాగధసైన్యములు మధురానగ రము నలుదిక్కుల నావరించెను. బయటివారు నగరమును జొర వీలుపడదయ్యెను. నగరముననుండువారు బయటికి వచ్చు నవకాశ మట్టిదే యయ్యెను. మహత్తర సేనాకలకలములు భూ నభోవివరములను జెవుడ్పడఁ జేసెను. ఆక్షోభము చెప్ప నలవి కాదనుట నిర్వివాదము. యాదవుల త్తరుణమున భయంపడి యీయాపద తప్పనుపాయ మేదియనియు నాలోచింప సమర్థు లుకాక యుండిరి. వనితలు శిశువులు బాలకులు పడరానికడ గండ్లఁ బడసాగిరి. దిక్కు మన కెవ్వరని పామరు లూహించిరి.

---

* అజగామ షడంగేన బలేన మహతా వృతః=అని హరివంశము. షడంగేన రథగజతురగపదాతిపణ్యధాన్యావణికాఖ్యైః షడ్భిరంగైరుపేతేన అని వ్యాఖ్య. హరివంశమునఁ దప్ప నన్నిపురాణములందు నిరువదిమూఁ డక్షౌ హిణులసేన బయులువెడలిన ట్లున్నది.

2. సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహము.
శ్రీశంకరాచార్య విరచితము. ప్రతిపద టీకా తాత్పర్య సహితము. ముద్రితము.

3. తత్త్వోపదేశము.
శ్రీశంకరాచార్య విరచితము. ముద్రితము.

4. కలివిడంబనము.
శ్రీనీలకంఠ దీక్షిత కృతము. ముద్రితము.

5. సౌభాగ్యలక్ష్మి.
ఇందు లక్ష్మీస్తోత్రములు చాలగలవు ముద్రితము.

* వీరిచే సంకలితగ్రంథములు. *

6. సుభాషితమణి కంఠహారము. ముద్రితము.
7. ఆహ్నిక విధి. ముద్రితము.
8. ఆబ్దికవిధి. „

* సంస్కృతోపన్యాసములు. *

ఆంధ్ర తాత్పర్య సహితములు.

1. శివవివకారణం. ముద్రితము.
2. శ్రౌతాన్యేవ శైవచిహ్నాని. ముద్రితము.
3. శ్రౌతమేవహి ధారణం లింగస్య. ముద్రితము.
4. శిష్టాస్సర్వే శివం ప్రపన్నాః. ముద్రితము.
5. ప్రౌఢావివాహనిరసనం. అముద్రితము.

సంధుఁ జంపుట కిది యదను కాదు. వీనిఁ బ్రాణములతో వదలిన మత్సరగ్రస్తుఁడు కావునఁ బగసాధింపఁ బూని మరలఁ బెక్కు మందిని గూర్చుకొని వచ్చును. వారిం బొలియించిన భూభారము తగ్గును. ఇట్లు పెక్కుసారు లొనరించిన నీతనిమూలము ననే భూదేవి భారమువాయ సుఖించును. నా యవతార ఫలము భూభారహరణము, సాధుపరిపాలనము కదా. దుష్టులు తొలుదొలుత వధింపఁబడకయున్న మరలమరల నాపై యుద్ధమునకు సంసిద్ధు లగుదురు. దాన జీవులు పెక్కుమంది పొలియుదురు. చావునకు సిద్ధముగనుండుకర్మమునే చేసినవారెల్ల నాపైఁ గినుకవూనుదురు. వారు మడియుదురు. నాయవతారమునకుఁ దగినఫలము గలుగును.

అని యిట్లు తనలోఁ దలపోసికొని యీవిధమెల్ల స్వాభేదరూపుఁడగు నన్నకెఱింగించువాఁడై యేకాంతమున బలరాముం జీరి దేశకాలాదుల స్థితులెఱిఁగించి మాగధునిప్రయత్నంబుఁ దెలియఁజెప్పి యాదవులకుఁ గలిగిన మనఃక్షోభము చక్కఁగాఁ జెప్పి మనకృత్య మిద్దియే యని తెలుపుచుండెను.* ఆతఱి నంబరమునుండి రెండురథములు దిగియెను. అవి సూర్యతేజస్సువలె వెలుంగుచుండెను. సూతులు రథపరికరములు గుఱ్ఱములు లోనగునవియన్నియుఁ గొఱంత లేకుండెను. ఆ రెండు రథములపై దివ్యములు నతిప్రాచీనములు నగునాయుధము లమ

* ఏవం ధ్యాయతి గోవింద ఆకాశా త్సూర్యవర్చసౌ, రథా వుపస్థితౌ సద్య స్ససూతౌ సపరిచ్ఛదౌ, ఆయుధాని చ దివ్యాని పురాణాని య దృచ్ఛయా, దృష్ట్వా తాని హృషీకేశ స్సంకర్షణ మథాబ్రవీత్ = అని భాగవతము.

దేశముల యందు శాస్త్రిత్వ యనముతో గడచెను.

* 3. తృతీయ వర్షదశకము. *

ఇందు, గార్హస్థ్య పరిగ్రహము. రఘురుద్రాక్ష మాహాత్మ్యచండ మార్తాండము, శైవసిద్ధాంత సంగ్రహము, చెన్నపురి యందు శైవ సిద్ధాంత ప్రచార మూలమున శ్రౌతశైవ ప్రకాశికా ప్రచారము గావింప బడియెను.

—* 4. చతుర్థ వర్షదశకము. *—

జ్ఞానవాసిష్ఠము సర్వవేదాన్త సిద్ధాంత సంగ్రహము కాదంబరి వ్యాసకథము, మొదలగు గ్రంథముల విరచనంబును, తాడికొండ గ్రామమున శాస్త్రాధ్యాపనంబును గావింపం బడియెను.

—* 5 పంచమ వర్షదశకము *—

ఈసుదనున, తెనాలిపురమున సంస్కృత కలాశాలో పాధ్యాయపదవి గ్రహింపబడి ధర్మసంగ్రహము, ఆర్యధర్మ ప్రత్యక్ష ఫలబోధిని, ఈ గ్రంథముల విరచనంబును, శైవరహస్య బోధిని పత్రికా ప్రచారంబును గావింపఁ బడియెను,

—* 6 షష్ఠ వర్షదశకము. *—

శైవ రహస్యబోధిని పత్రికా ప్రచారణంబును, శ్రీకంఠాచార్య విజయంబను సంస్కృత కావ్యవిరచనంబును గావింపఁ బడుచున్నది.

శాస్త్రిగారింకను మతగ్రంథముల పరిశీలించి మతగ్రంథముల విశేషముగా రచింపఁ గోరెదము.

ఇపుడు మహాహవ మాసన్నమైనది. ఇందుఁగల పెక్కుజీవులు తనచే బలరామునిచే మృతినొందఁ దగినవారు గలరు. భగవంతుని యవతారఫలమునకుఁ దోడ్పడఁ బుట్టినవారేకాని వేఱుకాదు. వారు పుట్టకయున్న భూభారము తీఱదు. జరాసంధాదులు భూభారహరణ లీలానాటకమునందుఁ బాత్రముల వంటివారు. ఆనాటకమును శ్రీకృష్ణుఁడు సూత్రధారుఁడై సాగించును. బలరాముఁడు భావుకుఁడు. అనఁగా సూత్రధారునకు సహాయభూతుఁడని గ్రహింపఁదగు. ఈనాటకము వీరరసైక ప్రధానము శృంగారాదిరసము లంగములు కావలదా యని ప్రశ్నింతురేమో? అన్నియు నిం దమరియుండును. భగవద్దివ్య రూపమును మృతినొందిన పుణ్యాత్ముఁడు కాంచుటయే శృంగారము. ఇట్లే నవరసములు నీనాటకమునఁ గనఁబడఁ గలవు. యుద్ధ మేలాగుసాగెను? ఎంద ఱెందు మృతినొందిరి? ఎవ్వరెవ్వ రెట్లెట్లు యుద్ధము చేసిరి? అనిమాత్ర మేకథను జదువకుఁడు. దానఁ గాలమును వ్యర్థముచేసిన ట్లగును. ఏయేజీవు లెట్టిపుణ్యము చేసికొనిరి? భగవంతుఁడు యుద్ధము చేసినాఁడా? వారి వారిమృత్యువు వారికిఁ బ్రతిపక్షశూరుఁడుగా నిలిచి పోరాడుచున్నదా? ఎందఱందుఁ బుణ్యాత్ములు గలరు? ఇప్పట్టున సర్వసాక్షి నిర్లిప్తుఁడు. అన్నపేరులు శ్రీహరికిం జెల్లునా? చెల్లవా? అను నీ మొదలగువిషయములం బ్రధానములుగా భావించి కథను జదువుచు వీనిని సమన్వయము చేసికొనుఁడు. అపుడు పఠనమునకుఁ జక్కనిఫలము గలుగు. ఎవ్వరెవ్వ రెంతెంతసేపు పోరాడిన నేమి? అస్త్రము లెవ్వరెక్కుడఁగాఁ బ్రయోజనమేమి? ప్రధాన మదిగాదు. కర్మము దృఢపాశములతో నెవ్వరె

నీడ్చుకొనివచ్చి మృత్యువునోటఁ ద్రోయును. ఈబాణము పని సాధించినట్లు కనఁబడును. కావున లోకమున నొక్కని వేఱొక్కఁడు చంపుటనునది కల్ల. నిమిత్తమాత్ర మొకఁడుండును. అదియే ప్రధానముగా మనము భావింతుము. కాని కర్మ మిట్లు చేయుచున్నదని యూహింపము. మన మెఱుంగఁదగినవిషయ మిదియేకాని వేఱొకటి కాదు. దీని నెఱుంగుటచే నింకొకరిని ద్వేషించుట వదలిపోవును. అంతకంటె మనకుఁ గావలసిన దేముఁన్నది ?

ఇఁక భగవంతుని యద్భుతకృత్యమును వినుఁడు. శత్రువులు పురమును ముట్టడించిరని యెఱింగెను. యాదవులా వాహినిని నిలుపఁజాలరనియు నెఱింగెను. వెంటనే యన్నతోటి తనపూర్వశస్త్రాస్త్రములం దలంచెను. రథముతో నన్నియు సన్నిధిం జేరెను. ఆకాశమునుండి దివ్యరథములు రెండు సకలాస్త్రసంపన్నములై వచ్చెను. భగవంతుని యిచ్ఛామాత్రమున బ్రహ్మాండము లొక్కసారి యుప్పతిల్లునన్న నిఁక నరదము దిగి వచ్చుటొక యద్భుతమా? నిరాధారస్థలమునుండి యరదము దిగుటసంగతము కాదాయని ప్రశ్నింపవచ్చును. కాని యా ప్రశ్నమంత యుక్తియుక్తము కాదు. దేనికేది యాధారమో యెఱుంగఁజాలక చేయుప్రశ్న మిద్ది. సూర్యుని రథగమనమున కాధార మేది? భూమినిలుచుట కాధార మేది? సకలబ్రహ్మాండములుండుట కాధార మేది? అన్యోన్యమాశ్రయించి భగవచ్ఛక్తిచే నిలిచియున్నవి. మహాభారతమునందు ధర్మరాజు సూర్యున కేమియాధారమను ప్రశ్నమునకు "సత్య మాధార మండ్రు" అని చెప్పెను. సత్యమనఁగా భగవద్రూపమని

సామానాధి కరణ్య మనన్వయిత్యపి మందం॥ శివ శబ్దస్య దేవతా విశేష వచనత్వేపి, తల్లీలా పంచ వింశక సామాన్య వచనతయా, లింగశబ్దస్య తస్మాత్ విశేష వచ నతయా చ సామాన్య విశేష వచన యో శ్శివ లింగ శబ్దయో స్సామానాధ కరణ్యేన సమాసః।మూర్తి విశేషస్య అన్యదీయత్వ శంకా వ్యావృత్త్యై, మూర్త్యంతర వ్యావృత్త్యాచ తదుభయ పదసార్థక్యం॥ శివస్య లింగం మూర్తి విశేష ఇతి గాహా శ్శిర ఇతి వదభేదే షష్ట్యుప చారాత్, శివాభిన్నం లింగమిత్యర్థ సిద్ధ్యాత్రషష్ఠీ సమాసేపి నకాపి సిద్ధాంతలవక్షతిః॥

నను స్కాందే శివతత్త్వ సుధానిధౌ। తిష్ఠ తిష్ఠ సదా స్త్రీణాం మోహకో౽స్య ధమాధమ॥ లింగమేత త్సముత్పాట్య అనయా భార్యయా వినా। కృత్వాకర్మ సదాచారో వనే స్మ స్వైహరాధమ॥ స్కాందః॥ ఇత్యుక్త సుతదా శంభు స్తేషాం మధ్యే తథా కరోత్॥ లింగముత్పాట్య సంత్యజ్య తయాచాంతర్హితో౽భవత్। తల్లింగం తద్వనం సర్వం దదాహ శ్రమ మండలం। ఇత్యాదినా తదీయం మహాత్మ్యం నిర్వర్ణ్య, తతో బ్రహ్మణాం ప్రతి॥ కశ్చిత్స భార్య శ్యాస్నాకాన్న నగ్నో వి

ప్ర॥ స్కాందమున శివతత్త్వ సుధానిధి యందు ఈశ్వరుడు దేవదారువనము నందు మునిపత్నుల పాతివ్రత్యము ను భంగపరచి నప్పుడు నీలింగమును త్రెంచి వైచి వనమున విహరింపుమని మునులు శపింప నంత నట్లేవుడట్లు చేసి యంతర్ధానము నొందగా నాలింగము వనమునంతను గాల్చుచుండ నామహర్షులు బ్రహ్మలోకమున కేగి యావృత్తాంతము చతుర్ముఖునకు నెరింగించియద్దేవు నుపదేశముచే నాలింగము నాపిష్టమోరియందు ప్రతిష్ఠించిపూజించిరని యున్నది దీనింబట్టి లింగము శివుని యవయవవిశేషమే యని తెలియుచున్నది అదియు పరమేశ్వరావమానము చేసిన మునులకే పూజనీయమని శివతత్త్వ సుధానిధి వచనము వల్లనే తెలియుచున్నది. ఇట్లు దీనినందరు పూజింపవలయునను నియమముతో నేమి?

ఉః పరమేశ్వర నిందచేసిన మునులకు పరమేశ్వరునియవయవవిశేషమైన లింగమే పూజనీయమని వారికి దండనము న్యాయ్యముగనే విధింపబడియెను. దానింబట్టి యీశ్వర నిందకులకు నదియె పూజార్హమని తెలిసెడిని ఎల్లరకు పూజనీయమైన లింగము శివతత్త్వ సుధానిధియందె తరువాతి యధ్యాయమునందు బ్రహ్మవిష్ణువుల కలహశాంతికై జ్వాలాస్తంభ రూపముతో నావిర్భవించినదనివర్ణింపబడి యున్నది, లింగ రూపుడగు పర

మన మెఱుంగకయున్న బుద్ధిమంతులము కాఁ జాలము. ఈ భావ మెఱిఁగినవారికి నంబరమునుండి దివ్యరథములు దిగివచ్చె నన్న విచిత్రముగాఁ దోఁపదు. అది యెఱుంగనివారి కన్నియు విచిత్రములే. ఇఁక నీవిషయమును విశేషించి పెంచివ్రాయఁ బూనక యీవిషయమున శ్రీకృష్ణజన్మఖండమునుండి యించుక వ్రాసి పైకథను సాగించెదను.

* ఒకనాఁడు మధురానగరమునుండి శ్రీహరి దూరము నకరిగి వటమూలమునఁ గూరుచుండి తనకృత్యమేమని యోజించెను. బలరాముఁడు చెంగటనుండెను. తొలుత గరుడుని స్మరించెను. అవ్వల లవణార్ణవమును విశ్వకర్మను దలంచెను. వారు వచ్చులోపల గోపాలబాలవేషమును త్యజించెను. నృపవేషమును ధరించెను. † ఆవెంటనే హరి స్మరింపకయున్నను జక్ర మరుదెంచెను. చక్రము భగవంతునిచ్ఛ నెఱుంగును. రాజవేషమునుధరించుట పరాక్రమము చూపఁబూనియే కదా. అపుడు తాను లేకున్న నెట్లు పనిసాగును? అన్నయూహచే భగవంతుఁ డేక్షణమున బాలవేషమును వదలి రాజవేషమును ధరించెనో యాక్షణమ చక్రము సన్నిహితమయ్యెను. దానికి సుదర్శన మనుపేరు గలదు. దానిప్రకాశము సూర్యకోటిబింబములకు లేదనుట స్వభావోక్తియే యనక తప్పదు. తేజోవిషయమును మాత్ర మాలోచించిన నది శ్రీహరిసమానమని చెప్పక తప్పదు.

---

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండము నూటమూఁడవ యధ్యాయము నుండి సంగృహీతమని యెఱుంగవలయును.

† ఏతస్మిన్నంతరే చక్ర మాజగామ హరిం స్వయమ్ = అని మూలము.

నన్వేవమపి, బ్రహ్మవిష్ణ్వోః కలహ సమయే ఖ్యాత లింగ ముద్భూతం తత ఏవ నతతః పూర్వం లింగార్చన మస్తీతి జ్ఞాయతే తదా లింగోద్భవ లీలాయా ఏవాభావాత్ తత్పూర్వం తద్దర్శనం కథమిత్థం స్యాన్నిత్య మితి చేదుచ్యతే।

ప్రపంచ సర్గాత్ప్రాక్కాల ఏవ లింగావిర్భావః, యత ఏవ ప్రపంచోత్పత్తిః। తతశ్చ ప్రపంచోదయాల్లింగార్చనమస్త్యేవ। బ్రహ్మవిష్ణ్వోః కలహాసమయే తచ్ఛాన్త్యర్థం పూర్వం స్థితస్యైవ లింగరూపస్య దర్శనం కృతం॥ తథాచ, స్కాందే శివతత్త్వసుధానిధావేవ॥ పూర్వమేకార్ణవే ఘోరే నష్టే స్థావరజంగమే। మధ్యే సముత్థితం లింగమైశ్వరం తైజసం పరం। జ్వాలామాలావృతం దివ్యమప్రమేయమనామయం। కల్పాన్తే తత్ర లీయన్తే సర్వే తే సర్వదేవతాః। దక్షిణే లీయతే బ్రహ్మా వామతశ్చ జనార్దనః। హృదయే చైవ గాయత్రీ సర్వదేవోత్తమోత్తమా। లీయన్తే మూర్ధ్ని వై వేదాః సషడంగపదక్రమాః। జఠరే లీయతే సర్వం జగత్ స్థావర జంగమం। పునరుత్పద్యతే యస్మాద్బ్రహ్మాద్యాశ్చ చరాచరమితి॥

అత్ర, కశ్చిదాహ॥ శివలింగ మిత్యత్ర లింగ పదం చిహ్న పరం, తదుక్తం శంకర సంహితాయాం॥ తదేవ హస్తాంబుజ పీఠ మధ్యే నిధాయ లింగం పరమాత్మ చిహ్న మితి॥ తస్మాన్న లింగం పరమేశ్వర స్వరూప మితి॥ తదసాధు, శంకర సంహితావచన చిహ్నరూప పదా

---

పూర్వము చరాచరాత్మకమగు జగము నశింపఁగా నప్పుడు జ్వాలామాలావృతమగు తేజోమయమగు లింగము ప్రకాశించుచుండెను॥ కల్పాంతము నందు సర్వదేవతలు నందు లయ మొందుచుందురు॥ ఆలింగము యొక్క దక్షిణ భాగంబున బ్రహ్మయును, వామ భాగంబున విష్ణుండును, హృదయంబున గాయత్రియును, శిరంబున సాంగోపాంగములగు వేదంబులును, గర్భంబు నందు చరాచరాత్మక మగు జగంబును లయించుచున్నవి॥ సృష్టి యందు నాయా స్థానంబులనుండి సర్వంబును వెల్వడు చుండును. అని శివతత్త్వ సుధానిధి యందు దెలుపఁబడి యున్నది.

ప్ర॥ లింగమే శివుఁడని చెప్పుట యెట్లు? అట్లు చెప్పనెడ శంకర సంహితే యందు

నవో,నీప్రాపుగాంచియు యాదవులు వ్యసనార్ణవమున మునింగి యున్నవారు. కావున వీరికష్టములఁ దొలఁగించుట నీకు విధి కదా. ఇదిగో దివ్యరథము నీకొఱకు వచ్చి నిలిచియున్నది. నీ దివ్యాయుధములన్నియు నిం దున్నవి. * ఈయరదము నారో హించి యీవచ్చిన వైరివాహినిం గెలిచి ప్రళయ మాసన్న మయ్యెనని భయంపడుచున్న యీ యాదవులనెల్ల నుద్ధరిం పుము. మన మవతరించినది సాధురక్షణాసాధుశిక్షణార్థమే కదా. ఇరువదిమూఁడక్షౌహిణులసేన యిపుడు మనచేఁ జంపఁ బడఁ దగును. పుడమికిం గలబరువును దీర్పుము. అన నట్లే యని బలరాముఁ డంగీకరించెను.

అంత నారామకృష్ణులు కవచంబులు తొడిగిరి. దివ్యరథ ముల నధిరోహించిరి. దివ్యాస్త్రములం దాల్చిరి. అంబరము నుండి రథము నెక్కివచ్చినసారథి దారుకుఁ డయ్యెను. శ్రీకృ ష్ణుఁడు బలరామునిఁగూడి దారుకుఁడు రథము చిత్రగతుల నడుప యుద్ధరంగమును బ్రవేశించెను. బలరాముఁడుకూడ నరి గెను. ఆదివ్యరథములు రెండును యుద్ధరంగమునఁ బ్రవేశించు నపుడు మింటనుండి చూచుదేవతలకా భగవంతుని రెండు మూర్తులు దివ్యతేజముల వెలుంగుచుండ భటులనెల్ల వారి చెంతకు మృత్యుదేవత పెక్కురూపములఁ దాల్చి పాశముల వారిమెడలకుఁ దగిలించి యీడ్చుకొని వచ్చి వారిముందటఁ ద్రోయుచున్నట్లును, వారిదర్శనమాత్రమున వారెల్ల మ్రందు చున్నయట్లును గనఁబడియెను. వారెల్ల భగవంతుని యద్భుత

---

* ఏతదర్థం హి నౌ జన్మ సాధూనా మీశకర్మకృత్, త్రయోవింశ త్యనీకాఖ్యం భూమేర్భార మపాకురు = అని భాగవతము.

లును, వీరుగాక యింకను బేరుగల రాజవర్యులెల్ల బలసమగ్రులై జరాసంధునిం గూడి జనార్దనునందున్న యీసున యుద్ధము చేయ నరుదెంచిరి.

ఇందు ధార్తరాష్ట్రులు నూర్వురు చేరిన ట్లున్నది. ఇది సుసంగతమా యను ప్రశ్నము రావచ్చును. సుసంగతమే కాని యసంగతము కాదు. దుర్యోధనాదులకుఁ బాండుసూనులయందెడతెగని పగ గలదు కదా. పాండునందనులయందుఁ బక్షపాతము యాదవులకుఁ గలిగియుండుట వారికిఁ దెలియనివిషయము కాదు. శ్రీకృష్ణుని యద్భుతకార్యములు వారెఱింగియే యుండిరి. శ్రీకృష్ణున కర్జునునియం దెక్కుడు ప్రీతియనియు వారు తెలిసికొని యుండిరి. వారు దండెత్తిపోయి మధురముట్టడింపఁ బూనఁగూడదా యన్న ధృతరాష్ట్రుఁ డంగీకరింపఁడు. భీష్మద్రోణకృపాశ్వత్థామాదులు నంగీకరింపరు. వీరిసాయము లేకయున్నఁ దమకేపనియు జేయ శక్యముగాదనుట వారిహృదయములందు నాటియే యుండెను. కావునఁ దమరు దండయాత్రకుఁ బోకయున్నను జరాసంధుఁడు దండయాత్ర చేయఁబూనఁగా నాయాత్రయందుఁ దమరును బాల్గొన్నచో జరాసంధుఁడు రామకృష్ణులఁ బొలియించుననియుఁ, దరువాతఁ దమరు పాండవుల నసహాయుల నశ్రమంబునఁ జంపవచ్చుననియు భీష్మద్రోణులు పాండవపక్షపాతులైనను దెగించి తమపక్షముమాని యాపక్షమునఁ బ్రవేశింపరనియు వారెఱింగిరి. కావున జరాసంధుని సంగరయాత్రయందు భీష్మద్రోణాదుల సాయముగోరక తమరు సోదరులు మాత్రమే సేనలంగూడి మధురపైఁ జనిరి. ఇందసంగతప్రసంగ మేమాత్రము లేదని యెఱుంగవలయును.

* ఆర్యులారా! జరాసంధుఁడు మూర్ఖుఁడు కాఁడు. విజ్ఞానసంపన్నుఁడు. అతఁ డీసమయమున శ్రీకృష్ణునింగూర్చి పలికినమాటలు వేదాంతసారములు. ఆయర్థము నా కల్పించినది కాదు. వ్యాఖ్యానమును బరిశీలింపుఁడు. జ్ఞానసంపన్నుఁడైన యుద్ధము చేయవచ్చునా యని ప్రశ్నింపకుఁడు. భగవన్మాయామోహితుఁడై భగవత్కార్యమునకు సహాయము చేయ శత్రుపక్షమునఁ జేరినను భగవంతుని దర్శింపఁగనే జ్ఞానముదయింపక పోదు. అది లేకపోయినచో నా పరాత్పరునిదర్శనము వ్యర్థమగును. ఎట్టిపాపములైనఁ దన్నామస్మరణమున నశించుచున్న నీకఁ బ్రత్యక్షముగాఁ జూచినఁ బాపములునశించి విజ్ఞాన ముదయింపదనుట వెఱ్ఱివాదము. భగవత్తత్వమెఱుంగని మూర్ఖులవాదమది. అట్లయినఁ గలిగినవిజ్ఞానము నశించునా? నశింపకున్న వాఁడేల యుద్ధముచేయును? భక్తుఁడు కావలసినదియే కదా. అట్లుగాక జరాసంధుఁడు పెక్కుపర్యాయములు యుద్ధసన్నద్ధుఁ డయ్యెనే, ఏల? అను ప్రశ్నము చేయవచ్చును. సమాధానమును వినుఁడు. భగవద్దర్శనమున జ్ఞానముదయింపక తప్పదు. కార్యముకొనసాగవలయును గాన భగవంతుఁ డతనిమూలమున నేయేకార్యములుకావలయునో వానినన్నింటిని జేయింప నాతని మాయచే

---

* తావాహ మాగధో వీక్ష్య హే కృష్ణ పురుషాధమ, గుప్తేనచ త్వయామంద నయోత్స్యే యాహి బంధుహన్. న త్వయా యోద్ధు మిచ్ఛామి బాలకే నేహ లజ్జయా=అని మూలము. పురుషాః అధమాః యస్మాదితి వాస్తవోఽర్థః హే పురుషోత్తమేతి గుప్తేన దంశితత్వా త్సర్వాంతరత్వాద్దర్శనానర్హేణ. హే మంద. బధ్నాతీతి బంధుః. అవిద్యా తాం హంతీతి హన్ హే అవిద్యానిరసనేతి. యాహి ప్రాప్నుహి. అని వ్యాఖ్య.

మహాదేవో మహాదేవం కథ మన్యాం సమాశ్రయేత్। నామత శ్చార్థత
శ్చాపి మహాదేవో మహేశ్వరః॥ తదన్యే కేవలం దేవా మహాదేవస్తు
సఘః॥ మహాదేవం వినా యోఽన్యాం భజతే శ్రద్ధయా సహ। నాస్తి త
స్య వినిర్ముక్తి స్సంసారా జ్జన్మ కోటిభిః॥ ఇత్యాది మహావిష్ణూప దే
శానంతరం॥ సత్యసంధో మహాధీమాన్ మహావిష్ణోః ప్రసాదతః। పరి
త్యజ్యాఖిలాన్ దేవా నాశ్రితో భవదీశ్వరం। ఈశ్వరస్య ప్రసాదేన స
త్యసంధో మహాద్విజః। జ్ఞానం వేదాన్తజం లబ్ధ్వా విముక్తో భవబం
ధనాదితి పరమేశ్వర ప్రసాదేనైవ సత్యసంధో విముక్త ఇతి ప్రతిపా
దితం॥ అత్ర శ్రీ మాధవాచార్యైరపి॥ మహాదేవం సమాశ్రిత్యేతి॥
మహాదేవ మాశ్రితేన ఇష్టఫలానవాప్తౌ తస్య సాధకస్య తత్ఫల
ప్రాపణాయ మహాదేవః కథ మన్యాం మహాదేవం సమాశ్రయే
త్॥ స్వస్మా దన్యస్య మహతో దేవస్యాభావా దిత్యర్థః॥ ఏ

---

గాను॥ అట్టి శక్తి గలవాఁడు పరమేశ్వరుఁడే యని చెప్పి, సాధకుఁడగు సత్యసంధుఁ
డా, నీవు పరమేశ్వరుని సేవింపుము. మహాదేవు నాశ్రయించినను కోరిక తీరకపోయిన
శంకింపకుము॥ మహాదేవుఁడే దేవత లందఱిలోను గొప్పదేవుఁడు అట్టివాని నాశ్రయిం
చినను కోరిక తీరకున్నచో నంతకన్న గొప్ప దేవుఁడెందు గలఁడు? మహేశ్వరుఁడు నా
మము చేతను అర్థము చేతను మహాదేవుఁడగును. కడమ దేవత లెన్నో దేవత లనియె చెప్పం
బడుదురు గాని మహాదేవ సంజ్ఞ అన్యులకు లేదు గావున, అట్టి మహాదేవు నాశ్రయిం
పక యన్యు సేవించు వారలకు ఎన్నటికిని సంసార ముక్తి సంభవింప నేరదు॥ అని మహావి
ష్ణుమూర్తి చెప్పిన తరువాత సత్యసంధుఁడు నారాయణమూర్తి యనుగ్రహమువలన ప
రమేశ్వరు నాశ్రయించి యద్దేవు ననుగ్రహించిన సంసారమునుండి విముక్తి నొందెనని తె
లుపఁబడి యున్నది॥ సూతసంహితా వ్యాఖ్యానమందును శ్రీమాధవాచార్యులవా
రును, మహాదేవుని నాశ్రయించిన వానికి వాంఛితము నొసఁగ జాలని భక్తుని
నిష్టము దీర్పనెంచి యద్దేవుఁడు ఇంకొక దేవుని నాశ్రయింపవలసి వచ్చును. ఆశ్రయింప
నైన మహాదేవుని కంటె నింకొక మహాదేవుఁడు గలఁడని ఎందును లేదు. కావున పరమేశ్వ
రుని కంటె గొప్ప దేవుఁడింకొకఁడు లేఁడని చెప్పియున్నారు. ఈ యర్థము నెఱుఁగునవారు

బంధించునది బంధువనంబడు. అనఁగా నవిద్యయని యర్థము. దానిని హరించువాఁడు బంధుహా అనఁబడును. అవిద్యా ధ్వంసకుఁడా యని దీని యంతరార్థము. గుప్తేనత్వయా=అనఁగా సర్వభూతాంతర్యామివి గావునఁ జూడ శక్యుఁడవు కావని తాత్పర్యము. దీనిని వాక్యరూపముగా వినుఁడు. ఓపురుషో త్తమా! త్రికాలజ్ఞా! అజ్ఞానధ్వంసకా! పరమేశ్వరా! సర్వభూత ములయం దంతర్యామివై వెలయు నిన్ను దర్శింప యోగీశ్వరు లకే నశక్యము. ఇఁక నావంటిపామరున కది శక్యమా? కాదు. ఐన నాపూర్వజన్మసుకృతపరిపాకమున నెట్లో దర్శన మిచ్చితివి. ఇట్టినీతో యుద్ధము చేయఁ బూనుదునా? పూనను. అంతియ కాక ముద్దులుమూటఁగట్టుచున్న బాలరూపమున సాక్షాత్క రించితివి. లోకసామాన్యదృష్టిం జూచినను నీవయస్సునకు నా వయస్సునకుఁ జాలయంతరము గలదు. ఇట్టిబాలకునితో నే క్రూరుఁడును యుద్ధము చేయఁడు. బాలరూపమున సాక్షాత్క రించినమాత్రమున బుద్ధిలేక నీతోఁ బోరుదునా? నాకు సిగ్గు గాదా? కాఁబట్టి నన్నుఁ జేరుము. అనఁగా నీకళ నాయందెక్కు వగాఁ బ్రవేశపెట్టుము. నన్నుద్ధరింపుము. ఇదిగో కాచియు న్నాఁడను. అని జరాసంధుఁడు పలికెనని గ్రహింపుఁడు.

ఈఘట్టమున మహాకవి పోతనామాత్యుఁడు చెప్పినపద్య రత్నములం బరిశీలింపుఁడు:—

సీ. అదలించి రొప్పంగ నాలమందలుగావు
 గంధగజేంద్రసంఘములుగాని
 పరికించి వినఁగ నంబారవంబులు గావు
 వాజీంద్రహేషారవములుగాని

వాహినీసాగరం బిది వనజనేత్ర
నెఱసి నిను దీవికైవడి నేఁడు ముంచు.

ఇంతదనుక మూలమున లేనియర్థము నిందుఁ జొప్పింపఁబడిన దనుట స్పష్టము కాదా. దీనిపిదప శ్రీకృష్ణుఁడు బదులుచెప్పఁగా నందులకు రోషించి జరాసంధుఁడు పల్కిన శ్లోకపద్యము కలదు. ఆపద్యమును దిలకింపుఁడు.

ఉ. బాలుఁడ వీవు కృష్ణ బలభద్రునిఁ బంపు రణంబుచేయ గో
పాలక బాలుతోడ జనపాలశిఖామణియైన మాగధుం
డాలము చేసెనంచు జనులాడెడి మాటకు సిగ్గుపుట్టెడిఁ
జాలుఁ దొలంగు దివ్యశరజాలుర మమ్ము జయింపవచ్చునే.

అని యున్నది. పురుషాధమ, మంద, బంధుహా, అనుపదముల యం దిమిడియున్న యర్థము వదలిపెట్టఁ బడినది. బాలకేన లజ్జయా అను రెండుపదములయందుఁ గలయర్థము మాత్రమే గ్రహింపఁబడినది. గుప్తేనచ త్వయా అనుపదమునఁగల యత్యద్భుతార్థము స్పృశింపఁ బడలేదు. కేవలమూర్ఖుఁడు జరాసంధుఁ డనియే యీపద్యములనుండి తెలునుగాని భగవంతునికృపకుఁ బాత్రుఁడన్న యర్థ మిం దేమాత్రము గానరాదు. మహాకవి యాశయమెట్టిదో తెలిసికొనఁ జాలకున్నాఁడను. పద్యములు మిగుల హృద్యములుగా నున్నవి. కాని మూలమున విచిత్రార్థ మిం దించుకంతయైనఁ గానరాలేదనిమాత్రము చెప్పక తప్పదు. ఏది యెటులున్నను భగవంతునియందు వారికిఁగల భక్త్యనురాగము లనంతములు. పద్యములు సరసజనహృద్యములు. తర్వాతి విషయము నవధరింపుఁడు.

## శివపూజా మాహాత్మ్యం.

శివతత్త్వ సుధానిధౌ॥ శృణు విప్ర ప్రవక్ష్యామి లింగార్చన ఫలం। సర్వదాన ఫలం యచ్చ సర్వ తీర్థ ఫలంచ యత్। సర్వయాగఫలం యచ్చ యచ్చ పుణ్యం తతోధికం॥ తత్సర్వం సమవాప్నోతి పరత్ర సుఖమేధతే॥ యేర్చయంతి మహాదేవం తేయాంతి పరమం పదం। సకృదభ్యర్చితే లింగే గర్భ జన్మ నవిద్యతే॥ సదా సమర్చయేద్యస్తు సయాతి పరమాం గతిం। సంసార దుఃఖ కాంతారే నిమగ్నశ్చ మహీతలే చక్ర వద్భ్రమతే విప్ర లింగార్చన వివర్జితః లింగార్చన రతానాంచ గర్భ జన్మ న విద్యతే। లింగార్చన రతో విప్ర న భూయ స్తనపో భవేత్। నైవ స్వాత భయం నాస్తి తథా మరణ జన్మనోః యస్తు పూజయతే నిత్యం లింగం సురగణార్చితం॥ ధర్మ మాచరితం యచ్చ త్రైలోక్యే దివిచ స్థితం। శివలింగార్చనస్యైత దణ్వంశంనైవ పూరయేత్॥ బ్రహ్మా విష్ణు మహేంద్రాశ్చ లోక పాలాశ్చ దేవతాః। విద్యాధరా గుహ్యకాశ్చ గంధ

---

లిక మార్గంబున పూజింపఁ బడు చుండుదు అని మొదలుగాఁ గలదు॥

### శివపూజా మహాత్మ్యము

శివతత్త్వ సుధా నిధియందు శివపూజా మహిమ యిట్లు తెలుపఁ బడియున్నది॥ లింగారాధన ఫలంబు చెప్పెద వినుము॥ సర్వదానంబులు చేయఁగాఁ గలుగు ఫలంబును సర్వతీర్థ స్నానంబుల వల్లఁగా లభించు సుకృతంబును, సకల యజ్ఞములు ననుష్ఠింపఁజేయుటయందు పుణ్యంబును నెద్దికలదో అద్దాని కంటె నధికమగు సుకృతంబు లింగార్చనంబున ప్రాప్తించును॥ లింగంబు నొకసారి మారు పూజించినను గర్భ జన్మంబు నివర్తించును॥ ఎల్లప్పుడు లింగము నారాధించు వాఁడు ఉత్తమ గతి నొందును అని వేఱె చెప్పవలయునా? లింగార్చనంబు సేయని వాఁడు దుఃఖకరమగు సంసారవన మధ్యంబున నెల్లప్పుడు చక్రంబుఁబోలె తిరుగు చుండును॥ లింగార్చనము సేయువాఁడు తిరిగి తల్లిపాలు త్రావఁ డనను॥ లింగము నర్చించువాని యమునివలనను, మరణము వలనను, జన్మము వలనను భయము లేదు॥ త్రైలోక్యంబునం దున్న సకల ధర్మంబులు చేసినను నది యంతయును లింగార్చనంబు యొక్క సహస్రాంశంబు నైనఁ బోలఁజాలదు॥ బ్రహ్మ విష్ణు మహేశ్వరులును, లోకపాలురును, దేవతలు, విద్యాధరులు, గుహ్యకులు, గంధర్వులు, కిన్నరులు, రాక్షసులు, వసిష్ఠాది మహాఋషులు నెల్ల

నడపునట్టిసారథి యరదమును నడపుచుండఁగా స్యందనంబునఁ గూరుచుండి మహత్తరసేనాసమేతుఁడై రామకృష్ణుల మార్కొనియెను. ఇట్లు పౌరుషమును గనఁబఱుపం బూని రామకృష్ణులం దలపడి ఘోరాహావంబు చేయఁబూని వాయుదేవుఁడు విజృంభించి సూర్యుని మేఘములచేతను, అగ్నిని పరాగముల చేతను గప్పునట్లు తీవ్రనారాచములఁ గప్పెను. ఆబాణములచే గరుడకేతనమున వెలయుచుండు శ్రీకృష్ణుస్యందనము, తాళధ్వజమున గుఱుతింపఁజాలు బలరామునరదంబు నీరెండును గప్పఁబడి కనఁబడవయ్యెను. ఈ మహాసంగరమును జూచువేడుకం బూని మధురానగరకాంతలు గోపురములపై హర్మ్యములపై నట్టలపైఁ గూరుచుండియుండిరి గాన రథములు రెండును గనఁబడకపోఁగా దురంతదుఃఖమునఁ గన్నీరు వదలిరి. క్షణకాలము మూర్ఛల మునింగిరి.

ఇట్లు రామకృష్ణుల బాణములం గప్పి సాయముగా వచ్చియున్న యాదవబలంబులఁ జీకాకు పఱచెను. ఆ మహాకృత్యమునకే యతఁడు గర్వించెను. దాన నాపరమేశ్వరుఁ డాగ్రహించెను. ధనుస్సుఁ గేలనంది తమయాదవసేనలు కుందుటకుం జాలినొంది యాగ్రహించి జ్యాలతఁ గోటికెక్కించి నిశాతనారాచములం గూర్చి జరాసంధునిఁ దద్వీరభటులను నొవ్వఁజేయఁ బూని ప్రయోగించెను. ఆబాణములు కాలదండములం బోలి నలుదెసలంబఱచి సేనలపైఁ బడియెను.ఆబాణములు సోఁకినంతనే కొన్నియేనుంగులకుఁ గుంభస్థలములు బ్రద్దలయ్యెను. కొన్నింటికి దంతములు తెగిపోయెను. మఱియుం గొన్నింటికిఁ దొండములు ఖండితములై ధరఁ బడియెను. హయములలోఁ

ఫలం। సౌభాగ్యం కాంతి మద్రూపం సత్యం త్యాగః సువక్తృతా శౌర్యంచ జగతి ఖ్యాతిశ్శివ పూజా విధేః ఫలం। యోదదాతి గవాం లక్షం దోగ్ధ్రీణాం వేదపారగే। ఏకాహ మర్చయే ల్లింగం తస్య పుణ్యం తతోధికం॥ ఇత్యాది కమనంతం ద్రష్టవ్యం॥ తథా॥ క్రియాసారే॥ భక్త్యా యశ్శివ మర్చయే, దనుదినం లింగే సమాప్నోతి సః। దానానాం తపసాం త్రివిష్టప మహాతీర్థ ప్లుతీనాం ఫలం। పాపాన్యాశు వినాశ్య శంకర గణ శ్రైష్ఠ్యం సమాప్నోత్యసౌ విజ్ఞానాత్పరిహృత్య మోహ మఖిలం జ్ఞానం పరం గచ్ఛతి॥ ఇత్యాది॥ శివారాధన పరాశ్చ క్రియాసారే, వర్ణాశ్రమ ధర్మకాండే, శిష్టాస్సర్వే శివం ప్రపన్నా ఇతి వ్యాసేన ద్రష్టవ్యాః॥

శివారాధనస్య నిత్యత్వం.

ఇదంచ శివారాధనం నిత్యం, తథాహి, జాబాలే॥ నిత్యం త్రిసంధ్యం శివలింగ మభ్యర్చ్యం॥ ఇత్యత్ర నిత్య శబ్ద ఘటిత వచన విషయత్వాత్॥ అకరణే ప్రత్యవాయజనకత్వ జ్ఞాపక నిందాస్మరణాచ్చ॥ తథా చ క్రియాసారే బ్రహ్మకైవర్తే॥ భుంజీత నేశార్చన మప్యకృత్వా భుం

---

గు చుండును॥ సౌభాగ్యమును, కాంతియుక్తమగు రూపము, సత్యము, త్యాగము, వక్తృత్వము, శౌర్యము, కీర్తి యనునది శివపూజవిధి ఫలంబులేయగు॥ పాలు పితుకు లక్షగోవులను వేదమంత్రియుండు జదివిన వానికి దానముచేయఁగాఁగలుగు పుణ్యముకంటె ఒక్కదినమున లింగమును పూజించిన వాని పుణ్యమధికమైనది॥ అనిమొదలుగాఁగలవు॥ ఎవ్వఁడు భక్తితో ననుదినము లింగము నందునను పూజించునో వాఁడు సకల దానములు, సర్వతపములు గంగా స్నానములు చేయఁగా గలుగు ఫలమును పొందును. మఱియు వాఁడు సకలపాప నిర్ముక్తుఁడై జ్ఞానము వలన మోహమును వదలిపెట్టి గణాధీశ్వరత్వము నొందును.

అని క్రియాసారము నందు నున్నది॥ శివారాధనము నెవ్వరు చేసిరని క్రియాసారము నందును, వర్ణాశ్రమ కాండ మందును, శిష్టాస్సర్వే శివం ప్రపన్నా అను వ్యాసము నందును చూడ వలయు॥

శివారాధనము నిత్యము.

త్రికాలముల యందు నిత్యముగా లింగము పూజింప వలయునని జాబాలశాఖ యందు గలదు గాన శివారాధనము నిత్యమని యెఱుంగు నది॥ ఇట్లు నిత్య శబ్దముతో గూ

మూర్చు టొక ప్రఖ్యాతి గాదు. కాని మానవత్వమూనినందున నించుక వర్ణనీయంబని యెఱుంగఁదగు.

తనసైన్యములు ముహూర్తమాత్రమున నశింపఁగాఁ దన రథము భగ్నముకాఁగా వెలవెలఁబోవుచున్న యాజరాసంధుని మించినపూన్కి బలరాముఁడు విక్రమించి త్వరపడి పట్టుకొని వరుణపాశంబులచేతను బెఱత్రాళ్లచేతను బంధింపఁ బూనెను. అంతియగాక వాని విశేషావమానమునకు లోనుగాఁ జేయఁ బ్రయత్నించెను. కాని హరి యాకార్యముల కిది సమయము కాదనియు నూహించి నివారించెను. బలరాముఁడు పట్టుకొని తన్నవమానింపఁ బూనుటయు శ్రీకృష్ణుఁడు విడిపించుటయుఁ దనకు మఱింత యవమతిం గల్పింపఁగాఁ దాను బ్రపంచమున విఖ్యాతబలపరాక్రమవంతుఁ డయ్యును మహావాహినీవంతుఁ డయ్యు నాయిద్దఱు గోపాలబాలకులచే నోడుటకుఁ దనసేన యెల్ల భస్మీభూతమగుటకుం జింతించి మరలి నిజపురంబునకుఁ బోవఁజాలక తపోవనంబున కరుగఁ దలంచెను. తనకు సహాయము చేయవచ్చిన రాజులెల్ల నాతనిం బొడివినిలుచుండి మహారాజా! జరాసంధచక్రవర్తీ! ఈపరాజయంబునకుఁ జింతించెద వేల? కర్మబంధసంప్రాప్తము కదా యివి. దీనికి వగచిన లాభమేమి? దైవగతి యెట్టివారికేని దుర్లంఘ్యము కదా. ఇది నీ యెఱుంగనివిషయమా. అను నీమొదలగు ననేక లౌకికన్యాయదృష్టాంతముల చేత నాతనిచింతఁ బాపిరి.

జరాసంధుఁడు భావికాలప్రచోదితుండౌట వనగమనప్రయత్నమును జాలించి యవమానపరితాపతప్తహృదయుఁ డై యెట్లో యింటికిం బోయెను. శ్రీహరియుఁ దన యాదవబలం

మహాశయులారా! ఈకథయం దొక్క విషయము వ్రాయఁదగినది గలదు. జరాసంధుఁడు విద్వాంసుఁడు. మహా పరాక్రమవంతుఁడు. పెక్కుసంగరముల నరివీరుల జయించిన మేటి. అట్టులయ్యు మధురానగరమును ముట్టడించి విధివశమున నోడిపోయెను. ఇదేసమయమని పెక్కుమందిరాజు లా జరాసంధునకుఁ దోడ్పడిరి. ఇరువదిమూఁడక్షౌహిణులసేన లాతని వశమందు దేహము లర్పింప సంసిద్ధముగా నుండెను. అందఱు పెక్కుసంగరముల నారితేఱినవారలే కాని వేఱుగాదు. ఇట్టు లయ్యుఁ దొలియుద్ధమున నోడిపోయెను. సేనలన్నియు యుద్ధ భూమిని దలలు పోఁగొట్టుకొనియెను. తాఁ బట్టుపడియెను. శ్రీవారి విడిపించెను. ఆయవమానమున నిఁక గిరివ్రజమున కరుగరాదని తలంచి తపోవనమునకుఁ బోవఁ బ్రయత్నించెను. కాని యాకార్యము కొనసాగిన నాతనిమూలమునఁ గావలసిన భూభారహరణకార్యము కాదు. కాఁబట్టి భగవంతుఁ డాలోచించెను. వీఁడుండినఁగాని వీనిని నమ్మి పెక్కుమందిరాజులు యుద్ధమునకు రారు. యుద్ధము సాగినఁగాని యనేకప్రాణులు మృతి నొందరు. అట్లు సాగినఁగాని భూభారము తగ్గదు. కావున జరాసంధునకుఁ బౌరుషమును వృద్ధిచేయవలయునే గాని శాంతమునకుఁ బోటు మది నునుపరాదు. అని యోజించి వానికి సాయమొనరింపవచ్చి యుద్ధముననోడి జీవచ్ఛవములవలెనున్న రాజులందఱకు మత్సరము నెలకొనఁ జేసెను. వారు దాన ముందటికంటె మహారోషపూరితాంతరంగులై కత్తులదూసి యిపుడే బలరామాదియోధులఁ జించి చెండాడఁజాలమాయని పలికిరి. వారిమాటలు జరాసంధున కప్పటికి రుచించెను. తపోవనమున

లింగోచ్ఛ్రాయ సమో పీఠః। పరిధి స్తత్త్రిగుణత స్తద్వ్యాసేతం వ్యవస్థితః ప్రణాళికా తథైవ స్యాత్స్యాచ్చ సూత్ర వినిర్ణయః। అత్రేదం తత్త్వం। లింగ మస్తక విస్తారం లింగోచ్ఛ్రాయ సమం కృత్వా తత్త్రిగుణ సూత్ర వేష్టనార్హం లింగ స్థౌల్యం కృత్వా, తత్సమం వృత్తం చతురశ్రం వా పీఠ విస్తార మధశ్చోర్ధ్వం చ కుర్యాత్॥ పీఠోచ్ఛ్రాయాత్తు లింగోచ్ఛ్రాయో ద్విగుణః। పీఠ మధ్యే లింగా ద్విగుణ స్థూలం పీఠోచ్ఛ్రాయ తృతీయాంశే కంఠం కృత్వా తస్యోర్ధ్వం అధశ్చ సమం వప్రద్వయం త్రయం వా కృత్వా లింగ విస్తారం షష్ఠాంశేన పీఠోపరి బాహ్య మేఖలాం కృత్వా తదంత స్సంలగ్నం తత్సమం ఖాతం కృత్వా పీఠా ద్బహిర్లింగ సమదీర్ఘాం పీఠార్ధ దీర్ఘాం వా మూలే దైర్ఘ్య సమవిస్తారాం తృతీయాంశేన మధ్యే ఖాతాం పీఠ వప్ర మేఖలాం ప్రణాళికాం కుర్యాదితి॥ అత్ర మూలం సిద్ధాంత శేఖరే శైవాగమేచ జ్ఞేయ మితి॥

లక్షణ లోపే దోష ఉక్త శ్శివతత్త్వ సుధానిధౌ। శివాధిక్యే ధవేన్మృత్యు శ్శక్త్యాధిక్యే ధనక్షయః। శివశక్తి సమం లింగం భుక్తి ముక్తి

---

వచ్చునుగదా? అశుచి సమయముల యందు శివపూజ చేయవలెనా?

ఉ॥ ప్రాణములనైన విడువవచ్చును, శిరము నైన నరికించుకొనవచ్చును గాని లింగమునందు పరమేశ్వరుని పూజింపక భుజింపగూడదు. జాతాశౌచము నందు మృతాశౌచము నందును శివపూజను విడువగూడదని నిర్ణయసింధువునందు చెప్పఁబడియున్నదిగాన అశుచి సమయముల యందైన శివపూజ చేయవలసినదే.

ప్ర॥ స్త్రీలు, ఉపనయనము కాని ద్విజులు, శూద్రులును లింగమును తాకగూడదని నిర్ణయసింధువునందు గలదు॥ ఇట్లుండఁగా, స్త్రీలు పూజచేయుటెట్లు?

ఉ॥ స్త్రీలు మొదలగు వారు లింగమును దాకగూడదని చెప్పిన వచనము తమకు స్వాధికారములేని స్థావరలింగము మొదలగుదాని పరముగా గ్రహింపవలయును। ఏలన నిర్ణయసింధువునందే స్త్రీలు మొదలగు వారలకు నాత్మార్థము పూజయందు నధికారము గలదని చెప్పఁబడియున్నది స్త్రీలు మొదలగు వారు లింగమును దాకనేగూడదని యైన వారలకు పూజాధికారమెట్లు యుక్తమగును? నిర్ణయసింధువునందే బ్రాహ్మణులకు క్షత్రియు

యుక్తియుక్తముగఁ దోఁచెను. ఇంతకుముందు శ్రీరామకృష్ణుల దాడి కొక్కనిముసమైన నోర్వనిశూరులఁ దాను గన్నులారఁ గాంచియు మరల వారు గెలుపును దనకుఁ గూర్తురని నమ్మెను. ఇట్లు నమ్మునట్లు చేసినదేది? విధి. విధి బలవత్తరము కదా. దానిని మీఱు నెవ్వరికే నయితిగాదు. దానిత్రిప్పులకు లోఁబడనివాఁ డొక్కభగవంతుఁడే. ప్రపంచముల మఱెవ్వరును లేరని యెఱుంగవలయు. విధియన నేమోయని సంశయింపఁ బనిలేదు. భగవత్సంకల్పమే. ఆసంకల్పమే ప్రకృతియనంబడు. విధియని యుఁ జెప్పంబడు. దానిత్రిప్పులకుఁ ద్రిమూర్తులే లోఁబడుదు రనఁగాఁ దక్కినవారిమాట యిటఁ జెప్పనేటికి? హరిహరులు సంగరమొనరించిరి కదా. అప్పటి శివధనుస్సుగదా జనకచక్రవర్తి యింట నుండెను. వారికేమి పరస్పర మోడింపఁజాలమను జ్ఞానము లేదా. విధిచేష్టను మార్ప శక్యముగాదనువిషయమును మన మెఱుంగవలయును. అట్టిచోట విధిచెయ్వులఁ దప్పించుకొను టెట్లు? తత్పాదారవిందార్చనముచేతనే గాని వేఱు మార్గము లేదు. దీనినే వైష్ణవులు శరణాగతి యందురు. ఈ విషయమే శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారు సౌందర్యలహరి యం దిట్లు తేటపఱచిరి.

" శ్లో. త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవహి చరణావేవ నిపుణౌ.

వ్యా. అయంభావః. హస్తాభ్యామభయవరదానం సర్వసాధారణ మితికృత్వా త్వచ్చరణావేవ తాదృశాభయవరదానే

గృహేశ్వరుఁడు. శ్రీకృష్ణునిఁ బొలియింపనే కోరుచుండువాఁడు. కావునఁ బదునెనిమిదవమాఱు గొప్పదండుతో మథురను ముట్టడింపఁ బ్రయత్నించెను. యాదవు లావృత్తాంతము నెఱింగిరి. జరాసంధునిభయము మనల వదలకున్నదే యని పరితపించిరి. అందఱొక్కచోఁ జేరి యాలోచింపసాగిరి. శ్రీకృష్ణుఁడు బలరామునింగూడి యాసభలో నుండెను. పెద్దపిన్న లటఁ జేరిరి. ముం దొనర్పందగు పనియేమని యూహింపసాగిరి. ఆసభలో మహాతేజుఁడు నీతిశాస్త్రకోవిదుఁడునగు వికద్రువను గోపకుఁడుండెను. ఆయాలోచనల నన్నింటి నాలకించెను. తనకుం దోఁచినభంగి నిట్లు చెప్పఁబూనెను. ఉగ్రసేనుఁడు వినుచుండ శ్రీకృష్ణునితో నిట్లు పలికెను.

గోవిందా! తండ్రీ! యీయదుకులసముత్పత్తివిధ మెఱింగించెద. ఆలకింపుము. అది తెలుపుట కిది తగినకాలము. ఆమీఁద నీకు హితమైనఁ జేయుము. యదువంశ మేకాలమున నెట్లుత్పత్తి యయ్యెనో యెఱింగించెదను. వ్యాసులు జ్ఞానదృష్టి నవలోకించి నాకొక్కపర్యాయము తెలిపెను. ఆవిషయము నే చెప్పెదను. మనువంశము సుప్రసిద్ధము కదా. అది యిక్ష్వాకువంశమను నామమునఁ బరఁగెను. ఇక్ష్వాకుమహారాజునకుఁ గొడుకు గలఁడు. హర్యశ్వుఁడని యాతని నామధేయము. మహేంద్రసమాన విక్రముఁడై విఖ్యాతిని గాంచెను. ఆహర్యశ్వునకుఁ బ్రీతిపాత్రురాలగు భార్య గలదు. ఆమె మధుదానవుని పుత్త్రిక. మధుమతి యని యామె పేరు. ఇంద్రునకు శచీదేవివలె నారాజున కామధుమతి యనువ్రతయై యుండెను. నవయౌవనస్ఫురితయై రూపవతియై భర్తకుఁ బ్రాణతుల్యయై నియతవ్రతయై యుండెను.

సేవకునివలె నిందుండుట మర్యాదగాదు. మనమిరువురము నా తండ్రియింటికిం బోవుదము.

హితములై కాలోచితములై న్యాయసమ్మతములై యున్న యా మధుమతీవాక్యముల కారాజు సమ్మతించి యన్నను రాజ్యమును వదలి మధువనమునకుం బోయెను. భార్యయు మితపరిజనులు వెంటనే పోయిరి. మధుదానవుఁ డల్లునిఁ గూఁతును మిగుల గారవించి వారిరాక కపరిమితానందము నొంది వత్సా! ఆయాసంపడక వచ్చితివిగదా. నిన్నుంజూడ సమ్మోదము మదిఁ గుదురుకొనియెను. మధువన మియ్యదితప్ప నారాజ్యమెల్ల నీకొసంగెదను. అంతఃపురము లిచ్చెదను. స్వేచ్ఛగా నందు నివసింపుము. ఈవనమందు మత్పుత్రకుఁడు లవణాసురుఁ డుండును. వాఁడు నీకెల్లభంగుల సాయపడును. నీవు శత్రునిబర్హణమును గోరినచో నాతఁడు నీకు బాసటయై జయము చేకూర్చును. సముద్రానూపభూములచే నున్నతమై సిరులసొంపారు నీరాజ్యమును బూజ్యభంగిఁ బాలింపుము. ఈనారాజ్యమునందు గోసహస్రములు గలవు. ఆభీరజనులు పిక్కటిల్లుచుందురు. ఐశ్వర్యము సాంద్రమై యుండును. ఈరాజ్యమునకు ముఖ్యనగరము గిరిపురమగును. అది శత్రుదుర్గమము. విశాలసౌధవిరాజితము. అది నివాసము నీకుఁగాఁదగును. ప్రియసుఖముల నొసంగునది. నిరామయము. జలసమృద్ధము. అనేక సాంద్రవనసంశోభితము. ఆనర్తమనుపేరఁ బరఁగునీరాజ్యము నీ కొసంగెదను. కాలయోగమున నీరాజ్యమున నీయధీనము కాఁగలదని నమ్మెదను. పార్థివవృత్తమును వదలక యిందు నివసించి పూజ్యభంగి రాజ్యమేలుము. యయాతిపుత్రునిసంబంధమున నీవంశము యాదవవంశ

రాజ్యలక్షణములు గొఱంతఁగాంచక యుండెను. దినదినాభివృద్ధి నొంది న్యాయైశ్వర్యము లొప్పెను.

ఇట్లుండఁ గొంతకాలము నా మధుమతీదేవి యదువను పేర విఖ్యాతినొందు కుమారునిం గనియె. దుందుభినిస్వనము గల యాయదువు వృద్ధినొందెను. అతని జూచినంతనే బాల్యమునందే పరరాజులు వడఁకుచుందురు. రాజలక్షణములన్నియు నాతనియందుఁ గన్పట్టుచు నుండెను. యయాతికి నీయదువే పుత్రుఁడై యుండునపుడు పూరుఁడనువాఁడు జ్యేష్ఠుఁడై యుండెనో ఈజన్మమున నాతఁడే యీతనికిఁ గొమరుఁడై పుట్టెను. హర్యశ్వుఁడు పదివేలసంవత్సరములు రాజ్యమును బూజ్యభంగిఁ బాలించి యప్రతిముఁడై విఖ్యాతింగాంచి స్వర్గపురము నలంకరించెను. యదువును బ్రజలే పట్టాభిషిక్తుని జేసిరి. యదువు రాజై తస్కరాదిబాధలు లేకయుండ రాజ్యమును బాలించుచు వంశకర్త యయ్యెను. ఈతనికాలమున నీవంశము యాదవవంశమనం బ్రఖ్యాతిం గాంచెను.

ఆయదుభూపాలుఁ డొక్కతరుణమున గుణోదారలగు దారలంగూడి తారకాసహితుఁడగు శశాంకునిచందమున సాగర జలముల జలక్రీడల సల్పెను. అందొక మహాసర్పము నివసించుచుండి యీయదువు నీడ్చుకొనిపోయి సర్పపురమునం జేర్చెను. ఆసర్పపురము పాతాళలోకమందుండి మణిమయ గృహద్వారముల శోభిల్లుచు నుండెను. రత్నరాసు లానగరమున గవ్వలవలె నుండెను. అచ్చటివృక్షములు ప్రవాళచ్ఛాయ గలవి. సదాకుసుమములు ఫలములు వానియం దుండును. వానిశాఖలయం దెల్లయెడల బాలనాగములు వ్రేలాడుచుం

గాక. మనసమయమునకు బద్ధులై సలిలాభ్యంతరమునఁ జరిం పఁగలిగి కామరూపులై వారు నీవంశము నలరింతురు గాక. అని యీవర మనుగ్రహింపుమని కోరి యాతఁ డంగీకరింపఁ గన్యకలను వరమును గైకొని యదుభూపాలుఁడు జలముల నుండి చంద్రునివలె వెడలివచ్చెను. పంచభార్యలనడుమఁ దార కాపంచకాంతరమున నలరు నమృతకిరణునిం బోలి యాతఁడు చూడనొప్పెను. వివాహకాలవేషము వానిం బాయకుండెను. దివ్యాంగరాగము కనఁబడుచు మనోహరముగ నుండెను. తన భార్యలకు వారింజూపి తనపోయివచ్చినవిధ మెఱిఁగింప వా రాపత్నులంగలిసి యాదృతిమై నుండిరి. ఇంచుకంతయు మనః ఖేదమునొందక యుండిరి. అని పలికి వికద్రుపు తరువాతికథను జెప్పఁబూనెను.

మహాశయులారా! ఈకథ విచిత్రముగా గాన్పించును. సముద్రోదకములందు జలక్రీడలుసల్పుట విచిత్రము గాదు. రాజులకుఁ బెక్కండ్రుపత్నులుండుటయు విచిత్రము గాదు. ఆసమయమున రాజును ఘోరజలసర్పము పట్టుకొనుటయుఁ జిత్రము గాదు. ఆ పట్టుకొనినపాము యదువును సర్పపురము నకుం గొంపోవుటయు నందొకసర్పరాజు సింహాసనాసీనుఁడై యుండి యాదృతిసంభాషించి వరమొసఁగి మనుష్యుఁడగు యదు వునకుఁ దనపుత్రికాపంచకము నొసంగి పంపుటమాత్ర మబ్బుర ముగాఁ దోఁచును. సర్పలోకమునకుం బోయినపుడు యదువు నొక్కపామైనఁ గఱవకుండుటయు నాశ్చర్యమును గొలుపు విషయమే. ఆపాములకు విషము లేదందుమా పురాణములు పెక్కులు గరళజ్వాలలఁ గ్రక్కుచుండుసర్పములు పాతాళ

గము కేవలకల్పితము. వ్యవహారార్థము కల్పింపఁ బడినది. కావునఁ గాలము హేతువు కాదు. కాలరూపుఁడగు భగవంతుఁడే కారణమన్న శిరసావహించెదను.

మానవులకు స్వర్గపాతాళవాసులతో సంగతి గలదని యంగీకరింపకతప్పదు. రాకపోకలుండెను. అన్నియుఁ గల్పితములన వీలులేదు. ఇపుడిపుడు ఖగోళవాసులతో మాటలాడువారును, బ్రయత్నించువారును, యంత్రముల సిద్ధముచేయుచుండువారును గలరు కదా. యంత్రములద్వారా కాక తపోబలమున నాకాలమున రాకపోకలు సాగుచుండెను. సర్పములు కామరూపములు సృష్ట్యాదియందు రూపములు సంకీర్ణములుగ నుండునని పురాణములు చెప్పుచున్నది. అధోభాగము సర్పాకారము. ఊర్ధ్వభాగము మానవాకృతి. ఇది పాతాళవాసులయందు మర్యాదగ నుండెను. గుఱ్ఱములకు ఱెక్కలుండెను. ఇప్పుడు లేవేల? అనుప్రశ్న మసంగతము. పక్షిమర్యాద గుఱ్ఱములయం దుండెను. ఇప్పుడు శుకములు గోరపక్షులు మనుష్యులవలె మాటలాడుట ప్రాచీనసృష్టిమర్యాదలో మిగిలియున్నదని యెఱుంగవచ్చును. అన్నిపక్షుల కాయలవాటుండెనేమోయన్న లేదని సిద్ధాంతముచేయ నవకాశము లేదు. ఆయలవాటు క్రమముగా నశించి బీజరూపముగాఁ గొన్నిజాతులపక్షులయం దున్నదన్నది యుక్తియుక్తము. ఏదేశపుగుఱ్ఱము లాదేశభాషతోఁ జెప్పినవిషయముల గ్రహించుచున్నవి కదా. ఇట్లే యన్నియునని మన మూహింపవచ్చును. మనకున్న యల్పజ్ఞానమునఁ బెక్కువేల హాయనములనాఁటివార్త లసత్యములనుట వింతకదా. అట్టి సాహసకార్యమునకుఁ బూనరాదు.

సంన్యా పారంపర్య క్రమాగతా। ఉత్తమా సాతు విజ్ఞేయా గురు దత్తాపి తత్సమా॥ ఇతి గురు దత్తానాం ప్రతిమా సాలగ్రామాదీనామపి సర్వోత్తమత్వం వ్యవస్థాపితం॥

శివపూజా పరికర సంపాదన విధిః.

అథ కర్తా స్నాతో ధృత ధౌతాంబరో నిర్వర్తిత నిఖిల నిత్య కృత్యః శివపూజా గారం ప్రవిశ్య శివారాధన యోగ్యతా సిద్ధ్యర్థం భావ స్నానం భస్మ స్నానంచ విధాయ ధృత భస్మ త్రిపుండ్ర రుద్రాక్షాభరణో భూశుద్ధ్యాది శ్రీకంఠ మాతృకా న్యాసాంతం విన్యస్య సకలీకరణం కుర్యాత్॥

ఆచమ్య హుం ఫడంతాస్త్రేణ దక్షిణ పాదాంగుష్ఠోద్గతేన వహ్నినా దేహగత బాహ్యమల మాత్రం దగ్ధం విచింత్య వహ్ని సంబంధ క్షుభిత బిందుస్థాన స్థిత శక్తి మండల స్రవదమృత ప్రవాహేణ శరీర మాప్లావయేత్॥ అథ మనసా మూల మంత్రం నాదాంత ముచ్చరన్నేవ తత్సంపర్క క్షుభిత శక్తి పరిశుద్ధ బహుళామృత ప్రవాహే

---

న్న తక్కువయు. అంగుళముకన్న నెక్కువయు కానిదై పంచసూత్ర ఘటితమైన లింగమును ధరింపవలయునని మకుటోత్తరమునందున్నది. మరియు, గురుదత్తమైన యిష్టలింగము, విగ్రహము మొదలగు వాని యందు లక్షణము పరీక్షింపఁ గూడదని యున్నది. కావున, గురుదత్తమైన విగ్రహము, సాలగ్రామము మొదలగు వాని యందును లక్షణము పరీక్షింపఁ గూడదని విజ్ఞాన సింధు వునందును గలదు. దీనిబట్టి, గురుదత్తమైన యిష్టలింగము సర్వోత్తమము గాన దానికి లక్షణ పరీక్షణ మావశ్యకము గాదని యెఱుంగునది.

కర్తయగు వాఁడు స్నానముచేసి యుదికినవస్త్రములు ధరించి, నిత్యకృత్యములు తీర్చుకొని, శివపూజాగృహము ప్రవేశించి, శివారాధన యోగ్యత సిద్ధించుటకై భావస్నానము, భస్మస్నానమును చేసి భస్మరుద్రాక్షముల ధరించి, భూశుద్ధి మొదలుకొని శ్రీకంఠ మాతృకాన్యాసముదనుక న్యసించుకొని సకలీకరణము చేయవలయును.

భావస్నానమెట్లనఁ, ఆచమనము చేసి, అస్త్రమను హుం ఫట్ అని పలికి కుడికాలి బొటనవ్రేలినుండి పుట్టిన యగ్ని జ్వాలచేత దేహము మీఁదనున్న మాలిన్యమంతయుఁ గాలిపోయి

కుంట మున్నున్నపద్ధతి. తనకు లేనిశక్తిని గ్రియారూపమునఁ దెలుప వలనుపడదుగాన వాగ్రూపమునఁ దెలుపుట యిప్పటి వారి పద్ధతి. ఖేచరమార్గమున నెందేనరుగుట పూర్వకాలయోగుల సామర్థ్యము. ధూమశకటమునందో నౌకయందో విమానమునందో మర్యాదాస్థానమునఁ గూరుచుండి యరుగు టిప్పటి యోగుల సామర్థ్యము. శాపానుగ్రహఫల మొనఁగూర్చుట పూర్వమహర్షుల మనశ్శక్తి. వార్తాపత్రికలయందుఁ దనభావమును వ్రాయు టిప్పటిమహర్షుల మనశ్శక్తి. త్రిలోకములయందెందున్న వస్తువునైనను గనుఁగొనుట ముందున్న మహాత్ముల నైజము. ప్రత్యక్షవస్తువుల యంత్రసహాయమునఁ దెలిసికొను టిప్పటిమహాత్ముల నైజము. భగవంతుఁడు ప్రత్యక్షమైనను జెప్పుకొనకయుండుట ప్రాక్కాలిక సజ్జనాచారము. భగవంతుఁడు దేవాలయముల శిలారూపమునఁ బ్రత్యక్షముకాఁగా నాయెదుట సాక్షాత్కరించెనని నలువురతోఁ జెప్పుట యిప్పటి సజ్జనులయాచారము. వ్యర్థముగా ధనవ్యయము చేయక మంత్రతంత్రముల యథాక్రమముగా వివాహాదిసంస్కారముల నొనర్చుట పూర్వాచారము. వ్యర్థముగా ధనవ్యయము చేసి మంత్రతంత్రముల యథాక్రమముగా వివాహాదిసంస్కారములఁ దగ్గించు టిప్పటియాచారము. సర్వకర్మముల బ్రహ్మార్పణము చేయుట ముందటివారి స్వభావము. సర్వకర్మముల నాత్మార్పణము చేసికొను టిప్పటివారి స్వభావము. తాఁ జేసినదాన మితరులకుం దెల్పకుండుట పూర్వస్వభావము. తాఁ జేసినదానము గోరంత కొండంతలు చేసి వార్తాపత్రికలమూలమున నెల్లరకుం దెల్పు టిప్పటి కాలస్వభావము. ఆత్మస్తుతి పాపమనుట ముందటి

ఇట్టియుదాహరణము లెన్నియో చూపి సృష్టిపద్ధతి యిట్టిదని యెఱుంగ శక్యముకాదని చెప్పవచ్చును. ఒకరు నమ్మినను నమ్మకున్నను నా కక్కఱ లేదు.సత్యము చెప్పఁబూనిన సృష్టిచమత్కృతి నిదమిత్థమ్మని నిర్ణయింపఁ జాలమని చెప్పక తప్పదు. కాఁబట్టి యీ గాథయందు నమ్మఁదగనివిషయము లేదని తెలిపి యీభాగము నింకను బెంచి వ్రాయక తరువాతికథను వ్రాయుచున్నాఁడను.

## ముచుకుందాదుల యుత్పత్తి.

ఆయదుభూపాలుఁ డా నాగకన్యలయం దైదుగురి యందు నైదుగురను గొడుకులను వంశోద్ధారకులను బడసెను. ముచుకుందుఁడు, పద్మవర్ణుఁడు, మాధవుఁడు, సారసుఁడు, హరితుఁడని వారిపేరులు. వీరెల్లఁ బంచమహాభూతములకు సరియనఁదగినవారు. వారింజూచి రాజు పరమానందభరితుఁ డయ్యెను. వారు సంప్రాప్తయౌవనులై పర్వతములం బోలి ధైర్యముగలవారలై యుండిరి. బలదర్పముల వెలయుచు వా రొక్కనాఁడు తండ్రికడ కేగి యిట్లు ప్రశ్నించిరి. తండ్రీ! వయస్స్ఫురితుల మైతిమి. మహాబలముగలవార మైతిమి. మే మేమిచేయఁదగునో యాజ్ఞాపింపుము. అన వినియదుమహీపాలుఁడు బెబ్బులులంబోలి కార్యమునకై త్వరపడుచున్న కొడుకులం గాంచి కుతూహలమున నిట్లు లాజ్ఞాపించెను. నాకొడుకగు ముచుకుందుఁడు విద్యర్క్షవంతములను పర్వతముల నావరించి రెండునగరముల నిర్మించి యందుండఁ దగును. సహ్యపర్వతోర్ధ్వభాగమునఁ బద్మవర్ణుఁడను కుమా

* ఈభాగము హరివంశాంతర్గత విష్ణుపర్వము ముప్పదియెనిమిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడెనని యెఱుంగునది.

య పూర్వకం శివ లోక ప్రాప్తి ర్భవతి। మధు స్నపనేన వహ్ని లోక ప్రాప్తి ర్భవతి॥ కర్పూరాగరు తోయేన శివ పద ప్రాప్తి రిత్యాది ద్ర ష్టవ్యం॥

గంధ సంపాదన విధిః క్రియాసారే నిగదితో యథా॥ తత్ర గంధోహి మలయజ ఘృష్ట సమభాగ రోచన కుంకుమ చంద నైలకర్పూర కృష్ణాగరు దారు కుష్ఠ కస్తూరికా క్షోదో వా, సమ భాగ చందనాగరు కుష్ఠ కర్పూరకుంకుమ పత్ర జలోశీర క్షోదో వా, సమ భాగేనత ద్ధేనవా కర్పూరేణ యుక్త శ్చంద నాగరు కుంకుమ క్షోదో వా సమ భాగ చందన కర్పూర మృగ మద క్షోదో వా ఫలస్య నిమ్న ప్రమాణాంశో యథా సంభవ మాత్రేణ కర్పూరాది యుక్త శ్చందన క్షోదో వా, కేవల బిల్వ ఖండ క్షోదో వా కేవల కృతమాల ఖండ క్షోదో వా, సర్వ ఏతే గంధా శ్శివస్యాతి ప్రీతి కరాః॥ కేవలజల ఘృష్ట దేవ దారు గంధోపి కల్ప పర్యంతం శివలోక ప్రాప్తి కరః॥ కేవల బిల్వ గంధో ష్యత్ర మహోత్స్వ ర్యి పదా యుకః॥ పరత్ర శివ పద ప్రాప్తి కరశ్చ॥

నరది చూచి గ్రహింప వలయును॥

జలాభిషేకాదుల వలన ఫలము క్రియాసారమున నిట్లు చెప్పబడి యున్నది. శివలింగమునకు జలముతో నభిషేకము సేయుగా కల్పకోటి సహస్రజన్మముల నుండి సంపాదింపబడియున్న పాపమంతయు నశించును. ఒక్కనెల గోఘృతముతో నభిషేకము సేయ గా, ఇరువది యొక్క తరము వారితోఁగూడ కైలాసప్రాప్తి సంభవించును. గోక్షీరము తో నభిషేకము సేయు నెడ నలంకరించిన పదివేల గోవుల దానము చేయుగా గలుగు ఫలములభించును.

ఆవు పెరుగుతో నభిషేకము చేయగా సకల పాపములు నశించి శివలోక ప్రాప్తి లభించును. తేనెతో నభిషేకము సేయు నెడ నగ్నిలోక ప్రాప్తి గలుగును. కర్పూరాగరు జలముతో నభిషేకము చేయు నెడ శివలోక ప్రాప్తి గలుగును.

గంధము నెట్లు తయారు చేసికొనవలయునదియు నందుగలదు. మంచి గంధమునకు సమాభాగము గోరోజనము, కుంకుమపువ్వు, ఏలకులు, పచ్చకర్పూరము, కృష్ణాగరు, దేవదారు, చంగల్ కోష్టు, కస్తూరి వీని చూర్ణము గలిపినదిగాని, మంచిగంధము, అగరు, చంగల్ కోష్టు, పచ్చకర్పూరము, కుంకుమ పువ్వు, పట్టె వేళ్ళు, వీనన్నిటిని సమభాగ

రెండుపర్వతముల నడుమ నానగరము రిపుభయంకరమై సకల సుఖాకరమై యొప్పెను. ఋక్షవంతముచెంత వేఱొకనగరమును నిర్మించెను. పురి కానగరమని దానికిఁ బేరిడెను.

ఇట్లు రెండుపురముల నిర్మించి వానిని ధర్మమునఁ బాలించుచు నుండెను. పద్మవర్ణుఁడు తండ్రియనుమతి ననుసరించి సహ్యపర్వత పృష్ఠభాగమున వేగవతీనదీతీరమున సకల తరులతానిబిడమగుతావున నగరము నిర్మించెను. తనరాష్ట్ర మల్పమని యెఱింగి తదనుగుణముగా నగరనిర్మాణ మొనర్చెను. ఆరాష్ట్రము పద్మావతమనియు నానగరము కరవీరమనియుఁ బ్రఖ్యాతిం గాంచెను. సారసుఁడును గ్రౌంచనగరమును దండ్రియానతి మేఱకు నిర్మించెను. ఆనగరము తామ్రమృత్తికగల భూమిపై నిర్మింపఁ బడియెను. చంపకాశోకాది భూరుహములు చుట్టును బలసియుండెను. వనబహుళంబగుట వనవాసిజనపదంబన నది ప్రఖ్యాతంబయ్యె. ఆరాష్ట్రమునం దెల్లతావుల సర్వర్తుకుసుమ ఫలములు సర్వకాలముండునట్లు రాజు నిర్మించెను. హరితుఁడను యదుపుత్త్రుఁడు పితృనాజ్ఞఁ దలందాల్చి సముద్రమునడుమ విరాజిల్లు నాద్వీపమును బాలించెను. ఆభాగము నవరత్నస్ఫీతము. నారీజనమనోహరము. ఆతనిసేవకులు దాశనామమునం బరఁగుదురు. వారు నీటమునిఁగి చాలకాలముండి బయలుపడఁగలరు. వారివంశము మద్గురమునం బరఁగెను. సముద్రమునడుమనుండు శంఖములఁ దీయుట వారికి వృత్తి. మఱియు నందుఁగొందఱు ప్రవాళాంజనసంభవములగు నమూల్యవస్తువులను దీయుదురు. సువర్ణము నాద్వీపమున దొరకును. మౌక్తికములు సమృద్ధములై యుండును. జలములఁ గన్పడురత్నజాతు లాద్వీపమున

ఏవం కాల విశేషేణ సంధ్యా పర్ణ ప్రియా సర్వ శ్వేతార్క శ్వేత కమల పలాశ పున్నాగ మాలతీ మల్లికా రక్తాగస్త్య బకుళ లక్ష్మీ వికర్ణి వేదికా పాటలా శోక కదళీ శంఖినీ పుష్పాణి ప్రాతః కాల పూజాయాం ప్రశస్తాని॥ ద్రోణ కరవీర కృతమాల దుత్తూర వృక్షి బృహతీ పాటల కమలోత్పల చంపక కురంటి పుష్పాణి మధ్యాహ్న పూజాదిరాం ప్రశస్తాని। చంపక మాలతి కావేదికా వకుల కర్ణి మహా భద్రా భద్రా మహాసల్యా తులసీ శమీ శంఖ పుష్పాణి గంధ ఫలం చ సాయం పూజాయాం ప్రశస్తాని॥ జాతి నీలోత్పల కదంబ స్థల కమల పున్నాగ నాగ దంతీ పుష్పాణి హ్రీబేర బిల్వ ఫలం చార్ధరాత్ర పూజాయాం కనక కదంబ జాతి పుష్పాణి, రాత్రావేవ సమర్పణీయాని॥

మాధవీ ఆనందయూధికా మదయంతికా శిరీష సర్జక బంధూక విభీతక కుందదీప్త దాడిమ లాంగలీ శ్రీకర్ణికా కార్పాస నింబ కూష్మాండ శాల్మలీ శిగ్రు మత్స్యాక్షి కపిత్థ తింత్రిణీ పుష్పాణ్యేతాని వర్జనీయాని॥ కేతకీ నిషేధోఽర్ధరాత్రి వ్యతిరిక్త విషయః। కదంబ శిరీషయో ర్రా

---

ఎర్రనివి రాజసములు గాన భోగము నొసగును పచ్చనివి మిశ్రములు గాన భోగ మోక్షముల నొసగునవి సర్వకార్యసిద్ధి ప్రదములును పుత్రపౌత్రాభివృద్ధి కరములుగా నగును. నల్లగలువ తక్క నల్లనివి తామసములు గాన శివపూజకు నుపయోగింపవు వీనిలో తెలుపు ఎరుపు పసుపునను సన్నిరంగులు గల పూవులతో బూజించుట యుత్తమము నల్లకలువలన్నిటిలో నుత్తమమని కొన్ని యాగమముల యందును గన్నేరు ముఖ్యమని కొన్నిచోట్లను బకపుష్ప మధికమని కొన్నిచోట్లను గిరిపుష్పము శ్రేయమని కొన్నిచోట్లను గలదు పద్మము సర్వోత్తమమని కొందరెంచిరి.

వీనిలో కొన్ని కాలవిశేషమున నుపయోగించుట ఎట్లన.

సంధ్యవర్ణము ప్రియావర్తము తెల్ల జిల్లేడు శ్వేతకమలము మోదుగు పున్నాగము జాజి ఎఱ్ఱగన్నేరు పొగడ బిల్వపుష్పము వికర్ణ పాటలము అశోకము శంఖపుష్ప అనునవి ప్రాతః కాల పూజయందు నుత్తమములు తుమ్మి గన్నేరు నల్లయుమ్మెత్త పాటలము కమలము కలువ సంపెంగ అనునవి మధ్యాహ్న పూజకు ముఖ్యములు సంపెంగ జాజి అగిసె శంఖపుష్ప గంధ ఫలము మొదలైనవి సాయంకాల పూజకు నుత్తమములు జాజి నల్లకలు

యుఁడు కుశుఁడు రాజ్యమును బాలింపఁగా లప్పుడనునాతని యనుజన్ముఁడు యువరాజుగ నుండుతఱి భీమునికుమారుఁడగు నంధకుఁడు రాజ్యమును బాలించెను. ఆ యంధకునికుమారుఁడు రైవతుఁడు. ఋక్షుఁడు రైవతతనయుఁడు. పర్వతమూర్ధమున రైవతుఁడు పుట్టినకతమున నాపర్వతము రైవత పర్వతమనుప్రఖ్యాతి నొందెను. ఆ రైవతునికొడుకులలో విశ్వగర్భుఁ డనువాఁడు మహాయశమును గాంచెను. ఆతఁడే రాజ్యమునుబాలింప సమర్థుఁ డయ్యెను. ఆవిశ్వగర్భునకు దేవతాకాంతలఁ దిరస్కరించు రూపలావణ్యములుగల మువ్వురు భార్య లుండిరి. ఆముప్పురు నల్వురుకొడుకులం గాంచిరి. ఆకుమారులందఱు దిక్పాలకులకు సీడని చెప్పఁదగినవారు. వసువు, బభ్రువు, సుషేణుఁడు, సభాక్షుఁడు అని వారిపేరులు. వీరందఱు యాదవులనియే పిల్వఁబడిరి. వీరి నల్వురచేత నీయదు వంశము విస్తృతింగాంచ నొనర్పఁబడినది. వీరిపుత్రపౌత్రులం బెంచుకొని పెక్కుమందిరాజులు ప్రజావంతు లైరి.

కుంతివిషయమున వసువనురాజునకు వసుదేవుఁడు కుమారుఁ డయ్యెను. కుంతియు సుప్రభయనియు నిర్వురుకుమారికలు గల్గిరి. కుంతి పాండురాజునకుఁ బత్నియయ్యెను. ఆయమ భూమిందిరుగు దేవకాంతయే యనవలయు చేదిరాజగు దమఘోషునకు సుప్రభ భార్యయయ్యెను. శ్రీకృష్ణా! నీవంశ చరిత్ర మీవిధమునఁ జెప్పితిని. నీకెట్లు తెలియునందు వేమో పూర్వము శ్రీకృష్ణద్వైపాయనుఁడు నాకుం దెల్పెను. వంశోద్ధారకా! యీయదువంశము భూమియందు నష్టప్రాయమైనది. దీనిని బ్రహ్మదేవునింబోలి యుద్ధరింపుము. శత్రుబాధలం దొలఁ

కోల కురంట గిరి కర్ణికా ద్వయ రుద్ర పర్ణీ భూత పద్మ హ్రీంబేర ద మన మరువక ద్రోణ సింధు వార శంఖినీ గోక్షుర వకుళ కృత మాలాది పత్రాణి ప్రశస్తాని॥ పుష్పేషు నీలోత్పల పద్మ పత్రేషు బిల్వ పత్రం ప్రశస్తతమం ఆరగ్వధ ద్రోణ ద్వయం ప్రశస్త తమం॥ యేషాం పుష్పాణి ప్రశస్తాని తేషాం పత్రాణ్యపి ప్రశస్తానీత్యేవ॥ ఏవం పుష్పపత్రేషు యత్కించిత్పత్ర పుష్పాకారం సౌవర్ణం పత్ర పుష్పం సంపాద్య, అష్టోత్తర శతే నైకాశీత్యా పంచాశతా, పంచ వింశత్యా వా సువర్ణ పుష్పైః ప్రతి దిన మర్చనం చాసంఖ్యేయ ఫలం। స్వర్ణ పుష్పసంపాదనా శక్తౌ సువర్ణ శకలైర్వా రజత పుష్పైర్వార్చనీయం॥ స్వర్ణ పుష్పస్య నాస్తి నిర్మాల్య దోషః। పత్రాణి పుష్పాణిచ స్వారామ సంభవాన్యుత్తమాని॥ యాని క్రీతాని పరారామోద్భవాని పూజాకాలే యాచితాని పుష్పాణి ఉత్తరోత్తర మపకృష్టాని॥ ఘనారామోద్భవాని తు వర్జ్యాని। ఇతి॥

బిల్వార్చన మపి నిత్యం॥ తదుక్తం॥ శివతత్త్వ సుధానిధౌ॥ యో

---

మారేడు పత్రి రేలపత్రి దర్భ ఉత్తరేను మొదలయినవి॥ ప్రతిదినము పతితులను జూచుట భాషించుట తాకుట మొదలగువాని వలన గలుగు దోషము నడచునని గాన నుత్తమములయినవి. పూవులలో నల్లగలువవోలె పత్రములలో మారేడుపత్రి పూజకు నతి ప్రశస్తమైనది. రేల తుమ్మిపూవులును నత్యుత్తమములు.

ఏనిపూవులు శ్రేష్ఠములో వాని పత్రములును శ్రేష్ఠములగును. ఏదోయొకటియగు పుష్పపత్రి రూపముతో సువర్ణ పుష్పములు సువర్ణ పత్రములు చేయించుకొని అట్టి వానితో నూటయెనిమిదింటి చేత గాని ఎనుబది ఏబది ఇరువదియైదు సంఖ్యగల వాని చేత గాని ప్రతిదినము పూజించుట యుత్తమమగును. సువర్ణ పుష్పములు చేయించుకొన జాలనివారు సువర్ణశకలములతో గాని వెండి పూవులతో గాని పూజింపవగును. సువర్ణపుష్పములకు నిర్మాల్యదోషములేదు. ఒకసారి పూజించినవి యింకొకసారి పూజింప గూడును దోషములేదు. తన తోటలోని పత్రి పుష్పాదులుత్తమములు, కొన్నవి ఇతరులతోటలోనివి, పూజాకాలమున యాచించి గ్రహించినవి ఒకదానికన్న నొకటి హీనములైనవి. ఘనతో ద్యానములోనివి కూడవు.

బిల్వార్చనయును నిత్యమే యగును, బిల్వపత్రములతో శివుని పూజింపనున్న విశేష

చెడినది. కావున నిపు డేది కర్తవ్యమని తోఁచునో యాపని చేయుము. రాజ్యకాంక్షగలరాజులచే వంచింపఁబడితిమి. జరాసంధభయార్తులమై రాజ్యక్షోభమున వగలఁబొగిలి నగరజనులు మమ్ము భీతులనినిందింపఁ గడుఁగుందియున్న మ మ్ముద్ధరింపుము. శ్రీకేశవా! యాదవులపై రాజులకెల్ల విరోధము కలదు. కావున వీరినడుమఁ జిక్కుపడితిమి. నీయందున్న విశ్వాసముచే నా మతమిదియని విన్నవించితిని. మరలమరల విన్నవింపఁబని లేదు. ఇందు నేపని యెట్లుచేయశక్యమో యాపని యట్లు చేయవలయును. ఈసేన నీవునడుప నడుచును. మేమెల్ల నీప్రాపున నుండఁ దగువారము. ఈవిరోధము నీమూలమునఁ గలిగినది. నిన్నుఁ గాపాడుకొనుచు మమ్ముఁ గాపాడుము. నాయీ మాటలకు క్షమింపుము. అని పలికి యూరకుండెను.

ఆర్యులారా! ఈచరిత్రమునుండి విశేషాంశములు నేర్చుకొనఁదగినవి లేవుగాని విచిత్రాంశ మొక్కఁడు గలదు. దానిని బరిశీలించుటం జేసి ప్రాచీనకాలమున దేశమర్యాద లెట్లున్న వనునది విశదమగును. అది యెఱుంగుటయు ముఖ్యమే. అదేదనఁగా వినుఁడు. యదువు తన తనయులకు బ్రదుకుమార్గము చూపవలసి యుండెను. సంప్రాప్తయౌవను లగుకొడుకులు తండ్రి నింగాంచి యొక్కనాఁడిక మేమెట్లు జీవింపవలయునో ఆజ్ఞాపింపుమా యని ప్రార్థించిరి. తండ్రియుఁ బరమానందభరితుఁ డయ్యెను. లోకమున మనుజునకు సుఖ మాఱువిధములుగాఁ గలుగును. వేఱుమార్గమునఁ గలిగినది సుఖమే కాదు.

"శ్లో. అర్థాగమో నిత్యమరోగతా చ
ప్రియాచ భార్యా ప్రియవాదినీ చ,

చక్కఁగ నెఱుంగుదురు. పర్వతప్రాంతములనుండుట వారి కెక్కువ మక్కువ. అందు నివసించిన నారోగ్యమును గల్గించు గాలియు సారవంతములగు నాహారపదార్థములు లభించునని యు వానిచే నాయువు పెరుఁగుననియు వారివిశ్వాసము. జల సమృద్ధికిఁ గొఱఁతయుండదనియు వర్షము లధికముగాఁ గురి యుననియు వా రెఱుంగుదురు. గోధనము పూర్వుల కెక్కువ. గోక్షీరములఁ ద్రాగుచుండెడివారు. భూలోకామృతమని యా వుపాలకుఁ బేరు. క్రొత్తఁగాఁ దీసినపాలకుఁ బీయూషమని పేరు గలదు. పాలుకాచి త్రాగుటకన్న నురుగాఱనిపాలు త్రాగుట మేలనియు రోగములు నశించుననియు వా రెఱుంగు దురు. ధారోష్ణములని వానింబిలుచుట విన్నారము కదా. అట్టిక్షీ రములు ధేనువులు చక్కఁని పచ్చికమేసిననే యొదవును. అందుల కరణ్యప్రాంతముల నివసించుట మంచిదని వా రూహించిరి. అడ వులఁ బెంచిన వర్షమునకుఁ గొఱంత లేకుండుటగాక యందున్న యమూల్యపదార్థములు లభించునని ప్రాకాలికజనుల యాశ యము. అట్టియాశయము లికాలమున నశించి నగరవాస ముత్తమోత్తమమని భావించుచున్నారు. స్వభావసౌందర్యము పర్వతములయందుఁ గలదుగాని మఱెందుగలదు? అట్టివిశేష ములం జూచుభాగ్యము గల్గుట సామాన్యమా? మఱియుఁ బర్వతములయందు మహర్షులుందురు. వారిదర్శనము సకలవిధ ముల జ్ఞానదాయకము. వారు లోకుల కుపకరింపఁ దిరుగుట కలదు. వారిదర్శనము పరమపురుషార్థ మీఁజాలునని నమ్మువా రెక్కుడుసంఖ్యగలవా రుండిరి. ఇపుడు వారు కనఁబడక తిరు గుచున్నవారు. లోకవృత్తమును దిలకించుచున్నవారు. ఎవరై

ణా పామకం॥ చందనాగరు కస్తూరీ ముస్తా సింహక చూర్ణసమ్మితః ఖ్యం॥ తక్కోల పూగ కర్పూర జాతీ ఫల లవంగ చూర్ణైః సుగంధాఖ్యం॥ ఏవమాది కృత్రిక ప్రాకృక్ నామ్నా ప్రసిద్ధాని ధూప ప్రత్యేకే త్యాదినా నిరూప్య, తత్ర కేవల గుగ్గులు ధూప స్సప్త జన్మ కృత పాప హారః। చందన ధూప స్సర్వ పాప హారః। సౌగంధిక ధూప స్సర్వ కామార్థ సాధకః॥ కృష్ణాగరు ధూప స్సర్వ పాప హారః। శ్వేతాగరు ధూపో ముక్తి ప్రదః॥ లక్షా కస్తూరీ ధూప శ్చతుర్వేదాధ్యాయి బ్రాహ్మ జన్మ ప్రదః॥ ఘృత మిశ్ర గుగ్గులు ధూపో మాసార్ధ సమర్పితః కల్పకోటి సహస్ర సగ్గపర్యన్తం శివపుర భోగస్య, సార్వభౌమ జన్మనశ్చ ప్రదః॥ సహస్ర ఫల మహిషాక్షు గుగ్గులు ధూప స్తమాలస్పృక్ చూర్ణేన సహిత శ్శివ సాయుజ్య ప్రదాయక ఇత్యాదిచ॥

దీపోప యుక్త మాజ్యాని కథ్యన్తే తన్త్రే॥ కపిలా ఘృత ముత్తమం॥ గవాంతర ఘృతం మధ్యమం। అజాఘృతం తిల తైల మధమం॥ ఉష్ట్ర మహిష్యాది ఘృత, వృక్ష బీజ ప్రభవాది తైలంచ వర్జ్య

చందనపుదూరా, అగరు, కర్పూరము, సింహకము, ప్రాకసము చంగల్ కోష్టు, తుంగముస్తెలు, వీనిచూర్ణముతో విజయమనునది చేయ్చునెడ కర్పూర కల్యాణమను పేరు గలదియగును॥ చందనము, అగరు, కస్తూరి, తుంగముస్తెలు, సింహకము, వీనిచూర్ణము అమృతము నుపేరు గలదియగును॥ తక్కోలాలు, పోకలు, కర్పూరము, జాజికాయ. లవంగములు వీనిచూర్ణమునకు సుగంధమని పేరు.

కేవలము మహిషాక్షి యొక్క ధూపము ఏడుజన్మముల నుండి చేసిన పాపమును పోగొట్టును, మంచిగంధపు చూర్ణధూపము సర్వపాపముల నణుచును. సౌగంధికధూపము సర్వకామార్థముల నొసంగును. కృష్ణాగరుధూపము సర్వపాపముల హరించును. శ్వేతాగరు ధూపము ముక్తి నొసంగును. లక్క, కస్తూరి వీనిధూపము నాల్గు వేదములు చద్విన బ్రాహ్మణజన్మము నొసంగును. నేతితో గూడిన మహిషాక్షిధూపము పదునైదు దినములు చేయునెడ వేయికోట్ల కల్పములవరకు కైలాస సౌఖ్యమును సార్వభౌమ జన్మము నొసంగును॥ మహిషాక్షి గుగ్గులును తమాల చూర్ణము తో గలిపి ధూపము చేయునెడ శివసాయుజ్యము నొసంగు నని యిట్లు క్రమాపాయము వంటి గలవు

దీపమునకు నుపయోగించు ఘృతాదులు నందె యిట్లు చెప్పబడియున్నవి. కపిల

చున్నవి. భగవద్భక్తి యుపన్యాసములయందు నర్తనము చేయు చున్నది. కంఠపాఠములు చేసినవిషయము లుపన్యసింపఁబడు చున్నది. సభలలో భక్తుల మనిపించుకొన నెందఱో ప్రయ త్నించుచున్నారు. కొందఱు ప్రయత్నింపఁ బూనుచున్నవారు. ఇంకను గొందఱు ప్రయత్నింతమా వలదా యని యాలోచిం చుచున్నారు. మీరు ప్రయత్నించిన మేము తోడ్పడుదుమని మఱికొందఱు వాగ్దానము చేయుచున్నారు.

మహాశయులారా! కాలమెట్లు మాఱుచున్నదో పరి కింపుఁడు. ధర్మము లెట్లున్నవో యూహింపుఁడు. ధర్మము నను సరించి వర్షములు లోనగునవి యెట్లు లోకుల కుపకరించుచు న్నవో తలంపుఁడు. మనుష్యులయాయుస్సు వరుసగా నెట్లుతగ్గు చున్నదో చింతింపుఁడు. రోగములు క్రొత్తక్రొత్తపేరుల నెట్లు చెలరేఁగుచున్నవో పరీక్షింపుఁడు. ఆహారనియమ మెంతపాడై నదో చూడుఁడు. యోగాభ్యాసము శశవిషాణము నెట్లుమిం చినదో చూడుఁడు. ధర్మప్రవక్తలు తమ రాచరింపనిధర్మముల నె ట్లుపదేశించుచుఁ దన్మూలమున ద్రవ్యమునార్జించి ధన్యుల మను కొనుచున్నారో కనుఁగొనుఁడు. హరిదాసుల మర్యాదలఁ గాంచుఁడు. వేదాంతుల ద్రవ్యాశ మేరుతుల్య మగుచున్నది. సదాచారము లడుగంటుచున్నవి. మతధర్మము లేటిపాలగు చున్నవి. ధర్మము నుపదేశింపనివాఁ డరుదు. ఔరా! కాల మెంత తలక్రిందగుచున్నది. నిన్నటియాచారము నేఁడు కాన రాదు. భగవత్సేవ వాగ్రూపమున నున్నది. చెప్పినధర్మములఁ దా నాచరింపనివారిసంఖ్య మితిమీఱుచున్నది. ఇట్టి మహత్తర కష్టకాలమునఁ దరణోపాయ మేది? భగవన్నామసంకీర్తనమే.

దారుణి వ్యాప్తస్యాగ్నే ర్మథన క్రియయా క్వచి దభివ్యంజనవత్ అభిమత దేశ ప్రాపణ భావనా రూపయా క్రియయా శివ లింగా ద్యభిమత దేశే శివ స్యాభివ్యంజనమేవా వాహనం।

నను, సర్వత్ర నిత్యోదిత చిదానంద ప్రకాశ రూపస్య పరమశివస్య కిమిద మభివ్యంజన ముచ్యతే। యథా, స్వయం ప్రకాశ మానస్యాత్యంతాంగార వహ్నే పుంజస్య భస్మచ్ఛన్నస్య భస్మ నిరాస పూర్వక క్రియయా ఽభివ్యంజన మివ స్వయం ప్రకాశమానస్యాపి పరమశివస్య పూజక మనసో విషయాంతరేషు మనోవ్యాపారేణ తం ప్రతిచ్ఛన్నస్య తస్య మనస్సహితా వాహన క్రియా పూర్వక మభిమత దేశే లింగాదా యావజ్జీవం కర్తవ్యస్య తదుపచార సమర్పణార్థ మనుసంధాన సంతాన స్యోపక్రమణ మేవాభివ్యంజనం ॥ ఇతి ।

నను, నైవేద్యాదికం పరమేశ్వరస్య కస్మి న్ముఖే కర్తవ్య మితి చేత్ తదుక్తం క్రియాసారే। అథ సదాశివః కేన వక్త్రేణ భుంక్తే। ఊర్ధ్వ వక్త్రేణ భుంక్తే॥

---

ప్ర॥ సర్వవ్యాపకుడగు శివుండంతటను నుండగాన ఆవాహన మెట్లు సంభవించును?

ఉ॥ విప్పుకట్టెయందున్నను మథనముచేతనే దానిని నభివ్యక్తము గావించినట్లు భావనచేత శివలింగాదుల యందు నభివ్యక్తము గావించుటయే ఆవాహనమగును.

ప్ర॥ అంతటను నానంద ప్రకాశ రూపుండుగా నున్న పరశివుని నభివ్యక్తి పరచుట మాత్రమెట్లు?

ఉ॥ అగ్ని స్వతము ప్రకాశ యుతమైనను నివురుగప్పినప్పుడు భస్మము దొలగింప నవసరమైనట్లు, పరమశివుండు స్వయం ప్రకాశమానుండైనను పూజకుని చిత్తము విషయాంతరముల యందుఁ ప్రవేశించుటను జేసి శివస్వరూప మభివ్యక్తము గాక కప్పబడినట్లుండ దీనింబట్టి, లింగాదులందు తానుజేయు నుపచారముల నర్పించుటకై ఏకాగ్రచిత్తముతో నావాహన క్రియచేత, నిరంతరము సంధానము గావించుటయే అభివ్యక్తి పరచుటయని గ్రహింపవలయును.

ప్ర॥ పరమేశ్వరునకు నైవేద్యాదులే ముఖమునఁ జేయవలయును.

ఉ॥ ఈవిషయము క్రియాసారమున నిట్లు చెప్పబడియున్నది. భక్ష్య భోజ్యాదుల

పర్యాకులేన నయనాంతవిజృంభితేన
వక్త్రేణ కోమలదరస్మితవిభ్రమేణ
మంద్రేణ మంజులతరేణ చ జల్పితేన
నందస్య హంత తనయో హృదయం ధునోతి. ౨౦

కందర్పకండూలకటాక్షబందీ
రిందీవరాక్షీరభిలాషమాణాన్
మందస్మితాధారముఖారవిందాన్
వందామహే వల్లభధూర్తపాదాన్. ౨౧

వయమేతే విశ్వసిమః కరుణాకరమూర్తి కింవదంత్యాంగే,
అపిచ విభో తవలలితే చపలతరా మతిరియం బాల్యే. ౨౨

మధురిమభరితే మనోభిరామే
మృదులతరస్మితముద్రితాననేందౌ
త్రిభువననయనైకలోభనీయే
మహసి వయం వ్రజభాజి లాలసాస్మః. ౨౩

శ్రీకృష్ణకర్ణామృతము. 3 ఆశ్వాసము.

అవతార ప్రయోజనప్రదర్శనారంభమను నేడవప్రకరణము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1928.

నాగ్రత శ్శంభో ర్వర్తేత యోషిదాశ్రయే। పశ్చిమాస్యం యతః పృష్ఠ స్తస్మా ద్దక్షిణ మాశ్రయేదితి ' పూర్వాభి ముఖ స్థిర లింగ విషయాణి॥ చర లింగ పూజాయాం॥ స్థండిలే చరలింగేచ సాధకాభి ముఖశ్శివ ఇతి విశేష వచన దర్శనాత్. నను, న పృష్ఠే నాగ్రతో వాపి స్థిత్వో దేవం పరిపూజయే దితి వచనాను సారేణ పూజక స్యాగ్నేయ దిగ్భాగ స్థానే శివస్య పూజకాభి ముఖత్వం నలభ్యత ఇతి చేత్సత్యం॥ తదపి వచనం స్థిర లింగ విషయ మేవ॥ స్థిర లింగ సాధారణ్యేన లోకానుగ్రహ కత్వాచ్చ తస్యాషు దిక్షు స్వేష్ట ముఖ మతిశయ్య దిశి ద్వారం తదభి ముఖం భవతి॥ తత్ర హృద్గుహ్య చరణ స్యాక మూర్ధ్వ ముఖం బుధః। ద్వార స్యాభి ముఖం చోర్ధ్వ వక్త్రం దేహం ప్రకల్ప యేదితి వచనాత్సైవ ప్రాచీ॥ యస్యాం దిశి భవే ద్ద్వారం తాం ప్రాచీం పరికల్ప యేదితి వచనా త్తత్ప్రభృత్యేన ప్రాదక్షిణ్యేన తత్పురుషా ఘోర సద్యోజాత వామ దేవ ముఖాని కల్ప నీయాని॥ లింగస్యాభిముఖం యత ద్ద్వారం తత్పూర్వ మిష్యతే। తత్ర తత్పురుషం వక్త్రం మూర్ధ్వం చాభి ము

---

ప్ర॥ శివునకు నెదురుగా కూర్చుండకూడదు. దేవునకు ముందుగాని నుత్తరపువైపున కూర్చుండ కూడదు. పృష్ఠముగాన శివునకు పశ్చిమ దిశను కూర్చుండ కూడదు కావున దక్షిణ దిశనె యుండి పూజకుడు శివుని పూజింప వలయును అనుటచే నెదురుగా నుండరాదని యున్నది. ఇది యెట్లు కుదురును.

ఉ॥ చరలింగము నందు శివుడు పూజకునకు నభిముఖముగా నుండుననియున్నదిగాన నభిముఖముగా నుండ గూడదను వచనము తూర్పు ముఖముగా నున్న స్థిర లింగ విషయము.

ప్ర॥ దేవునకు నెదురుగాని వెనుకగాని యుండగూడదు, ఆగ్నేయదిశ నుండి పూజింప వలయునని యున్నది. అప్పుడు అభిముఖ్యమెట్లు లభించును?

అవచనంబును స్థిరలింగ విషయమైనదే యగును. స్థిరలింగము లోకానుగ్రహార్థ మేర్పడినది గాన నాల్గువైపుల కన్న ద్వారదేశమునందు నెక్కువయిన యాభిముఖ్యము గలదై యుండును. హృదయము గుహ్యము పాదములు మొదలగు నవయవములతో గూడ నూర్ధ్వముఖము ద్వారమునకు నభిముఖముగా నున్నట్లు భావింప వలయునని

ప్రతిమాయాం వా క్రియతే స్వధ్యాయతయా పూజా। కకుభాం తస్యాః
యజ్ఞే యజేత శివ ముత్తరాభి ముఖః॥ తత్ర ముఖ్య పూర్వాభి ముఖ
ముఖ్యాగ్నేయ దిశి స్థితస్య పూజక స్యాభిముఖ్యోత్తరాభి ముఖత్వమే
వ ఘటతే॥ పశ్చిమ దిగ్రూప గౌణ పూర్వాభిముఖ లింగ పూజాయాం
వాయవ్య దిగ్రూప గౌణాగ్నేయ దిశి స్థితస్య దక్షిణ దిగ్రూప గౌణో
త్తరాభిముఖత్వం ఘటతే॥

ఏవం దక్షిణ దిగ్రూప గౌణ పూర్వాభిముఖ లింగ పూ
జాయాం నైఋత దిగ్రూప గౌణాగ్నేయ దిక్స్థితస్య ప్రాచీ రూప గౌ
ణోత్తరాభిముఖత్వం॥ ఉత్తర దిగ్రూప గౌణ పూర్వాభి ముఖ లింగ
పూజాయాం॥

ఈశాన దిగ్రూప గౌణాగ్నేయ దిశి స్థితస్య గౌణాగ్నేయ భా
గావస్థాన నియమ స్తదభిముఖ స్థితే॥ ఏవం పూజకస్య ముఖ్య గౌణా
గ్నేయ దిగవస్థాన నియమ స్తత్త ద్దిగభి ముఖ స్థిర లింగ విషయ ఏవే
త్యవతార్య పూజాయాం దేవస్య పూజకాభిముఖత్వ నియమో నహ్యస్య

---

అని యారంభించి, తత్పురుష ముఖమును తూర్పుదిక్కునగాని, పడమరదిక్కునగాని యు
న్నటుల భావింపవలయు॥ అఘోర ముఖమును దక్షిణపు దిక్కునగాని, ఉత్తరముదిక్కు
న గాని యున్నట్లు భావింప వలయును॥ వామదేవముఖమును ఉత్తరపు దిక్కునగాని, ద
క్షిణదిక్కునగాని యున్నట్లు భావింపవలయు॥ సద్యోజాతముఖమును పడమరగాని, తూ
ర్పుగాని యున్నటుల భావింప వలెను, అనియున్నది.

మరియు, దక్షిణ ద్వారముగల యాలయమునందు దక్షిణపు దిక్కున అఘోర
ముఖమును గాని, తత్పురుష ముఖము గాని పూజింప వలయును॥ సద్యోజాతముఖమును గా
ని, వామ దేవముఖమును గాని యుత్తరపు దిక్కున బూజింపవలయును॥ తత్పురుష ము
ఖమును గాని వామదేవ ముఖమును గాని తూర్పుదిక్కున బూజింపవలయును॥ అనియున్నది

లింగము వలయుగాని విగ్రహము వలదుగాని పూజకుడు తాను ఉత్తరాభిముఖుడు
గా నుండియే పూజింప వలయునను ప్రమాణములను బట్టి స్థిరలింగము నుత్తరాభిముఖుడై
గా నుండియే పూజింప వలయు॥

అందు తూర్పు ద్వారము గల యాలయమున నాగ్నేయ దిక్కున నుండి పూజిం